# మల్లెపూలు మంచిగంధం

హరికిషన్

నంబూరి సుబ్బారావు



సర్వోదయ పబ్లిషర్స్
ఏలూరు రోడ్డు :: విజయవాడ-2
Phone No 4645

# మనవి

ఈనాడు సాహిత్య ప్రక్రియలో నవలకు ఎంతో విశిష్టమైన స్థానం ఉన్నది. జీవిత చిత్రణకు సాహిత్య ప్రక్రియ లన్నిటిలోనూ నవల ఒక ప్రత్యేక స్థానాన్ని సంతరించుకున్నది.

ఈ నవలా రచనలో ఎవరి పద్ధతులూ, బాణీలూ వారివి. కొందరి నవలల్లో వర్ణనలు హృద్యంగమంగా ఉంటే కొందరి నవలల్లో సంభాషణలు ఉత్తేజకరంగానూ జీవిత చిత్రణకు అతి చేరువతోనూ ఉంటాయి.

ఈ పరిస్థితుల్లో ముగ్గురు నలుగురు రచయితలు కలిసి ఒకే నవలను గొలుసు నవలగా రూపొందించటం ఒక నూతన ప్రక్రియ.

ఈ గొలుసు నవలను మేము ఉభయులమూ వ్రాయటానికి పూనుకొని పూర్తిచేశాము.

మొదటివారు పేజీలు 1 నుంచీ 118 వరకూ, రెండవ వారు పేజీలు 119 నుంచీ చివరివరకూ రచించుట జరిగింది. ఇందులో మేము ఎంతవరకూ కృతకృత్యులమైనదీ పాఠకులే నిర్ణయించాలి.

మా ఈసంకల్పమునకు చేయూత నిచ్చి ప్రోత్సహించిన సర్వోదయా పబ్లిషర్స్ అధిపతులు శ్రీ కొత్త సుబ్బారావు గారికి మాకృతజ్ఞత తెల్పుకుంటున్నాము.

హరికిషన్

నండూరి సుబ్బారావు

# శ్రీ వేంకటేశ్వరాయ నమః

ఏడూకొండల స్వామీ, ఏడూద్వారాల వెనుక
నల్లనిరూపంలో, నామాల తెలుపుతో
మముగాంచి చూచేవా, మా బాధలు తీర్చేవా

ప్రభాతసమయాన, నీ దర్శనంకొరకు
నిద్రలే పోలేదు, ఆ సత్రంలోన
తోమాలియ సేవలతో, మనమునే దోచావా
నామాల దేవయ్యా, నల్లని నావాడా ॥ఏడూ॥

నీ సహస్ర నామంతో, నిఖిలమైన జనులు
ముదమును కలిగి నీ ముంగిల్లో ఉన్నారు
ధర్మదర్శనంకోసం దీనజనులందరు
దూరాననుంచొచ్చి ధైర్యంతో ఉన్నారు
నామాల దేవర, నల్లని దేవర
కాపాడి వారిని, కరుణించు తండ్రి ॥ఏడూ॥

పవళింపు సేవల్లో పాల్గొనుటకు మేము
పరుగెత్తి వచ్చాము పవళింప రావయ్యా
పద్మావతీదేవి అలకొచ్చి పోగానే
మము బ్రోచుటకు నీవు ఇక్కడే ఉన్నావా ॥ఏడూ॥

# సర్వోదయ పబ్లిషర్స్ వారి
# స్వంత ప్రచురణలు

## వాచస్పతిగారి....

| | |
|---|---|
| మారినకాలం - మారని మనుషులు | 4 00 |
| ఆంధ్రప్రభ బహుమతి పొందిన నవల | |
| కాగితంపూలు, చేరువైన గమ్యం | 3 00 |
| ఆంధ్రప్రభ సీరియల్ | |
| అంతస్తులూ-అంతఃకరణాలూ | 5 00 |
| ఆంధ్రపత్రిక సీరియల్ | |
| స్వీకారం | 3 50 |
| జ్ఞాననేత్రం | 2 50 |
| జీవని | 4 00 |

## కోడూరి (అరికెపూడి) కౌసల్యాదేవిగారి

| | |
|---|---|
| చక్రభ్రమణం | 5 00 |
| ఆంధ్రప్రభ ఉగాది నవలా పోటీలలో ప్రథమ బహుమతి పొందిన నవల | |
| శాంతినికేతన్ | 7 00 |
| ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో సీరియల్‌గా ప్రచురింపబడ్డ నవల | |

అనిర్వచనీయం 4 00

కల్పన 4 00

వివిధ పత్రికలలో ప్రచురింపబడిన కథలు

నాడైరీలో ఒకపేజీ ముప్పాళ రంగనాయకమ్మ 1 50

ఆంధ్రపత్రిక సీరియల్

రోమన్ హాలిడే గొల్లపూడి మారుతీరావు 3 50

నేటి ఆనందం - రేపటి దుఃఖం అశ్వర్థ 5 00

(మూసిన తలుపులు) నవల ఫేమ్

లోకం పోకడ హరికిషన్ 5 00

ఆంధ్రప్రభ సీరియల్

హృదయకుసుమాలు ,, 5 00

ఆంధ్రపత్రిక సీరియల్

ఈడొచ్చిన కోర్కెలు ,, 6 00

ప్రగతి వారపత్రికలో సీరియల్‌గా ప్రచురింపబడిన నవల

పసిడిమనసులు ,, 6 00

ఆంధ్ర సచిత్ర వారపత్రిక సీరియల్

మల్లెపూలు — మంచిగంధం

హరికిషన్, నండూరి సుబ్బారావు 5 00

మనసీనయ్యా సంసారం నండూరి సుబ్బారావు 3 00

కృష్ణవేణి మాసపత్రిక సీరియల్

గంగూలి ప్రేమకథ — కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ — 4 00

విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు — ,, — 4 00

కృష్ణాపత్రికలో సీరియల్‌గా ప్రచురింపబడిన నవల

రామశాస్త్రి — సుక్తాంకర్ — 1 25

రాకెట్స్ — డా॥ గాలి బాలసుందరరావు — 2 00

ప్రాణులు - ప్రభావము — ,, — 3 00

భారతీయుల దృష్టిలో కెనడి — రెంటాల గోపాలకృష్ణ — 3 00

అమెరికన్ గాంధి — పోట్లూరు పుల్లయ్య — 3 00

## బాలల బొమ్మల పుస్తకములు

## ముచ్చటైన మూడురంగుల అట్టతో

శ్రీ వెంకటేశ్వర మహాత్మ్యం — 0 50

51 బొమ్మలతో, వ్రతకథ, సుప్రభాతం
హనుమాన్ చాలీసా, ప్రార్థన

శ్రీరామకథ (సంపూర్ణరామాయణము) — 0 50

43 బొమ్మలతో, ధ్యానము, వ్రతకథ, అష్టో
త్తరము, ప్రార్థన, హనుమాన్ చాలీసా, ఆంజ
నేయస్వామి దండకము, శ్రీరామసుప్రభాతము

శ్రీ సత్యనారాయణస్వామి మహాత్మ్యం — 0 50

37 బొమ్మలతో, వ్రతకథ, దండకం,
ప్రార్థన, అష్టోత్తర శతనామావళి.

శ్రీకృష్ణలీలలు 0 60

50 బొమ్మలతో ప్రార్థన, శతనామావళి, పూర్తికథ.

దశావతారములు 0 60

54 బొమ్మలతో, ప్రార్థన, స్తోత్రం, పూర్తికథ

శ్రీ బ్రహ్మంగారి కాలజ్ఞానము 0 60

43 బొమ్మలతో ప్రార్థన, పూర్తికథ, కాలజ్ఞానం, దండకం.

భారతము 0 75

52 బొమ్మలతో, ప్రార్థన, భగవద్వాణి, సప్తశ్లోక భగవత్ గీత, పూర్తికథ, శ్రీకృష్ణోత్తరగీతానామస్తోత్రము.

భాగవతము 0 75

53 బొమ్మలు, శ్రీ భగవన్నుతి పూర్తికథ

భక్త హనుమాన్ 0 75

37 బొమ్మలతో, పూర్తికథ, ఆంజనేయ శతనామావళి, స్తోత్రాణి, హనుమాన్ చాలీసా, దండకం,

శ్రీ శివలీలలు 0 75

41 బొమ్మలతో, పూర్తికథ, శ్రీ శివరక్షాస్తోత్రం, అష్టోత్తరము, నవగ్రహ జ్ఞానశ్లోకః ద్వాదశ జ్యోతిర్లింగస్తోత్రము, అథ శివలింగాష్టకమ్, శివపంచాక్షరస్తోత్రము, శివ పంచాక్షరీస్తోత్రము.

# మల్లెపూలు - మంచిగంధం

భారతికీ, నారాయణమూర్తికీ వివాహం జరిగింది. బంధు మిత్రు లంద రికీ శుభలేఖలు వేసింది భారతి. ఆమె మనస్సు తెల్సినవారూ, అభి ప్రాయాలు అవగాహన చేసుకున్నవారూ అందరూ వచ్చారు. భారతి భర్త ఎంత అందంగా ఉంటాడో, ఏ ఉద్యోగం చేస్తున్నాడో తెల్సుకుం దామని వచ్చారు. పెళ్ళికూతురనే యెబ్బరికం లేకుండా అందరినీ సాద రంగా ఆహ్వానించింది భారతి. కొంతమంది "ఏమే భారతీ, ఎవ్వరి తోనూ చూచాయగాకూడా అనకుండా ఇంత అర్జంటుగా పెళ్ళి చేసుకుంటు న్నావ్, మీ శ్రీవారు డాక్టరా, ఇంజనీరా, ఐ. ఏ. యస్. ఆఫీసరా లేక వ్యాపారమా" అంటూ ఆప్యాయతతో హేళనను రంగరించి అడిగారు. అందరికీ చిరునవ్వే సమాధానంగా చెప్పింది భారతి.

వధూవరులు పీటలమీద కూర్చున్నారు. వరుడు ఎంత ఠీవిగా, హోదాగా ఉంటాడో, ఆయన తరపున ఎంతమంది ఆఫీసర్లు వచ్చారో అని ఆత్రంగా చూశారు స్నేహితురాళ్ళంతా.

లగ్నం అయింది, భోజనాలూ పూర్తయాయి. పెళ్ళిపీటలమీది నుంచి గదిలోకి వచ్చింది భారతి. అంతా భారతిని చుట్టు ముట్టారు. ఎంతో ఉత్సాహంతో ఉన్న భారతి స్నేహితురాళ్ళంతా విస్తుపోయారు.

"మీవారేం చదివారే" అన్నది జానకి.

"థోరుప్తారం ఫెయిల్డ్" అన్నది కోమలి.

"కాదు, భారత, భాగవతాలు చదివి అర్థం చెప్పగలడు" అన్నది రోజా.

"నువ్వు భారత, భాగవతాలు చదివావా రోజా" అన్నది భారతి.

"అంతకోపం ఎందుకే. అసలువిషయం చెప్పు చంపక", అన్నది రాజేశ్వరి.

"నా హృదయాన్ని ఆయన చదివారు వారిమనస్సుని నేను అర్థం చేసుకున్నాను. ఇంతకన్న చదువెందుకే రోజా" అన్నది భారతి.

"అయితే ఆనర్సు చదివి నువ్వు చేసిన ఘనకార్యం ఇదన్న మాట" అన్నది కోమలి.

"అవును. ఆయన స్కూల్ఫైనల్ చదివారు. ఆ చదువు చాలదా సంసారాన్ని తీర్చిదిద్దుకోటానికి" అన్నది భారతి.

"దీనికి పిచ్చెక్కింది" అన్నది రాజేశ్వరి. నవ్వుతూ చూసింది భారతి. అందరూ తనకేదో అన్యాయం జరిగినట్లుగా చిన్నబుచ్చుకుని వెళ్ళిపోయారు. మనోరమమాత్రం ఏమీ మాట్లాడలేదు.

"వెళ్లొస్తానే భారతీ" అన్నది మనోరమ.

"మంచిదే మనూ, ఉత్తరాలు వ్రాస్తూండు" అన్నది భారతి.

"అట్లాగే, నీ స్నేహాన్నే ఎరుగున్నాకాని, జీవితాన్నికూడా చూడాలికదా. ఒక్కమాట, ఎప్పుడయినా నీ జీవితంలో నేను ప్రవేశించే రోజు రాకపోదేమో" అన్నది మనోరమ.

కాపురానికి వెళ్ళింది భారతి మనోరమ అన్నమాటలు తల్చుకుంటూ నాలుగుమాసాలు వెనక్కి వెళ్ళింది.

ఆనర్సు పరీక్షలు కాగానే తేలికపడిన హృదయంతో ఇంటికి వచ్చేసింది భారతి. సంవత్సరమంతా చదవటం ఒకఎత్తు, పరీక్షలముందు చదవటం ఒకఎత్తు. సరదాగా కబుర్లు చెప్పుకుంటూ, కాలేజీకి వెళుతూ, తోటివిద్యార్థుల అల్లరిచేష్టలకు మనస్సులో బాధపడుతూనే, పెదవులపై మందహాసం చిలికిస్తూనే కాలేజీ జీవితం గడిపిన భారతికి పరీక్షలుకాగానే

మనస్సు తేలికపడ్డా, అలాంటి వాతావరణం మళ్ళీ రాదుకదా అనిపించింది. స్నేహితురాలు మనోరమ ఆ రోజునే ఊరుకు వెళ్ళిపోతుంది. సుగుణకు పెళ్ళి నిశ్చయమైంది. కమల బి. ఏ. చదువుతుంది. సుశీల బి. కాం. పాసయితే ఎక్కడయినా ఉద్యోగం చెయ్యాలనుకుంటున్నది. జానకి, కోమలి, రాజేశ్వరి, రోజా వాళ్ళతత్వాలు వేరు. వాళ్ళమనస్సులు ఎవ్వరికీ అంతుపట్టవు. మనస్సులో ఒకటి, పైకి ఒకటి చెప్తారు. అందరి భవితవ్యాలు ఎవరికి వారు నిర్ణయించుకున్నారు. తన భవితవ్యమే ఎటూ తేలలేదు.

ఇంటికి రాగానే భారతికి ఇవే ఆలోచనలు. వేసవికాలం తనూ ఏ ఊరయినా పోదామంటే ఎక్కడికి వెళ్ళటానికీ తోచదు. బంధువులెవరూ పిలవరు. ఈ రోజుల్లో ఎవరి సంసారతాపత్రయాలూ, ఆర్థిక ఇబ్బందులూ వాళ్ళవి. ఒకరివిషయాల్లో మరొకరు పట్టించుకోరు. చుట్టాలిళ్ళకు వెళితే మొదటిరోజున కాళ్ళు కడుక్కునేందుకు నీళ్ళిస్తారు. రెండో రోజున పెరట్లోకి వెళ్ళి కాళ్ళుకడుక్కుని రమ్మంటారు. మూడోరోజున మొహామొహాలు చూసుకుంటారు. తనకు ఇవన్నీ అనుభవమే.

ఆరోజు రాత్రి రైలుకే మనోరమ వెళ్ళిపోతుందని హాస్టల్లో మనోరమ గదికి వెళ్ళింది భారతి. ప్రయాణానికి సిద్ధమౌతోంది మనోరమ.

"మళ్ళీ ఇప్పట్లో రావు కదూ మనూ."

"ఇంక చదువు పూర్తయినట్లే. చదువుకోసం కాకపోయినా ఈ ఊరు రాకుండా జరగదుకదా."

"రిజల్ట్సు తెలిశాక నీ ప్రోగ్రాం ఏమిటి?"

నవ్వింది మనోరమ. ఆ నవ్వులో అనేకభావాలు తలుపుకొచ్చాయి. మనోరమ మనస్తత్వం చాలా వింతగా ఉంటుంది. ఏ విషయంలోనూ, ఏ అభిప్రాయాలూ ఉండవు. ఏ విషయమూ ఎక్కువగా పట్టించుకోదు. కాని అన్నివిషయాలూ తనకే కావాలి. చింతకాయపచ్చడిలో గింజ తియ్యటంనుంచీ అణ్వాస్త్రాలు ఎవరు ఎక్కడ తయారుచేశారో, అవి ఎప్పుడు ఎక్కడెక్కడ పేల్చారో అన్నీ తెల్సు. కాని అన్నింటియందూ ఒకేరకమైన నిర్లక్ష్యభావం.

మనోరమ నవ్వి ఊరుకోవడంతో భారతికి ఏమీ అర్థంకాక ఎగతాళి పట్టించింది.

"అయితే పెళ్ళి చేసుకుంటావా మనూ?"

"తప్పుకాదుగా?"

"వరు డెవరు?"

"ఎవరో! వాళ్ళమ్మ కొడుకు."

"కాదు, వాడిభార్య అత్తకొడుకు."

ఇద్దరూ నవ్వుకున్నారు.

"పోనీ, నీ ప్రోగ్రాం ఏమిటి" అన్నది మనోరమ.

"ఇంకా నిశ్చయించుకోలేదు." నిర్లిప్తతగా నవ్వింది భారతి.

"అట్లా ఆముదం తాగిందానిలా ముఖం పెట్టావేం. కాబోయే పట్టభద్రురాలివి. అంత దిగులు పడ్డావేం భారతీ" అన్నది మనోరమ చీరెలన్నీ పెట్లో పెడుతూ. భారతి ఒక్క నిట్టూర్పు విడిచింది.

"మనూ!"

వెనక్కు తిరిగి చూసింది మనోరమ. భారతికళ్ళు చెమర్చాయి. మనోరమకు సంగతేమిటో అర్థం కాలేదు.

"నా జీవిత సమస్యల్ని పరిష్కరించుకోటానికి నీ సలహా తీసుకుందామని వచ్చాను మనూ" ఆశగా మనోరమ ముఖంలోకి చూసింది

"అసలు సమస్య లేమిటి?"

భారతి మాట్లాడలేదు.

"ఎవర్నయినా ప్రేమించావా? అతను నిరాకరించాడా? ఇద్దరి కుల గోత్రాలు ఒకటి కావా? నిన్ను వంచించి, మోసగించి ..."

"ఇక చాలించవే. నీ అల్లరిమాటలూ, పిచ్చికబుర్లూ పోనివ్వు" అన్నది భారతి కళ్ళు తుడుచుకుంటూ.

"క్షమించు భారతీ! ఏదో ఎగతాళిగా అన్నాను. అసలు సంగతేమిటే" పెట్టెలో బట్టలన్నీ సర్దేసి అవతలకునెట్టి పక్కన కూర్చుంది మనోరమ.

## మల్లెపూలు - మంచిగంధం

"మనిషికి అందం ప్రధానమా, విద్య ప్రధానమా, గుణం ప్రధానమా" అన్నది భారతి.

"ఈ ప్రశ్నలు సర్వీస్‌కమీషన్ పరీక్షలోగాని, ఏ ఇంటర్వ్యూలో గాని అడగబోతున్నారా?"

"ఎగతాళి పట్టించక నీ అభిప్రాయాలు చెప్తావా లేదా?"

"ఈ మూడూ ఉంటే నూటికి నూరుమార్కులూ రావచ్చు. ఒక్కొక్కటే ఉంటే నూటికి ముప్పైమూడో వంతు మార్కులే వస్తాయి. మూడోవంతు మార్కులొచ్చినా ఈ అత్తెసరుమార్కులతో ఈ కాలంలో పరీక్ష ప్యాసవవచ్చు. సరే. దానికేంగాని నా ఉద్దేశ్యంలో గుణం ప్రధానం. అందాన్ని కొరుక్కుతినకపోయినా చూసి ఆనందించాలికదా! కంటికి ఇంపుగా ఉన్న భర్తని మరోసారి కౌగలించుకోబుద్ధి పుడుతుంది. ఇక విద్యంటావా, ప్రతి మానవుడికీ కావలసిందే."

"గుణమూ, అందమూ ఉండి చదువు లేకపోతేనో?"

"మంచి ప్రశ్నే. ఈ రెండూ ఆడదానిలో రాణిస్తాయి. అందమూ, గుణమూ ఉన్న ఆడదానికి అంతగా చదువు లేకపోయినా పట్టింపులేదు. ఆడపిల్లకు సంపాదన విషయం ఎట్లాఉన్నా చదువు సంస్కారాన్నిస్తుంది. ఆ సంస్కారమే వెర్రితలలు వేస్తే ఇక పరిష్కారానికి రావటం చాలా కష్టం. మగవాడికి చదువూ, గుణమూ కావాలి. అందానికి ప్రాధాన్యత తక్కువ. ఇంతకీ నీ రాజకుమారుడికి చదువు తక్కువా, గుణం ఎక్కువానా?"

చర్చనీయాంశాలు మనస్సు నొప్పించకుండా చెప్పటంలో మనోరమ చాలా నేర్పరి.

"నీ అభిప్రాయాలతో కాస్త ఏకీభవించలేకపోతున్నాను."

"ఎందుకని?"

"ఆడదానికి అందమూ, గుణమూ ఉండి చదువు లేకపోయినా ఫరవాలేదన్నావు. మనం ఆనస్సు చదువుకోటం అనవసరమే కదూ!"

"మనకు అందమూ, గుణమూ ఉన్నయ్యని మనకు మనమే సర్టి

ఫికెట్ ఇచ్చుకుంటే ఎట్లాగే భారతీ! ఆ వచ్చేవాళ్ళు సమ్మతించవద్దూ!"
నవ్వుతూ చూసింది మనోరమ.

"కాబోయే భర్త మనకు అందమూ, గుణమూ ఉన్నయ్యని సర్టి ఫికెట్ ఇచ్చారనే అనుకుందాం. ఈ చదువు అనవసరమే నంటావ్ అంతేనా?"

తెలివిగా ప్రశ్నించాననుకుంది భారతి. "వెర్రితలలువేసే చదువు కన్నా చదువు లేకపోవటమే మంచిదన్నాను. నిజం చెప్పాలంటే ఆడ పిల్ల చదువుకోటంలో మూడువిషయాలు ముడిపడి ఉన్నాయి. కీడెంచి మేలెంచాలి. అకస్మాత్తుగా భర్త చనిపోతే తననూ, తన పిల్లలనూ పోషించుకోటానికి, ఉద్యోగం చేసుకోటానికి వీలవుతుంది. ఏ కారణం వల్లనైనా మనస్పర్ధలు వచ్చి, విడాకులు పొందినా తనపొట్ట పోసుకోటా నికి తగిన ఉపాధిని ఏర్పరుచుకోగలుతుంది. మూడోది సర్వత్రా ఉండేదే. భర్త సంపాదనతో సంసారం వెళ్ళకపోతే, తనూ ఉద్యోగంచేసి సాయ పట్టానికి వీలవుతుంది. ఏమిటో వాగేస్తున్నాను. ఇంతకీ నీ సమస్య."

భారతి మనస్సులోనిమాట బయటికి రావటంలేదు. ఆమె మనస్సు లోని భావాలకు సరైన సమాధానం రావటంలేదు.

"నా చర్చ పూర్తికాలేదు మనోరమా! అందమూ, గుణమూ కల మగవాడు చదువు లేకపోయినా మనలాంటి చదువుకున్న అమ్మాయిని పెళ్ళాడితే ఆ సంసారం ఎట్లా ఉఁటుంది?"

చమత్కారంగానే భారతి ఈ ప్రశ్న వేసిందనుకుంది మనోరమ. ఈ ప్రశ్నతో తన సమస్య పరిష్కారమౌతుందని ఆశించింది భారతి. ఒకరిభావాలు మరొకరికి అర్థం కాలేదు.

"ఆ భర్తను కొంగున ముడివేసుకుని తిరగొచ్చు. ఆ సంసారం చాలా ఆనందంగా ఉంటుంది."

"అలాంటి దంపతుల్ని ఎక్కడైనా చూశావా?" ఆమర్దాగా అడి గింది భారతి.

"అక్కర్లేదు, ఊహించవచ్చు. ఆ భర్త సుగుణాలను పూల చెండులా గుచ్చుకుని, ఆ పూలచెండును తల్లో తురుముకుంటుందా భార్య.

అప్పుడు చదువుకున్న భార్య అందరిస్త్రీలకన్నా మిన్నగానే ఉంటుంది. కాని ఆ భర్తమాత్రం మానసికంగా కుమిలిపోతాడు."

"ఎందుకని?" ఎంతో ఆదుర్దాగా అడిగింది భారతి. ఆ మాట లోని తొట్రుపాటుని గమనించింది మనోరమ.

"అలాంటి భర్తను కొంగున ముడేసుకు తిరిగే ఆ భార్యముందు భర్త ఆధిక్యత ఏముంటుంది, వట్టి చవటగా తయారవుతాడు. ఇతరులు ఆ భర్తకు 'హానరరీ హస్బెండ్' అనే బిరుదునూ ఇస్తారు." పకపక నవ్వింది మనోరమ

ఈ మాటలకు భారతి మనస్సు చివుక్కుమన్నది. చదువుకున్న భార్య తనకన్నా చదువుతక్కువైన భర్తను అంత తేలిగ్గా చూస్తుందన టంలో మనోరమ అభిప్రాయాలతో ఏకీభవించలేకపోయింది.

"చదువూ, అందమూ, గుణమూ, సంస్కారభావాలూకల భార్య కూడా ఆ భర్తను అట్లాగే చూస్తుందంటావా."

భారతి ముఖంలోకి ఆలోచనగా చూసింది మనోరమ. ఇంత విపులంగా భారతి ఎందుకు అడుగుతోందో కాస్త అనుమానంతోనే ఆలోచించింది.

"విద్యరాని మగవాడు తన వినయవిధేయతలు చదువుకున్న భార్యవద్దకాక మరెవరివద్ద ప్రదర్శిస్తాడు భారతీ? సంస్కారభావాలు కల గుణవతి అయిన భార్య అయితే ఆ భర్తను ముద్దు ముద్దుగా నవ్వుతూ మందలించి తన ఆధిక్యతను కాపాడుకుంటుంది."

చదువు తక్కువైన మగవాళ్ళంటే మనోరమకు ఎంత చులకన భావం ఉన్నదో భారతి బాగా అర్థం చేసుకుంది.

"నీతో ఏకీభవించలేకపోతున్నాను మనోరమా" ఏదో ఆలోచిస్తూ అన్నది భారతి.

"నిజమే, ఆ సమయం రావాలి కదా."

సూటిగా అన్న మనోరమమాట శూలంలా గుచ్చుకుంది భారతికి. ఇంటికి వెళ్ళింది భారతి, ఊరికి వెళ్ళింది మనోరమ.

ఇంటికి వెళ్ళిన భారతికి మనస్సులో ఆలోచనలు బాధ పెట్ట సాగాయి.

అసలు చదువుకున్న ఆడపిల్ల చదువుతక్కువైనవాణ్ణి భర్తగా ఎందుకు ఎంచుకుంటుంది? ఒకవేళ ఎంచుకుంటే ఆ వ్యక్తిలో ఏదో సద్భావమూ, సద్గుణాలూ ఉండటంచేతనేకదా! ఆ వ్యక్తియందు తనకు ప్రేమ, ఆదరాభిమానాలూ ఉండటంచేతనే అతనియందు ఇష్టతా కలుగుతుంది. పట్టభద్రురాలైన యువతి స్కూల్ ఫైనల్ పాసయిన యువకుణ్ణి పెళ్ళి చేసుకున్నదంటే, తన చదువుకన్న అతనిలోఉన్న సంస్కారమూ, ఉన్నత భావాలూ చూసికదా పెళ్ళాడేది, ఇతరుల దృష్టిలో నగుబాటుగాఉన్నా ప్రేమించి చేసుకున్నప్పుడు ఆ సంసారం సుఖమయం కాదా? ఆ దాంపత్యం చూడ ముచ్చటగా ఉండదా? ఆ భార్య భర్తను చులకనగా చూస్తుందా? ఆ భర్త ఆ చదువుకున్నభార్యకు వినయ విధేయతలు కలవాడై ఉండాలా? ఇలాంటి దాంపత్యాన్ని లోకం హర్షించదా? ఒకవేళ హర్షించినా ఆ దంపతుల్ని చులకనగానే చూస్తారా? ఏమిటీ భావాలు? చదువురాని భార్యలుమాత్రం చదువుకున్న తమ భర్తని ఎంత మంది చులకనగా చూట్టంలేదు? ఒక్కచదువే ప్రేమకు కొలతబద్దా? గీటురాయా? మనస్సు, హృదయమూ, ప్రేమానురాగాలూ ప్రధానం కావా?

ఆలోచిస్తూ పడుకున్న భారతికి తెలియకుండానే కనుకొలకుల్లో నుంచి కన్నీరు జారింది.

ఆవేదనతో కూడిన ఆలోచనలతో తల వేడెక్కిపోయింది. ఒక్క నిట్టూర్పువిడిచి కళ్ళు మూసుకుంది.

విశాలమైన నుదురు, చక్కని ఉంగరాలజుట్టు దబ్బపండులాంటి శరీరఛాయ, విశాలమైన వక్షస్థలము, కండలుదీరిన శరీరము, వింత సోయగంతో చిరునవ్వులు చిలకరించే చక్కని పలువరుస,ముగ్ధమోహన సౌందర్యంతో విరాజిల్లే నారాయణమూర్తి కనుపించాడు భారతికి.

ఆవేదనాభారంతో బరువెక్కిన హృదయంతో కళ్లు తెర్చింది

భారతి. చెంపలవెంట కారిన కన్నీరు తుడ్చుకుంది. టేబిల్ మీద ఉన్న నారాయణమూర్తి ఫోటోని తదేకధ్యానంతో చూస్తూ కూర్చుంది.

కొన్నాళ్ళక్రితం ఇద్దరూ మాట్లాడుకున్న మాటలు గుర్తొచ్చాయి.

"బావా."

"ఏం భారతీ."

"నేను బి. ఏ ఆనర్సు ప్యాసయితే నీకు సంతోషమేనా?"

"ఎందుకుకాదు భారతీ! ఈ జన్మలో నువ్వు పట్టి ఆనర్సువి, నేను గత జన్మలో ట్రిబుల్ ఎమ్మె చదివి, చదివి విసుగెత్తి ఆ పుస్తకాలు మొయ్యలేక, అంత చదువును ప్రసాదించినందుకు సరస్వతీదేవిమీద కోపం కలిగి "అమ్మా, సరస్వతీదేవీ, ఈ జన్మలో నాకీ చదువుచాలు. వచ్చే జన్మలో నాకు కాస్త దూరంగా ఉండు. ఎట్లాగో స్కూల్ ఫైనల్ పాసయితే చాలు, అంతకన్న ఎక్కువ చదువు వద్దు, కాని చిన్నకోరిక. నీ నామధేయంకల భార్యనుమాత్రం ప్రసాదించి, ఆవిడకు నీకు వీలయినంత చదువు ప్రసాదించు, ఈ కాస్త కోరికా తీర్చు తల్లీ" అని ప్రాధేయపడ్డాను, అందుకనే ఈ జన్మలో నువ్వు సిద్ధించావు భారతీ."

"ఛీ బావా, ఈ చదువు తక్కువైన మొద్దుబావ నా కొద్దు."

"పోనీ మనస్ఫూర్తిగా చెప్పెయ్యి, నెత్తిన గుడ్డవేసుకుని పోతా."

ఈ మాటలన్నీ గుర్తొచ్చి నవ్వుకుంది భారతి. ఇంతలో నారాయణమూర్తి పిలవటంతో గదిలోకి వెళ్ళింది.

"భారతీ నమస్తూభ్యం, వరదే భార్యరూపిణీ, భోగారంభం కరిష్యామి ముద్దుర్భవతుమేసదా."

"చాల్లెండి, కవిత్వం పైత్యంగా వస్తోంధి."

"భారతీ! ఏది ఏమైనా నీ చదువుకు జోహార్లర్పించే నిన్ను భార్యగా స్వీకరించాను, చిలిపిగా బుగ్గ గిల్లిన చేత్తోనే నీకు నమస్కరిస్తాను" అన్నాడు.

భారతి కళ్ళల్లో ఆనందబాష్పాలు గర్వంగా తొణికిసలాడినయ్యి.

# 2

భారతి ఆనర్సు ఫస్టుక్లాసులో పాసయింది. అంతా ఎంతో సంతోషించారు, కొంతమంది బాధపడ్డారు. కొంతమంది హేళన చేశారు. "బి. ఏ. ఆనర్సు పాసయిన ఆవిడకు స్కూల్ ఫైనల్ మొగుడేనని: "

ఆ పల్లెటూళ్లో అంతా దవడలు నొక్కుకున్నారు. వాళ్ళకు పళ్ళ పోటుకాదు, మనస్సుకు తీట, గుసగుసలాడుకున్నారు.

భారతి అత్తగారు యశోదమ్మ ఇంత దుమారం రేగుతుందనీ, ఇంతమంది ఆడిపోసుకుంటారనీ పెళ్ళికిముందు ఆవిడ అనుకోలేదు. అందరూ ఇన్నిమాటలూ అనేసరికి ఆవిడకూ ఇదేమిటా అనిపించింది.

కొత్త కోడల్ని చూట్టానికి పల్లెటూరి అమ్మలక్కలంతా వచ్చారు.

"మీకోడలు యేమ్మేటగా, అదేమిటే యశోదమ్మా,ఎంత మేనరికమయితేమటుకు అంత చదువుకున్నపిల్ల భూమ్మీద నిలవాలా" అన్నదో ముసలావిడ.

"ఎందుకు నిలవదు పిన్నీ, ఆవిడ ఉద్యోగం చేస్తుంది, వీడు చీరెలు ఆరేసి మడత పెడతాడు" అన్నదొక దూరపు బంధువు.

"కాదు జగదంబా. అంత చదువుకున్నదానికి ఎన్నో ఆలోచనలుంటాయి. ఎవరో ఒకరు మొగుడనేవాడు ఉండకపోతే ఎట్లా" అన్నదొకావిడ.

భారతికి వళ్ళు మండిపోయింది.

"మీ అందరి అనుభవాలూ చాలా బావున్నయ్యి. ఇంక వినక్కర్లేదు" అని గదిలోకి వెళ్ళిపోయింది భారతి. అందరిమాటలూ వినేసరికి యశోదమ్మకు కంపరం కలిగింది. కొత్త కోడలు పరామర్శ ఇట్లా అయిందేమా అని ఆవిడా బాధపడ్డది. తను చేసింది పొరపాటే మోనని ఆవిడా బాధపడది.

ఇవన్నీ భారతి నారాయణమూర్తితో చెప్పింది అతనూ నవ్వి ఊరుకున్నాడు.

"నవ్వితే సరిపోయిందా" మానసిక వేదనతో అన్నది.

"ఆ నవ్వినవాళ్ళ జీవితాలు నీకు తెలియవు, నవ్వు నాలుగువిధాల చేటు అనే విన్నావుగాని నాలుగు విధాల సంతోష పెడుతుందని మనమూ ఋజువు చేసుకునేరోజు రాకపోదు. వాళ్ళకు కనబడింది నీ ఎక్కువ చదువు, నా తక్కువచదువు. అంతేకాని మనంకాదు, మనల్ని వాళ్లు తెల్సుకోవాలంటే కొంతకాలం పడుతుంది, అంతవరకూ వాళ్ళకూ వ్యవధి కావాలికదా" అన్నాడు.

భారతి నవ్వింది. ఆ నవ్వులోనే ఆమె మనస్సు అనిర్వచనీయమైన మనస్సుతో బాధపడ్డది. తను చదువుకున్న పిల్లయినా మంచి అణకువ, యోగ్యత కలదనీ యశోదమ్మ ఎప్పుడూ అంటూ ఉండేది. తనను ఎంతో మెచ్చుకుని ఆదరించిన మేనత్త అత్తగా మారటంతోనే ఆమె మనస్సులో తనంటే ఇంత ఏహ్యభావం ఎందుకు కలిగిందో భారతికి అర్థంకాలేదు. పైగా చూడవచ్చినవాళ్ళ తలొక మాటా అంటుంటే తనూ వాళ్ళతో శృతికలిపి ఇంకా చులకనగా చూట్టం చాలా బాధ కలిగించింది.

పదిరోజులు గడిచాయి. ఈ పదిరోజులూ పది సంవత్సరాలే అయ్యాయి.

ఒకరోజున యశోదమ్మ ఎవరితోనో బాతాఖానీవేసి కూర్చుంది. భారతిని కాఫీ కాచి పట్టమ్మన్నది. కెటిల్తో కాచిన నీళ్ళు కాఫీ ఫిల్టరులో పోసి పాలగిన్నె కుంపటిమీద పెట్టింది. కుంపటి విసురుతుంటే విసిని కర్ర తగిలి ఫిల్టరు పడిపోయి కాఫీ డికాషనంతా పోయింది. భారతికి కాలు బొబ్బలెక్కింది.

"ఏమిటే ఆ చప్పుడు భారతీ" అన్నది యశోదమ్మ. జరిగిన విషయం చెప్పింది భారతి.

"ఇదీవరస, చూశారా రవణమ్మగారూ, ఇది చదువులవాణి కావి, గృహిణికాదు. ఆ కాలేజీ చదువుల్లో కాఫీకాయటమైనా చెప్పరు కామాలు, ఏం చేస్తుంది, పెద్ద బి. ఏ అనర్సు, కుంపటి విసరటం చేతకాదు, ఈ చదువుకున్న కోడళ్ళతో ఇదే యాతన" అన్నది యశోదమ్మ ఈసడింపుగా.

"ఈ రోజుల్లో స్కూలుఫైనలు వెలగబెట్టినవాళ్ళకే చెప్పలేం, ఒక్కొక్కదానికీ ఎంత అతిశయమో, మరి కాలేజీచదువు పూర్తిచేసినవాళ్ళు ఒక్క వంటవిషయంలో తప్ప, అన్నింట్లోనూ సమర్థులే, మనకు తెలీని విషయాలు వాళ్ళకు లక్షతెల్సు" అన్నదావిడ. ఆవిడకు నోరు మాట్లాడుతుంటే, నొసలు వెక్కిరిస్తయ్యి, శనగలు తింటూ ఆముదాలు చేతులో పెట్టేరకం.

భారతికి కళ్ళనీళ్ళ పర్యంతమైంది. వేన్నీళ్ళుపడి కాలిన బొబ్బల కన్నా వీళ్ళమాటలే ఎక్కువ బాధ కలిగించాయి. నాలుగు మాసాల క్రితం వరకూ ఏ అవమానమూ ఎరుగని తను పెళ్ళి కాగానే ఇంత మానసిక వ్యధకు గురికావాల్సొస్తుందని అనుకోలేదు. అందులోనూ తనకత్వం తెల్సిన మేనత్త ఇట్లా అంటుందని ఎన్నడూ వూహించలేదు.ఫస్టుక్లాసులో ప్యాసయి అందరి ప్రశంశలనూ పొందిన తను ఈనాడు అతిహీనంగా చూడబడ్డం తల్చుకుంటే నీళ్లు కారిపోయింది. చదువులవాణిగా పేరు తెచ్చుకున్న తను ఆ ఇంటి కోడలు కాగానే తన మంచితనమూ, చదువు సంధ్యలూ, విశ్వవిద్యాలయపు డిగ్రీ, అధ్యాపకుల ఆదరాభిమానాలూ ఎందుకూ కొరగాకుండా పోయినయ్యి. జీవితానికి అవతారం మారినట్లయింది.

నారాయణమూర్తిని తను పెళ్ళి చేసుకుంటానంటేనే స్నేహితురాళ్ళంతా ఎగతాళి చేశారు. బంధువులు వింతగా ఊహాగానాలు చేశారు. అందరికీ ఇష్టంలేకపోయినా యశోదమ్మ ఇష్టపడింది. అప్పుడు ఆవిడ సంతోషం ఆకాశాన్ని తాకింది. పెళ్ళింకా వారంరోజులు ఉన్నదనగానే తనకు జడవేస్తూ యశోదమ్మ అన్నది.

"నువ్వు భారతివో, సరస్వతివో, చదువులవాణివో నాకు తెలీదే పిల్లా, మా ఇంటికోడలు కాబోతున్నావు, నాకు అదే పదివేలు" అంటూ ఎంతో ఆప్యాయంగా చెప్పింది అందరికీ. ఎవరిమనస్సులో ఏముందో ? అప్పుడు ఎవరూ ఏమీ అనలేదు. ఆ మూడుముళ్ళూ పడ్డాక అందరి నిజస్వరూపాలు బయటపడ్డాయి. అంతా హేళనచేసేవారే, అంతా దవడలు నొక్కుకునేవారే, ఎన్ని అవమానాలూ, అవహేళనలూ పడ్డా నారాయణ మూర్తి ముఖం చూసేసరికి అన్నీ మర్చిపోయేది భారతి.

అందరిభావాలూ అతనికీ అర్థమయాయి. తన తల్లికూడా వాళ్ళ మాటలకు వంతపల్కుతుంటే భారతి చెంతనఉన్న అతని మనస్సులో చీకట్లు కమ్మాయి.

ఒకరోజు రాత్రి నారాయణమూర్తి అన్నాడు.

"నానుంచి నువ్వు అనేక అవమానాలకు గురవుతున్నావు భారతీ, నేను అందమైనవాడిననీ, సహృదయుడననీ నువ్వు పెళ్ళి చేసుకున్నావు. నాలాంటివాడు మీ కాలేజిలో ఎవ్వరూ లేరా, నిన్ను చేసుకునేందుకు అందమైన విద్యార్థికులు ఎందరులేరు. ఈ స్కూల్ఫైనల్ మొగుణ్ణి ఎందుకు పెళ్ళాడావు భారతీ."

భారతి మనస్సు విలవిల్లాడింది, తనంటే నారాయణమూర్తికూడా ఇష్టంలేదా !

"చదువులూ, డిగ్రీలూ మంచితనానికీ, ఆత్మసౌందర్యానికి గీటురాయి కావు. చదువు సంస్కారాన్నీ, లోకజ్ఞానాన్నీ, మానసిక పరివర్తననీ కలిగించేమాట వాస్తవమే. చదువుకున్నంతమాత్రాన అందరు మగవాళ్లూ సహృదయులుకారు. చదువుల్లో డిగ్రీలు సంపాదించినా సంస్కారంలో ఉన్నత భావాల్లో, నైతిక విలువల్లో అంధులైన విద్యార్థికులు మగవారిలో ఎందరో ఉన్నారు. చదువు తక్కువైనా హృదయౌన్నత్యం కల మగవారూ ఎందరో ఉన్నారు. చదువుకున్న ఆడపిల్లలు అతిశయంగా ఉంటారనీ, వాళ్ళ హుళ్ళూ పెళ్ళూ చూస్తే వీళ్ళసలు కాపరాలు చేసేవాళ్లేనా అనీ, అనిపించే ఆడపిల్లలూ లేకపోలేదు. డిగ్రీలు తెచ్చుకున్నా సంసారపక్షంగా జీవితం గడపాలనుకునేవారూ, లేకపోలేదు.

చదువు సంధ్యలు లేకపోయినా వెర్రితలలు వేసే నాగరికతను సినిమాలు చూసి తమంతట తాము సృష్టించుకుని కాలుజారిన కన్యలూ లేకపోలేదు. మీరు ఎక్కువగా చదువుకోకపోయినా, డిగ్రీలు తెచ్చుకోకపోయినా నా మనస్సనే విశ్వవిద్యాలయంలో ఉత్తమ శ్రేణిలో వచ్చారు. ఎవరేమనుకున్నా, ఎన్ని అపార్థాలు కల్పించుకున్నా నా లక్ష్యసిద్ధి ఒక్కటే" అన్నది.

"ఏమిటది భారతీ."

"మాట తప్పరుకదా"

"ఆ నమ్మకం నీ కున్నదని నాకు నమ్మకమే."

"నేను కాలేజిలో లెక్చరరుగా చేర్తాను, ఉద్యోగం చేస్తూనే మన సంసారం సుఖమయం చేసుకోవాలని ఉన్నది. ఏ ఆదర్శంకోసం మిమ్మల్ని చేసుకున్నానో ఆ ఆదర్శాన్ని అక్షరాలా అమలుజరిపి అందరికీ కనువిప్పు కలిగించాలి."

నారాయణమూర్తి నవ్వుతూ భారతి చెవిలో అన్నాడు.

"నిజమే భారతీ,నా చదువుకు ఎట్లాగూ ఉద్యోగం దొరుకుతుందనే నమ్మకంలేదు, ఒకవేళ దొరికినా ఆ జీతం నా కాఫీ ఖర్చుకు సరిపోతుంది. నువ్వు ఉద్యోగంలో చేరు, నేను ఇంటిపన్లు చక్కపెడతాను."

"మీరూ అట్లా అంటే ఇక మీలో ఉన్న ప్రత్యేకత ఏముంది, అందరితోనూ చేరినట్లే. వాళ్ళ భావాలను మీరూ పరోక్షంగా సమర్థిస్తున్నారు." నిర్లిప్తతగా అన్నది. భారతి ముఖం చూసి చిన్నబుచ్చుకున్నాడు.

"ఒక్కరోజు గడువిస్తావా? నా సమాధానంకోసం ఒక్కరోజు ఆగలేవూ."

"ఒక్కరోజుకాదు, వారంరోజుల్లో చెప్పండి. సరేనా"

ఆరాత్రి తెల్లవార్లూ నారాయణమూర్తికంటిమీద కునుకులేదు. భారతి ప్రశాంతంగా అతని పక్కన నిద్రపోతున్నది. లేచి పక్కమీద కూర్చున్నాడు.

ఆనర్సు క్లాసులో పాసయిన ఈ చదువుల వాణి నన్ను మనస్సులో నింపుకుని నాకు అంకితమైపోయింది. ఉన్నతమైన స్థాయిలో భాగస్వామిని, జీవిత భాగస్వామిని ఎంచుకోలేకపోయింది. అందరిదృష్టిలో ఇది భారతికి పరాజయమే, కాని ఈ వాణీదృష్టిలో ఇది పరాజయంకాదు. ఇంత చదువుకున్నదాన్ని చేసుకుంటే- నేనామెకు దాసుడిననే అందరి అంచనా. నిన్న మీ ఆవిడ నడివీధిలో అమ్ముకొస్తుందిరా, అన్నారు కొంతమంది. ఆవిడ విలాసాలనూ, భోగాలనూ నువ్వు చూస్తూ ఊరుకోవటమేకాక ఆ విలాస నౌకకు నువ్వు చుక్కాని ఔతావని అన్నారు మరికొందరు. ఏదిసత్యం? ఈ రాణి చదువు సంధ్యల అంతస్థుకు గోరీ కట్టింది. డిగ్రీలకు విలువ ఇవ్వనేలేదు. ఆదర్శభావాలను పుణికి పుచ్చుకుని అందర్నీ ఎదిరించి ఎదురీతకు సిద్ధమైంది. మనస్సులో మాలిన్యం డిగ్రీలవల్ల రాదు,కాని ఇతరులదృష్టిలో ఈ డిగ్రీలు అపార్థాలు కల్పించి సంసారజీవితంలో చిచ్చుపెట్టేందుకు పనికివస్తయ్యి. అర్థంచేసుకోలేనివారు అనర్థకంగానే మాట్లాడుతారు, వాళ్ళనట్లా వదిలెయ్యవల్సిందే! జీవితంలో ఇద్దరం పందెం కాసినట్లయింది. ఎవరిది గెలుపు? ఎవరిది ఓటమి?

ఈ రకంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు నారాయణమూర్తి. తన మనస్సులో ఎన్నో విషయాలు దొర్లిపోతున్నా, నిత్యనూతనమైన సంసారసాగరంలో తలమునకలుగా చక్కగా స్నానంచేసి ప్రశాంతంగా నిద్రపోతున్నది భారతి. ఆ చిరునవ్వు సొగసులో డిగ్రీలు లేవు. ఆత్మసమర్పణ చేసుకున్న అర్ధాంగి. ఆదర్శభావాలకూ, గృహస్థ జీవితానికీ అంకితమైన అపరంజి బొమ్మ. లోకందృష్టిలో బి. ఏ ఆనర్సు., కాలేజీలో లెక్చరరు. విద్యార్థులపాలిట అపరశారద. ఎన్నో ఆశయాలనూ, ఆదర్శభావాలనూ పుణికి పుచ్చుకుని విద్యార్థులకు చదువుచెప్పి. ఇంటికి రాగానే అన్నీ మర్చిపోయి ఆదర్శగృహిణిగా, అపరంజి చిలుకగా తన బాహువల్లరిలో కరిగిపోతుంది.

ఆమెముఖంలోకి చూస్తూ, ముంగురులు సవరిస్తూ కూర్చున్నాడు నారాయణమూర్తి. వెచ్చని కన్నీటిబొట్లు చెంపలమీద పడి కళ్లు తెర్చింది

భారతి. ఆమెగుండెల్లో తల దాచుకుని "నువ్వు లెక్చరరువి భారతీ" అంటూ ఆమె కళ్ళల్లోకి చూశాడు నారాయణమూర్తి. లక్ష దీపకళికల కాంతులు ఆ నాలుగుకళ్ళల్లో జాజ్వల్యమానంగా ప్రకాశించాయి.

♦ ♦ ♦ ♦

భారతి కాలేజీలో లెక్చరరుగా చేరింది. కొత్త సంసారానికి కావల సిన సామానంతా కొన్నారు, నారాయణమూర్తికి తండ్రి లేడు. పెత్తన మంతా తల్లి యశోదమ్మదే. పదెకరాల పొలం ఉన్నది. ఆ పొలంలో వచ్చిన ధాన్యం కొంత అమ్మి కొంత తిండికి ఉంచుకుని ఇల్లు గడిపే దావిడ.

యశోదమ్మకు ఇద్దరే మగపిల్లలు. పెద్దవాడు నారాయణమూర్తి, రెండోవాడు కేశవుడు. వాడు థర్డుఫారం చదువుతున్నాడు. ఒక్కర్తే ఆడ పిల్ల. పేరు శ్యామల. శ్యామలకు ఇద్దరు పిల్లలు. భర్తకు విశాఖపట్ట ణంలో ఉద్యోగం. శ్యామలకు ఎవరిపొడా గిట్టదు. ఎవరయినా తమ కన్నా పచ్చగాఉంటే ఆమెకు కడుపులో దేవినట్లు ఉంటుంది. ఎంత వరకూ తనభర్తా, పిల్లలూ బాగుపడి పైకి రావాలనే తాపత్రయం. మెతుకు పోతే బ్రతుకు ఏమైపోతుందోనని భయం. భర్త కృష్ణమూర్తి పది నయా పైసల రెవిన్యూస్టాంపు మినహా జీతమంతా ఆవిడచేతిలో పొయ్యా ల్సిందే. ఇక ఆయన కాఫీ, సిగరెట్ ఖర్చులు ఆవిడ చేతుల్లోనుంచే రావాలి.

అన్నగారి పెళ్ళికి వచ్చినా, అంతమందీ అన్నిరకాలుగా అను కున్నా, నారాయణమూర్తి, భారతిలను గురించి శ్యామల ఏమీ అనలేదు. కనీసం తల్లితోనైనా తన అభిప్రాయం వెలిబుచ్చలేదు. తనకు కావలసిన (రావలసినవికాదు) ఆడబడుచు లాంఛనాలూ, చీరెలూ తీసుకుని మూణ్ణి ద్రలు కాకుండానే వెళ్ళిపోయింది.

ఇలాంటి మనస్తత్వంకల శ్యామల తన అన్నగారూ, వదినె గారూ విశాఖపట్టణంలోనే ఉంటున్నా ఆవిడ ఏమాత్రం పట్టించుకో లేదు.

డెబ్భైయిదు రూపాయలకు కాలేజీకి అరమైలు దూరంలో మూడుగదుల ఇల్లు అద్దెకు తీసుకున్నారు. భారతికి ఆ ఇల్లు నచ్చింది. నారాయణమూర్తికి పొరుగు నచ్చలేదు. కారణం ఇంటివారింట్లో ఇరవై నాలుగ్గంటలూ చీట్లపేక ఆడుతారు. అదో చిన్నసైజు క్లబ్బు. పెద్దపెద్ద వాళ్ళు వచ్చి పేకాడుతారు. ఇంటాయనకు అదే సంపాదన. వచ్చే వాళ్ళంతా కుటుంబీకులు. సంఘంలో గౌరవమర్యాదలు కలవారు. ఆ ఇంటి మహాత్యం ఎటువంటిదో, ఎన్నెన్ని వందలూ వేలూ పోగొట్టు కున్నా పల్లెత్తుమాట ఒకరినొకరు అనుకోకుండా జేబులు ఖాళీకాగానే చక్కగా సిగరెట్ కాల్చుకుంటూ వైటికివచ్చేస్తారు, అది పేకాటమర్యాద. అందుచేత రాత్రింబగళ్ళు పేక ఆడుతున్నా పక్కభాగాల్లో వాళ్ళకుగాని, ఇంట్లోవాళ్ళకుగాని ఏ ఇబ్బందీ కలగటంలేదు. ఇంటాయన ఆటకు పది హేను పైసలు తీసుకుంటాడు. అదే ఆయనకు నెలకు నాలుగయిదు వందల సంపాదన.

ఇలాంటి వాతావరణమైనా ఇల్లు చాలా వసతిగా ఉంటంనుంచీ, తమవాకిలి తమభాగంవైపు విడిగా ఉంటంనుంచీ భారతి అక్కడే ఉందా మన్నది. నారాయణమూర్తి ఒప్పుకోక తప్పిందికాదు.

నాలుగునెల్లు గడిచాయి, తనకు వచ్చే జీతంలోనే సామానంతా కొన్నది భారతి.

ఉదయాన కాఫీ కాగానే వంట చేస్తుంది. వంటకాగానే మధ్యా హ్నానికి ఫలహారం చేస్తుంది. కాఫీ ఫ్లాస్కులో పోస్తుంది, తొమ్మిది గంటలకల్లా ఇద్దరూ ఒక్కసారే భోజనానికి కూర్చుంటారు. భారతి కాలేజీకి వెళ్ళుతుంది. మధ్యాహ్నానికి కాఫీ,ఫలహారం తీసుకు వెళుతుంది. సాయంత్రం కాలేజినుంచి రాగానే సాయంత్రం వంట చేస్తుంది. భోజనా లయాక మర్నాడు చెప్పవలసిన పాఠాలకు ప్రిపరేషను, రాత్రి పదింటికి గాని పక్కచేరదు.

నారాయణమూర్తికి ఏం తోచటంలేదు. భారతి ఉన్నంతవరకూ సరేసరి, భారతి కాలేజీకి వెళ్ళగానే సాయంత్రం అయిదుగంటలవరకూ

ఇంట్లో ఒక్కడే. కాసేపు రేడియో, కాసేపు పుస్తకాలు, నవలలు, ఎంత సేపటికీ అయిదుకాదు. భారతి ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తుంటాడు. ఏమీ తోచదు. ఏమిటో ఆలోచనలు, పగటి నిద్రతో బద్ధకం.

నాలుగు నెల్లకుగాను తల్లి స్వయంగా ఉత్తరం రాసింది. అంతకు క్రితం ఉత్తరాలన్నీ తమ్ముడు రాసేవాడు. ఆ ఉత్తరం చదివి బాధ పడ్డాడు. తల్లి ఊహాలు ఏమీ మారలేదు. ఆ ఉత్తరాన్ని దిండుక్రింద దాచి జీవితాన్ని నెమరువేసుకోసాగాడు. తను చేసిందాంట్లో తప్పేమీ కనుపించలేదు.

సాయంత్రం భారతి రాగానే ఆ ఉత్తరం ఇచ్చాడు, ఉత్తరం చదివింది భారతి.

చి॥ నారాయణమూర్తిని ఆశీర్వదించి వ్రాయునది,

క్షేమం. నీ క్షేమసమాచారాలు తెలుస్తున్నా ఉద్యోగపు హోదాలో ఉన్న భార్యతో ఏ ఇబ్బందులు పడుతున్నావో, ఆలోచిస్తే భయంగా ఉన్నది. నువ్వూ ఏదైనా చిన్న ఉద్యోగం చేస్తే బాగుంటుందిరా నారాయణా, ఏ ఉద్యోగమూ లేకుండా ఇంట్లో కూర్చుంటే అడపనికూడా నువ్వే చెయ్యాలేమో, అబ్బాయికి పెళ్ళవుతుందని మురిసిపోయానుగాని, కోడలు ఆఫీసరు అవుతుందనుకోలేదు, ఎట్లా వేగుతున్నావో? చదువు తక్కువ భార్యకు చక్కగా నచ్చ చెప్పవచ్చు. ఇప్పుడు నువ్వు దాన్ని ప్రతిమాలుకోవాలేమో! చదువుతక్కువైన భార్యకు భర్తయందు బాధ్యత ఎక్కువ, చదువుకున్న భార్యకు భర్త లోకువ. ఈ సత్యాన్ని ఈపాటికి గ్రహించే ఉంటావు, ఏది ఏమైనా నీ జీవితంలో ఆ పిల్లనుచేసి నిప్పులుపోశాను, ఎంత మేనమామ కూతురైనా అది నీమాట వింటుందనే నమ్మకం నాకు లేదు, సరే? ఏం చేస్తాం, ఉత్తరాలు రాస్తుండు, ఒకసారి వచ్చి చూసిపో, నిన్ను చూడాలని ఉంది. తమ్ముడు కులాసాగానే ఉన్నాడు. చదువుకొంటున్నాడు. కోడలు వినిపించుకోకపోయినా దాన్ని అడిగానని చెప్పవలసింది.

మీ అమ్మ
యశోదమ్మ.

"ఎట్లా ఉంది ఉత్తరం" అన్నాడు నారాయణమూర్తి.

"అత్తయ్య మనస్సులోమాట ఉత్తరంద్వారా మరోసారి తెల్సింది. ఎవరి భావాలు వాళ్ళవి, నేనేమీ తప్పు పట్టించుకోను" ఎంత కాదనుకున్నా మనస్సులోని కుమిలింపు మరుగున పడిపోలేదు. ఆ కుమిలింపును వెనక్కునెట్టి ప్రేమానురాగాల్ని చిందించే హాస్యాన్ని ముందుకు నెట్టింది.

"అత్తయ్య మాటలయందు నాకు చాలా గౌరవం ఉన్నది. తల్లి లాంటిది, ఆవిడమాటలను కొట్టి పారెయ్యలేను."

"అవును భారతీ, నీమనస్సు నాకు తెల్సినంతగా నీకూ తెలీదేమో. మా అమ్మ మాటను ఏదీ కాదనలేవు."

"అందుకనే అత్తయ్య భావాలకు అనుగుణంగానే నడవాలను కుంటున్నాను." భర్త కళ్ళల్లోకి చూస్తూ ఎగతాళి భావాల్ని పుణికి పుచ్చుకుని అన్నది.

"అంటే" అతనికి అర్థంకాలేదు.

"పనిమనిషి తోమివెళ్ళాక ఆ గిన్నెలు తోలవాలి, బిందెలనిండా నీళ్ళు పట్టాలి, స్టౌ, కుంపటి అంటించి కూరతరిగి ఇవ్వాలి, బియ్యం ఏరాలి, బట్టలు ఉతకాలి, ఇల్లు చిమ్మాలి, చీడెలు మడత వెయ్యాలి, సాయంత్రం నేను వచ్చేసరికి కాఫీ కాచి, వంట చెయ్యాలి, నేను మిమ్మల్ని లెక్కచెయ్యను, బ్రతిమాలుకోవాలి, ఇంకా...." ఆజ్ఞాపిస్తున్నట్లుగానే అన్నది.

"కాళ్ళు పిసకాలి, వీపు రుద్దాలి, పక్కవేసి పడుకోబెట్టాలి, నేనే ముద్దు........" నవ్వి తనే ముద్దుపెట్టుకుంది భారతి.

వీళ్ళ కాపురాన్ని మొదట్లో ఆ ఇళ్లల్లో ఎవరూ పట్టించుకోలేదు. భారతి కూడా ఎవరితోనూ ఎక్కువ పరిచయం చేసుకోలేదు. ఆరోజు అది

వారం, భారతి ఇంట్లోనే ఉన్నది. కాలేజిలో సహాధ్యాపకురాలు ఆరోజున వచ్చింది. ముందుగా ఆవిడ వస్తానని చెప్పకపోవటంతో భారతి కొంచెం విస్తుపోయింది, ఆవిడ తెలుగు లెక్చరరు, పేరు సత్యవాణి.

ఆవిడ రాగానే సాదరంగానే ఆహ్వానించింది భారతి.

"రండి కూర్చోండి, ఏమిటి కబుర్లు" సత్యవాణి కూర్చుంటూనే ఒక్కసారి నాలుగు పక్కలా చూసి, ఇంట్లో సామానంతా చూసింది.

"కొత్తకాపురంతోపాటు సామానూ కొత్తదే, ఇటీవలనే కొన్నారా" అన్నది.

"అవునండీ, అసలు మా పెళ్ళయి ఏడెనిమిది నెలలే అయింది. ఇక్కడికి వచ్చాకనే సామానంతా కొన్నాం" అన్నది భారతి.

"మీవారు ఇంట్లోనే ఉన్నట్లున్నారు, వారి కెక్కడ ఉద్యోగం."

భారతి మనస్సు చివుక్కుమన్నది. పైకి తొణక్కుండానే "వారికి ఉద్యోగం చెయ్యాలని లేదు. స్వంతంగా ఏదైనా వ్యాపారం చెయ్యాలని ఆలోచన, ఇంకా ఏం తేల్చుకోలేదు."

సత్యవాణి నవ్వింది. ఆ నవ్వులో హేళన స్ఫురించింది భారతికి. వాళ్ళిద్దరూ మాట్లాడుతూ ఉండగానే నారాయణమూర్తి వెళ్ళిపోయాడు.

"మీరు చాలా పూర్వకాలం మనుష్యులే సుమండీ, లెక్చరరు ఉద్యోగం చేస్తున్నా నల్లపూసలూ, కాళ్ళకి మట్టెలూ, పుస్తెలతాడు, కళ్ళకు కాటుకా ఈ కాలంలో ఎవరూ పెట్టుకోరు. అచ్చగా పల్లెటూరి గృహిణిలా వున్నారు. దానికితోడు కల్సిన సంబంధమల్లే వున్నది. చదువులేకపోయిన మేనరికం చేసుకున్నారు."

ఈ మాటలకు కొంచం కించపడ్డది భారతి. అభిమానాన్ని లోలోపలనే ఇముడ్చుకుంది.

"మీరు మట్టెలు పెట్టుకుని కాలేజీకి వస్తుంటే అంతా మీకాళ్ళ వైపే చూస్తుంటారు. విద్యార్థినులు మరీను" అన్నది సత్యవాణి.

"నాపాదాలు అందరి దృష్టినీ ఆకర్షించేటంత అదృష్టం చేసుకున్నయ్యని నాకు తెలీదు. పెళ్ళయినవాళ్ళు కాలేజిలో చేరితే మట్టెలు

ఉంచుకోకూడదనే రూలు ఏమైనా ఉందేమో ప్రిన్సిపాల్‌గార్ని కనుక్కుంటాను. అలాంటి ఆర్డరును మీరు చదివారా" కాస్త వెనక్కి తగ్గింది సత్యవాణి, కాని తనమాటను ఖాతరు చెయ్యలేదనే వ్యధ ఎక్కువైంది.

"పెళ్ళయినవాళ్ళు మల్లెలు పెట్టుకోకూడదని నా ఉద్దేశం కాదు. కాని మనంచదువుసంధ్యలులేనిపల్లెటూరివాళ్ళంకాదు. చదువుకున్నవాళ్ళల్లో సంస్కారభావాలు గుబాళిస్తయ్యని అందరికీ తెల్సినదే. దానికితోడు మనం మసులుకునే ప్రదేశాల వాతావరణాన్నిబట్టికూడా కొన్ని పూర్వాచారాలకు స్వస్తి చెప్పాలి. చదువుకున్నవాళ్లు, చదువులేనివాళ్ళు ఒకేరకమైన ఆచారాల్ని పాటిస్తే ఇంత విద్యావంతులమైనందుకు మన ఆధిక్యత ఏముంటుంది? మనమే ఇంత పూర్వాచార పరాయణులమైతే మనదగ్గర చదువుకునే విద్యార్ధినులకు రాతియుగపు సాంప్రదాయాలని బోధించినట్లే అవుతుంది. ఇక వాళ్లేం పురోగమిస్తారు. నామటుకు నేను మల్లెలూ, నల్లపూసలూ ఎప్పుడూ పెట్టుకోను" అన్నది సత్యవాణి.

భారతికి వళ్ళు మండిపోయింది. "చదువుకుని డిగ్రీలు తెచ్చుకున్నంతమాత్రాన మనం దొరసానులమై పోలేదు. హిందూ కుటుంబాల్లో హైందవ సాంప్రదాయాల్లో పుట్టి పెరిగిన వాళ్ళమేకాని యూరోపియన్ జాతివాళ్ళం కాదు. చదువు సంస్కృతినీ, విజ్ఞానాన్నీ, వివేకాన్నీ కలిగిస్తుంది కాని భారతీయ సంస్కృతినీ మార్చమని, భారతీయ ఆచార సాంప్రదాయాలను పాటించ వద్దని చెప్పలేదు. మన జాతి సంస్కృత, మన భారతీయ సాంప్రదాయాలూ, మతాచార వ్యవహారాలూ ఎంతో ఉన్నతమైనవనీ, ఆదర్శనీయమైనవనీ, విదేశీయులుకూడా మెచ్చుకుంటూంటే, భారతదేశంలో హిందూ కుటుంబాల్లో పుట్టి, హైందవ సాంప్రదాయాలను పాటించ కూడదనటం అజ్ఞానానికి చిహ్నం. మల్లెలు, మంగళసూత్రాలూ, నల్లపూసలూ వివాహిత స్త్రీలే ధరిస్తారుగాని పెళ్ళికానివారూ, వితంతువులూ ధరించరు కదా! అందువల్ల సాంప్రదాయ విరుద్ధమైన పన్లు మనం చెయ్యడంలేదు. వివాహిత స్త్రీలు వాటిని ధరించక పోయినందువల్ల వచ్చే ఆధిక్యతా లేదు. మన ఆచార వ్యవహారాలూ,

సాంప్రదాయాలూ మనకే నచ్చకపోతే చదువుకున్నందుకు మనలో విజ్ఞానం అంత దిగజారి పోయిందనుకోవాలి."

సత్యవాణి స్థంభించిపోయింది. ఇక ప్రస్తుతానికి ఈ ప్రమాదం నుంచీ బయట పడదామనుకుంది. భారతి మనస్తత్వం అర్థంచేసుకుంది. ధోరణి మార్చాలనే సంకల్పం కలిగింది.

"పోనీలెండి, ఎవరిపోలిక వారిదయినట్లు ఎవరి ఉద్దేశ్యాలు వాళ్ళవి. మీరుకూడా మహిళామండలిలో మెంబరుగా చేరాలి. ఈ విష యమే అడుగుదామని వచ్చాను. మన కాలేజీ స్టాఫంతా మండలిలో మెంబర్లే, మీరుకూడా తప్పక చేరాలి."

"అట్లాగే, ఆలోచించుకుని రేపు చెప్తాను. ఒక్కరోజు గడు విన్వండి. మెంబర్లంతా మట్టెలు, నల్లపూసలు లేనివాళ్లేనా."

సత్యవాణికి ముఖాన కొట్టినట్లయింది.

"లేదండీ, అటూ ఇటూ ఉన్నారు. మీరేం ట్యూషన్లు ఏర్పాటుచేసు కోలేదా."

ఆశ్చర్యంగా చూసింది భారతి.

"అవును, ఈ కాలంలో కాలేజిల్లో చెప్పేది ఎవరు సరిగ్గా ఆక ళింపు చేసుకుంటున్నారు. అందులోనూ మీరు మేథమెటిక్స్ లెక్చరరు కదా, కనీసం డజనుమంది అయినా మిమ్మల్ని ట్యూషన్ చెప్పమని అడగలేదా" అన్నది సత్యవాణి.

"ఎవరూ అడగలేదు, వాళ్ళకు తెల్సేట్లుగా చెప్పి, తెలీకపోతే క్లాసులోనే చెప్పేటప్పుడు ఇంక వేరే ట్యూషన్లు ఎందుకూ? వాళ్ళకు డబ్బు దండగ, అయినా జీతాలుకట్టిచదువుకునే విద్యార్థినకు జీతాలు పుచ్చు కునే మనం సరిగ్గా పాఠాలు చెప్పకపోతే వాళ్ళు ట్యూషన్లకు వెళ్లాలి. ఈ పద్ధతి నాకు నచ్చదు. ట్యూషన్లద్వారా డబ్బు సంపాదించాలనే తాపత్రయంకూడా నాకులేదు, ఎవరైనా ఇంటికొచ్చి అడిగితే వాళ్ళకు తప్పక అర్థమయ్యేటట్లుగా ఊరికినే చెప్తాను. ట్యూషన్ ఫీజు అవసరం లేదు" అన్నది భారతి.

సత్యవాణికి ఏం మాట్లాడానికీ తోచలేదు. ఏది మాట్లాడినా భారతి తగిన సమాధానమే చెప్తోంది. ప్రస్తుతం ఇక ఊరుకుంటేనే మంచి దనుకుంది.

"సరే వెళతాను, రేపు చెప్తారు కదూ."

"తప్పకుండా" అన్నది భారతి. సత్యవాణి వెళ్ళింది.

కొందరు చదువుకున్న ఆడవాళ్ళు స్త్రీత్వాన్నీ, స్త్రీ ధర్మాన్నీ కూడా మర్చిపోయి వెర్రి ఆలోచనలకు పందిరివేసి ఆ పందిరి గుంజలుగా తాము నిలబడి తమ వ్యక్తిత్వాన్ని ఆ రకంగా చాటుకుంటారు కామాలను కుంది భారతి. తా చెడ్డకోతి వనమెల్లా చెరిచినట్లు తాము పట్టిన పెడదారినే అందరూ పోవాలనీ, ఇట్లా పదిమందినీ తమవైపుకు తిప్పుకుని తమభావా లను నూరిపోస్తే తామేదో అధికృత సంపాదించుకున్నట్లుగా భావిస్తారు కామాలనుకుంది.

సత్యవాణి స్వవిషయం భారతికి కొద్దిగా తెల్సు. ఆవిడ నడు స్తుంటే అందరికీ నవ్వొస్తుంది. ఆవిడకు ఇద్దరు పిల్లలు, కాని పెళ్ళికాని పదహారేళ్ళ బాలాకుమారిలా ఉండాలని సత్యవాణితాపత్రయం. సహజంగా తనవయస్సును స్త్రీ దాచాలనే ప్రయత్నిస్తుంది. భారతిలాటివాళ్ళకు అది నచ్చని విషయమే. సత్యవాణి కాస్త లావుగా ఉంటుంది. అర్ధచంద్రా కారం మెడక త్తిరింపుగలచోళీ, భుజాలను అంటిపట్టి లాగినా రాకుండా ఉండేటంత బిర్రుగా చేతులు, అవయవభింకం బయటపడకుండా ఉండా లనే తీవ్రవాంఛతో సరిదిద్దుకుని కట్టుకునే జాకిట్ బెల్టు, నడుంనుంచీ కొంచం పైవరకూ పచ్చగా కనబడేపొట్ట, జారి జారిపోతూ బొడ్డుకిందికి చీరె, ఆ పల్చని చీరెలోనుంచీ అందంగాకనబడే నక్షత్రంపూలు కనిపించే లేసులంగా, సత్యవాణి నడుస్తుంటే ఎంతవయస్సు దాచుకుందామను కున్నా మనస్సు కలవాళ్ళకు తెలుస్తూనే వుంటుంది. పొట్ట తొనలు, తొన లుగా జారిపోయింది. కండరాలు వెనక్కు ఎళ్ళుకొచ్చి వీపు నాలుగు భాగాలుగా అసహ్యంగా కనిపిస్తుంది. సత్యవాణి నడుస్తుంటే ఆడవాళ్ళకే నవ్వొస్తుంది. ముప్పైఅయిదేళ్లున్నా పదహారేళ్ళ పడుచునే అను

కుంటుంది. ఆవిడ మనస్తత్వం అది. మెళ్లో సన్నని గొలుసు, ఆ గొలుసు లోనే మంగళసూత్రాలు కనబడకుండా లోపల వేసుకుంటుంది. పైకి సన్నని గొలుసుమాత్రమే కనిపిస్తుంది.

అలాంటి సత్యవాణిని తల్చుకుని "ఏమిటో కర్మ" అనుకుంది భారతి.

నారాయణమూర్తి బజారునుంచి వచ్చాడు. సంపంగిపూలు, చామంతి, దవనం, కనకాంబరాలు, జాజిపూలు, అన్నీ కలిపి తెచ్చాడు. అంత పెద్దపూల పొట్లాం విప్పిచూసేసరికి భారతి ఆశ్చర్యంతో నవ్వింది.

"ఈ పూలన్నీ నాకేనాండీ, మీ చెల్లమ్మకూడా పంపాలా."

"కాదు భారతీ, ఈ పూలన్నీ నీకే, పూలజడ వేసుకుంటావని" ఎగతాళిగా అన్నాడు నారాయణమూర్తి.

"మీకు మనసయిందా."

"అవును, నువ్వు పూలజడ వేసుకుని నాలుగయిదు నెల్లయింది. ఆ ఒక్కరోజునేకదా పూలజడ వేసుకుంది."

"పాపం, మరీ చిన్నవాళ్ళయిపోతున్నారు."

"మరీ చిన్నవాళ్ళకు పెళ్ళికాదు, మనకు పెళ్లయింది. కాస్త పెద్ద వాళ్ళం."

"మాటలు నేర్చాడు."

"చదువు ఎక్కువరానివాళ్లకు ఈ మాట లెందుకంటావా" భారతి బుగ్గ చిలిపిగా గిల్లుతూ నవ్వాడు.

'అసలు డిగ్రీలు వున్నవాళ్ళకన్నా స్కూల్ ఫైనల్ వాళ్లే పెద్ద వుద్యోగాలు చేస్తున్నారు, ఊళ్లేలుతున్నారు." అన్నది భారతి. ఆమెవళ్ళో తల వాల్చాడు నారాయణమూర్తి.

"ఆనర్సు చదివినవాళ్లు పూలజడ వేసుకోకూడదు."

"ఇంకా."

"మట్టెలు, నల్లపూసలూ ధరించరాదు."

"ఇంకా."

"పదహారేళ్ళ పడుచులావుండాలి, వళ్ళంతా కనిపించేటట్లుగా పల్చని చీరెలే కట్టుకోవాలి."

'ఇంకా.'

"వయస్సు తగ్గించి చెప్పుకోవాలి."

"అంటే."

"ముప్పైఅయిదు, ముప్పైనాలుగు, ముప్పైమూడు, ఇరవై తొమ్మిది, ఇరవైఆరు, అట్లా అట్లా ఏ ఏటి కాఏడు తగ్గించుకుంటూ రావాలి."

"అంటే బాయిలింగ్ పాయింట్ జీరో వరకూ రావచ్చునన్న మాట." అన్నాడు నారాయణమూర్తి.

భారతి పొట్ట చెక్కలయ్యేటట్లుగా నవ్వింది.

"అయితే చదువుకున్నవాళ్ళు భర్తదగ్గర— — — — —."

"ఇంక చాలించండి, వ్యవహారం ముదుసు పాకాన పడుతోంది."

భారతి పూలు గుచ్చుకుని మాల కట్టుకుంటున్నది.

"ఆనర్సు చదివినవాళ్ళు అసహ్యంగా తల్లో పూలు పెట్టుకో వచ్చా?" అన్నాడు.

"ఏం? సత్యవాణి మీతో చెప్పిందా? అసలు మీకు సత్యవాణి లాంటి భార్య రావాల్సింది; తిక్క వదిలిపోయేది."

పూలచెండు తల్లో పెట్టుకుంటూ అన్నది భారతి. నారాయణమూర్తి సిగిరెట్ కాలుస్తూ భారతివైపు చూస్తూ కూర్చున్నాడు. ఆతని మనస్సులో ఏవో తెలియని భావాలు దొర్లిపోసాగాయి. భారతి ఎంత చక్కనిదయినా వినయ విధేయతలు కలదయినా, మనస్సునీ, ఆత్మనీ, మనోభావాలనీ మనస్ఫూర్తిగా తనకే అర్పితం చేసినా, అర్ధాంగిగా, గృహిణిగా, తనను ఆరాధించి ఆత్మార్పణ చేసుకున్నా, ఏదో తెలియని అశాంతి అతని మనస్సులో సుళ్ళు తిరుగుతునే ఉన్నది, తను విద్యాధికుడు కాదు, భారతి ఉద్యోగం చేస్తుంటే తను సిగరెట్లు కాలుస్తూ కాలాన్ని వ్యర్థం

చెయ్యడంకన్నా తను ప్రస్తుతం చేస్తున్నదేమీలేదు. చిన్నతనాన్ని ఎత్తి చూపే లజ్జాభావంతో ఆతని ముఖం చిన్నబోయింది.

కిటికీలోనుంచి సిగిరెట్ అవతల పారేసి అగ్గిపుల్లతో పళ్ళు తోడుకుంటూ కిటికీలోనుంచి వీధిలోనికి చూడసాగాడు. భారతి స్నానం చేసి, చీరె మార్చుకోటానికి అవతల గదిలోనికి వెళ్ళింది.

మనస్సులోని ఆవేదన మసిలిపోగా, కన్నీటితో కళ్ళు మసకగా కనుపించాయి, ఒక్కసారి ఎగపీల్చి పెదాలు గిల్లుకుంటూ ఆలోచిస్తున్నాడు నారాయణమూర్తి.

"ఏమిటంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు, నేను సినిమాకు రెడీ" అన్నది భారతి.

కళ్ళు తుడ్చుకుని జీరబోయిన కంఠంతో,

"సినిమాకు వెళదామంటావా భారతీ" అన్నాడు.

భారతి ఆశ్చర్యంగా చూసింది. ఎంతగట్టిగా కళ్ళు తుడ్చుకున్నా నారాయణమూర్తి కళ్లలోని కన్నీరు సాంతంపోలేదు.

"అట్లా ఉన్నారేం, నేను ఆలస్యం చేశానా."

"లేదు, నేనూ స్నానంచేసి వస్తాను, సినిమాకు వెళదాం, తెలుగు సినిమాకే కదూ."

"ఇంగ్లీషు సినిమా అయితే మీకు అర్థంకాదు" అని భారతి ఎగతాళిగా అయినా అంటుందని అనుకున్నాడు.

"ఏదో ఒక సినిమాకు పోదాం, అది సరే ఎందుకో మీ కళ్ళల్లో నీళ్ళు నావైపు చూశాయి. నేనేమయినా మీ మనస్సు కష్టపెట్టానా?"

"లేదు భారతీ, కళ్ళల్లో సిగిరెట్ మసిపడింది."

"మీకు మాట ఎట్లా తప్పుకోవాలోకూడా తెలీదు. కళ్లల్లో సిగిరెట్ మసి ఎట్లాపడుతుందండీ" నవ్వుతూ కళ్ళు తుడిచింది. నారాయణమూర్తి స్నానానికి వెళ్ళాడు.

మహిళా మండలిలో మెంబరుగా చేరటాన్నిగురించి అడుగుదామనుకుంది భారతి, కాని అడగలేకపోయింది, నారాయణమూర్తిని ఆ స్థితిలో చూసేసరికి అసలా విషయమే స్ఫురణకు రాలేదు.

పశ్చాత్తాపం మనశ్శాంతినిస్తుంది. మనస్సులో సుళ్ళుతిరిగే మనో భావాలను వెళ్ళగక్కటానికి బయటికి కనుపించేది కన్నీరు. కాని ఆ కన్నీరు శాశ్వతమైన మనశ్శాంతి నివ్వలేదు.

స్నానాలగదిలో ఒక్కసారి తనలోతనే బావురుమని, మనోవేదనను కన్నీరుగా మార్చుకుని స్నానంచేసి వచ్చాడు నారాయణమూర్తి. ఇప్పు డతనిముఖం విప్పారింది.

ఇద్దరూ సినిమాకు వెళ్లారు.

మర్నాడు కాలేజీకి వెళ్ళగానే సత్యవాణి అడిగింది మహిళామండలిలో భారతి చేరేవిషయం. భారతి చేరనన్నది. సత్యవాణికి తల నరికేసినంత పనయింది. తోటి లెక్చరర్లతో సత్యవాణి పందెం కట్టింది భారతిని మహిళామండలిలో మెంబరుగా చేర్పిస్తానని. చాలామంది చేర్పించలేవన్నారు. కొంతమంది తటస్తంగా ఉన్నారు.

"ఎందుకని" అన్నది సత్యవాణి.

"నేను ఉన్నత ఆదర్శభావాలు కలదాన్ని కాదు, నాలాంటి మూసివాయినం ముత్తయిదువను చేరితే మండలి ఏమంత పురోగమించదేమోనని నా భయం." అన్నది భారతి. అందరూ సత్యవాణివైపు చూశారు.

అంతమందిలో ఈమాట అన్నందుకు సత్యవాణి అహం దెబ్బతిన్నట్లయింది. అంతా మనస్సులో పరిపరివిధాలుగా అనుకున్నారు, కొంతమంది సత్యవాణికి మంచి శాస్తి జరిగిందనుకున్నారు.

"నిజమే భారతీ, మీరు చేరకుండా ఉంటమే ఉత్తమం. చదువురాని భర్తను మెడకట్టుకున్నప్పుడు మహిళామండలిలో చేరటం సబబు కాదు. మీలాటివారు వంటింటి కుందేలులా ఉంటూ భర్తకు చదువు చెప్పుకోవటం ఆరోగ్యం." అని విసవిసా తనక్లాసులోకి వెళ్ళిపోయింది.

అంతా విస్తుపోయారు. భారతి మనస్సు అభిమానంతో, అవమానంతో కుంచించుకుపోయింది. తలెత్తి అందరిముఖాల్లోకి చూడలేక పోయింది.

క్లాసులోకి వెళ్లి కుర్చీలో కూర్చున్నదన్నమాటేగాని లెక్కలు చెప్పలేదు, మనస్సు కెలికినట్లయింది. ఎన్నోభావాలు అవమానంతో దహించుకుపోయాయి. కళ్ళముందు నారాయణమూర్తి మెదిలాడు. దెబ్బ శరీరాన్ని బాధపెడుతుంది. మాట గుండెల్లో గుచ్చుకుంటుంది. ఆప్తులైన వార్ని అనవసరంగా మాటలన్నప్పుడు ఆత్మాభిమానం దెబ్బతింటుంది. ఆవేదనతో హృదయం తూట్లు పడుతుంది.

అరగంట గడిచినా భారతి కుర్చీలోనుంచి లేవలేదు. విద్యార్థిను లంతా విస్తుపోయారు. ఒకళ్ళ ముఖాలొకరు చూసుకున్నారు. ఎవరికీ ఏమీ అర్థంకాలేదు. ఆ నిశ్శబ్దతను ఎవ్వరూ సహించలేకపోయారు. ఇంకో లెక్చరయితే అందరూ కలిసి దుయ్యబట్టి అడిగేవారే. భారతి అంటే అందరికీ గౌరవమూ, అభిమానమూ. ఎవ్వరూ సాహసించి అడగలేక పోయారు. ప్రమీల ధైర్యంచేసి లేచి నిల్చుంది.

"సుస్తీగా ఉన్నారాండీ" అన్నది ప్రమీల.

భారతి తలెత్తి చూసింది. కళ్ల తుడ్చుకుంది. కళ్ళు ఎఱ్ఱబడ్డయ్యి.

"ఒంట్లో బావుండలేదా, శలవు పెట్టకపోయారా" అన్నది ప్రమీల మళ్ళీ.

"అవునమ్మా, ఒంట్లో బావుండలేదు. శలవు పెడితే బాగుండేది. ఇప్పుడయినా శలవుపెట్టి వెళ్ళిపోతాను; ఈరోజు లెక్కలు చెప్పలేకపోయి నందుకు మన్నించండి" అన్నది భారతి.

ఆరోజుకు శలవురాసి ప్రిన్సిపాల్ కు ఇచ్చి వెళ్లింది భారతి.

ఇంటికి వెళ్లేసరికి నారాయణమూర్తి ఒక్కడే కూర్చుని ఏదో నవల చదువుకుంటున్నాడు. కాలేజినుంచి వచ్చేసిన భారతిని చూసి ఆశ్చర్యపోయాడు.

"అప్పుడే వచ్చేశావేం, ఈరోజు శలవా."

"లేదు, శలవుపెట్టి వచ్చాను. కొంచం తలనొప్పిగా ఉంది."

"మాత్ర ఏదైనా పట్టిమ్మంటావా, కాఫీ తెచ్చివ్వనా."

నుదురుమీద, చెంపలమీద చెయ్యివేసి చూశాడు.

"అరే, వొళ్ళు వెచ్చగా ఉంది, టెంపరేచరు చూద్దాం."

ధర్మామీటరు తెచ్చాడు. జ్వరంలేదు. మంచంమీద అటువైపు తిరిగి పడుకున్నది.

సత్యవాణి మాటలు ఇంకా కడుపులో దేవుతూనే ఉన్నాయి. భారతి మాట్లాడకుండా పడుకుంటే నారాయణమూర్తికి ఏమీ తోచలేదు. పలకరిస్తే ఏడుపొచ్చే పరిస్థితిలో ఉన్నది. ఎందుకట్లా వున్నదో అతనికి అర్థంకాలేదు. ఎంత బ్రతిమాలినా, ఎంత అడిగినా భారతి ఏమీ చెప్ప లేదు, ఏంచెప్తుంది?

"నామీద కోపమా?"

"లేదండీ."

"మరి మాట్లాడవేం?"

"మాట్లాడుతునే ఉన్నానుగా."

"ఎందుకో మనస్సులో బాధపడుతున్నావ్."

"బాధపడటం మానవసహజం."

"నీ కష్ట సుఖాల్లో బాధ నాకూ వున్నట్లే. నీ మనస్సులోని బాధకూ నాకూ సంబంధం వున్నది."

"ఎవరో ఏదో అన్నప్పుడు కాస్త బాధపట్టం సహజం. ఆ ఏమిటి కబుర్లు." కళ్ళు తుడుచుకుని మనస్సులోని బాధను వెనక్కు నెట్టి, లేని సంతోషాన్ని తెచ్చుకుంది.

"నాతో చెప్పకూడని విషయమా" అన్నాడు బ్రతిమాలుతున్నట్లుగా.

"ఏం లేదండీ, కొంచం వేడిచేసి తల దిమ్ముగా ఉండి శలవు పెట్టి వచ్చేశాను."

"విషయం దాస్తున్నావ్. పోనీలే, నీకు ఇష్టంకాకపోతే చెప్పొద్దు" మంచంమీదినుంచి లేచాడు. చెయ్యిపుచ్చుకుని కూర్చోపెట్టింది.

"ఏం రాయటంలేదు. కాని మగవాళ్ళకు చెప్పతగని విషయాలు ఆడవాళ్లకు అనేకం వుంటయ్. అన్నీ చెప్పమని మగవాళ్ళు అడక్కూడదు."

"అంటే."

"ఆ తేడా సృష్టిలోనే వున్నది."

"నీ మాటల్లోని భావాల్ని తెల్సుకోటానికి నేను డిగ్రీలు తెచ్చుకోలేదు." మనస్సులో నొచ్చుకున్నాడు నారాయణమూర్తి.

"అదుగో, అంతలోనే మీరు బయటపడిపోతారు."

"పోనీలే దాచుకో, నాకేం చెప్పనక్కరలేదు. కాస్త భార్యగా నీ సలహా కావాలి."

భారతి నవ్వుతూ చూసింది.

"ఏం నవ్వుతున్నావ్, తల దిమ్మపోయిందా."

"కాస్త భార్యగా ఏం సలహా ఇస్తాను. పూర్తి భార్యఅయితే ఏదన్నా చెప్పవచ్చు."

"పూర్తి భార్యావేకాదు, పూర్తిన్నర భార్యవు, సలహా చెప్తావా."

"అసలు సంగతేమిటి."

"చెప్పుకో చూద్దాం."

భారతికి ఏం తోచలేదు, తెలీదన్నట్లు పెదవులతో సంజ్ఞచేసింది.

"నువ్వు సంపాదిస్తుంటే నేను తిని కూర్చోటం నాకేం బాగాలేదు. కొన్నాళ్ళుపోతే ఎందుకూ పనికిరాకుండా పోతానేమో ననిపిస్తున్నది."

"అయితే నా సంపాదన, మీ సంపాదన అనే భేదభావం చూపిస్తున్నారన్నమాట. ఇది మీకే తోచిందా ఎవరన్నా అన్నారా" అన్నది భారతి గొంతులో తొట్రుపాటు కనిపించింది. తనమాదిరే నారాయణమూర్తికూడా ఎవరన్నా అన్న మాటలకు మనస్సులో బాధపడుతున్నారా అనుకుంది భారతి. ఇంక ఉండబట్టలేకపోయింది.

"చూడండి" కళ్ళల్లో నీళ్ళు తొంగిచూశాయి.

"ఏమిటి భారతీ" తనూ ఆందోళనపడుతూనే అన్నాడు.

"ఈ లోకంలో అనేక రకాల పోలికలుగల మనుష్యులు ఉన్నట్లే అనేక మనస్తత్వాలు కలవారూ వుంటారు. అందులో కొంతమందికి ఒక రకమైన అహంకారం వుంటుంది. ఈ ప్రపంచం ఈ రీతిగా నడవటానికి తామే కారణభూతులమని అనుకుంటారు. తాము ఎన్ని చెడ్డపనులు చేస్తున్నా, దురాలోచనలు చేస్తున్నా అవన్నీ లోకకల్యాణార్థమేనని వారి ఊహ. ఇన్ని తరహాల వ్యక్తుల్ని ఒక్క తాటిమీద నడిపించటం ఇంతమందినీ సృష్టించిన ఆపరమాత్ముడికే చేతకాదు. మనలోటివాళ్ళం ఎవరినీ సంతృప్తి పర్చలేం. అందుకని ఆత్మవంచన చేసుకుంటామా చెప్పండి. అంతేకాదు, వాళ్ళు ఏదో అన్నందుకు తాత్కాలికంగా బాధపడ్డా, ఆ తాత్కాలిక మానసిక సంక్షోభ భరించలేక ఏదో ఒక నిర్ణయానికి రావటం తగని పని" అన్నది.

నారాయణమూర్తికి ఏమీ అర్థం కాలేదు. ఏం మాట్లాడలేదు.

"పోనీ ప్రైవేటుగా చదువుతారా ? మీరూ బి. ఏ. పాసవుదురు గాని."

భారతి ఆవేదనతో కూడిన చురుకుదనంతో భర్తవైపు చూసింది.

"నువ్వు ట్యూషన్ చెప్తావా భారతీ ! చదువులో నీ విద్యార్థిని, చెవులు మెలిబెట్టినా ఊరుకుంటాను. నిన్ను ఆరాధించటంలో శారదా భక్తుణ్ణి. నా మనస్సుని నేనే అర్థం చేసుకోలేక సతమతమైపోతూ కళ్ళల్లో దుఃఖాశ్రువులు నింపుకుని నీ వళ్లో తలదాచుకున్నప్పుడు పసివాడిని. ఏక శయ్యలో భార్యాభర్తలం. ఇన్ని తరహాలుగా జీవితాన్ని గడుపుతున్నా ఎందుకో నన్ను నేనే సమాధాన పర్చుకోలేక పోతున్నాను. ఇంతకన్న నాకు చదువురాదు, చదువుకోవాలనీ లేదు. నీ భర్తని కనుక నేనూ చదువుకున్నట్లే, నీ డిగ్రీలో నాకూ భాగం వున్నది. నీ జ్ఞాన నేత్రంతో ఈ సంఘాన్ని నేనూ చూసి అర్థం చేసుకుంటున్నాను. నా మనోనేత్రంలో నువ్వెప్పుడూ కనబడుతూనే వుంటావు. మనల్ని మనం అర్థం చేసుకున్నా సంఘం మనల్ని అర్థంచేసుకోటం లేదు. అందుకే మనిద్దరికీ మనశ్శాంతి లేకుండాపోతున్నది. ఈ జీవితంలో నాకు డిగ్రీలు రావు, అక్కరలేదు.

ఆ ప్రయత్నమూ చెయ్యను. కాని సంపాదన పరుణ్ణి కావాలి. గౌరవంగా నేనూ సంపాదించాలి. అందుకు నాకు తోచింది ఒక్కటే మార్గం." ఆవేశంతో అన్నాడు నారాయణమూర్తి.

"ఏమిటది."

"కంట్రాక్టులు చేస్తాను. నా స్నేహితుడు వెంకట్రావు పెద్ద కంట్రాక్టరు. అతను కొద్ది వాటా ఇస్తానన్నాడు. నేనంటే అతనికి చిన్నప్పట్నుంచీ పంచప్రాణాలూ, పెట్టుబడిలేదు. నా వాటా కొచ్చే లాభాలే నా పెట్టుబడికి జమకడతారు, ఇందుకు నీకు ఇష్టమేనా ?"

కష్టంగా చూసింది భారతి. ఏం సమాధానం చెప్పలేకపోయింది. ఆ కంట్రాక్టులేమిటో ఆ పెట్టుబడులేమిటో భారతికి అర్థంకాలేదు. ఆమెకు తెల్సింది యూనివర్శిటీచదువు, లెక్చరరు ఉద్యోగం, మనసారా వలచివల పించుకున్న భర్తతో కాపురం. కాంట్రాక్టులు చెయ్యటమంటే ఎండనక, వాననక తిరగాలి. ఆఫీసర్లకు అణకువగా ఉండాలి. కొంతవరకూ వ్యక్తిత్వాన్ని చంపుకోవాలి. అంతవరకే తెల్సు భారతికి. తనకు ఏమంతగా ఇష్టంలేకపోయినా సరేననక తప్పలేదు.

నారాయణమూర్తి తృప్తిగా భారతివైపు చూశాడు. ఆమె నవ్వింది. ఆ నవ్వులో కోటివీణానాదాలు వినిపించాయి నారాయణమూర్తికి.

సాయంత్రం ఐదుగంటలకు భారతి వంటప్రయత్నంలో ఉన్నది, నారాయణమూర్తి కంట్రాక్టరు వెంకట్రావు ఆఫీసుకు వెళ్ళాడు. తలుపు చప్పుడైంది. తలుపు తీసింది భారతి. ఆశ్చర్యపోయింది. మరది కేశవుడు.

"ఏం కేశవా, ఎప్పుడొచ్చావు, ఉత్తరమైనా రాయకుండా వచ్చావేం? అత్తయ్య కులాసాగా ఉన్నారా? నీకు శలవలా? మన ఊళ్ళో అందరూ క్షేమమా" అంటూ ప్రశ్నలవర్షం కురిపించింది. కాళ్ళ కడుక్కోటానికి నీళ్ళిచ్చి, మంచినీళ్ళు ఇచ్చింది.

"అందరూ కులాసానే వదినా, ఊరికినే చూసి రమ్మని అమ్మ పంపింది. రెండురోజులు ఉండి వెళతాను" నవ్వు ముఖంతో సమాధానం చెప్పాడు కేశవుడు.

గంటక్రితమే తమ కాఫీ, ఫలహారాలు పూర్తయాయి. కేశవుడితో మాట్లాడుతూ అతనికోసం ఉప్మాచేసింది. కాఫీకి పాలులేవు. మిగిలిన పాలు తోడువేసింది. కేశవుడిని పత్రిక చదువుకుంటూ కూర్చోమని పెరటి త్రోవన వెళ్ళి పదినిముషాల్లో హోటల్‌నుంచి ఫ్లాస్కులో కాఫీ తెచ్చింది భారతి. అతనికి ఉప్మా, కాఫీ ఇచ్చి మాట్లాడుతూ వంట చేస్తున్నది.

"వంట నువ్వే చేస్తావా వదినా" అన్నాడు కేశవుడు.

"నేను చెయ్యటంలేదని ఎవరయినా చెప్పారా" అన్నది భారతి.

"కాదు, కాలేజీ టైముకు కుదుర్తుందో లేదోనని అడిగాను వదినా."

"నేను ఎంతో మారిపోయి ఉంటానని మీరంతా అనుకున్నారు కదూ" అతని ముఖంలోకి పరీక్షగా చూస్తూ అడిగింది భారతి. సమాధానం చెప్పటానికి అతను సంకోచించాడు.

"నువ్వు ఏం చెప్పినా విని ఆనందిస్తాను కేశవా, నేనేమీ అనుకోను."

"నువ్వు కాలేజికి వెళుతుంటే అన్నయ్యే వంట చేస్తాడని అమ్మ చెప్పింది. ఊళ్ళో చాలామంది అట్లాగే అన్నారట. అమ్మ అన్నది."

భారతి మనస్సు బాధతో నిండిపోయినా నిస్సంకోచంగా చెప్పిన కేశవుని అభినందించింది.

"పోనీలే కేశవా, ఎవరి అభిప్రాయాలు వాళ్ళవి. అందుకు బాధ పడటం తప్పే కాని, బాధ పడవద్దని మనస్సుకు నచ్చ చెప్పలేం, మనస్సు చిన్నపిల్లకాదుకదా కేకవేసి కూర్చోపెట్టటానికి."

వదినెగారి పరిస్థితి స్వయంగా చూసిన కేశవుడికి అమ్మ చెప్పిందంతా అబద్ధమే ననిపించింది.

"అన్నయ్య ఏడి వదినా."

"కాంట్రాక్టులు చెయ్యబోతున్నారు. ఆ విషయాల్లోనే ఎక్కడికో వెళ్ళారు."

"అన్నయ్యకూడా ఉద్యోగంచేసి సంపాదిస్తున్నాడా వదినా" ఆశ్చర్యంగా అడిగాడు కేశవుడు.

"మీ అన్నయ్య ఉద్యోగం చెయ్యలేరనికూడా అత్తయ్య అన్నదా కేశవా."

"అవును వదినా, ఒకవేళ అన్నయ్య ఉద్యోగం చేసినా నీ కన్న తక్కువ జీతమే తెస్తాట్ట."

కన్నకొడుకును గురించి ఇంత తక్కువగా, కోడల్నిగురించి ఇంత ఎక్కువగా యశోదమ్మ ఎందుకు అంచనా వేస్తున్నదో భారతికి అర్థం కాలేదు.

"ఇంకా నన్నుగురించి అత్తయ్య ఏమనుకుంటున్నది కేశవా" ముభావకంగానే అడిగింది.

"ఏమీ అనుకోటంలేదు వదినా" ఏదో చెప్పాలనుకున్నా చెప్పలేక పోయాడు కేశవుడు.

రాత్రి తొమ్మిదిగంటలకు నారాయణమూర్తి వచ్చాడు. తమ్ముణ్ణి చూసి ఆశ్చర్యపోయాడు. కుశలప్రశ్నల తరువాత భోజనాలకు లేచారు.

రెండురోజులు గడిచాక కేశవుడు వెళ్ళిపోతూ అన్నాడు.

"అమ్మ నన్ను డిటెక్టివ్‌గా పంపించింది అన్నయ్యా:కాని వదినెకు నమస్కరించి వెళుతున్నాను" అని భారతి పాదాలకు నమస్కరించాడు కేశవుడు. నారాయణమూర్తికి ఏమీ అర్థంకాక నివ్వెరపోయాడు. కేశవుడు వెళ్ళాక జరిగిన సంభాషణ అంతా చెప్పింది భారతి.

"మన ఊళ్ళో మన పరువుప్రతిష్టలను మా అమ్మ తీసేసేటట్లే ఉన్నది. కాని ఏనాటికయినా అమ్మ తెల్సుకోకపోదు." అన్నాడు నారాయణమూర్తి.

ఆ మర్నాడు సాయంత్రం ప్రమీల వచ్చింది."రా ప్రమీలా, కాలేజి నుంచి ఇటే వచ్చేశావా, ఏమిటి విశేషాలు."

ప్రమీల పుస్తకాలు డ్రాయరుమీద పడేసింది. "ఆరోజున మీరు అదోలా ఉన్నారు. ఎంత ఊహించినా మాకేం తెలీలేదు. వంట్లో సుస్తీనా

అనుకుంటే అట్లాలేదు. తరువాత ఆరా తియ్యగా సత్యవాణిగారితో వాగ్వాదం వచ్చిందని తెల్సింది. అంతా అర్థం చేసుకున్నాం. మీరంటే మాకు ఎంతో గౌరవం. కాని సత్యవాణిగారుకూడా మాకు లెక్చరర్‌కదా, విని విచారపడ్డంకన్నా మేము ఏమీ చెయ్యలేకపోయాం" అన్నది.

ఉదాసీనంగా నవ్వింది భారతి.

"ఎవరి భావాలు వాళ్ళవి, తమభావాలతో ఏకీభవించమని బలవంతం చెయ్యటం ఎంతో అవివేకమైనపని. కాని ఎవరితప్పులు వాళ్ళు తెల్సుకునే స్వభావం చాలామందిలో అరుదైన విషయం." అన్నది జరిగిన సంఘటనలు గుర్తుకు తెచ్చుకుంటూ.

"ఆవిడ పద్ధతి ఎవ్వరికీ నచ్చదు. కాని ఆవిడదగ్గర చదువుకుంటూ ఆవిడ మంచిచెడ్డలు మాబోటి విద్యార్థినులు చర్చించటం తగదు. కాని ఒక్కొక్కప్పుడు మాలో మేం విమర్శించుకోక తప్పదు. ఆవిడకు ఇద్దరు పిల్లలు. కాలేజి ఉద్యోగమేకాక ట్యూషన్లుకూడా చెప్తుంది. కొన్నాళ్ళు నేనూ ట్యూషనుకు వెళ్ళాను. ఆ ఇంటి పరిస్థితి చూశాక మనస్కరించక ట్యూషనే మానేశాను" ఇంక చెప్పలేకపోయింది ప్రమీల.

"ఎందుకని?"

"ఆవిడ స్వవిషయాలు చర్చించటం ప్రారంభిస్తే ఓ పెద్దగ్రంథం తయారవుతుంది. ఒక్కవిషయం మీతో చెప్దామని వచ్చాను. ఆవిడ మాటకు ఎదురు చెప్పాలంటే ఎంతో స్తోమత ఉండాలి. ఆవిడ మాటలకే గాక చేతలకుకూడా తాళం వెయ్యాలి. అట్లాకాకపోయిందా అనవసరంగా అనేకరకాల పుకార్లు లేవదీస్తుంది. ఆవిడతో పడలేకనే సీతారత్నంగారనే లెక్చరరు రిజైన్‌చేసి వెళ్ళిపోయింది అంచేత సత్యవాణిగారితో చాలా చాకచక్యంగా లౌక్యంగా వ్యవహరించాలి. ఇదే చెప్దామని వచ్చాను, వెళ్ళొస్తాను." అన్నది ప్రమీల.

భారతి ముభావకంగానే ఊరుకుంది. ప్రమీల వెళ్ళినవైపే చూస్తూ నిల్చుంది తనంతట తానుగా వచ్చి సత్యవాణినిగురించి ఎందుకు చెప్పిందో భారతికి అర్థంకాలేదు. ఇట్లా చెప్పమని సత్యవాణి ప్రమీలతో చెప్పిందా? అసలు ప్రమీల మనస్తత్వం ఎటువంటిదో ఎవరికి తెల్సు!

ఆ మర్నాడే వెంకట్రావుతో పార్టనర్‌షిప్ ఎగ్రిమెంటు రాసుకున్నాడు నారాయణమూర్తి. అతను వర్కింగ్ పార్ట్నరు. పదిలక్షల ఎస్టిమేట్ గల బ్రిడ్జిపనిని నారాయణమూర్తికి వప్పచెప్పాడు వెంకట్రావు.

రోజూ ఉదయం ఏడుగంటలకల్లా వెళ్ళేవాడు నారాయణమూర్తి. పనిదగ్గరకే క్యారేజీ భోజనం వచ్చేది. మళ్ళీరాత్రి ఎనిమిదిగంటల తరువాత ఇంటికి వచ్చేవాడు.

వారంరోజులు గడిచేసరికి నారాయణమూర్తి నలిగిపోయాడు. భారతితో సరదాగా కబుర్లుచెప్పటానికి బొత్తిగా వీలుపట్టంలేదు. ఉదయం ఏడుగంటలకు నారాయణమూర్తి వెళ్ళగానే భారతి మామూలుగా వంట చేసి తను భోజనంచేసి వెళ్లేటప్పుడు క్యారేజీలో భోజనం పనిమనిషిచేత నారాయణమూర్తికి పంపేది. సాయంత్రం అయిదుగంటలకు రాగానే వంటచేసి నారాయణమూర్తి రాకకు ఎదురు చూసేది. ఏం చదివినా బుర్ర కెక్కేదికాదు. ఎట్లాగో మర్నాడు కాలేజిలో చెప్పవలసినలెక్కలు మాత్రం చూసేది. రేడియో ట్యూన్‌చేసి గడియారంవైపు చూస్తూ కూర్చునేది. ఒక్కొక్కప్పుడు నారాయణమూర్తి రాత్రి పది దాటాక వచ్చేవాడు. ఇంత ఆలస్యమైందేమిటంటే ఆఫీసర్లు క్యాంపు చేశారు అనో, పనికి కావాల్సిన మెటీరియల్సు తేవటానికి వెళ్ళాననో చెప్పేవాడు. ఇంతశ్రమపడి, చమటోడ్చి, నల్లబడిపోయి ఎందుకా సంపాదన అనేది భారతి. నారాయణమూర్తి పేలవంగా నవ్వేవాడు. స్నానంచేసి బడలిక తీర్చుకుని భారతితో కబుర్లు చెప్తూ భోజనం చేస్తుంటే పగలల్లా పడిన శ్రమనంతా మర్చిపోయేవాడు నారాయణమూర్తి. ఈ అవస్థంతా తల్చుకుని విచారపడేది భారతి.

కొందరి మనస్తత్వాలు ఒక తీరుగా ఉంటయ్యి తమనుగురించి ఎదుటివాళ్ళు ఏమీ అనుకోకపోయినా, ఎదుటివాళ్ళు ఏమైనా అనుకుంటున్నారేమోనని మానసికంగా బాధపడిపోతారు. ఏదో తప్పుచేసినట్లుగా చిన్నతనంగా ఉన్నట్లు అనుకుని తమలోతాము ఎంతగానో నొచ్చుకుంటారు. ఎదుటివారి దృష్టిలో తాము అసమర్థులుగా భావింపబడుతున్నా

మే మోననే దిగులుతో కుమిలిపోతారు. నారాయణమూర్తి ఈ రకంగా మనస్సులో బాధపడుతూంటే భారతి ఇంకోరకంగా అనుకుని ఇంకా బాధపడుతోంది. తనభర్త తనకన్న చాలా తక్కువ చదువుకలవాడని తనకు తెలిసే అతన్ని చేసుకున్నది. నాకు మనస్సు ప్రధానంకాని చదువు ప్రధానం కాదన్నది. తన సంపాదనతో ఇద్దరిజీవితాలూ హాయిగా వెళ్ళిపోతాయన్నది. తనభర్త సంపాదనపరుడు కాదని ఎన్నడూ అనలేదు. తానింత అణకువగా, మర్యాదగా, ఆప్యాయత కనబరుస్తూ తన భర్తకు ఎంతో విధేయురాలై ఉంటే, నారాయణమూర్తి ఎందుకుగాను తనను అపార్థం చేసుకుని ఈ కంట్రాక్టుపన్ల బాధ్యత నెత్తిన వేసుకుని సతమతమై పోతున్నాడో భారతికి అర్థంకాలేదు. అర్థంకాని ఆవేదన ఇద్దరిలోనూ తిషవేసింది.

కంట్రాక్టరు వెంకట్రావు ఇంజనీరింగ్‌లో డిగ్రీ పుచ్చుకుని ఉద్యోగం చెయ్యకుండా కంట్రాక్టులు చేస్తున్నాడు. నారాయణమూర్తంటే అతనికి చాలా అభిమానం. అందుకనే పెట్టుబడి లేకుండా భాగం ఇచ్చాడు. వెంకట్రావు కంట్రాక్టు పన్లలో చెప్పుకోతగిన ప్రత్యేకత ఉన్నది. సంవత్సరానికి కొన్ని లక్షల రూపాయల పన్లు చేస్తాడు. అతనికి ఒక ఆఫీసు కూడా ఉన్నది. అతని ఆఫీసులో ఒక మేనేజరు, ఎకౌంటెంట్. నలుగురు గుమాస్తాలు, ఇద్దరు సూపర్వయిజర్లు, ఇద్దరు డ్రాఫ్ట్సమన్లు ఉన్నారు. మేనేజరు జనార్దనరావు ఎమ్.కాం, యల్. యల్. బి పాసయినారు. ప్లీడరుగా ప్రాక్టీసుచేసిన నాలుగేళ్ళ కాలంలో నాలుగెకరాలు అమ్మి జీవితం గడిపాడు. మొత్తం నాలుగేళ్ళలో అయిదువందలు సంపాదించాడు. ప్లీడరుగా తను రాణించనని తెల్సుకుని మొట్టమొదట్లో రెండువందల జీతానికి వెంకట్రావు ఆఫీసులో ఎకౌంటెంట్‌గా చేరాడు. మూడేళ్లు గడిచేసరికి మేనేజరు అయాడు. ఇప్పుడు జీతం నాలుగువందలు. ఇతను చేరినప్ప

ట్నుంచీ కంపెనీ బాగా వృద్ధి చెందింది. వెంకట్రావు పెండరువేసిన ప్రతిపనీ వచ్చేది. అందుచేత వెంకట్రావుకు, జనార్ధనరావంటే చాలా అభిమానం.

వెంకట్రావు కంపెనీలో నారాయణమూర్తి భాగస్వామిగా చేరినప్పట్నుంచీ అతనికీ, జనార్ధనరావుకూ స్నేహం ఏర్పడింది. ఇద్దరూ చనువుగా మాట్లాడుకుంటూ ఉంటారు, ఇంత సంపాదిస్తున్నా జనార్దనరావు ఎప్పుడూ మానసికంగా బాధపడుతూనే ఉంటాడు. ఆ మానసిక బాధ పైకి పొక్కనివ్వడు. ఇది అందరికీ తెల్సినా ఎవ్వరికీ ఏమీ చెప్పడు.

ఒక ఆదివారంనాడు జనార్ధనరావు, నారాయణమూర్తిని తన ఇంటికి రమ్మని ఆహ్వానించాడు. భార్యాసమేతంగా రమ్మని పదేపదే చెప్పటంతో నారాయణమూర్తి సరేననక తప్పలేదు. ఈ విషయం ఇంటికి వెళ్ళగానే భారతితో చెప్పాడు నారాయణమూర్తి.

"మీరు వెళ్ళండి, ఆడవాళ్లు పిలవందే తెలీని వాళ్ళింటికి వెళితే ఏమన్నా అనుకుంటారు." అన్నది భారతి.

"మా కంపెనీ మేనేజరుగారే. ఆయన ఏమీ అనుకోరు, ఇక ఆడవాళ్ళసంగతి, ఒకసారి వెళితే అదే పరిచయం అవుతుంది. అసలు పరిచయమే లేకపోతే ఒకరినొకరు తెల్సుకునేది ఎట్లా ? నిన్ను కూడా తీసుకు వస్తానని మాట ఇచ్చాను, ఈసారికి కాదనకు భారతీ."

భారతి సరేనన్నది. నారాయణమూర్తి పరమానంద భరితుడయ్యాడు.

సాయంత్రం నాలుగ్గంటలకు ఇద్దరూ రిక్షాలో జనార్ధనరావు ఇంటికి వెళ్ళారు. వీరి రాకకోసమే ఎదురు చూస్తున్నాడు జనార్ధనరావు.

మందహాసపూర్వకంగా ఒకరి నొకరు పలకరించుకున్నాక నారాయణమూర్తి పక్కనే భారతి నిల్చుంది. ఆమెను పలకరించేందుకు ఆడవాళ్లెవరూ కనబడలేదు. మనస్సులోనే బాధపడుతూ ఇంక బాగుండదనుకుని తనే లోపలికి వెళ్ళింది. అప్పటికి ముస్తాబు పూర్తయి గదిలో

నుంచి ఇవతలకు రాబోతున్నది జనార్దనరావు భార్య. ఒకరినొకరు చూసుకుని ఆశ్చర్యపోయారు. ఆమె సత్యవాణి. భారతి గుండె ఝల్లుమన్నది. సత్యవాణి ముఖం చిట్లించింది.

"రండి కూర్చోండి, ఈ పిల్లలతో తెమలక మిమ్మల్ని ఆహ్వానించేందుకు రాలేకపోయాను" అన్నది సత్యవాణి. ఇద్దరూ కుర్చీల్లో కూర్చున్నారు. సత్యవాణి ఇద్దరు పిల్లలూ భారతి కుర్చీపక్కన చేరారు. ఏం మాట్లాడ్డానికీ తోచక పిల్లల్ని పలకరించింది భారతి.

"నాపేరు సుమిత్ర." అన్నది పెద్దపిల్ల. దానికి ఆరేళ్ళు.

"నా పేరే అనూరాధ" అన్నది రెండోపిల్ల. దానికి మూడేళ్ళుంటయ్యి.

"వీళ్ళతో చచ్చి సతమతమైపోతున్నానంటే నమ్మండి. పాడుపిల్లలు, అంతా ఎంతో చక్కగా పిల్లా, పీచూలేకుండా ఉంటారు. వాళ్ళని చూస్తే ముచ్చటగా ఉంటుంది. నా ఖర్మ ఏమిటో నా వయస్సుకు అప్పుడే ఇద్దరు పిల్లలు" విసుక్కుంటూ అన్నది సత్యవాణి.

పెద్దపిల్ల బిక్కముఖంతో భారతివైపు చూసింది. ఇద్దర్నీ ఆప్యాయంగా పిల్చింది భారతి. వాళ్ళజడలు సవరిస్తూ చెవులరింగులు చూస్తోంది. తలంతా మట్టితో అంటలు కట్టింది. చెవులసందున ముట్టుకుంటే తట్టెడు మన్ను వచ్చేట్టుగా ఉంది. తలలు మాసి వాసనవేస్తున్నయ్యి. వాళ్ళ పరిస్థితి అర్థం చేసుకుంది భారతి.

"వాణీ" అంటూ లోపలికి వచ్చాడు జనార్దనరావు. కుర్చీలోనుంచి లేచి నిల్చుంది భారతి. సత్యవాణి అట్లాగే కూర్చుని "ఏం ఎందుకూ" అన్నది.

"ఏం లేదు, టిఫిన్ తెస్తావేమోనని" నెమ్మదిగా, వినయంగా చెప్పి మళ్ళా ముందు గదిలోకి వెళ్ళిపోయాడు. సత్యవాణి కుర్చీలోంచి కదల్లేదు.

"ఒసేయ్‌సుమిత్రా, మీ నాయనమ్మను కాఫీ, టిఫిన్ పట్రమ్మనూ" అంటూ పెద్దపిల్లను కసిరింది. వంటింటిలోకి వెళ్ళింది సుమిత్ర.

"ఇప్పుడు టిఫినెందుకండీ, వచ్చేముందు కాఫీ తాగే వచ్చాం" అన్నది భారతి.

"మీరు కాఫీ తాగరనీ, అదేమంత మహద్భాగ్యమనీకాదు. అదొక మర్యాద" ఈసడింపుగా అన్నది సత్యవాణి.

భారతి మనస్సు చివుక్కుమన్నది. రెండుప్లేట్లల్లో ఉప్మా, రెండు గ్లాసుల్లో కాఫీతో అరవైఏళ్ళ ముసలావిడ వచ్చింది. అవన్నీ బల్లమీద పెట్టిందావిడ. ఆవిడవైపు కొరకొరా చూసింది సత్యవాణి.

"ఎన్నిసార్లు చెప్పాలి మీకు, టిఫిన్‌తోపాటు కాఫీకూడా ఇప్పుడే తెస్తే చల్లారిపోదూ. ముందు మంచినీళ్ళు పట్రండి" అన్నది. ఆవిడ సత్యవాణి అత్తగారు.

"ఓసారి ఇట్లారండి, మిమ్మల్నే" అంటూ జనార్దనరావు నుద్దేశించి పిల్చింది. జనార్దనరావు కాఫీ, టిఫిన్ తీసుకుని నారాయణమూర్తి దగ్గరకు వెళ్ళాడు. తనే మళ్ళీ వంటింటిలోకి వెళ్ళి రెండుగ్లాసులతో మంచినీళ్ల

భారతికి ఏం మాట్లాడ్డానికీ తోచలేదు. ముళ్ళమీద కూర్చున్నట్లుగా వున్నది. సత్యవాణి వంటింటి గుమ్మంలోకి వెళ్ళి,

"ఇంకా ఇక్కడ ఇద్దరం వున్నాం. మాకూడా కాస్త టిఫిన్ పడెయ్యండి" అన్నది. అత్తగారు టిఫిన్ మంచినీళ్ళు తెచ్చి బల్లమీద పెట్టి వెళ్ళింది.

"తీసుకోండి" అన్నది సత్యవాణి తను ఉప్మా తింటూ.

"పిల్లలకు పెట్టండి." అన్నది భారతి.

"వాళ్ల వాయినం ఇదివరకే చెల్లించారు. ఈగలు ముసిరినట్లు ముసిరారు. పీడవతలకు" అని విసుక్కుంది సత్యవాణి.

భారతికి ఉప్మా తినబుద్ధి పుట్టలేదు. కాఫీతాగి "వెళ్ళొస్తామండీ." అంటూ లేచింది.

"అప్పుడప్పుడూ వస్తుంటారు కదూ" అన్నది కుర్చీల్లో కూర్చునే సత్యవాణి. ముందుగదిలోనుంచి భారతి వెళ్ళటం చూసి అప్పుడే

టిఫిన్ పూర్తిచేసిన నారాయణమూర్తి ఆశ్చర్యపోయాడు. జనార్దనరావు అంతా గ్రహించాడు.

"శలవండీ, వెళ్లొస్తాను" అంటూ కుర్చీలోనుంచి లేచాడు నారాయణమూర్తి. ప్రతినమస్కారం చేశాడు జనార్దనరావు. వాళ్లు వెళ్లాక భార్యతో అన్నాడు.

"వాణీ! అదేం మర్యాద, నువ్వుకూడా వాకిలివరకూ వచ్చి పంపిస్తే బావుండేది. కాస్తలో మర్యాద దక్కించుకోలేకపోయావ్."

"ఆవిడగారికి అమర్యాద చాలు, ఆవిడ ఎవరోకాదు. మా కాలేజిలో లెక్చరర్, ఆవిడ నారాయణమూర్తి భార్య అని నాకు ముందుగా మీరు చెప్పలేదు. మీ కంపెనీ కంట్రాక్టరుగారి భార్య అంటే ఎవరో అనుకున్నాను. ఈవిడగారని తెలిస్తే అసలు వప్పుకునే దాన్నేకాదు. ఈవిడ గారు నన్ను చూడనక్కర్లేదు". అన్నది సత్యవాణి. భార్య తత్వం తెల్సిన జనార్దనరావు మాట్లాడలేదు.

భారతి ఇంటికి వెళ్ళాక జరిగిన సంఘటనను మరొకసారి పునశ్చరణ చేసుకుంది. తన ఇరవైమూడేళ్ళ జీవితంలో సత్యవాణిలాంటి స్త్రీని చూట్టం ఇదే మొదలు. కడుపున పుట్టిన పిల్లల పోషణ విషయంలో కూడా ఇంత అశ్రద్ధగా ఉండే తల్లులు ఉంటారు కామోసనుకుంది. పిల్లలులేక తపించిపోయేవాళ్ళు కొందరయితే, ఈపిల్లలు ఎందుకు పుట్టారా అనుకునేవాళ్ళు మరికొంతమంది, ముప్పైఏళ్ళ వయస్సుకు ఇద్దరు పిల్లలుంటే సత్యవాణికి ఎందుకు కష్టంగా ఉందో భారతికి అర్థం కాలేదు.

"ఆ ముసలావిడ సత్యవాణి అత్తగారు" అన్నాడు నారాయణ మూర్తి.

"అవును, కోడళ్ళను ఏడిపించే అత్తలు ఒకతరంవారయితే, అత్తల్ని ఏడిపించే కోడళ్ళు ఇంకోతరంవారు. చావటానికి సిద్ధంగా ఉన్న ఆ ముసలావిడను సతాయిస్తుంది. ఈ రాణీగారికి ఆవిడ టిఫిన్లు చల్లారిపోకుండా అందించాలి. కన్నపిల్లలకే దిక్కులేకపోతే ఇక అత్త

గారి సంగతి చెప్పేదేముంది. ఆ పిల్లల్ని చూస్తుంటే నాకే కష్టమనిపించింది. వాళ్ళేం పాపం చేశారో, ఆ తల్లి కడుపున పుట్టారు. ఆవిడ మాత్రం ఏరోజూ శోభనం పెళ్ళికూతుర్లా ఉండాలనుకుంటుంది. ఇక ఆయన్ని కూర్లో పురుగుని విదిలించి పారేసినట్లుగా మాట్లాడుతుంది. ఛీ! పాడు బ్రతుకు" నారాయణమూర్తి నవ్వుకున్నాడు.

"ఆయన యమ్. కామ్. ఎల్. ఎల్. బి ప్యాసయినాడు తెల్సా! జీతం నాలుగు వందలు."

"ఏమయితేనేం? చదువు సంస్కారాన్ని కలిగిస్తుంది కాని కర్మను మార్చలేదు. చదువుకున్న మగవాడు భార్యకు అంత అణిగి మణిగి వున్నాడంటే ఆవ్యక్తి మానసిక వ్యధ ఎటువంటిదో ఆ పర మాత్ముడికే తెలియాలి."

"అంటే చదువుకోని భర్తయితే అణిగిమణిగి పడివుండాలంటావు" నవ్వుతూ అన్నాడు నారాయణమూర్తి.

భారతి చిన్నబుచ్చుకుంది. ఏం సమాధానం చెప్పకుండానే ఇద్దరికీ వడ్డించింది. భోజనానికి కూర్చున్నారు.

"నేను అణిగిమణిగి భోజనం చేస్తున్నాను." అన్నాడు. తన ప్రశ్నకు భారతినుంచి సమాధానం రాలేదు.

"చదువుకున్న వాళ్ళయినా, చదుకోనివాళ్ళయినా తమ వ్యక్తిత్వాన్ని తాము కాపాడుకుంటూ ఎదుటివాళ్ళని మర్యాదగా చూట్టం నేర్చుకుంటేనే తామూ గౌరవింపబడతారు, భర్తని చులకనగా చూట్టం ఎంత నీచమో, భార్యని హీనంగా చూట్టమూ అంత నీచమే" అన్నది.

"వ్యక్తిత్వమనేది చదువు వచ్చినవారయినా, రానివారయినా, తర తమ బేధాల్ని పాటించి కాపాడుకుంటే వారి జీవితాల్లో పరాజయం పొందటమనేది అరుదయిన విషయం. కొందరి హృదయం గాజు లాంటిది, దెబ్బతగిల్తే పగిలిపోతుంది. కొందరి హృదయాలు కరుడు గట్టిపోతవి. ఎలాంటి బాధల్లోనూ పైకి తొణకరు. మరికొందరి హృద యాలు అతిసున్నితమైనవి. ఏమాత్రం తాకిడికీ తట్టుకోలేవు. అలాంటి

వారి జీవితాలు తమాషాగా ఉన్నా అట్లా అని అనుకోవటానికీ వీల్లేదు. ఏ విషయంలోనైనా సరే తన ఎదుటివారు మిన్నగా ఉన్నప్పుడు వారితో చనువుగా మాట్లాటానికి మనస్సులో చిన్నబుచ్చుకుంటారు. అంటే ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు అనేకమా అర్థం లెక్చరరుగారూ" అన్నాడు.

భారతి తమలపాకులు చిలకలుచుట్టి నారాయణమూర్తికి ఇచ్చింది. ఏం సమాధానం చెప్పకుండానే వంటఇల్లు సర్దుతోంది. భర్త ఇట్లా డొంక తిరుగుడుగా ఎందుకు మాట్లాడుతున్నాడో అర్థంకాలేదు. మాటల ధోరణిలో తనేమయినా పొరపాటు మాటలు అన్నానేమోనని, తను మాట్లాడిన మాటలు స్ఫురణకు తెచ్చుకుంది. కాని సమాధానం దొరకలేదు.

నారాయణమూర్తి పక్కమీద పడుకుని ఏదో ఆలోచిస్తున్నాడు. అతని ఆలోచనలు ఒకదారికి రావటంలేదు. అంతగా ఆలోచించవలసిన అవసరమూలేదు కాని మనస్సు అలా అనిపించటంలేదు. భారతివచ్చి పక్కమీద కూర్చునేటంతవరకూ అతను గమనించనేలేదు.

"ఏవండీ"

"ఏమిటి భారతీ?"

"ఒక్కమాటకు సమాధానం చెప్తారా"

"ఒక్కటికాదు, వందమాటలకు సమాధానం చెప్తాను"

"మనస్ఫూర్తిగా సరయిన సమాధానం చెపితే ఒక్కమాట చాలు.'

'అలాగే.'

"ఈ సంవత్సరంతో మీ తమ్ముడికి ధరుపారం అయిపోతుంది. వచ్చే ఏటినుంచీ అత్తయ్యనీ, అతన్నీ ఇక్కడే మనదగ్గరే అట్టే పెట్టుకుందాం, అక్కడేం స్వంతవ్యవసాయం లేదుకదా. ఆ మక్తా గింజలు ఎక్కడున్నావచ్చేవే" అన్నది.

"ఆ ఊరు వదలి అమ్మరాదు భారతీ! వాడికి అక్కడా స్కూలు ఫైనల్ వరకూ చదువుంది. నీకు ఇంటిపనికీ, కాలేజీకీ తూగటం లేదా?"

"నాకు పని తెమలికకాదు, అందరం ఒకచోటనే ఉందామనే ఉద్దేశ్యంతో అన్నాను. అందరికీ ఇష్టమైతేనే, నాకు ఇంటిపనికీ కాలేజీ పనికీ తెమలకపోతే కాలేజీ ఉద్యోగం మానేస్తాను ఇంటిచాకిరీకి అత్తయ్యను పిల్చి నేను ఉద్యోగం వెలగపెట్టటానికి సత్యవాణినికాదు" అన్నది. భారతిగొంతు జీరబోయింది. తెలియని ఆవేదన కట్టలు తెంచుకుని ప్రవహించింది. కళ్ళుతుడ్చుకుని మంచంమీదినుంచి లేచింది. అవతలి గదిలోకివెళ్ళి ఇంకో మంచం వాల్చుకుని పడుకుంది. నారాయణ మూర్తికి ఏం తోచలేదు.

భారతి కన్నీళ్ళతో దిండంతా తడిసింది. కట్టలు తెంచుకుని ప్రవహించే నదీప్రవాహాన్ని అరికట్టటం ఎంత కష్టమో, హృదయంలోనుంచి పొంగి పొర్లుకువచ్చే దుఃఖప్రవాహవేగాన్ని అరికట్టటమూ అంతకష్టమే. ఒక్కసారి పూర్తిగా చదువునంతా వెళ్లగక్కితేనేకాని మనస్సు కుదట పడదు. భారతికూడా ఒక్కసారి పూర్తిగా ఏడ్చేసి మనస్సు కాస్త కుదుట పడ్డాక ఆలోచించసాగింది. ఇంటెడుపనీ వదిలిపెట్టి తను కాలేజికి వెళ్ళ టానికి వీలుగా చాకిరీ చెయ్యటానికిగాను తన తల్లిని పిలిపించమని అడుగుతున్నట్లుగా నారాయణమూర్తి భావించారు కామోలనుకుంది. చదువు కున్నదాన్ననే గర్వంతో తనిట్లా మాట్లాడుతున్నానని భర్త అర్ధంచేసు కున్నాడేమోనని కుమిలిపోయింది. సత్యవాణి కాపురం చూసి తనేమీ అలా అనలేదు. ఈ పెద్దతనంలో కొడుకూ, కోడలూ ఉన్నా అత్తయ్యే ఆ పల్లెటూళ్లో ఇంటెడు చాకిరీ చేసుకుంటూ ఉండటమెందుకనే సద్భా వంతో పిలిపించమన్నది. కాని నారాయణమూర్తి అలా అపోహ పడతా డనుకోలేదు.

నారాయణమూర్తి ఆలోచన మరోవిధంగా ఉన్నది. ఆరోజల్లా సత్యవాణి కాపురంగురించి మాట్లాడుకోవటంతో ఎగతాళిగా తాను మాట అన్నాడు. అందుకు భారతి ఇంతగా అర్ధంతీసి బాధపడుతుందని అతనూ భావించలేదు. తనతల్లిచేత ఇంటెడు చాకిరీ చేయించటానికే ఆమెను పిలిపించమని భారతి అడుగుతున్నట్లుగా అతను భావించనేలేదు.

ఎగతాళిగా అన్నమాట ఇంతదూరంపోయింది. తను చెప్పినట్లుగా భారతి హృదయం గాజులాంటిది. తన హృదయం సున్నితమైంది.

పడుకున్నవాడల్లా లేచివెళ్ళి భారతి గుండెల్లో తలదాచుకున్నాడు. కళ్ళుతుడిచింది భారతి.

ఆ మర్నాడు నారాయణమూర్తి తల్లికి ఉత్తరంరాస్తానని చెప్పాడు. భారతి ఎంతో సంతోషించింది.

కొడుకురాసిన ఉత్తరంచూసి యశోదమ్మ నిర్లిప్తతగా ఊరుకుంది. రెండు రోజులు పోయాక ఆమెకు సన్నిహితులయినవార్ని సంప్రదించింది. ఆమె భావాలకు జీవంపోశారు వాళ్ళు. మరోవారం గడిచాక కొడుక్కి ఉత్తరం రాసిందావిడ.

తల్లి రాసిన ఉత్తరం చదవగానే నారాయణమూర్తికి నిజంగానే తల్లిమీద కోపం కలిగింది. లోలోపల కుమిలిపోతూ ఉత్తరం వచ్చిన సంగతి భారతికి చెప్పనేలేదు. ఆ ఉత్తరం చదివితే భారతి ఎంత బాధ పడుతుందో అతనికి తెల్సు.

మరో పదిరోజులు గడిచాయి. ఆరోజు ఆదివారం. "ఇవాళ శ్యామలనూ, పిల్లలనూ చూసివద్దాం" అన్నది భారతి. నారాయణమూర్తి ఆశ్చర్యంగా చూశాడు.

"వాళ్ళింటికి ఎందుకూ" అన్నాడు ముఖం చిట్లించి.

"వాళ్ళుకాదు. మీ చెల్లెలు, నాకు ఆడబడుచు. వాళ్ళ మనస్తత్వం ఎటువంటిదైనా, వాళ్ళని చూట్టం మనవిధి. ఎప్పుడో వాళ్ళఇంటికి వెళ్ళ వలసింది. ఆలస్యమైంది. ఇవాళ తప్పదు" అన్నది భారతి. ఇదొక కొత్త సమస్య తల ఎత్తటం అతనికి ఇష్టంలేదు. అయిష్టతగా అవతలకు వెళ్ళాడు.

భారతి అతనిదగ్గరకు వెళ్ళి. "మనస్పర్థలు మనుష్యుల మధ్యనే ఉంటాయి. ఆ మనస్పర్థలకు కూడా ఇవ్వవలసినచోట విలువ నివ్వాలి. అంతేకాని దగ్గర బంధువుల్లో కాదు. చుట్టరికాన్ని దూరంచేసుకోటం ఆరోగ్యప్రదంకాదు. ఇప్పుడే వెళదాం లేవండి." అన్నది. అయిష్టంగానే వప్పుకున్నాడు నారాయణమూర్తి. ఇద్దరూ బయలుదేరారు. దార్లో పిల్లలకు బిస్కట్లు, చాక్లెట్లు కొన్నది. శ్యామలకు మంచి సిల్కుజాకెట్ గుడ్డ, పూలు కొన్నది. ఇవన్నీ కొంటుంటే నారాయణమూర్తి ఏమీ మాట్లాడలేదు.

వీరు వెళ్లేసరికి శ్యామల జడల్లుకుంటున్నది. పెద్దపిల్లాడు నాలుగేళ్ళవాడు ఎందుకో ఏడుస్తూ కూర్చున్నాడు. రెండోవాడు రెండేళ్ళవాడు, వాడు దువ్వెన నోట్లో పెట్టుకుని కొరుకుతూ తల్లి అడిగినా ఇవ్వటంలేదు. భర్త కృష్ణమూర్తి పేపరు చదువుతూ కూర్చున్నాడు.

వీళ్ళని చూడగానే శ్యామల ముఖంలో ఏ భావమూ కలగలేదు.

"రండి ప్రిన్సిపాల్‌గారూ, దారితప్పి వచ్చినట్లున్నారు. అయినా ఉద్యోగస్తులు కదా. తీరిక ఉండొద్దూ. ఏరా అన్నయ్యా, హూం, అయినా నీ పెత్తనం ఏముందిలే, నిన్నని లాభంలేదు" అంటూ ఆహ్వానించింది. జడకు రిబ్బను కట్టుకుంది.

"కూర్చోండి బావగారూ, కులాసేనా" అంటూ సాదరంగా ఆహ్వానించాడు కృష్ణమూర్తి. పడక్కుర్చీలో కూర్చున్నాడు నారాయణమూర్తి. శ్యామల పక్కనే కింద కూర్చుంది భారతి.

"ఇంకా ఏడుస్తావేంరా సన్యాసీ! మీ అత్తయ్యరా, అత్తయ్య. మేనల్లుళ్ళకి ఏం తెచ్చిందో కనుక్కో." అంటూ పెరట్లోకి వెళ్ళింది చేతులు కడుక్కోటానికి. నారాయణమూర్తికి వళ్ళు మండిపోతోంది. భారతి మనస్సులోనే నవ్వుకుంటూ బిళ్ళలపొట్లాం, బిస్కట్లపొట్లాం చెరొక పిల్లాడికీ ఇచ్చింది. వాళ్లు భారతిని ఎగాదిగా చూస్తూ ఆ పొట్లాలు తీసుకున్నారు.

"ఏం బావగారూ, మామీద సీతకన్నేశారు. ఈ ఊరొచ్చి ఇన్నాళ్ళయినా ఒక్కసారయినా మా ఇంటికి రాలేదు" అన్నాడు కృష్ణమూర్తి.

"మీరుమాత్రం వచ్చారా చెప్పండి, ఎవరితప్పులు వారికి తెలీవు" అన్నాడు నారాయణమూర్తి.

కుశల ప్రశ్నలయ్యాక కృష్ణమూర్తి వంటింటిలోకి వెళ్ళాడు. శ్యామల స్టౌ వెలిగించింది.

"కాఫీయేనా, టిఫిన్‌కూడా చేస్తున్నావా."

"ఏదో నాకు తోచింది చేస్తున్నా, మీరూ తింటారుకదా" అన్నది.

"ఈ రాత్రికి భోజనానికి ఉండమను, మర్యాదగా ఉంటుంది."

"రాకరాక వచ్చారు. ముంగిలా కూర్చోక కాస్త మీ వదినెతో సరదాగా మాట్లాడు. నీవుల్లవిరుపుమాటలు కాస్త తగ్గించు" అన్నాడు. శ్యామల కోపంగా చూసింది. కృష్ణమూర్తి ముందుగదిలోకి వచ్చేశాడు.

"ఏం బావగారూ, ఏదో కంట్రాక్టుపన్లు చేస్తున్నార్ట, ఎట్లా ఉంది. ఈ ఉద్యోగాలకన్నా అదేనయమేమో" అన్నాడు కృష్ణమూర్తి. నారాయణమూర్తి నవ్వి ఊరుకున్నాడు. భారతి వంట ఇంటిలోకి వెళ్ళింది. బజ్జీలు వండటానికి బంగాళదుంపలు చక్రాలుగా తరుగుతోంది శ్యామల. భారతి గడపలో కూర్చుంది.

"అదేమిటి వదినా, ఉద్యోగస్తురాలివి, అలా కిందకూర్చున్నావేం. ఆ కుర్చీ తెస్తానుండు" అని లేవబోయింది.

"అక్కరలేదువదినా, వంటింటిలో కుర్చీలు వేసుక కూర్చోటమేమిటి? ఆ పీట వాల్చుకూర్చుంటాలే. ఇప్పుడా బజ్జీలు ఎందుకమ్మా. కాఫీ తాగే వచ్చాం" అన్నది భారతి పీట వాల్చుక కూర్చుని.

"మేం గొప్పవాళ్ళంకాదు వదినా స్వీట్లు చేసి పెట్టటానికి. ఏదో నాకు చేతనయిన ఫలహారం చేస్తున్నాను. మీ ఇంటికొస్తే ఈ మాత్రం కూడా చెయ్యటానికి నీకు తీరుబడి ఉండదని నాకు తెల్సు" అన్నది శ్యామల శనగపిండిలో ఉప్పు, కారంవేసి నీళ్ళుపోసి కలుపుతూ.

"కాస్త పచ్చిపిండి పెట్టమంటావా వదినా, ఉప్పూ కారం సరిపోయిందేమో చూద్దువుగాని" అన్నది మళ్ళీ వెటకారంగా.

"అంత చేతకానిదానివి కాదుకదా, నీకు తెల్సినంతగా నాకు ఏమీ తెలీదు" అన్నది భారతి.

శ్యామల మరి మాట్లాడలేదు. మరో అరగంటలో ఫలహారాలు పూర్తయాయి. కాసేపు కూర్చున్నాక ఇంక వెళతామంటూ భారతి లేచింది. కృష్ణమూర్తి భార్యవైపు చూశాడు.

"ఈ పూట మా ఇంట్లో ఉండాలి, తప్పదు. ఏదో మాకు కలిగిందాంట్లోనే చేసిపెడతాం. మా బోటివాళ్ళ ఇంట్లో ఒక్క మగవాడు సంపాదిస్తే ఇంట్లో అందరూ తినాలి. మీరంటే ఇద్దరూ సంపాదనపరులే" అన్నది శ్యామల.

"ఉండండి బావగారూ, మీ చెల్లెలు అంత ఇదిగా చెప్తోంది. నేనూ గట్టిగా చెప్తున్నాను. ఈ పూట మా ఇంట్లో మీరు భోజనం చేస్తేనే మేం మీ ఇంటికి వచ్చేది. లేకపోతే అసలటువైపు రానే రాము" అన్నాడు కృష్ణమూర్తి.

ఎంతో కష్టంమీద ఆరాత్రి భోజనాలయాక వెళ్ళారు. భారతి తాను తెచ్చిన జాకెట్ గుడ్డ శ్యామలకు బొట్టుపెట్టి ఇచ్చింది. భారతి వెళుతుంటే బొట్టయినా పెట్టలేదు శ్యామల. చిన్నబుచ్చుకుంది భారతి.

ఇంటికివెళ్ళాక నారాయణమూర్తి, "ఏం భారతీ! ఎట్లాఉంది శ్యామల, బులపాటం తీరిందా?" అన్నాడు.

"అనేకరకాల మనుష్యులతో అనేక తరహాల మనస్తత్వాలు కలవారితో తిరిగితేనే ప్రపంచాన్ని అర్థంచేసుకోగలుగుతాం. ఏదయినా ఒక్క చిన్న సంఘటనకు తాత్కాలికంగా మనస్సు చివుక్కుమన్నా, మన మనస్సుల్ని శోధితం చేసుకోటానికి అట్లాంటి సంఘటనలూ అవుసరమేనేమో" అన్నది భారతి.

కంట్రాక్టుపనికి కావలసిన మెషినరీసామాన్లు కొనటానికి వెంకట్రావుతో నారాయణమూర్తి మద్రాసు వెళ్ళాడు. నాలుగురోజులవరకూ

రాడు. ఇంట్లో ఒంటరిగా ఉంటానికి బెరుకనిపించింది భారతికి. అయినా తప్పలేదు. మొదటిరోజు రాత్రి తెల్లవార్లూ నిద్రపోలేదు. కారణం ఇంటి వాకిట్లో పేకాట చాలా జోరుగా సాగుతోంది.

మర్నాడు సాయంత్రం కాలేజి వదిలాక ప్రమీలను ఇంటికి రమ్మన్నది భారతి. ప్రమీల బి. యస్. సి. చదువుతున్నది.

ప్రమీల సాయంగా పడుకోటానికి వస్తానన్నది. బలవంతంమీద నారాయణమూర్తి వచ్చేవరకూ అక్కడే భోజనం చెయ్యటానికి ఒప్పుకున్నది.

కాలేజీలో చదువుతున్న ప్రమీలను, భారతి విద్యార్థినిగానే చూసింది గాని స్నేహితురాలుగా చూడలేదు. కాలేజీలో తనకు తెల్సిన విద్యార్థినులతో చదువు విషయాలే మాట్లాడేదికాని వాళ్ళ స్వవిషయాల్లో భారతి ఎన్నడూ జోక్యం కలిగించుకోలేదు.

అందరి స్వవిషయాలూ తెల్సుకుంటే భారతిలాంటివాళ్ళకు ఆశ్చర్యమేకాకుండా పిచ్చికూడా ఎక్కవచ్చు. పైకి అందరూ సామాన్యంగా కనిపించినా ఎవరి జీవితాల్లో ఎలాంటి సంఘటనలు మిళితమై ఉన్నవో, ఎవరి మనస్సు ఎటువంటిదో చూడగానే తెల్సుకోటం చాలా కష్టం. ఎంతో సన్నిహితంగా ఉన్నా ఒకరి జీవితాలు మరొకరు తెల్సుకోవటమూ కష్టమే.

ఆరోజు సాయంత్రం వచ్చిన ప్రమీల, రాత్రి భోజనాలయేవరకూ కాలేజీ విషయాలూ, లెక్చరర్ల మనస్తత్వాలూ, సత్యవాణి స్వవిషయాలూ తనకు తెల్సినంతవరకూ చెప్పింది ప్రమీల. ఏమాట చెప్పినా ప్రమీల మాటల్లో నిరాశ, నిస్పృహ, ఏదో తెలియని ఆవేదన ప్రస్ఫుటంగా కనిపించసాగాయి భారతికి. ప్రమీల ఎందుకట్లా మాట్లాడుతుందో భారతికి అర్థంకాలేదు. రాత్రిపదకొండుగంటలవరకూ ఇద్దరూ మాట్లాడుకుంటూనే ఉన్నారు. మాట్లాడుతూనే నిద్రపోయింది భారతి. ఒకసారిపిల్చినా పలక్కపోవటంతో భారతి నిద్రపోతున్నదని తెల్సుకుని తనూ కళ్ళుమూసుకుంది ప్రమీల.

అర్ధరాత్రివేళ భారతికి మెళకువ వచ్చింది. పక్కన మంచంమీద ప్రమీల నిద్రపోతున్నది. ప్రమీల ముఖం పరీక్షగా చూసింది భారతి. కన్నీటి చారలు చెంపలమీద కనుపించాయి. దిండు అక్కడక్కడా తడిసింది. తన మంచంమీదనే లేచి కూర్చుంది భారతి. ప్రమీలకు పాతికేళ్ళకు పైనే ఉంటయ్యి. తనకన్న వయస్సులో పెద్దది. భారతికి విచారం కలిగింది. తనకన్న వయస్సులో పెద్దవాళ్ళు తన విద్యార్థిన్లు. ఇంత వయస్సొచ్చాక ప్రమీల ఎందుకు చదువుకుంటున్నదో ఆమెకు అర్థంకాలేదు. ఏదో ఆలోచిస్తూనే మళ్ళీ నిద్రపోయింది.

మర్నాడు యథాప్రకారం భారతి ఇంటిపని చేసుకుంటున్నది. ప్రమీల స్నానానికి బాత్‌రూంలోకి వెళ్ళింది. స్నానంచేసి బట్టలు మార్చుకుని రావటానికి అరగంట పట్టింది. ప్రమీల జడవేసుకుంటున్నది.

"ప్రమీలా"

"ఏమండీ"

"ఆరోగ్య సూత్రాలు అక్షరాలా పాటిస్తున్నావా" నవ్వుతూ అన్నది భారతి. ప్రమీలకు అర్థంకాలేదు.

"ఏమిటండీ, ఏమైంది"

"నీ స్నానం అరగంట పట్టింది. అంత పరిశుభ్రంగా వళ్ళు రుద్దుకుని స్నానం చేస్తున్నావన్నమాట" మళ్ళా నవ్వుతూనే అన్నది భారతి. ప్రమీల చిన్నబుచ్చుకుంది.

"మీ స్నానానికి ఇబ్బంది కలిగించాను. క్షమించండి"

"అబ్బె నాకేం ఆలస్యం కాలేదు, ఊరికినే అన్నాను". అన్నది భారతి.

"ఏమీ అనుకోకండేం" జీరబోయిన కంఠంతో అన్నది ప్రమీల.

"ఏమీ అనుకోను, అసలు విషయం" అన్నది భారతి.

"బాత్‌రూంలు ఆడవాళ్ళ స్నానాలకేగాక వంటరిగా, తృప్తిగా ఏడవటానికూడా ఉపయోగపడతయ్యి."

"అట్లాగా" భారతి మరేమీ అనలేకపోయింది.

వంటయాక ఇద్దరూ భోజనాలుచేసి కాలేజీకి వెళ్ళారు. సాయంత్రం ఇద్దరూ వచ్చారు. మర్నాడు ఆదివారం, కాలేజీకి శలవు.

రాత్రి భోజనాలయాక ప్రమీల అన్నది.

"మీకు నవలలంటే ఇష్టమేనా"

"చెవి కోసుకుంటాను. ముఖ్యంగా ఇంగ్లీషు నవలలు, తరువాత తెలుగు నవలలు."

"నే నొక నవల రాశాను చదువుతారా"

"నువ్వు రచయిత్రివి కూడానా" అని ఆశ్చర్యంగా అన్నది

"ఏదో కొద్దిగా. ఇటీవలనే ఒక నవల రాశాను. మీరు చదువుతానంటే చూడండి" అని తన సంచిలోనుంచి ఒక వ్రాత ప్రతిని తీసింది ప్రమీల.

"నువ్వు చదువు, నేను వింటాను" అన్నది భారతి.

"నా దస్తూరి అర్థమౌతుంది. మీరే చదువుకుంటే బావుంటుంది. నేను చదువుతే నట్టునట్టుగా చదువుతాను. నాకు లోపల్లోపలే చదువుకోటం అలవాటు" అన్నది ప్రమీల.

పక్కమీద పడుకుని భారతి నవల చదువుకోసాగింది. ప్రమీల కాలేజీ పాఠాలు చదువుకుంటున్నది. అప్పటికి రాత్రి తొమ్మిదిగంట లయింది.

## భారతి చదివిన నవల

"నన్ను చూస్తే అలా బెదిరిపోతావేం రాధా! నేనంటే అంత భయమెందుకూ?" అన్నాడు సుబ్బారావు రాధని చూస్తూ. ఈ మాటకు రాధ కొంచెం బాధపడ్డా సమాధానం సూటిగానే చెప్పదల్చింది.

"బావగారనే గౌరవంకన్నా, స్త్రీల విషయంలో మీరు చూపే తూష్ణీభావమే మిమ్మల్ని చూస్తే నాకు భయం కలిగిస్తున్నది బావా! మరదలుకదా ఎలా మాట్లాడినా తప్పులేదనుకుంటున్నారో, మాట్లాడినా ఈ మరదలు నన్నేం చేస్తుందిలే అనుకుంటున్నారో, లేక నన్ను గురించి మీ మనస్సులో ఏవిధంగా చిత్రించుకున్నారో నాకు తెలీదుగాని, మీ ప్రవర్తన మాత్రం నాకు ఎంతమాత్రం నచ్చలేదు బావా!" అని కాలేజీకి వెళ్ళింది రాధ.

ఈ మాటలకు సుబ్బారావు చాలా చిన్నబుచ్చుకున్నాడు. అతని అభిమానం గాలివానకు చెట్లుపడినట్లయింది. ఇంతధైర్యంగా రాధ తనను ఎదిరించి మాటలాడుతుందనుకోలేదు. రాధ వెళ్ళిన పావుగంటవరకూ తేరుకోలేకపోయాడు.

రాధ కాలేజీకి వెళ్ళింది. లెక్చరరు చెప్పేది వింటున్నా మనస్సు మాత్రం తన ఆలోచనలను చదువువైపు కేంద్రీకరించలేకపోయింది. బావగారన్న మాటలు తల్చుకుని అనేక రకాలుగా ఆలోచిస్తూ కూర్చుంది. ఎంత ఆలోచించినా, ఎన్ని అనుకున్నా మళ్ళీ సాయంత్రానికి ఇంటికి వెళ్ళి బావగారి కంటపడక తప్పలేదు సుబ్బారావు రాధవైపు తీక్షణంగా చూడకా మానలేదు.

రాధ కన్నీరు నింపుకొని అక్కదగ్గరకు వెళ్ళింది తన మనో వేదన అక్కయ్యతో ఎన్నోసార్లు వెళ్ళబోసుకుంది. వేదవతి ఎన్నో విధాల రాధను ఊరడించేది. కాని ఆ రోజున వేదవతి రాధను ఊరడించే పరిస్థితిలో లేదు. కారణం వేదవతి భర్త సుబ్బారావు చేత దెబ్బలుతిని పుట్టెడు దుఃఖంతో గదిలో పడుకున్నది.

"పడుకున్నావేమే అక్కయ్యా" అన్నది రాధ.

వేదవతి కళ్ళు తుడుచుకుని మంచంమీద కూర్చుంది. ఆమెకళ్ళు వాచి ఎర్రబడినయ్యి. ముఖంలో ఆవేదనా, నిరాశ నిస్పృహా కాపురం చేస్తున్నయ్యి.

"బావ ఏమన్నా అన్నారా అక్కయ్యా" రాధకంఠం జీరపోయింది.

"నిత్యమూ ఉండే విషయాలే రాధా. వారు నన్నేమన్నా బాధ లేదు. సంతోషంకన్నా సుఖంకన్నా నాజీవితమూ, శరీరమూ బాధలకే అలవాటు పడ్డది. ఈ బాధలన్నీ నాకు అలవాటే. కాని నానుంచి నువ్వే మానసిక క్షోభకు గురవుతున్నావు రాధా! వారికళ్ళల్లో ఎప్పుడూ నువ్వే మెదులుతున్నావు. అనుక్షణం వారికళ్ళన్నీ నీమీదనే. ఈ చదువు పూర్తయి నువ్వు మళ్ళీ మన ఊరుచేరితే నాకదే పదివేలు. ఇలాంటి వాతావరణంలో అసలు నీకు చదువు వంటపడుతున్నదా, అనే నా సందేహం. ఆడదాని అదృష్టం అనుకూలుడైన భర్తతోనే ఉన్నది. కాని అనుకూలుడైన భర్త కాకపోయినా అపనిందలు తెచ్చే భర్తయితే ఇంక చెప్పవలసిందిలేదు. అపనిందలుకూడా అప్పుడైనవారిద్వారా తెచ్చి అపఖ్యాతి తను పడటమేకాక, ఇతరులనుకూడా అపఖ్యాతిపాలుచేస్తే, ఇక ఆ భార్య జీవితం నిజంగా అనవసరమే. కాని ఒక్క విషయంలో మాత్రం నా బాధ్యతను విస్మరించకూడదనే, దృఢసంకల్పంతోనే నేను జీవించకలుగుతున్నానే రాధా! లేకపోతే ముక్కు మూసుకుంటే మూడు ఘడియలు పట్టదు" అన్నది వేదవతి.

బాధతోకూడిన ఆశ్చర్యంతో వేదవతి ముఖంవైపు చూసింది రాధ. తన అక్కయ్య ఏం మాట్లాడుతున్నదో రాధకు అర్థంకాలేదు. ఇలాంటి మాటలు మాట్లాటం వేదవతికి మామూలయినా, వినటానికి తనకూ అలవాటయినా ఆరోజున ఎందుకో రాధకి వేదవతి మాటలు వింతగా తోచసాగాయి.

"నువ్విట్లా ఎందుకు మాట్లాడుతున్నావో నాకు తెలిదే అక్కయ్యా! నీధోరణిన్నిబట్టి చూస్తే మనింటికి పోలీసుల్ని రప్పించేటట్లున్నావు. అంత పని మాత్రం ఎన్నడూ చెయ్యవద్దు. ఆత్మవంచన చేసుకుని జీవితాంతం బ్రతికి బాధలుపడ్డా లోకం హర్షిస్తుంది. కాని, ఆత్మహత్య చేసుకుంటే లోకం హర్షించదు. పాపపుణ్యాల సంగతి అట్లా ఉంచు, జీవితంలో ఏమీ చెయ్యలేక, ఏమీ చేతకాక, భీరువైపోయి చావటమనేది మానవ జీవితానికే తలవంపు" అన్నది రాధ.

రాధ అందాన్ని తన కళ్ళతోకాక, భర్తకళ్ళతో చూసింది వేదవతి.

"రాధా! కోపగించుకోకు.. అక్కయ్యకూడా ఇలా మాటలాడుతున్న దేమా అనుకోవద్దు. మనిద్దర్నీ చూస్తుంటే మీబావగారికి తూర్పు పడమరలుగా తోస్తున్నది. నేను పల్లెటూరిదాన్ని. ఎక్కువ చదువురాని దాన్ని. చదువుకున్నవాళ్ళల్లో ఉండే సంస్కారం నాలో ఏమాత్రం లేదని మీబావ నమ్మకం. నువ్వు చదువుకున్నదానివి. ఎంతో సంస్కారవంతురాలివని వారి ఉద్దేశ్యం! వారిభావాల్లో సంస్కారమంటే అనేక వెర్రితరహాల ఆలోచనలు ఉన్నయ్యి. ఆ వెర్రితరహాల ఆలోచనలకి మనం కట్టుబడి ఉండాలని వారి ఉద్దేశ్యం. నిజమే, భర్త అడుగు జాడల్లో నడవవలసిన బాధ్యత నాకున్నది. కాని ఆత్మవంచన చేసుకోలేక పోతున్నాను. చదువుకున్న వాళ్ళయినా, చదువుకోని వాళ్లయినా కొన్ని పరిధుల్లో మనం జీవిస్తుంటే మనకూ తృప్తిగా ఉంటుంది. సంఘదృష్టిలోనూ మనం గౌరవించ బడతాం" అన్నది వేదవతి.

అంతా అర్థంచేసుకున్న రాధ ఆలోచనల వెంటవెళితే, వేదవతి వంటపనిమీద వెళ్ళింది.

మర్నాడు ఆదివారం, కాలేజీలేదు. రాధ చదువుకుంటూ కూర్చుంది. రాధ స్నేహితురాలూ, సహాధ్యాయినీ అయిన ధనలక్ష్మి వచ్చింది. వస్తూనే రాధ ముఖంవైపు చూస్తూ,

"అదేమిటే, అలా దిగాలుపడి కూర్చున్నావ్, పుస్తకం హస్తభూషణంగానే ఉందికాని చదువుతున్నట్లు లేదు" అన్నది.

రాధ నవ్వు ధనలక్ష్మికి ఆశ్చర్యాన్ని కలుగచేసింది.

"ఎందుకు రాధా! అంత దిగులు, నాన్నగారు శుభలేఖలు వేయిస్తానంటున్నారా, ఫ్యూరిఫ్ చూశావా" అన్నది ధనలక్ష్మి నవ్వుతూ.

"నాకు తోడు పెళ్లెందుకే, నీకు పెళ్లంటే మోజుగా ఉందా."

"అసలు పెళ్ళివిషయంలో నాకు ఏమాత్రం నమ్మకంలేదు, పెదవాళ్ళకే అసలువాళ్ళకన్నా మోజుజాస్తి! ఆ హంగామా అంతా పెద్దవాళ్ళ మనస్తత్వాన్నీ, హోదానీ వెల్లడిచేస్తుంది."

"అంటే అసలు పెళ్ళంటే నీకు ఇష్టంలేదా."

"నా ఉద్దేశ్యం అదికాదు, పెళ్ళిళ్ళ విషయాల్లో మూల సూత్రాలు చాలా సడలించాలి "

రాధకు అర్థంకాలేదు.

"ఏమిటా మూల సూత్రాలు."

"సాధారణంగా పెళ్ళిచూపులనే తతంగం ఎంతసేపు జరుగుతుంది."

"ఓ అరగంట."

"అవునుకదా, ఆ అరగంటలో వధూవరులు ఒకరి మనస్తత్వాలు మరొకరు అర్థం చేసుకోగలరా" ప్రశ్నవేసింది ధనలక్ష్మి.

"మనస్తత్వాలు అర్థంకాకపోవచ్చు. బాహ్యసౌందర్యం ఎంతవరకు ఉన్నదో చూసి తెల్సుకోవచ్చు. కంటికి ఇంపుగా ఉంటేకదా మనస్సుకు ఇంపుగా ఉండేది. పెళ్ళిచూపులనేవి అంతవరకే. వధూవరుల మంచి చెడ్డలు, గుణగణాలూ పెద్దవాళ్ళు తెల్సుకున్నాకనే పెళ్ళిచూపులనే తంతు సామాన్యంగా ఏర్పాటవుతుంది. ఇంతకీ నీ ఉద్దేశ్యం."

"ప్రేమించి పెళ్ళిచేసుకోవటం ఈకాలంలో ఎక్కువగానే జరుగుతున్నది. ఆవిషయంలో చెప్పవలసిందేమీలేదు. పరాయి సంబంధాల విషయంలోనే కొంత సంస్కరణ జరగాలి. అంటే ఆ వధూవరులిద్దరూ కొన్నిరోజులు నైతిక పతనం కాకుండా స్వేచ్ఛగా గడిపి ఒకరి మనస్తత్వం మరొకరు తెల్సుకున్నాక ఇద్దరి అభిరుచులూ, అభిప్రాయాలూ ఒకరికొకరు నచ్చచెప్పుకోగలిగితేనే వాళ్ళకు వివాహం చెయ్యాలి. అంతేకాని పెళ్ళిచూపులతోనే ఒక నిర్ణయానికి రాకూడదు" అన్నది ధనలక్ష్మి.

ఈ మాటలకు రాధ ఆశ్చర్యపడింది. సమాధానం చెప్పాలనే ఊహించుకుంది

"ధనలక్ష్మికి రామారావు సంబంధం వచ్చింది. మనస్తత్వాలు తెల్సుకోటానికి వారంరోజులు నైతికపతనం కాకుండానే కలిసిమెలిసి తిరి

గాదు. మనస్సులు కలవలేదు. కాదనుకున్నారు. మళ్ళీ ధనలక్ష్మికి నాగేశ్వరరావు సంబంధం వచ్చింది. నైతిక పతనం కాకుండానే మళ్ళీ వారంరోజులు స్వేచ్ఛగా తిరిగారు. కాని ఈ సంబంధం విషయంలోనూ అభిప్రాయాలూ, అభిరుచులూ కలవలేదు. ఆ సంబంధమూ తప్పింది తరువాత రంగారావు సంబంధం వచ్చింది. అతను ధనలక్ష్మికి నచ్చాడు. అతన్ని చేసుకోవాలనుకుంది. కాని రంగారావుకు ధనలక్ష్మిని పెళ్ళాడటానికి ఇష్టంకలగలేదు కారణం ధనలక్ష్మి కొన్నాళ్ళు మనస్తత్వ పరిశోధనకు రామారావు, నాగేశ్వరరావుతో స్వేచ్ఛగా తిరిగింది. ఈ కారణంగా ధనలక్ష్మిని రంగారావు పెళ్ళాట్టానికి ఇష్టపడలేదు. అంతే. ఇదొక కొత్తఅల్లరి ధనలక్ష్మి తనకుతానుగానే కొనితెచ్చుకున్నట్లే అవుతుంది. అవునంటావా ధనం" అన్నది రాధ.

ధనలక్ష్మికి ఏం సమాధానం చెప్పాలో తోచలేదు. ఈవిషయంలో ఇంక ఎక్కువగా తరచకూడదనుకుంది రాధ.

"పోనీలేవే ధనం, ఎవరి అభిప్రాయాలు వాళ్ళవి. అవి కొందరి విషయంలో మల్లెపూలయితే, మరికొందరి విషయంలో మంచిగంధపు చెక్కలు. మల్లెపూలు మర్నాటికి వాడిపోతాయి. మంచిగంధపుచెక్కలు చాలాకాలం ఉంటాయి. అయినా ఇప్పుడు పెళ్ళిసంగతులేమీ రాలేదులే. నా పెళ్ళి ఇప్పుడు జరగబోవటంలేదు. ఆ సమయం వచ్చినప్పుడు నువ్వు ఆ కాబోయేవరుణ్ణి నీ ప్రశ్నలతో మూడు చెరువులనీళ్ళు తాగిద్దువుగాని, సరేనా" అన్నది రాధ.

ధనలక్ష్మి ఫక్కున నవ్వింది. హేళనగా నవ్వింది. వెటకారంగా నవ్వింది. రాధ విస్తుపోయి చూస్తూ కూర్చుంది.

"నా చేతులో నువ్వు చిత్తుగా ఓడిపోయావే రాధా" అన్నది.

"నువ్వనేది నాకు అర్థంకావటంలేదు. అసలువిషయం చెప్పు, చంపక" అన్నది రాధ.

"నే చెప్పిన అభిప్రాయాలు నావే అనుకున్నావా పూర్ క్రీచర్."

"ఎవరయినా ఒక మహాకవి అభిప్రాయాలా."

"మహాకవులు ఎప్పుడూ ఇలా చెప్పరు."

"మరి, ఎవరి అభిప్రాయాలు."

"ఇవి కామేశ్వరి అభిప్రాయాలు."

"కామేశ్వరా!" ఆశ్చర్యంగా చూస్తూ నిట్టూర్చింది రాధ.

"అవును, ఏం? కామేశ్వరితో నీకు బాగా పరిచయం ఉన్నదా?"

"ఆ, చాలా పరిచయం ఉన్నది. కామేశ్వరి ఈ అభిప్రాయాలనే కాదు. ఇంతకన్నా గొప్ప అభిప్రాయాలనే వెలిబుచ్చింది. ఆవిడకున్న అభిప్రాయాల్లో నువ్వు చెప్పినవి రూపాయిలో పదోవంతుమాత్రమే" అన్నది రాధ.

"అలాగా? నాకు కామేశ్వరితో అంతగా పరిచయం లేదులే. తాత్కాలికంగా కనబడ్డప్పుడు ఏదో మాటలాడ్డమే. పోనీ నీకు తెల్సిందేమిటో చెప్పరాదా" అన్నది ధనలక్ష్మి.

"చెప్పినందువల్ల మనకు వొరిగేదేమీలేదు. మనస్సు కష్టపెట్టుకోవటమే తెల్సేది. కొంతమంది స్త్రీలుంటారు, వాళ్ళు స్త్రీజాతికి తలవంపు తెచ్చే పన్లుచేసినా అంతా వార్నే హర్షించి గౌరవిస్తారు, ఎందుకంటావు" అన్నది రాధ.

"దుష్టుడికి దూరంగా ఉంటం మంచిదనే."

"అదీ కొంతవరకే నిజం. కాని దానికీ సభ్యత అనే రంగుబుపూసి వారికి బ్రహ్మరథం పడతారు. అంటే వాళ్ళంతా "కల్చర్డ్ లేడీస్" అని వారిభావన."

"అయితే చాలాకధ ఉన్నదన్నమాట, కామేశ్వరిచరిత్ర" ఆశ్చర్యంగానే అన్నది ధనలక్ష్మి.

"కామేశ్వరి చరిత్ర తెల్సుకోవాలనుకుంటే ముందుగా మా చరిత్ర తెల్సుకోవాలి. నువ్వు వింటానంటే మీ ఇంటికి వచ్చి చెప్తాను" అన్నది రాధ.

మధ్యాన్నం భోజనాలు కాగానే రాధ, ధనలక్ష్మి ఇంటికి వెళ్ళింది.

"ఆ, సూతులవారు శౌనకాది మహామునులం జూచి ఇట్లనియె" అన్నది ధనలక్ష్మి నవ్వుతూ.

రాధ ఇలా చెప్పసాగింది—

"మాది సామాన్య మధ్యతరగతి కుటుంబమేగాని సంపన్న కుటుంబంకాదు. మాది రామచంద్రపురం తాలూకాలో ఒక పల్లెటూరు. మా నాన్నగారికి ఆ ఊళ్లో పదెకరాల పొలం వున్నది. ఆయన ఎక్కువగా చదువుకోలేదు. వ్యవసాయమే ఆయన ఉద్యోగం. భూదేవినే ఆయన నమ్ముకుని స్వంతవ్యవసాయం చేస్తూ ఆయన జీవితం ప్రారంభించారు, మా అమ్మగారి పుట్టిల్లు అన్నవరం. అంతే సత్యనారాయణ స్వామి వెంచేసి వున్నఊరే. చిన్నప్పటినుంచీ ఆమెకు దైవభక్తి. దైవ చింతన జాస్తీ. కనీసం ఆ కాలపు తెలివితేటలుకూడా ఆవిడకు లేవు. తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్ళు అనేరకం. మా నాన్నగారు పగలల్లా పొలంలో కష్టపడి ఇంటికి వచ్చేవరకూ ఇంటిపను పూర్తికాగానే ఆవిడ దైవచింతనతో కాలం గడిపేది. అమ్మ, నాన్న మనస్తత్వాలు ఇలా ఉండటంతో అక్కయ్యకు చదువుమీద ధ్యాసవున్నా సాగలేదు. కారణం అక్కయ్య వేదవతి విధిగా ఇంటిపనిలో అమ్మకు సాయం చెయ్యవలసి వచ్చేది. అందువల్ల అక్కయ్యకు బడికివెళ్ళి చదువుకునే సావకాశం కలగలేదు. అయినప్పటికీ అక్కయ్య ఇంటివద్దనే పుస్తకాలు తెప్పించుకుని చదువుతూ తన విజ్ఞానాన్ని పెంపొందించుకున్నది. క్రమంగా ఇంగ్లీషు పుస్తకాలు చదువుతూ ఆంగ్లభాషకూడా నేర్చుకున్నది. అక్కయ్య స్కూల్లో ఫస్టుఫారంమాత్రమే చదివింది. అందువల్ల అక్కయ్య ఎంత విజ్ఞానాన్ని పెంపొందించుకున్నా చదువురానిదిగానే పరిగణింపబడేది. దీనికితోడు, అమ్మ నాన్నకూడా మాటల సందర్భంలో అక్కయ్యకు చదువురాదనే చెప్పేవారు. ఇలాంటి వాతావరణంలో పెరిగిన అక్కయ్య స్కూల్ ఫైనల్ వాళ్లపుస్తకాలన్నీ అనర్గళంగా చదువుతున్నా దాని చదువూ, విజ్ఞానమూ లెక్కలోకి రాలేదు. దీనికితోడు పెళ్ళి విషయంలోకూడా నాన్నగారు ఎక్కువబాధ పడనవసరంలేకుండా మేనరికమే ఉంటంతో ఆ విషయంలోనూ ఇతర ప్రయత్నాలు చెయ్యవలసిన అవసరం లేకపోయింది.

పందొమ్మిదేళ్ళు వచ్చిన అక్కయ్య, ఎంతో అందంగా, చూడ ముచ్చటగా ఉండేది దానిమనస్సు చాలా మంచిది. దానికి అమ్మపోలిక వచ్చింది. ఎవరినీ నొప్పించకుండా మాటలాడేది. అది మాటలాడుతుంటే ఎలాంటి వారికయినా వినసొంపుగా ఉండేది. అప్పటికి నాకు పదిహేడో ఏడు. మేనరికాన్ని చూపెట్టుకుని అక్కయ్య చదువు విషయంలో శ్రద్ధ చూపని నాన్న నా చదువు విషయంలో ముందంజవేశారు మా ఊళ్ళో హైస్కూల్లో స్కూల్ ఫైనల్ చదివాను. అక్కయ్య ప్రోద్బలంతోనే పక్క ఊరు రామచంద్రపురం కాలేజిలో పి. యు. సి లో చేరాలనీ అను కున్నాను. ఇంకా స్కూల్ ఫైనల్ రిజల్టుసరావాలి.

ఈ పరిస్థితుల్లో ఇంటిలో అమ్మ పోరు జాస్తీ అయింది. ఎంత మేనరికమైనా ఆ మూడుముళ్ళు వేయించేస్తే ఇక సగం బరువు బాధ్య తలు తీరిపోతాయని అమ్మ ఆదుర్దా. అమ్మపోరు పడలేక నాన్న విశాఖ పట్నంవెళ్ళి మా అత్తయ్యతో మాటలాడి వచ్చారు. అప్పటికి బావ ఎమ్. కాం మొదటిసంవత్సరం పూర్తిచేశారు. బావతండ్రి చిన్నప్పుడే పోయారు. ఆయన బ్రతికి ఉన్నరోజుల్లోనే ఉన్నపొలమంతా అమ్మేసి విశాఖపట్నంలో రెండుమేడలు కొన్నారు. ఒక వాటాలో వాళ్ళుండగా రెండుమేడలమీదా ఆరువందలకు పైగానే నెలనెలా అద్దెలువచ్చేవి. అదే వాళ్ళకు ఆధారం. మా నాన్నగారు వెళ్ళి పెళ్ళిసంగతి ప్రస్తావించగానే అత్తయ్యకు ఏనుగుమీద ఎక్కించినంత సంతోషమైంది. అక్కయ్య వేదవతిని తనకోడలుగా చేసుకోటానికి వప్పుకున్నది. బావ అభిప్రాయం కూడా తెల్సుకున్నాడు నాన్న. అమ్మ ఇష్టపడితే సరేనన్నాడు బావ. నాన్న ఎంతోసంతోషంతో ఇంటికివచ్చారు. విషయాలన్నీ విన్నాక అక్కయ్యను అడిగాను.

"బావను మేనరికమని చేసుకుంటున్నావా, ప్రేమించావా" అక్కయ్య సిగ్గుపడి నా బుగ్గలు గిల్లి, "ఇదే నా సమాధానం" అన్నది. ప్రేమించినట్లే దాని ముఖకవళికల్నిబట్టి అర్థమైంది.

"స్కూల్ ఫైనల్ పాసయితే పి. యు. సి. లో చేరనా" అన్నాను.

"చక్కగా రాణీలా చదువు, నా చదువుకూడా నువ్వే చదవాలి. కనీసం బి. యస్సీ పాసవాలి. ఎమ్మెస్సీ కావాలంటే మా ఇంట్లో ఉండి చదువుకుందువుగాని" అన్నది.

"మీ ఇల్లంటే."

"పోవే గడుగ్గాయ్, మీ బావగారిల్లు; మీ అక్కయ్యగారిల్లు. తెల్సిందా" అన్నది సంతోషంగా.

"అప్పుడే కాపురానికి వెళ్ళినట్లే చెప్పేస్తున్నావే" అన్నాను.

"ఇక ఈ కబుర్లు చాలించు. ఇక్కడనుంచీ రోజూ రామచంద్ర పురం కాలేజికి నలుగురయిదుగురన్నా వెళతారు. వారితో జట్టుగా నువ్వూ వెళ్ళి చదువుకో. మధ్యాన్నం భోజనానికి క్యారేజీ తీసుకువెళ్ళు" అన్నది.

నాన్న పెళ్ళి ప్రయత్నాలు చేస్తూ డబ్బుతేవటం. పెళ్ళికి కావల సిన సామాన్లు కొనటం ఈ రకంగా హడావుడిగా తిరుగుతూ ఉండేవారు. వేసంకాలం ఎండలు బాగా కాస్తున్నాయి. పెళ్లిపన్లకు నేనూ, అక్కయ్యా అమ్మకు సాయపడుతూ ఉండేవాళ్ళం. ముహూర్తనిర్ణయంకోసం నాన్న మళ్ళీ విశాఖపట్నం వెళ్ళారు.

ఆ పూర్వకాలం పెద్దలు అంటే నాన్న, అమ్మ, అత్తయ్య ఆలో చించుకుని ఒక శుభముహూర్తాన ఆకాశమంత పందిరీ, భూదేవంత అరుగూ వేసినంత తంతుజరిపి వాళ్ళకు పెళ్ళిచేశారు. బాకా భజంత్రీ లతో, మంత్ర తంత్రాలతో వేదఘోషతో అక్కయ్య శ్రీమతి వేద వతిగా మారింది. వేసంకాలంలో పెళ్ళయింది.

పెళ్ళయాక పదహార్రోజుల పండుగనాడు బావ ముచ్చటగా మూడు కోరికలు కోరాడు. మొదటిది తన చదువు పూర్తయ్యేవరకూ అక్కయ్యను కాపురానికి తీసుకువెళ్ళననీ, అక్కయ్య కాపురానికి వెళ్లే లోగా ప్రయివేటుగా చదివి మెట్రిక్ ప్యాసవాలనీ, మూడోది ఆ పల్లె టూళ్లో అక్కయ్య చదువు సాగదు కనుక విశాఖపట్నంలోనే వాళ్ళ

ఇంట్లో ఉండి చదువుకోవాలనీ చెప్పారు. అంటే భార్యాభర్తలుగాకాక చదువుకోసమే అక్కయ్య వాళ్ళింట్లో ఉండాలి ఈ మూడు షరతులూ తన సుపుత్రుడు నిర్ణయిస్తాడని అత్తయ్యకూడా తెలీదు. అందరూ నివ్వెరపోయారు. అమ్మ నెత్తీ నోరూ బాదుకుంది. నాన్న దిగులుపడ్డారు. అత్తయ్య ముఖాన నెత్తురుచుక్కలేదు. అక్కయ్య చిన్నబుచ్చుకుంది. ఎంతమంది చెప్పినా బావ తనపట్టు వదల్లేదు.

అక్కయ్య ఎవరితోనూ రెండురోజులు మాట్లాడలేదు. మూడో రోజున ఈ మూడు షరతులకూ తను ఒప్పుకున్నట్లుగా అందరితో చెప్పింది. అందరూ ఆశ్చర్యపోయారు. అమ్మ వాపోయింది. అక్కర తీర్చకుండా అత్తవారింటికి అలా పంపటానికి అమ్మకు ఏమాత్రం ఇష్టం లేదు. ఆ పద్ధతి అమ్మకు తప్పుగా తోచింది. తిండిపెట్టలేక, చదువు నెపంతో అక్కయ్యను అవతలకు నెట్టివేసినట్లుగా ఆవిడ భావించింది. ఏమైతేనేం బావ పంతాన్ని అక్కయ్య శిరసావహించింది.

ఒకరోజున అక్కయ్యను తీసుకుని అమ్మ, నాన్న, నేను అత్తయ్యగారింటికి విశాఖపట్నం వెళ్ళాము. నాలుగయిదురోజులుండి, అత్తయ్య చేతుల్లో అక్కయ్యనుంచి పుట్టెడు దిగులుతో మా ఊరు వచ్చేశాం. నా దుఃఖానికీ, ఆవేదనకూ అంతులేదు. అక్కయ్య సవ్యంగా, లోకరివాజుగా కాపురానికి వెళితే ఎవరికీ బాధ ఉండదు. మొదట్లో కొత్త అనిపించినా, దాని కాపురం అది చేసుకుంటున్నదనే తృప్తిపడవచ్చు. కాని అక్కయ్య పరిస్థితి అదికాదు. అందుకనే అందరికీ మనోవేదన కలిగింది.

మేము వచ్చేయంగానే ఆ మర్నాడే అక్కయ్యను ట్యుటోరియల్ కాలేజీలో చేర్పించాడు బావ. ఆయన ఎమ్. కాం. ఫైనలియర్‌లోకి వచ్చాడు.

నేను స్కూలుఫైనల్ మంచి మార్కులతో పాసయాను. అక్కయ్య కాపురంతో కనువిప్పు కలిగిన నాన్న నన్ను వెంటనే రామచంద్రపురం కాలేజీలో పి. యు.సి. లో చేర్పించారు. మా ఊరికి మైలు

న్నర. రోజూ అయిదారుగురు ఆడపిల్లలం జట్టుగా కలిసివెళ్ళి వస్తూ ఉండేవాళ్ళం" ఇంతవరకూ చెప్పి ధనలక్ష్మివైపు చూస్తూ కూర్చుంది రాధ.

"చెప్పటం ఆపేశావేం?" అన్నది ధనలక్ష్మి.

"చెప్తాను, కాని మధ్య మధ్య నువ్వేమీ ప్రశ్నలు వేయకూడదు. ఈ షరతుకు వప్పుకుంటే మిగతా సంగతులు మాట్లాడుకుందాం" అన్నది రాధ.

ధనలక్ష్మి సరేనన్నది. రాధ చెప్పసాగింది.

"కాలేజీ టైము ఇద్దరికీ ఒక్కసారే కావటంతో అక్కయ్యకూ, బావకూ ఒకసారేవడ్డించేది అత్తయ్య. బావపక్కన కూర్చోటానికి అక్కయ్యచాలా సిగ్గుపడేది. అన్నం తినబుద్ధిపుట్టేదికాదుట. పక్కనో, ఎదురుగానో అక్కయ్య భోజనంచేస్తున్నా బావ తలెత్తి అక్కయ్యవైపు చూసేవాడుకాదుట. ఇద్దరూ ముభావకంగానే కూర్చునేవాళ్ళు. ఈడొచ్చిన కొడుకూ, కోడలూ ఈ రీతిగా విరోధస్తుల్లా ఉండటం అత్తయ్యకు ఏమాత్రం నచ్చ లేదు. కాని ఏంచేస్తుందావిడ? ఒకసారి భోజనాలదగ్గర ఒక తమాషా జరిగింది. అక్కయ్య అప్పడంముక్క విరుచుకు తింటుంటే ఓ ముక్క ఎగిరి బావ కంచంలో పడ్డది. ఈ చిన్న విషయానికి ఇంకొక భార్యాభర్త లయితే ఎంత ఆనంద పడేవారో, కాని బావమాత్రం చివాలున కంచంలో చెయ్యికడుక్కుని వెళ్ళిపోయారు. కొడుకు ప్రవర్తనకు అత్తయ్య ఏడ్చింది. అక్కయ్య బాధపడింది.

అక్కయ్య వచ్చిన వారంరోజులవరకూ బావ అక్కయ్యను పలక రించనే లేదు. ఈ వారంరోజులూ వాళ్ళతరహా చూసి అత్తయ్య, అక్క య్యతో అన్నది.

"అమ్మాయ్, వాడిసంగతీ, మన స్తత్వం కన్నతల్లికి నాకే తెలేదు. వాడితో నా తల బొప్పి కట్టింది. అంత పెడసరి. వాడుపట్టినకుందేలుకు రెండున్నరకాళ్ళు అనేరకం. నువ్వూ పరాయిదానివికాదు. కలిసి ఉండా ల్సిన ఈ వయస్సులో అందరిమనస్సూ ఈ రీతిగా వాడు బాధ పెడు

తున్నాడు. కొత్త దంపతుల్లో ఉండవలసిన కోరికలు వాడి పెడసరి బుద్ధికి లొంగి పారిపోయాయి. కనీసం మీ రిద్దరూ మాటలాడుకుంటున్నా నా సంక్షోభ కాస్త తగ్గుతుంది. ఈరోజునుంచీ వాడికి కావాల్సిన విషయాల్లో నేను జోక్యం కలుగచేసుకోను వాడికి స్నానానికి నీళ్ళు తోడటమూ, బట్టలు అందించటమూ, కాఫీ ఫలహారాలు అందించటమూ అన్నీ నువ్వే చూసుకోవాలి. ఈ రకంగానైనా వాడు కాస్త దార్లోకొస్తాడేమో చూద్దాం." అన్నది. అక్కయ్య సరేనని అప్పటికి తల ఊపింది. కాని బావను సమీపిస్తేనే దానికి పులిదగ్గరకు వెళ్లుతున్నట్లుగా ఉండేది. ఆరోజునే అక్కయ్య బావకు కాఫీ పట్టుకు వెళ్ళిందిట. బావ చదువుకుంటూంటే డ్రాయరుమీద పెట్టింది. ఒక్కసారి అయిష్టతగా చూసి,

"కాఫీ నువ్వు తెచ్చావేం" అన్నారు బావ.

"అత్తయ్య నన్నే ఇవ్వమన్నారు" అక్కయ్య సమాధానం.

"నిన్నిక్కడికి మీ వాళ్లు పంపిందీ,నువ్వు ట్యుటోరియల్ కాలేజీలో చేరిందీ ఇందుకేనా."

"నేను పరాయిదాన్నికాదు."

"అలాగా, నేను నిన్ను పెళ్ళాడినా నా దృష్టిలో నువ్వు ప్రస్తుతం పరాయివానివే. నిన్నిక్కడకు చదువుకు పంపారు. కాపురానికి కాదు, నువ్వు కనీసం మెట్రిక్ పాసయితేనే నీతో కాపురం చేసేది. లేకపోతే.........ఇంకవెళ్ళు, ఎప్పుడూ ఇలాంటి పనులు చెయ్యకు" అన్నారుట.

అక్కయ్య కన్నీరు నింపుకుని అత్తయ్యదగ్గరకు వెళ్ళింది.జరిగిందంతా విన్నా అత్తయ్య తనూ విచారపడింది.

ఆరోజునుంచీ అక్కయ్య బావకు ఏ వస్తువూ ఇవ్వటంగానీ, మాటలాడ్డంగానీ చేసేదికాదు. బావ కనిపిస్తే తప్పుకు తిరిగేది. పొద్దస్తమానం పుస్తకాలు చదువుతూ కూర్చునేది.

ఏ విషయానికయినా ఒక హద్దంటూ ఉండాలి. ఏదయినా అతిగా ఉంటే శృతిమించి రాగాన పట్టమో, మనసు విరిగిపోవటమో జరుగు

తుంది. అక్కయ్య పాఠాలు చదువుతున్నా, కాలేజికి వెళుతున్నా ఏదో బాధగా పుట్టెడు దుఃఖంతో ఉన్నట్లుగా వెళ్లేది.

కొన్నిరోజులు గడిచాయి. అక్కయ్య తన సహాధ్యాయినులతో ఎక్కువగా చనువుగా మాటలాడేదికాదు. అక్కయ్య భర్త ఇంటిలోనే ఉండి చదువుకోటం వాళ్ళకు తెల్సింది. మానమర్యాదలకు మగ్గి అక్కయ్య కాలం వెళ్ళబుచ్చుకుంటున్నా, చుట్టుపక్కల వాళ్లు ఊరుకోరుకదా! వాళ్ల ఎగతాళి మాటలతో, అపవాదులతో అక్కయ్యమనస్సు పాడైపోయింది.

"ఏం వేదవతీ, చదువు నెపంతో అంత దొంగచాటుగా ఉండక పోతే చేసుకున్న భార్యవి, ఆ శాస్త్ర అడ్డూ తీర్చుకుంటే ఎవరేమంటారు" అనేవాళ్లట కొంతమంది.

"అది కాదే, వేదవతి కాలేజిగరల్ అయితేనేకాని ఆమెని పలక రించట్ట వాళ్లాయన. ప్రస్తుతం శ్రీవారి దృష్టిలో వేదవతి కాలేజిగరల్" అని ఇంకొకరు.

"ఆయనా, ఆవిడా ప్రస్తుతం సరస్వతీదేవిని ఆరాధిస్తున్నారుగాని రతీ మన్మధుల్నికాదు" అని ఇంకోపిల్ల. ఇలా ఎగతాళి పట్టించేవాళ్లట. అన్నీవిని ముఖం చిన్నబుచ్చుకుని అక్కయ్య ఇంటికి వచ్చేది.

ఈ విధంగానే చుట్టుపక్కల ఆడవాళ్లంతా అత్తయ్యను అనేక తీరులుగా అడిగేవాళ్లు. వాళ్లందరికీ సమాధానం చెప్పలేక అత్తయ్య సత మతమయేది. ఏదైనా కట్నకానుకలవద్ద తగాదా వచ్చిందేమోనని కొంత మందీ, అక్కయ్యలో ఏదో లోపం ఉన్నదని కొంతమందీ, ఇట్లా అనేక రకాలుగా, అనేక తీరులుగా అందరూ అనుకునేవారు. అసలు విషయం చెప్పినా ఎవ్వరూ నమ్మేవారు కాదు.

ఒకరోజున అక్కయ్య వినేటట్లుగానే పక్క భాగాలవాళ్లు నవ్వు కుంటూ మాటలాడుతున్నారుట. ఆ మాటలు వినలేక అక్కయ్య కుమిలి కుమిలి ఏడ్చింది. చదివే పాఠాలు బుర్రకెక్కలేదు. కళ్లు అక్షరాలను చూస్తున్నా మనస్సు క్షోభతో నిండిపోయింది. వాళ్లు మాట్లాడుకుంటున్న మాటలు-వినరానివి, వినలేనివి, కాపురాలు చేసుకునేవాళ్లు అనకూడనివి.

అక్కయ్యలో స్త్రీత్వంలేదనీ, బావలో పౌరుషత్వంలేదనీ ఆ మాటల సారాంశం. ఇంతకన్నా ఏంకావాలి మనస్సు బాధతో నిండిపోవటానికి ? ఎవర్ని మెప్పించగలం ? ఎవర్ని సమర్ధించగలం? ఎవరికి ఎలానచ్చచెప్ప గలం ?

ఒకరోజున అక్కయ్య కాలేజికి వెళ్ళి వస్తుంటే ఒక స్నేహితు రాలు ఏదో అన్నదిట. ఆ అవమానపు మాటలు వినేసరికి అక్కయ్యకు ఆవేదన, ఆక్రోశం ఎక్కువై అమ్మాయి చెంపలు పగలకొట్టింది. అదొక పెద్ద పంచాయితీ, కాలేజిలో పిల్లలంతా గోల, అల్లరి, అరుపులు, కేకలూ.

ఒకరోజున బావ చదువుకుంటున్నారు. అత్తయ్య తనగదిలో పడుకుంది. అక్కయ్యకూడా చదువుకుంటున్నది. పరిస్థితులు మానవుని పైకి ఎత్తగలవు. కిందికి అణగదొక్కగలవు.

గది గుమ్మం పుచ్చుకుని అక్కయ్య నిల్చున్నది. బావ వైపు కళ్ళార్పకుండా చూస్తున్నది. వయస్సుకు తగినకోరికలు అందరిలోనూ ఉంటయ్యి. అసలు జీవితాలే కోరికలపుట్ట. కొన్ని చీమలపుట్టలయితే మరికొన్ని పాములపుట్టలు. బావ తల ఎత్తకుండా చదువుకుంటున్నారు. అక్కయ్య అలాగే చూస్తూ నిల్చుంది. తన జీవితచరిత్ర అంతా చర్విత చరణం చేసుకున్నది. ఆఖరి అంశం పెళ్ళి. జరిగిన పెళ్ళివేడుకలూ, బావకోరిన మూడువరాలూ, అన్నీ గుర్తుకు తెచ్చుకుని దుఃఖంపొంగి పొర్లుకు రాగా వెక్కి వెక్కి ఏడ్చింది. బావ తలెత్తి చూశాడు. కన్నీరు కారుస్తూ అక్కయ్య గుమ్మంలో నిల్చుంది."

ఇంతవరకూ చెప్పి ఆగింది రాధ. "ఆగావేం రాధా, మిగతావి చెప్పరాని సంఘటనలా ?" అన్నది ధనలక్ష్మి.

"ఈ విషయాలన్నీ నీకు చెప్తున్నానంటే నా కెలా తెల్సునంటావే ధనలక్ష్మి" అన్నది రాధ.

"ఎలా తెలుసేముంది. మీ అక్కయ్య చెప్పి ఉంటుంది. లేక పోతే నీ కెలా తెలుస్తుంది."

"అవునుకద, ఒకరోజున అక్కయ్య నాకు తన జీవితకధ చెప్తుంటే, ఆరోజున నా మనస్సు ఎంత బాధపడ్డదో నీకు అర్ధమయే ఉంటుంది. మళ్ళీ ఇప్పుడు అలాంటి మానసిక బాధనూ అనుభవిస్తు న్నాను. విన్న మనమే ఇంత బాధ పడుతుంటే అక్కయ్య ఎంత కుమిలి పోయిందో ఆలోచిస్తే కడుపు తరుక్కుపోతుంది" అన్నది రాధ.

"మీ అక్కయ్య వేదవతి కనకనే అంత ఓర్పుతో అలాంటి వ్యక్తితో కాపురం చేస్తున్నది. నేనయితే ఎలా వంచుకురావాలో అలా వంచుకు వచ్చేదాన్ని" అన్నది ధనలక్ష్మి.

"ఈమాట నువ్వంటావా లేదా అనే నేనూ ఈ ప్రస్తావన తెచ్చాను. నేను అంచనా వేసినట్లే ఈ మాట నువ్వు అనేశావు. కాని కాపురాన్ని నిలబెట్టుకుని గౌరవంగా కాపురం చెయ్యదల్చుకున్న ఏ స్త్రీ కూడా, ఎంత తెలివి కలదయినా, ఎంత విద్యావంతురాలయినా భర్తమీద తిరగబడలేదు. అదే ఆ పరమాత్ముడు మనస్త్రీలకు ప్రసాదించిన పరమ పావనమైన క్షమాగుణం. తెగించిన వాళ్ళూ, తెగతెంపులు చేసుకున్న వాళ్లూ, గౌరవ మర్యాదలు పోగొట్టుకున్నవాళ్ళూ అన్ని కాలాల్లోనూ, అన్ని తరాల్లోనూ ఉన్నారు. కాని అక్కయ్యలో క్షమాగుణమనేది ఇంకా ఎక్కువ మోతాదులో ఉన్నదనే నేను చెప్పటం. దాని ఓర్పుకీ, క్షమా గుణానికీ నేనెప్పుడూ జోహారు లర్పిస్తాను" అన్నది రాధ.

ధనలక్ష్మికి ఈ అభిప్రాయం పూర్తిగా నచ్చలేదు. కాని ఆ పరి స్థితినిబట్టి తన ఊహలను మార్పుచేసుకున్నది.

"ఓర్పూ, క్షమాగుణమూ ఆడదానికి ఆభరణాలయితే కావచ్చు. కాని ఆత్మాభిమానంకూడా ఆడదానికి అలంకారమే. ఆత్మాభిమానం పోగొట్టుకున్న ఆడది అర్ధప్రాణం పోగొట్టుకున్నట్లే. ఆపరిస్థితి గ్రహించ కుండా ఓర్పూ, క్షమాగుణమూ అని తలవంచితే అది అమాయకత్వమో, అసమర్ధతో కన్న తల్లిదండ్రులుకూడా గ్రహించలేని పరిస్థితి ఏర్పడు తుంది. పెళ్ళాడిన భర్త పెళ్ళాం మనస్తత్వం తెల్సుకోలేకపోతే ఆ భార్య జీవితం అధోగతి పాలయినట్లే" అన్నది ధనలక్ష్మి.

"అవును. అక్కయ్య అభిప్రాయంకూడా అదే. ఇక అసలు విషయం చెప్తాను. తనను ఆ పరిస్థితుల్లో చూసిన భర్త తనను ఆదరిస్తారని అక్కయ్య అనుకోలేదు. ఆదరణ, అభిమానమూ ఉంటే పరిస్థితులు ఆవిధంగా రానేరావు. ఇక వాళ్ళిద్దరిమధ్యా జరిగిన సంభాషణ వింటే నువ్వెంతో ఆశ్చర్యపడతావు." అన్నది గంభీరంగా.

"మీ బావ ఏమన్నాడు రాధా" అన్నది ధనలక్ష్మి.

"ఎందుకా ఏడుపు, వంట్లో బావుండలేదా? అవును, ఎందుకు బాగుంటుంది? చదువుమీద ధ్యాసఉంటేకదా, నీ ఆలోచనలు వేరు" అన్నాడు బావ.

"చదువుమీద ధ్యాస ఉన్నరోజుల్లో చదువు అబ్బనేలేదు. మీ ఆజ్ఞ శిరసావహించి మనస్ఫూర్తిగా నేనూ చదువులోనే ప్రవేశించాను. నేను చదువుకోనని చెప్పటంలేదు. కాని...." అర్ధోక్తిలోనే ఆగిపోయింది వేదవతి.

"ఆగావేం, నీ మనస్సులోని కోరికలేవో చెప్పవచ్చుకదా."

"కోరికలను ఏనాడో చంపుకున్నాను. మీతో కొన్ని సంగతులు మాట్లాడాలని వచ్చాను. అభ్యంతరం లేకపోతే విని, మీ మనస్సు నాకు అర్థమయ్యేటట్లుగా మాట్లాడితే చాలు, నా కోరిక అదే" అన్నది వేదవతి.

"అసలు విషయం."

జడ్జీముందు ముద్దాయిలా నిలబడింది వేదవతి. నన్ను చదువులో ప్రవేశపెట్టటానికి పూర్వం, అంటే మన పెళ్ళికి ముందు మీ మనస్సులోని అభిప్రాయం చెప్పనే లేదేం."

"అప్పుడు అవసరమనిపించలేదు."

"మేనమామకూతురు ఏం చదువుకున్నదోకూడా మీకు తెలీదా."

"తెలుసు. కాని అప్పుడే చెప్తే నీకు పెళ్ళికాదేమోనని చెప్ప లేదు."

అక్కయ్య ఆశ్చర్యపోయింది. బావతో మాట్లాట్టానికి కాస్త ధైర్యమూ వచ్చింది.

"డిగ్రీఉన్న భార్య మీకు కావాలని ఉందికదూ."

"అవును."

"మరి నన్ను పెళ్ళి చేసుకున్నారేం."

"ఈ చదువురానిదాన్ని మరెవ్వరూ పెళ్ళాట్టానికి సాహసించరని నేను పెళ్ళాడాను. దానికితోడు బాంధవ్యాన్ని విడిచిపెట్టవద్దని అమ్మ కోరింది."

"భార్యాభర్తలమైన మనం ఈ రీతిగా జీవితాలు గడుపుతుంటే చూసినవాళ్ళు ఏమనుకుంటారో ఆలోచించారా."

బావకు కోపం వచ్చింది.

"నువ్వు నా భార్యవా, ఆ చూసినవాళ్ళ భార్యవా."

"మీ భార్యనే, కాని...."

"నాకు అంతా తెలుసు వేదవతీ. నా భార్యకు చదువు చెప్పిస్తున్నాను కాని, తగని పన్లేవీ చేయించటంలేదు. పెళ్ళికాగానే సంసారజీవితమే గడపాలనే సిద్ధాంతం నా ఉద్దేశ్యంలో ఎక్కడాలేదు."

అక్కయ్యకు బాగా ధైర్యం వచ్చింది.

"స్త్రీ, పురుషు లిద్దరికీ చదువుసంధ్యలు అవసరమే. చదువుకుని ఉద్యోగాలు చేసేవారు కొంతమందయితే, లోకజ్ఞానం పెంపొందించుకోవ టానికి, విజ్ఞానాన్ని పోషించుకోటానికి స్త్రీకి చదువు ఎంతో అవసరం. ఉద్యోగాలుచేసే విషయం అలా ఉంచండి. ఆ చదువుకూడా ఏ వయ స్సులో చదువుకోవాలో ఆ వయస్సులో చదువుకుంటే అది రాణింపుకు వస్తుంది. నా పరిస్థితిలో చదువుకుంటే మనం సద్బుద్ధితో ఉన్నా సంఘం హర్షించదు. మనలో ఏదో దోషమో, లోపమో ఉందని వాళ్ళ ముఖాన్నే

అంటున్నారు. పోనీండి! మీరు ఎమ్. కాం చదువుతున్నారు. అంటే మీకు కనీసం ఏ గ్రాడ్యుయేట్ భార్య అయితేనో మీ మనస్సుకు తృప్తిగా ఉంటుంది. అవునా" అన్నది వేదవతి.

"అవును. నిన్ను బి. ఏ. చదివించాలనే నా ఉద్దేశ్యం. అప్పుడే నా పక్కన ఉంటానికి అర్హురాలివి. చదువురాని వెంకాయమ్మ నా భార్య అని చెప్పుకోటానికి నా మనస్సు అంగీకరించదు" అన్నాడు బావ.

అక్కయ్య భావాలు పుంఖానుపుంఖాలుగా ఆమె మనస్సులో రొద చేయసాగాయి. తన భావాలను భర్తతో చెప్పటానికి ఈ మాత్రం సావకాశం కలిగినందుకు అక్కయ్య ఎంతో ఆనందంగా ఉన్నా, ఆ ఆనందం వెనక బావ నియంతృత్వపు భావాలు భయపెట్టటంతో సహజమైన భయభ్రాంతితో చూస్తూ నిల్చుంది అక్కయ్య.

"కూర్చుని మాట్లాడు వేదవతీ, నిరభ్యంతరంగా నీ కోరికలు వెల్లడి చెయ్యవచ్చు" అన్నాడు.

బావ ఉద్దేశ్యంలో అక్కయ్య చదువులేని కారణంగా ముద్దాయిగా మారిపోయింది.

అక్కయ్య కూర్చుంది.

"మీ దృష్టిలో చదువుకు ఉన్నంత ప్రాముఖ్యం, ప్రాధాన్యం, స్త్రీ గుణగణాలకీ మనస్తత్వానికీ లేదంటారా."

"అర్ధాంగిగా స్త్రీ మనస్తత్వమూ, గుణగణాలూ ఎంతో మంచివే కావచ్చు. భర్త మనస్తత్వానికి అనుగుణ్యంగా ప్రవర్తిస్తూ, గృహధర్మాలు పాటిస్తూ, పిల్లల్ని, కని పెంచి పోషిస్తూ ఉండొచ్చు. కాని చదువుకున్న భార్యకు అలాంటి నిరక్షరకుక్షి సాటిరాదు. సానపడితేనే వజ్రం ప్రకాశించేది. రాణించిన తన సహజ సౌందర్యంచేత మరులు గొల్పి మత్తెక్కించేది. సానపట్టని వజ్రం ఎంత కాంతివంతమైనదయినా వెలవెలపోతూనే ఉంటుంది. అట్లాగే చదువుకున్నభార్య అందాలూ, అలంకారాలూ వేరు. వాళ్ళ భావప్రకటన, మాటలతీరు అందంగా ఉంటాయి. ఆ మాటల్లో తెలివితేటలు గుబాళిస్తయ్యి. ఆ అందం ఆకర్షణీయంగా

అనుభవ యోగ్యంగా ఉంటుంది. అలాంటిస్త్రీనే నేను కాంక్షించి వాంఛించేది. అలాంటి భార్యనే నేను గౌరవించేది. నువ్వు సౌందర్యవంతురాలివీ, సంస్కారవంతురాలివీ, తెలివికలదానివీ అయినా కనీసంస్కూల్ ఫైనలయినా పాసవలేదు. నువ్వు సానపట్టని వజ్రానివి. ఆ వజ్రకాంతులు వెలికిరావాలంటే పట్టభద్రురాలివి కావాలి. నువ్వు ఆ పరిస్థితిలోకి రావటానికి అయిదారేళ్లు కావచ్చు. వేచి ఉండటానికి నేను సంసిద్ధుడినే" అన్నాడు బావ.

అక్కయ్య మాట్లాడలేక కన్నీరు పెట్టుకుంది. బావ చక్కగా మాట్లాడుతున్నాడు. కాని ఫలితంశూన్యం. తన ఉద్దేశం బావ అపార్థం చేసుకున్నాడేమో అనుకుంది. అర్థం చేసుకున్నా, అపార్థం చేసుకున్నా భర్తవద్ద మనస్సువిప్పి మాటలాట్టంలో తప్పేముంది?

"మీ మనస్సులో ఉన్నా అభిప్రాయాల్ని చక్కగా బయటపెట్టారు. ఇంత మనోనిబ్బరం కలవారూ, అభిప్రాయాలకూ, ఆలోచనలకూ ఒక రూపాన్నిచ్చి వాటిని ఆరాధించేవారూనని తెల్సుకున్నందుకు చాలా సంతోషపడుతున్నాను. మీరు నా భర్తకావటం నిజంగా నా అదృష్టం. కాని నా అదృష్టం మీకు దురదృష్టరూపంలో సాక్షాత్కరించింది. చదువు లేని భార్యను" అన్నది అక్కయ్య.

ఈ మాటలకు బావకు ఎంతో నవ్వు వొచ్చింది. కాని నవ్వితే తన పట్టుదల సడుల్తుందేమోనని ఆ నవ్వును పైకి రానివ్వలేదు. భార్యనేకాక తన నవ్వునికూడా శాసించగల నేర్పరి మా బావ.

"నీకు మనోనిబ్బరం కలగటంలేదు వేదవతీ, భర్త పొందుకే ప్రాధాన్యం ఇస్తున్నావా" వెటకారంగానే అన్నాడు బావ.

"నా మనోనిబ్బరాన్ని మీరు శంకించనక్కర్లేదు. ఆ ధైర్యం, పట్టుదల నాలో ఉందని మీకు నమ్మకమే కనుక నన్ను పెళ్ళాడింతరువాత కైకమ్మలా వరాలు కోరకుండా తాళికట్టినభర్త కనుక ఆంక్ష విధించారు. కాని ఇటువంటి అభిప్రాయాలు పుస్తకాల్లోనే ఎక్కువ సాక్షాత్కరిస్తాయి. చదివేఅభిప్రాయాలకూ,ఆచరణపెట్టేఅభిప్రాయాలకూచాలాచోట్ల సందర్భపడదు. మనఉద్దేశ్యాలుమంచివయినా, ఆచరణ సాధ్యంకాదని నా అభి

ప్రాయం. నేను పట్టభద్రురాల్ని కావాలని అన్నారు. చాలా సంతోషం, పరిస్థితులూ, సంఘంలోని వారూ, మనల్ని అధికంగా విమర్శిస్తున్నప్పుడు, వారి దృష్టిలో మనం నగుబాట్లు అవుతుంటే, నేను పుస్తకాలు పుచ్చుకుని ఏళ్ళతరబడి కాలేజికి పోతుంటే అది అందరూ హర్షించవద్దా చెప్పండి. నా కాపురం నేను తీర్చి దిద్దుకోటానికీ, మీకు సేవచేస్తూ సంతోషపెట్టటానికి నేను పట్టభద్రురాల్ని కానక్కరలేదేమో!" అన్నది వేదవతి.

అక్కయ్య పట్టుదలగా సమయస్ఫూర్తిగా మాటలాడుతుందని బావ అనుకోలేదు. తన మాటను మన్నించి చదువులో ప్రవేశించిన అక్కయ్య తన భావాలకు దాసురాలయిపోయిందనే భావించాడు బావ. ఇప్పుడు అక్కయ్య ఈ తీరుగా మాటలాడుతుంటే నా భార్య నాకు ఎదురు చెప్తుందా అనే పట్టుదల ఆయన మనస్సులో ప్రవేశించినా అక్కయ్య విమర్శనాశక్తికి మనస్సులో సంతోషంగానే ఉన్నది. కాని భరింపబడేది భార్య. భరించేది భర్త. ఈ తారతమ్యాన్ని మనస్సులో నిల్పుకుని తన పట్టుదలకే అలంకారం చెయ్యసాగాడు.

"నా భార్యకు నేను చదువు చెప్పించుకుంటున్నాను. ఇంపుడు కత్తెకు కాదు. ఈ సాధారణ విషయాన్ని ఎవరో సమస్యగా చిత్రిస్తే వార్ని చూసి భయపడి నగుబాట్లయిందని నీకు నువ్వే అనుకోటం సబబుగా లేదు వేదవతీ" అన్నాడు బావ.

అక్కయ్యకు కాస్త ధైర్యం వచ్చింది. కాని మనస్సులోని మాట చెప్పటానికి సిగ్గు అడ్డుకున్నది.

"స్త్రీ, పురుషులకు సమాన హక్కులు కావాలనీ, పురుషుడితో బాటుగా స్త్రీకూడా చదువుకుని, పురుషుడిమాదిరిగా అన్నిరంగాలలోనూ పనిచేసి పేరు ప్రతిష్ఠలు సంపాదించాలనీ ఎన్నోఏళ్ళనుంచీ అంటున్నాడు. ఆచరణలోకీ వచ్చింది. వృత్తి ఉద్యోగాల్లోకాని, విద్యాలయాల్లో కాని ఈనాడు అనేకమందిస్త్రీలు ఉద్యోగాలు చేస్తూ కనిపిస్తారు. పాతికసంవత్సరాలనాటికన్న ఈనాడు స్త్రీ విద్య, స్త్రీల ఉద్యోగాలూ ఎంతో ఉన్నత స్థితిలో ఉన్నది. ఇలాంటి వాతావరణంలో ఉంటూ నువ్వు చదువుకోననటం ఏం బావుండలేదు" అన్నాడు బావ.

అక్కయ్యకు నవ్వువచ్చింది. కాని నవ్వలేదు. "నేను చెప్పేది ఒకటి మీరు అర్థంచేసుకున్నది మరొకటి. నేను చదువుకోనని అనటం లేదు. పెళ్ళిచేసుకోకుండా నేను చదువుకుంటే లోకం హర్షిస్తుంది. పెళ్ళయి కాపురం చేస్తూ చదువుకుంటున్నవాళ్ళూ ఉన్నారు. కాని అది ఎబ్బెట్టుగానే ఉంటుంది. వివాహితస్త్రీ కొంతవరకూ చదువుకుని ఉద్యోగం చేస్తూ ఉద్యోగాభివృద్ధికోసం పై పరీక్షలకు చదువుకునేవాళ్ళు అనేక మంది ఉన్నారు. అలాంటివారు పిల్లలు, తల్లులూ ఉన్నారు. ఆ చదువుకు అవసరమూ, రాణింపూ వున్నాయి. కాని, ఈ తరుణంలో మనం ఈ రీతిగా విద్యార్థుల్లా ప్రవర్తిస్తుంటే చూసేవాళ్ళకు సమస్యగానే ఉన్నది.మనం అంటీ ముట్టనట్లు ఉంటున్నా మనచుట్టుపక్కలవాళ్ల మనల్ని నమ్మరు. కాపురం చేస్తున్నవాళ్లేనని అనుకుంటారు. పోనీ ఆ ప్రస్తావన అలా ఉంచండి. చదువుకున్న స్త్రీనే కాంక్షిస్తాననీ, వాంఛిస్తాననీ, గౌరవిస్తా ననీ అన్నారు. నాకు చదువు అబ్బదనుకోండి. అప్పుడు నన్ను ప్రేమగా చూడరా."

అన్నది అక్కయ్య. బావ సమాధానమేమిటోనని ఆదుర్దాగా చూసింది. బావముఖం కందగడ్డ అయింది. ఇంతనూటిగా వేదవతికి ఈ ప్రశ్న వేస్తుందని బావ ఆశించలేదు.

"వేదవతీ! అడగవలసినప్రశ్న అడిగావు. చదువూ, సంస్కారమూ ఉన్న స్త్రీకి, పట్టభద్రురాలయిన స్త్రీకి నా మనస్సు అర్పిస్తాను. నా హృదయంలో అలాంటి స్త్రీకే స్థానం ఉంటుంది. అలాంటి స్త్రీనే ప్రేమిస్తాను. ఒకవేళ నువ్వు చదువుకోలేక, చదువుయందు దృష్టిపోక, సంసారజీవితాన్నే గడపదల్చుకుంటావనుకో. అలాంటి పరిస్థితులే ఏర్పడితే...."

"ఏర్పడితే...." ఆదుర్దాగా అడిగింది అక్కయ్య.

"ఎవరిదారి వాళ్ళదే. నిర్భయంగా విడాకులు పుచ్చుకోవచ్చు" అన్నాడు బావ.

అక్కయ్య కుప్పన కూలిపోయింది.

ఆ మర్నాడు అక్కయ్య బావతో అన్నది.

"మీరు చెప్పినట్లే చదువుకుంటాను. మీనుంచి ఏమీ కాంక్షించను. పెళ్ళికాని వేదవతిగానే చదువుకుంటాను, కాని ఒక్కకోరిక తీర్చాలి."

"ఏమిటది" సౌమ్యంగానే అడిగాడు బావ.

"మనం కాపురంచేసే దంపతుల్లానే నటించాలి. మీతో బీచికీ, సినిమాలకూ తీసుకు వెళ్ళండి. షాపింగ్‌కూ వెళదాం. ఈ రకంగా చిలకా, గోరువంకల్లా నలుగురిదృష్టిలో పడితే మనదాంపత్యానికీ, నా చదువుకూ గౌరవం ఉంటుంది. ఈ మాత్రం నాకు సహాయపడినందువల్ల నా వ్యక్తిత్వానికి ఎంతో గౌరవం ఉంటుంది. మీ వ్యక్తిత్వానికి ఏమీ అగౌరవం కలగదనుకుంటాను" అన్నది అక్కయ్య.

పెళ్ళాడిన భర్తతో కలిసిమెలిసి ఉంటానికి పరాయిదానిలా అర్థించి అడుగవలసి వచ్చింది. చదువులో బావ ఎంత తెలివికలవాడో వట్టిదల లోనూ అంతే. బి. కాం ఫస్టుక్లాసులో ఎక్కువమార్కులతో పాసయాడు. విద్యార్థిలోకంలో బావకు ఎంతో గౌరవం వున్నది. పేరు ప్రతిష్ఠలూ ఉన్నయ్యి. బావ ఎమ్. కాం ఫైనలియర్ చదువుతున్నాడు. కాని అక్కయ్య పాలిట యమధర్మరాజు. ఎంత చిన్నవిషయమైనా ఆయనను అర్థించి అడగవలసిన వాతావరణాన్ని ఏర్పరిచాడు బావ.

ఈ విషయాలన్నీ అత్తయ్యతో చెప్పింది అక్కయ్య. ఆవిడ కుప్పగా కూలిపోయింది. ఉన్న ఒక్కకొడుకూ ఈ రీతిగా ఇంత రణ పెంకెగా మార్తాడని ఆవిడ అనుకోలేదు.

"నువ్వు నా కోడలువైనందుకు ఆనాడు ఎంతో ఆనందించాను వేదవతీ, కాని ఈ పరిస్థితులన్నీ తెల్సుకున్నాక నీకన్న ఎక్కువగా మనఃక్లేశాన్ని అనుభవిస్తున్నాను" అన్నది అత్తయ్య.

ఆరోజు రాత్రి అత్తయ్య బావతోఅన్నది.

"ఎందుకురా ఆ పిల్లని అలా బాధపెడతావ్, కాపురం చెయ్యటం ఇష్టంలేదా."

అక్కయ్య విషయంలో కటువుగా మాట్లాడే బావ తల్లితో ఎంతో సౌమ్యంగా సమాధానం చెప్తాడు. కాని ఫలితం ఒకటే.

"కోడలు చదువుకోవటం నీకు ఇష్టంలేదా అమ్మా."

"ఇష్టమే. భార్యను చదివించటానికి ఇన్ని కట్టుబాట్లు అవసరం లేదేమో."

"కట్టుబాటు ఉంటేనే చదువు వస్తుందమ్మా. ఈ విషయంలో తల్లిగా నీ గౌరవం నువ్వు కాపాడుకుంటే కొడుకుగా నా గౌరవం నేను కాపాడుకోటానికి వీలవుతుంది. మా కాపురాన్ని రచ్చకెక్కించి నా కొడుకు కోడలితో కాపురం చెయ్యటంలేదని పదిమందికీ చెప్పకుండా ఉండటమే పదివేలు. ఈ సహాయాన్ని సవినయంగా నీనుంచి కోరుతున్నానమ్మా" అని తల్లి చేతులు పుచ్చుకుని అడిగాడు బావ.

అత్తయ్య మాట్లాడకుండా వెళ్ళింది. ఇంకా తర్కిస్తే తన పెద్దరికం కొడుకు చేతిలో అపఖ్యాతి పాలవుతుందని ఆవిడకూ తెలుసు.

మనం ఆశించి ప్రయత్నించి విఫలమైన ప్రతివిషయంలోనూ నిరాశతోపాటు కర్మసిద్ధాంతాన్నికూడా వెంట తెచ్చుకుంటాం. మనం తీసుకు రాకపోయినా ఆ కర్మ సిద్ధాంతం మనకు తెలియకుండానే అంటి పెట్టుకుని ఉంటుంది.

"గత జన్మలో ఏ దంపతులనో కొంతకాలం విడదీశావ్ వేదవతీ. ఆ పాపఫలమే ఇప్పుడు అనుభవిస్తున్నావ్" అన్నది అత్తయ్య.

ఈ సంఘటనతో అత్తయ్య రాయబారమూ వీగిపోయింది.

మరోవారం గడిచింది. అక్కయ్య బావతో ఏదో కల్పించుకుని మాట్లాడేది. బావకూడా ముక్తసరిగా సమాధానం చెప్పేవాడు. ఆరోజున బావను అక్కయ్య అడిగింది.

"ఇవాళ సినిమాకు వెళదామంటారా."

ఈ విషయంలో అత్తయ్య ప్రోద్బలమూ ఉన్నది. అందుచేత అక్కయ్య ధైర్యంగానే అడిగింది.

"సినిమా చూడాలనే కోరిక ఉంటే అమ్మా, నువ్వూ వెళ్లండి. భర్తతో సినిమాకు వెళ్ళాలనే వాంఛ ఉంటే నేను కాస్త ఆలోచించుకోవాలి" అన్నాడు బావ. అక్కయ్య కొంత జంకింది. కాని ధైర్యంగానే చూస్తూ అన్నది.

"మీతో సినిమాకు వెళ్ళాలనే నా కోరిక. మీకు తగిన భార్యననే తీరుగానే మసులుకుంటాను. నా కోరిక మన్నించండి" అన్నది

"అర్ధసంవత్సరం పరీక్షలు వారంరోజుల్లో జరగబోతున్నయ్యి. శలవుల్లో వెళదాం. పరీక్షలకు బాగా చదవాలి." పుస్తకంలో తలదూర్చి అక్కయ్యవైపు చూడకుండానే అన్నాడు బావ.

"నా గమ్యస్థానం చదువులోనూ, జీవితంలోనూ పూర్తిగానే అర్థం చేసుకున్నాను. మీతో ఒక్కసారి సినిమాకు వెళ్ళినందువల్ల కలిగే ఆనందంతో ఇంకోపాతికమార్కులు ప్రతి సబ్జక్టులో ఎక్కువే తెచ్చుకో గలను."

బావ పుస్తకం మూసేశాడు. అత్తయ్య పక్కగదిలోకూర్చుని కొడుకు మనస్సు మార్చమని భగవంతుని ప్రార్థిస్తూన్నది.

"నాలుగుసార్లు సినిమాకు నాతోవస్తే వందమార్కులు ఎక్కువ వస్తయ్యా, నాలుగుపోన్లు బలుస్తావేమో" బావముఖం ఎర్రబడింది. అక్కయ్య మనస్సు జావకారిపోయింది. ఖిన్నురాలై తలవంచుకుని వెళ్ళబోయింది.

"వేదవతీ "

వెనక్కు తిరిగిచూసింది. కన్నీటిబొట్లు ఏ క్షణానైనా రాలవచ్చు.

"మొదటిఆటకు వెళదాం. నాకేమీ అభ్యంతరంలేదు. ఏ సినిమాకు వెళదాం."

"మీ ఇష్టం" కన్నీటిబొట్లు ఆనందబాష్పాలుగా మారాయి.

ఇద్దరూ సినిమాకు వెళుతుంటే అత్తయ్య ముఖంలో వెయ్యి దీప కళికల కాంతిని చూసింది అక్కయ్య.

సినిమా చూస్తున్నారు. ఉన్నట్లుండి బావ వెలుపలికి వెళ్ళి పదినిమిషాలు గడిచాక వచ్చాడు. ఇంటర్‌వల్‌లో అక్కయ్య అడిగింది.

"ఎక్కడికి వెళ్ళారు. సినిమా చూస్తూనే వెళ్ళిపోయారేం" బిస్కట్లు, కాఫీ వచ్చాయి. ఇద్దరూ బిస్కట్లుతిని కాఫీ తాగారు. బావ సమాధానం చెప్పలేదు, పిక్చరు మొదలుపెట్టారు.

"బిస్కట్లూ, కాఫీ ఇచ్చినా నేను మర్చిపోలేదు" నెమ్మదిగానే అన్నది.

"సినిమా చూడు."

సినిమా వదిలారు. ఇద్దరూ రిక్షా ఎక్కారు.

"నీ ప్రశ్నకు సమాధానం చెప్పాలికదా" బావ అన్నాడు.

"ఇంతఆలోచించుకుంటారని నాకు తోచలేదు"అన్నదిఅక్కయ్య. బావ సమాధానం చెప్పలేదు.

ఇంటివద్ద రిక్షాదిగారు. రిక్షా వెళ్ళింది. ఇంట్లోకి వచ్చారు.

"వేదవతీ! హద్దుమీరి మాట్లాడుతున్నావ్. కాస్త వళ్ళు దగ్గిరుంచుకుంటే బావుంటుంది."

అక్కయ్య మాట్లాడలేదు. మరోవారం గడిచింది. అర్ధసంవత్సరం పరీక్షలకు ఇద్దరూ చదువుతున్నారు.

బావ ఆదుర్దాగా పుస్తకాలబీరువా, టేబిల్ సొరుగులు, బట్టల బీరువా అన్నిచోట్లా హడావుడిగా వెతుకుతున్నాడు. అక్కయ్యతో ఆ వెతికే వస్తువ ఏమిటో చెప్పనేలేదు. అక్కయ్య అడగలేదు. రెండు గంటలు గడిచాక అక్కయ్యను అడిగాడు.

"ఏదయినా బట్టల బిల్లు చూశావా."

"ఎవరికి కొన్నారు. కొన్నవాళ్ళకు ఆ బిల్లు ఇవ్వాలా" అన్నది అక్కయ్య. బావ కోపంతో అక్కయ్య తహతహలాడింది. చెంపలు

వాయించటానికి చెయ్యి పైకి ఎత్తాడు. అక్కయ్యను ఇవతలికి లాగింది అత్తయ్య. బావకోపాన్ని మింగి కడుపునింపుకుని ఆపూట భోజనం చెయ్యకుండానే వెళ్ళిపోయాడు.

రాత్రి తొమ్మిది దాటాక వచ్చినబావకు ఆ బట్టలబిల్లు ఇచ్చింది అక్కయ్య. ఆ బిల్లులో నాలుగువాయిల్ చీరెలూ, రెండు సిల్కుచీరెలూ, ఆరుచోళీగుడ్డలు, నాలుగులంగాలు రాసి ఉన్నయ్యి. మొత్తం బిల్లు నాలుగు వందలకు పైగానే ఉన్నది. బిల్లుమీద బావపేరే ఉన్నది.

"ఎక్కడ దొరికిందీ బిల్లు" మామూలుగానే అడిగాడు.

"మూలపారేసిన జేబుగుడ్డ ఉతకటానికి తీస్తే దాంట్లో మడతగా ఉన్నది." అన్నది అక్కయ్య.

అక్కయ్య చేతులోనుంచి బిల్లు తీసుకుని గదిలోకి వెళ్ళిపోయాడు బావ.

"చీరెలపొట్లాం షాపులోనే మర్చిపోయారా, బిల్లు చూపించి రేపు పట్రండి. అయినా ఒక్కసారి అన్ని చీరెలు కొన్నారేం" గదిలోకి వెళ్ళి అన్నది అక్కయ్య.

ఒక్కనిమిషం తలవంచుకునే కళ్ళుపైకెత్తి అక్కయ్యవైపు చూశాడు బావ.

"నువ్వు భోజనం చెయ్యలేదల్లే ఉంది. పొద్దునకూడా తినలేదా" అన్నాడు.

"మీకు బిల్లు కనబడలేదని కోపంవచ్చి వెళ్ళిపోయారు. మీరు భోజనం చెయ్యకపోతే నాకు మాత్రం ఎలా తినబుద్ధి అవుతుంది. రండి, ఈపూటయినా ఇద్దరం భోజనం చేద్దాం" చెయ్యిపుచ్చుకోబోయి వెనక్కుతగ్గింది.

"మరీ పతివ్రతవై పోతున్నావ్, మగవాణ్ణి నేను ఎక్కడోక్కడ కడుపు నింపుకుంటాను. నువ్వు, అన్నం మానేస్తే చదువు దానంతట అదే చెట్టెక్కుతుంది" అన్నాడు. ముఖాన నవ్వు రంగు పులుముకున్నా, దాని వెనక ఏదో ఆదుర్దా, కాస్త బంగారున్నూ అక్కయ్య గ్రహించింది.

"నేనెంత, నా పాతివ్రత్యం ఎంత. భర్త అనౌచిత్యపు పనులు భార్య సహించి ఉండటానికి పాతివ్రత్యం అనే ముద్రవేశారు" అని గదిలోనుంచి రాబోయింది.

"ఆగు, అంటే నీ ఉద్దేశ్యం" గద్దించి అడిగాడు.

"ఆ చీరెల బిల్లునే అడగండి."

తన ఎడం చేతితో అక్కయ్య కుడిచెయ్యి గట్టిగా పుచ్చుకుని.

"నా వుంపుడుకత్తెకు కొన్నాను. సరేనా, ఇకవెళ్ళు. నాకు భోజనం అక్కరలేదు." అక్కయ్యను ఒక్కనెట్టు నెట్టాడు. గది తలుపు మీద పడ్డది. దెబ్బ తగల్లేదు. తలుపుకు ఉన్న సానుభూతి అక్కయ్యమీద బావకు లేదు. అత్తయ్య వచ్చింది.

"చూడు బాబూ! మాయిద్దరికీ ఇంత విషంఇచ్చి ఆ చీరెల బిల్లు తీసుకుని ఉంపుడుకత్తె ఇంటికి వెళ్ళు! కట్టుకున్న భార్య కళ్ళముందు కని పిస్తుంటే నీకు కళ్ళుపోయి కోపతాపాలు ఒలకబోస్తున్నావు. ఉంపుడు కత్తెకు చీరెలు కావాలిగాని చీరె బిల్లు కాదురా! ఆ చీరెలు అప్పుడే దాని కొంపకు చేరాయి. భార్యచేతికి బిల్లు వచ్చినందుకు పాపం! నీ మనస్సు పాడైపోయింది. ఛీ! పశువా!" అని అక్కయ్యని తీసుకుని అవతలి గదిలోకి వెళ్ళిపోయింది. గదితలుపు వేసుకున్నాడు బావ.

ఆరాత్రి తెల్లవార్లూ అక్కయ్యకు కన్నీరే శరణ్యమైంది. దాని మనస్సులో ఆవేదన, నిరాశ, నిస్పృహ నివాసమేర్పరచుకున్నాయి. మర్నాటినుంచీ బావను చూట్టానికే భయపడింది. బావ ఎదుట పడితే కళ్ళనీళ్ళు పెట్టుకుని ప్రక్కకు తప్పుకుని పోయేది. అప్పట్నుంచీ చదువుయందు మనస్సుని ఎంత నిలుపుకుందామనుకున్నా పుస్తకంలో అక్షరాలు అలుక్కుపోయినట్లుగా కనిపించేవి. పాఠాలు చదువుతున్నా బుర్రకెక్కేవికావు. పుస్తకాలు తెరిస్తే బావమాటలూ, బావ అభిప్రాయాలూ, మనస్సులో హృదయంలో మెదిలేవి. ఈ స్థితిలోకి వచ్చిన

బావ బాగా చదువుకున్న ఏ యువతినో చేకరదీశాడని ఊహించుకున్నది అక్కాయ్య. ఈ స్థితిలో తను చదువుకోకపోతే, పరీక్షలు వ్రాసయి పట్టభద్రురాలు కాకపోతే ఇంక తనకు విడాకులే శరణ్యమా! అనుకుని కుమిలిపోయేది. ఇరవై నాలుగ్గంటలూ అదే ఆలోచన, అదేదిగులు. కళ్ళు మూసుకుని పడుకుని అక్కాయ్య ఆలోచించేదిట. ఆడదాని జీవితంలో కాపురానికి వెళ్ళింతరువాత అత్త ఆడబిడ్డలచేత కొంతవరకూ కోడరికం పడవచ్చు. అదీ కొంత లోకసహజమే. భర్తతిరస్కృతిలోనూ, చివాట్లతోనూ కాలం వెళ్ళబుచ్చటం కొందరి జీవితాల్లో ఉన్నదే. కట్నకానుకలదగ్గర పేచీలువచ్చి భార్యను పుట్టింటిలో వదిలిపెట్టే మగధీరులూ ఉన్నారు. అన్నింటినీమించి భార్యను వదిలి పెట్టినవారూ ఎందరో ఉన్నారు. కాని తన జీవితంలో ఈ పాపం ఏమిటి? ఈ పట్టుదల, ఈ అభిప్రాయాలూ, ఉద్దేశ్యాలూ ఏమిటి ?

భార్య పట్టభద్రురాలయితేనే తన మనస్సుని అర్పించి ప్రేమిస్తారా? ఆమెతో కాపురం చేస్తారా? అంతవరకూ తమకు ఈ ఎడబాటు ఉండవలసిందేనా? అవతలగదిలో కట్టుకున్న భర్త, పక్కగదిలో మానసిక సంక్షోభ ననుభవిస్తూ తను, ఎంతకాలం ఇట్లా జైలు జీవితంలా జీవితం గడపాలి ? మనస్సులోని కోరికలనూ, ఆకాంక్షలనూ చంపుకుని మోడులా జీవించటమేకాక, భర్త పరస్త్రీలతో తన కోరిక తీర్చుకుంటూ ఉంటే హర్షించికూడా నోరెత్తటానికి వీలులేదా! ఈ పరిస్థితుల్లో నామీద వారికి ప్రేమలేదు. కోరికలేదు. కాంక్షలేదు. అనుభవించాలనే ఉద్దేశ్యమూలేదు. అన్ని కాంక్షలూ, కోరికలూ, అనుభూతీ, అనుభవాలూ చదువుకూ, డిగ్రీకీ, కాలేజీ జీవితానికీ అంకితం చేశారు. భార్యకు ఏమీ మిగల్చలేదు. వారి దృష్టిలో అందచందాలకీ, గుణగణాలకీ ఆప్యాయంగా మనసిచ్చి మాట్లాడి, వలచి వలపించుకోటానికి తావులేదు. పట్టభద్రురాలే ప్రేమించటానికి అర్హురాలు. సంసార జీవితం గడపటానికి యోగ్యురాలు. తమ భార్యను చెప్పుకోటానికి తగిన విద్యావతి, వారు చెప్పినట్లుగానే తనమీద వారికి ఏమీలేదు. అందుచేతనే పక్కగదిలో తను

పడుకున్నా కన్నెత్తి చూడలేదు. నోరువిప్పి మాట్లాడలేదు. అనురాగమూ అంతఃకరణా ఉన్న ఏ భర్తా ఈ రీతిగా ఊరుకోరు.

అక్కయ్య ప్రతిరోజూ అట్లాగే ఆలోచిస్తూ కన్నీటినే తనకు తోడుగా చేసుకుని, ఆకన్నీటిలోనే కరిగిపోయేది.

డిశంబరులో అర్ధసంవత్సరం పరీక్షలయి శలవులిచ్చారు. ఒక రోజున బావ ఇంటికి రాలేదు. అత్తయ్య మనస్సు ఏనాడో విరిగి పోయింది. ఆవిడ ఏం మాట్లాడకుండానే నిద్రపోయింది. ఆరాత్రి అక్కయ్యకు జాగరణ. పరిపరివిధాల తల్చుకుని కృంగిపోయింది. మర్నాడు బావ వచ్చారు.

"రాత్రి ఇంటికిరాలేదు ఎక్కడికి వెళ్ళారు" అన్నది అక్కయ్య.

"చీరెల బిల్లు వాళ్ళింటికి వెళ్ళాను."

"ఎవరా అమ్మాయి."

"నా సహాధ్యాయిని కామేశ్వరి, ఆ అమ్మాయి నా ప్రియురాలు, అర్థమైందికదూ."

మొట్టమొదటిసారిగా బావమీద జుగుప్స కలిగింది అక్కయ్యకు. కోపమూ, నిస్సహాయత ఉక్కిరిబిక్కిరి చేశాయి.

"ఆఅమ్మాయినే పెళ్ళిచేసుకుంటే బావుండేదేమో. పెళ్ళి నాతో, కాపురం ఆ అమ్మాయితో. ఎందుకు."

"ఈ ప్రశ్న అడిగే యోగ్యత ప్రస్తుతం నీకులేదు. నువ్వు బి. ఏ. పాసయ్యాకనే" అన్నాడు బావ.

"ఎవరా కామేశ్వరి. వాళ్ళఇల్లెక్కడ."

"మేం ఇంటిలో ఉండం. హోటల్లో ఉంటాం. పిచ్చిప్రశ్నలు మాని చదువుకో. నువ్వు బి. ఏ. పాసయిన మొదటి రోజునే మన ప్రణయ సమాగం" అన్నాడు బావ.

ఇంతవరకూ చెప్పి కళ్ళు తుడుచుకుంది రాధ. ఆసక్తిగా వింటున్న ధనలక్ష్మి ఒక్కనిట్టూర్పు విడిచి వంటింట్లోకి వెళ్ళి అప్పుడే తల్లిచేసిన ఉప్మా, కాఫీ తెచ్చింది.

ఇద్దరూ కాఫీ, ఫలహారం పూర్తిచేశారు. "నలుగురు పెద్దమనుషులతోనూ చెప్పి మీ బావకు ఇంతగడ్డి పెట్టించక పోయారా" అన్నది ధనలక్ష్మి.

"అన్నింటికీ తెగించి తమంతట తాముగా గడ్డితినేవాళ్ళకు ఇతరుల గడ్డి సయించదు. ఆ గడ్డిలో విటమిన్లు లేవంటారు, తాము తినే గడ్డిలో ఎ-టు-జడ్ వరకూ విటమిన్లు ఉన్నయ్యంటారు" అన్నది రాధ పేలవంగా నవ్వుతూ.

"మీ అక్కయ్యలో చాలా మెతకతనమూ ఉన్నది. గడుసుతనం పాలు చాలా తక్కువ" అన్నది ధనలక్ష్మి.

"గడుసుతనం ఉంటే కాపురం బాగుపడకపోగా అక్కయ్య పుట్టింటికి చేరవలసి వచ్చేది. ఆ పరిస్థితికి రావటానికి ఇష్టంలేదు" అన్నది రాధ.

రాధ మళ్ళీ చెప్పసాగింది.

"కామేశ్వరితో ప్రణయం ప్రారంభించినప్పట్నుంచీ బావ పూర్తిగా అక్కయ్యను మర్చిపోయాడు. వేదవతి తనభార్య అనికూడా ఆయనకు గుర్తుండటం లేదు. అక్కయ్యను తమ ఇంట్లో ఉంటూ చదువు కునే ఒక అనాధ స్త్రీగా చూడసాగాడు. అంతకుమినహా అక్కయ్యమీద బావకు ఏ అభిప్రాయమూ లేదు. ఏ కోరికాలేదు. పలకరించటంకూడా మానేశాడు. ఈ పరిస్థితిలో అక్కయ్య పరిస్థితి మరీఅధ్వాన్నమయింది. అత్తయ్య ఎంతమొత్తుకున్నా బావ చెవిని పట్టించుకోలేదు.

బావమనస్సులో ఒక్కటే అభిప్రాయం. చదువుకున్న స్త్రీ అయితేనే ఆయనకు మోజు. గుణగణాలతో, మానమర్యాదలతో, సాంప్రదాయాలతో ఆయనకు నిమిత్తంలేదు. విద్యావతి అయిన స్త్రీనే ఆయన కోరుకున్నారు. అప్పటికి కామేశ్వరి బి-కాం ఫైనలియర్ చదువుతోంది. బావ ఎమ్. కాం మొదటి సంవత్సరం. వీరిద్దరికీ ఎలా జత కుదిరిందో తెలియదు.

ఒకరోజున అక్కయ్య కాలేజికి శలవు పెట్టింది. తను ఎక్కడికి వెళ్లేదీ అత్తయ్యతో చెప్పింది. మొదటకాదన్నా తరువాత సరేనన్నది అత్తయ్య. కాళ్ళకున్న మట్టెలు తీసింది. నల్లపూసలూ తీసింది. మంగళ సూత్రాలు కనబడకుండా లోపలగా వేసుకుంది. చక్కగా అలంకరించు కుంది. అచ్చగా పెళ్ళికాని యువతిగానే తయారయింది.

సాయంత్రం కాలేజి వదిలేవేళకు కామేశ్వరికాలేజివద్దకు వెళ్ళింది. కామేశ్వరి ఎవరో అక్కయ్యకు తెలీదు. ఆడపిల్లల వెయిటింగ్‌రూం వద్దకు వెళ్ళి కామేశ్వరి ఎవరో తెల్సుకుని ముఖపరిచయం చేసుకుంది. పేరుమార్చి చెప్పింది. సాయంత్రం కామేశ్వరితో వాళ్ళింటికి వెళ్ళింది. ఈ అపరిచయ యువతి ఆప్యాయంగా మాట్లాటంతో కామేశ్వరికూడా తన ఇంటికి తీసుకు వెళ్ళింది. ఇక్కడ అక్కయ్యపేరు సుమతి. తనగదిలో కూర్చోపెట్టి కాఫీ ఇచ్చింది కామేశ్వరి. ఇద్దరూ కబుర్లలోకి దిగారు.

"ఇవాళ మీకేమీ ఎంగేజ్‌మెంట్సు లేవుకద" అన్నది సుమతి.

"లేవు. ఇంతకూ మీపేరు సుమతి అని చెప్పారు కాని, నా నుంచి మీరు ఆశించేదేమిటో చెప్పలేదు" అన్నది.

"నే నెవరో మీకు తెలియకపోవచ్చు. కాని మీరు నాకు తెల్సు. మీరు సుబ్బారావుగార్నే ప్రేమించారా."

కామేశ్వరి అప్రతిభురాలై చూసింది.

"ఓహో, మీరు ప్రేమించారని చెప్పటానికి నా అభిప్రాయాన్ని తెల్సుకుంటున్నారా ?"

"అవునండీ, నేను వార్ని ప్రేమించాను, మీరు."

"ప్రేమిస్తే పెళ్ళిచేసుకోండి. నాకేమీ అభ్యంతరం లేదు. కాని ఆయనకు ఇదివరకే పెళ్లయింది. ఒక చదువురాని మొద్దు ఆయనభార్య." అన్నది కామేశ్వరి.

"అలాగా, ఆ సంగతి మీకు వారే చెప్పారా? మొద్దయినా, వివేక వంతురాలైనా ఆయనకు భార్య ఉన్నదికదా. ఇది తెల్సికూడా వారితో

మీరు సంబంధం ఏర్పర్చుకున్నారేం. ఆ చదువురాని మొద్దుకు తెల్సికూడా అన్యాయం చేస్తున్నారు. నేను నా ప్రేమను వదులుకుంటాను మీరు ఆయనతో సంబంధం వదులుకోండి. ఇద్దరం ఈ రీతిగానైనా ఆ చదువు రాని మొద్దుగారి కాపురాన్ని నిలబెడదాం."

కామేశ్వరికి కోపంవచ్చింది. కాని దిగమింగింది.

"నేను ఆయన్ని ప్రేమించలేదు. నేను ఆయన ఆర్థిక సహాయాన్ని అర్థించాను. అందుకు నేను ఆచరించేది తప్పయినా, నా ఆర్థిక పరిస్థితికి తలవంచి ఆయనకోరిక తీరుస్తున్నాను. ఇంక మీరు వెళ్ళండి. నా మనస్సు బావుండలేదు."

కుర్చీలోనుంచి లేచింది కామేశ్వరి. కామేశ్వరి చెయ్యి పుచ్చుకుని కూర్చోపెట్టింది అక్కయ్య.

"మీ ఆర్థిక పరిస్థితి మెరుగు పర్చుకోటానికి ఒక చదువురాని మొద్దుకు అన్యాయం చెయ్యటమే కాకుండా, పతితురాలయావు. శీలాన్ని సంపదగా మార్చుకునేకన్న, ఇంగితజ్ఞానాన్నీ, మేధస్సునీ, వినియోగించి మీ ఆర్థిక ఇబ్బందులను తీర్చుకునేమార్గం ఆలోచించండి, శలవు."

క్షణం కూర్చోకుండా పమిటెనిండుగా కప్పుకుని వచ్చేసింది అక్కయ్య. కామేశ్వరి ఏమనుకుందో అక్కయ్యకు తెలియదు.

రెండురోజులు గడిచాయి. బావ చాలా చిరాకుగా ఉంటున్నాడు. ఆ చిరాకు ఎందుకో అక్కయ్యకు తెల్సినా మాట్లాడలేదు. బావ పలకరించలేదు.

ఆరోజు రాత్రి అక్కయ్య లెక్కలు చేస్తూ ఒక లెక్కకు ఆన్సరు రాక బావను అడిగింది.

"ఈ లెక్కకు ఆన్సరు రావటంలేదు. చెప్తారా?"

"నీకు ఈ జన్మలో ఆన్సరురాదు. కేన్సరు వస్తుంది."

"దురదృష్టం నెత్తిన ఉంటే ఏదయినా వస్తుంది. కేన్సరు వచ్చిన వాళ్లెవరయినా కనుపించారా?"

పక్కనున్న కుర్చీలో పుస్తకాలుంచి అన్నది అక్కయ్య. ఆ పుస్తకాలు డ్రాయరుమీద పెట్టి అక్కయ్యను కుర్చీలో కూర్చోమన్నాడు బావ. అక్కయ్య కూర్చున్నది.

"నాకు తెలియకుండానే నన్నొక అమ్మాయి ప్రేమించింది. నిన్ననే ఈ సంగతి తెల్సింది" అన్నాడు బావ.

"ఎవరా చదువుకున్న అమ్మాయి. మీ ప్రియురాలు కామేశ్వరా" మనస్సులోని బాధను మభ్యపెట్టి అన్నది అక్కయ్య.

"కాదు, ఎవరో నాకూ తెలీదు. కాని నన్ను ప్రేమించానని కామేశ్వరితో చెప్పిందిట."

"బహుశా చదువుకున్న అమ్మాయే అయి ఉంటుంది. మీకు చదువుకున్నవాళ్ళంటే ప్రేమకదూ."

"అవును. ఆ అమ్మాయిపేరు సుమతిట."

"కనబడలేదని దిగులు పడుతున్నారా? ఈసారి ఇంటికే వచ్చేస్తుందిలెండి. పోనివ్వండి. అమ్మాయిసంగతి నాకెందుకు. నేనుకూడా కాస్త చదువుకుంటున్నానుకదూ, నామీద కాస్త ప్రేమ కలగలేదా, నేను అందమైనదాన్నని మీరుకూడా ఒకసారి వప్పుకున్నారు."

"అనవసరమైన వాగుడువాగక లెక్క చెప్పించుకో." పుస్తకం తీసి లెక్క చెప్పాడు. లెక్కను అర్థంచేసుకుంది అక్కయ్య.

"లెక్కతోపాటు మీ మనస్సుకూడా అర్థమైంది. భార్య ప్లస్ డిగ్రీ ఈజీక్వల్‌టూ ప్రేమ, భార్యమైనస్ చదువు ఈజీక్వల్‌టూ కోపం, మీరు మైనస్ కామేశ్వరి, డివైడెడ్‌బై నేను ప్లస్ చదువు ఈజీక్వల్‌టూ మన దాంపత్యం" అన్నది అక్కయ్య.

బావ విభ్రాంతితో చూశాడు. తనమీద అక్కయ్యకు ఎంత అనురాగం ఉన్నదో ఆయనకు తెలియకపోలేదు. కాని తన పట్టుదలనూ ఆంక్షలనూ అక్కయ్య ఎందుకు పాటించదో, ఎందుకు వినదో ఆయన ఘరొకసారి తననుతాను ప్రశ్నించుకున్నా, ఆ ప్రశ్నకు తనే సరైన

సమాధానం చెప్పుకున్నా అక్కయ్య అభిప్రాయాలకు తను విలువనిస్తే తన వ్యక్తిత్వం దెబ్బతింటుందేమోనని ఆయన కాస్త భయపడినట్లుగా అక్కయ్య గ్రహించింది. కాని కామేశ్వరిని చూసింతరువాత అక్కయ్య మనస్సు ఉడికిపోయింది. బావ మనస్తత్వమూ, కోపమూ అక్కయ్యకు బాగా అర్థమైనా తన కాపురాన్ని నిలబెట్టుకోవటానికి మరోసారి దెబ్బలు తినటానికికూడా సిద్ధపడింది.

"కామేశ్వరి · చదువుకున్న అమ్మాయేనా, అందమైనదా" అక్కయ్య ప్రశ్నించింది.

"అందమూ, చదువూ రెండూ ఉన్నయ్యి. నాకు పుష్కలంగా సంతృప్తినిస్తున్నది. నీ ప్రశ్నకు ఖచ్చితమైన సమాధానమే చెప్పాను" కోపంగా అన్నాడు బావ.

"మీకు ఇచ్చే సంతృప్తిలో కామేశ్వరికి పుష్కలంగా డబ్బు కని పిస్తున్నది. ఒక ఇల్లు రాసిస్తే ఆమెకు ఎంతో సంతృప్తిగా ఉంటుంది. ఒక్కసారి మీ జీవితాన్ని మీరే విమర్శించుకోండి. పదిమందిలో అప హాస్యం పాలవుతున్నారు. ఇంటి ఇల్లాలిని ఉసురు పెడుతున్నారు. నా చదువు పూర్తయ్యేవరకూ నాతో మీరు కాపురం చెయ్యొద్దు. ఇది మీ నిర్ణయమే. మీ నిర్ణయాన్ని శిరసావహిస్తాను. కాని కామేశ్వరి పొందు మానండి. ఈ ఒక్కకోరికా మన్నించరూ" అన్నది అక్కయ్య.

బావ కోపం తారాస్థాయికి వెళ్ళింది.

"నీకోసం అంతవరకూ ఎదురు చూస్తూ కూర్చోవలసిన అవసరం నాకేమీలేదు. నా స్వవిషయంలో నువ్వేమీ జోక్యం కలుగచేసుకోకు."

"మీ స్వవిషయమేకాదు. నా స్వవిషయమూను. భర్త పరకాంతల ఇళ్ళల్లో గడుపుతుంటే ...."

బావ అయిదువేళ్లూ అక్కయ్య చెంపమీద తేలాయి. తలదిమ్మెర పోయింది. కన్నీరు చెప్పనక్కర్లేదు. అక్కయ్యలో మొండిధైర్యం ప్రవే శించింది.

"నీతికి విలువనివ్వకుండా నైతికంగా పతనమైనవాళ్లు భార్యను కొట్టటమేకాదు. చంపటానిక్కూడా వెనకాడరు. భార్యపోయాక వాళ్ళకి మిగిలేది వెలయాలి చివాట్లు" అని అత్తయ్య దగ్గరకు వెళ్ళింది.

సంక్రాంతి శలవలు అయాక కాలేజి తెరిచారు. బావ అక్కయ్యతో మాట్లాడి పదిరోజులయింది.

కామేశ్వరి, బావ ప్రణయ కలాపాలు బజార్న పడ్డయ్యి. మామూలు పరిస్థితుల్లోనే అక్కయ్య కాలేజికి వెళుతుంటే అందరూ ఎగతాళి పట్టించి దుయ్యబట్టసాగారుకదా, ఈ పరిస్థితులు ఏర్పడ్డాక అక్కయ్యను చూసి నవ్వుకోటమూ, వెర్రిప్రశ్నలతో ఇంకా మనఃక్లేశం కలిగించటమూ, హేళనగా మాట్లాటమూ సాగించారు.

ఒకరోజున అక్కయ్య ట్యుటోరియల్ కాలేజీనుంచి వస్తుంటే అక్కయ్యముందునుంచి వెళుతున్న స్నేహితురాళ్లు ఇట్లా మాట్లాడుకో సాగారుట.

"మన వేదవతిసంగతి తెల్సిందా, ఆవిడగారి శ్రీవారేమో కామేశ్వరితో ప్రణయకలాపాలు మొదలుపెట్టారు. ఈవిడగారి ముఖమైనా ఆయనగారు చూడడట. కాకపోయినా వేదవతిలోకూడా ఏదో దోషం ఉంటుందనుంచే ఇలా ఉందేమో వాళ్లకాపురం" అని ఒకమ్మాయి అంటే, ఇంకో అమ్మాయి.

"కాదే, ఈవిడగారిదోవ ఈవిడది. చదువునెపంతో కాలేజీలో చేరటమేగాని ఏమయినా పాఠాలుగాని, నోట్సులుగాని రాస్తున్నదేమో చూడండి. అయ్యగారు కామేశ్వరి భక్తులయితే, అమ్మగారు మరెవరి భక్తులో" అన్నదిట.

ఈ మాటలు విని అక్కయ్య కుమిలి, కుమిలి ఏడ్చింది. మనస్సు ఈ రీతిగా పాడయిపోగా, ఇంక చదువేం బుర్రకెక్కుతుంది. ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని, తన విధివ్రాతను నిందించుకుంటూ ట్యుటోరియల్ కాలేజికి వస్తుండేది.

ఒకరోజున అత్తయ్యతో ఈ సంగతులన్నీ చెప్పి చదువు మానేస్తానని అన్నది. అత్తయ్య ఒప్పుకోలేదు. కొడుకు మంచిదారికి వచ్చి ప్రవర్తన బాగుపడాలంటే మనస్సులోకి ఈ విషయాలేవీ రానివ్వకుండా గుండె రాయి చేసుకుని చదువులోనే మనస్సు లగ్నం చేసుకుని, ఇంకా పెళ్ళి కాలేదనే భావంతో ఉండి చదువుకోమని సలహా ఇచ్చింది అత్తయ్య. కొడుకుతో వాదన పెట్టుకున్నందువల్ల అతను, ఇంకా రెచ్చిపోయి వేదవతిని వదిలేసి మరో పెళ్లి చేసుకుంటానని మొండిపట్టు పడతాడేమోనని భయపడింది అత్తయ్య. భార్య ఉండగా మరో పెళ్ళి చేసుకోటానికి చట్టం అంగీకరించకపోయినా, ఇలాంటి మొండివాడు ఎంతకయినా సాహసిస్తాడని అనుమానపడింది అత్తయ్య. తాత్కాలికంగా బావ కామేశ్వరి వల్లోపడ్డా ఏనాటికయినా తనతప్పు తెల్సుకుని అక్కయ్యతో కాపురం చేస్తాడని అత్తయ్య ఆశ, నమ్మకమూ.

ఈ విషయాలన్నీ చర్చించేందుకు అమ్మనూ, నాన్ననూ రమ్మని ఉత్తరం రాసింది అత్తయ్య. వాళ్ళతో నేనూ విశాఖపట్నం వెళ్ళాను.

పరిస్థితులన్నీ విని అమ్మా, నాన్నా కుమిలిపోయారు. మేనరికమనే నెపంతో అక్కయ్య గొంతు కోశామని ఏడ్చింది అమ్మ.

అక్కయ్య జీవితం ఈ రీతిగా దగ్ధమైపోతుందని ఎవ్వరూ కల్లోనైనా అనుకోలేదు. జీవితంలో తనకెట్లాగూ సుఖసంతోషాలు లేవనీ చదువులేని నెపంతో ఇన్ని అవమానాలూ, అగచాట్లూ పడుతున్నాననీ, నువ్వయినా పూర్తిగా చదువుకుని పట్టభద్రురాలవు కమ్మనీ అక్కయ్య నన్ను హెచ్చరించింది.

అక్కయ్య జీవిత చరిత్ర వింటూంటే బావంటే నాకు ఎంతో అసహ్యం కలిగింది. డిగ్రీలుగల స్త్రీమీద గల మోజుతో ప్రేమ, ఆదరాభిమానాలూ చూపే భార్యను నిరాదరణగాచూస్తూ అక్కయ్యను అంత హింసిస్తున్నారంటే ఇంతకన్నా నీచమైన ఘట్టం జీవితంలో ఇంకేదీలేదనిపించేది.

బావ కామేశ్వరితో ఏర్పర్చుకున్న సంబంధం తాత్కాలికమైనదా? లేక అక్కయ్యకు తిలోదకాలిచ్చి కామేశ్వరిని పెళ్ళిచేసుకుంటాడా అనే అనుమానం నాలో కలిగింది. కాని ఈ విషయం అక్కయ్యతో చెప్ప లేదు. చెపితే ఇంకా బాధపడుతుంది.

అక్కయ్యగారింట్లో ఉన్న నాలుగురోజుల్లోనూ బావ ప్రవర్తన కనిపెడుతూనే ఉన్నాను. బావకు అక్కయ్యమీద ఏమాత్రం ఇష్టంలేదు. ఒకరోజున బావను పలకరించాను. ఏం మాట్లాడాలో తెలియకపోయినా పలకరించాను.

"అక్కయ్య బాగా చదువుతున్నదా బావా" అన్నాను.

"దాని చదువుసంగతి దాన్నే అడుగు. నువ్వు బాగా చదువు తున్నావా రాధా."

"పల్లెటూరివాళ్ళం వానాకాలం చదువు."

"వానాకాలం చదువు మీ అక్కయ్యది. నువ్వు బాగా చదువుకుని బి. ఏ. క్లాసులో పాసవాలి."

"ప్రతి ఆడపిల్లా బి. ఏ. పాసవాలని మీకోరికా?"

"అవును, డిగ్రీవస్తేనేకాని పెళ్ళి చేసుకోకూడదు. నువ్వు పెళ్ళికి తొందరపడకు" ఆ నవ్వులో ఎగతాళి కనిపించింది.

"చదువుకున్న ఆడవాళ్ళంటే మీకు చాలా గౌరవమల్లే ఉంది."

"అవును, చదువుకున్న ఆడపిల్లల్లో మగవాళ్ళు ఆశించినంత సంస్కారం ఉంటుంది. చదువురాని ఆడదానిలో సంస్కారం మృగ్యం. వ్యక్తిత్వాన్ని భర్త పాదాలమీద వదిలేసి యాంత్రికంగా సంచరించి భర్తకు దాసులయిపోతారు. వారికి భర్తను కవ్వించి, నవ్వించే నేర్పు ఉండదు. ఇలాంటి సంసారంలో సంఘర్షణకుగాని, తర్కానికిగాని, అనేక విషయాలు తెల్సుకోటానికిగాని, పదిమందిలో సరదాగా ఆ భార్యా భర్తలు ఎడ్యుకేటెడ్ కపుల్‌గా సగర్వంగా అనిపించుకోటానికిగాని వీలుం డదు. చదువుకున్నభార్య సంసారజీవితంలో సుఖసంతోషాలకూ, సంతృ ప్తినీ కనిపించడమేగాక, సంఘంలోకూడా ఆదర్శప్రాయంగా ప్రవర్తించి

ఫలాని వారి భార్యగా తమకూ, తమభర్తకూ పేరుప్రతిష్ఠలు తేగలుగుతారు. అలాంటి దాంపత్యాన్నే నేను హర్షిస్తాను. కోరుకుంటాను. అందు చేతనే మీ అక్కయ్యను చదువులో ప్రవేశపెట్టాను. కాని, దానికి చదువు అబ్బేటట్లులేదు." అన్నాడు.

"అక్కయ్యచేత వుద్యోగం చేయిస్తావా?" అన్నాను.

"ప్రస్తుతం ఆ తలంపులేదు. కాని ఆ అవకాశంవస్తే ఉద్యోగం కూడా చేయిస్తాను."

"మీ అభిప్రాయం సమంజసంగానే ఉంది. నేనూ మీ అభిప్రాయాలతో ఏకీభవిస్తాను. వ్యక్తిత్వమూ, వ్యక్తిగౌరవమూ వారి వారి సత్ప్రవర్తన వల్లా, గుణగణాలవల్లా, నైతికంగా పతనం కాకుండా లౌకిక ప్రలోభాలకూ, దుర్వ్యసనాలకూ లోనుగాకుండా ఉంచేనే ఉంటుంది కాని, కేవలంగా డిగ్రీ పుచ్చుకున్నంత మాత్రాన మంచిపేరు తెచ్చుకోలేరు" అన్నాను ఆ మాటకు బావ నవ్వుకుంటూ నా వైపు ఒక్కసారి అదోలా చూసి వెళ్ళిపోయాడు.

మరొక రెండురోజులు ఉండి అక్కయ్యకు ధైర్యమూ, హితోక్తులూ చెప్పి మేము మా ఊరు వెళ్ళిపోయాము.

రోజులు గడుస్తున్నయ్యి. బావ కామేశ్వరిల ప్రణయ కలాపాలు బాహాటంగా సాగిపోతున్నయ్యి. అక్కయ్య జీవితం మోడులాఅయింది. యాంత్రికంగా వెళ్ళి చదువుకోవటమే తప్ప మనస్ఫూర్తిగా చదువుకోటంలేదు. ఒకవేళ చదువుకుందామని పుస్తకాలు తీసినా అందులో బావ, కామేశ్వరిల ప్రతిరూపాలు తనని వెక్కిరిస్తున్నట్లుగా కనబట్టం తప్ప అక్షరాలు కనబడేవికావు. పాఠ్యపుస్తకాల్లోని ప్రతిపేజీలోనూ తడిసి ఆరిన అక్కయ్య కన్నీటిబొట్లు కనిపించేవి. అత్తయ్యమాటలుగాని, స్నేహితుల హితోక్తులుకాని, నాన్నగారి ప్రాధేయపూర్వకమైన ప్రార్థనలుగాని, అమ్మ ఆవేదనగాని, అక్కయ్య దుఃఖంగాని బావ పరిస్థితిని మనస్సును మార్చలేకపోయాయి.

ఒకరోజున అక్కయ్య తనలో తానే ఆలోచించుకుని కామేశ్వరి ఇంటికి వెళ్ళింది. ఈసారి సర్వాలంకరణ శోభితగా వచ్చిన అక్కయ్యను చూసేసరికి కామేశ్వరి విభ్రాంతితో చూసి,

"పెళ్ళెప్పుడైంది సుమతీ, నన్ను పిలవకుండా పెళ్ళిచేసుకున్నావు కదూ, సుబ్బారావుని ప్రేమించానన్నావు. ఆయనకు పెళ్ళయిందని తెలియగానే నీ ప్రేమను రద్దుచేసుకుని మరొకర్ని పెళ్ళాడావా సుమతీ" అన్నది కామేశ్వరి. అక్కయ్యకు కామేశ్వరి మాట వింటుంటే ఒకవైపు కోపమూ, మరోవైపు సంతోషమూ కలిగాయి.

"నేను సుబ్బారావుగార్నే ప్రేమిస్తున్నాను. వారే నా జీవిత సర్వస్వమూ, నాలోని ప్రతి అణువూ వారినే కోరుతున్నది. వారే నా భర్త. ఒక్కమాట, వార్ని నువ్వు ఎట్లా ఆకట్టుకోగలిగావు కామేశ్వరీ" అన్నది

కామేశ్వరికి కొస్త తల తిరిగింది.

"నువ్వు వేదవతివా, సుబ్బారావు భార్యవా" ఆశ్చర్యంగా అడిగింది.

"అవును. వేదవతినే. నా పేరు నీకు తెలుసుకాని నేను తెలీదు. ఆర్థిక పరిసితికి తలవంచి ఆయనకోరిక తీరుస్తున్నానని క్రితంసారివచ్చినప్పుడు చెప్పావు. నీ ఆర్థిక పరిస్థితికోసం నా కాపురంలో నీళ్ళుపొయ్యటం ఎంత అసమంజసమో నీకూ తెలియకపోలేదు. ఉంపుడుకత్తెకు భర్త విలువ తెలీదు. నీకు ఆయన డబ్బు కావాలి. ఆయన అక్కర్లేదు. నాకు వారూ, వారి ఆస్థిపాస్తులూ కావాలి. వార్ని వదిలిపెట్టు కామేశ్వరీ, భర్త విలువ నీకూ పెళ్ళయ్యాక తెలుస్తుంది" ఇంక మాట్లాడలేకపోయింది అక్కయ్య.

ఈ మాటకు కామేశ్వరి చిన్నబుచ్చుకున్నట్లు కనిపించినా నవ్వింది. "నేనేమీ మీశ్రీవారివెంట పడలేదు. ఆయన నన్ను అర్థించారు. కాదనలేకపోయాను. నాకు చాలా ఆర్థికసహాయం చేస్తానన్నారు. నా ఆర్థిక పరి

సితికి లొంగిపోయాను. ఆయనమనస్సు తిప్పుకోగలిగితే నాకేమీ అభ్యం
తరం లేదు. కాని మీరు పట్టభద్రురాలయితేనే ఆయన మనస్సు మారు
తుంది. ఆయన మనస్తత్వం మీకూ తెల్సు. మీకు ఇంకో విషయమూ
చెప్తున్నాను. ఆయన మీకు విడాకులిచ్చి నన్ను పెళ్ళిచేసుకుంటానన్నారు.
ఈ విషయంలో ఆయన కోర్టు ఎక్కక మునుపే మీరు కళ్ళు తెరవటం
మంచిది. నేనుమాత్రం నా అంతట నేనేమీ చెయ్యలేను. దీనికి అనేక
కారణాలున్నయ్యి. మీశ్రీవారు బంగారుపిచ్చిక" అన్నది.

అక్కయ్య ఇంటికివెళ్ళాక అత్తయ్యతో ఈ విషయాలన్నీ
చెప్పింది. ఆవిడమాత్రం ఏం చెయ్యగలదు? కొడుకుచేతుల్లో దెబ్బలు
తినకుండా ఉంటమే ఆవిడ చెయ్యగలపని. శృతిమించితే అంతవరకూ
వస్తుందనీ, ఆ పరిస్థితి ఏర్పడితే అంతకన్నా దారుణమైనసంగతి ఇంకొ
కటి లేదనీ ఆవిడకు తెల్సు. ఆవిడ అశక్తతకు నిదర్శనం అక్కయ్య
కన్నీటిలో తనకన్నీరు కలిపి ఏడవటమే!

అక్కయ్యలో కొత్తరకం మొండిధైర్యం వచ్చింది. వారింటి
మేడమీద ఒకటైప్ ఇన్‌స్టిట్యూట్ ప్రొప్రయిటర్ ఉన్నారు. ఆయన చాలా
ఉత్తముడు. ఆయన పెద్దకూతుర్ని భర్త వదిలేస్తే అమ్మాయి చదువుకుని
ఉద్యోగం చేస్తున్నది, అమ్మాయి కోర్టునుంచే విడాకులు పొందింది.
వారింటికి వెళ్ళింది అక్కయ్య. ఆవిడపేరు రాజ్యలక్ష్మి. అక్కయ్య
కాపుర పరిస్థితి ఆవిడకూ తెల్సు. కుశలప్రశ్నలూ, చదువుసంగతులూ
మాట్లాడుకున్నాక అసలు విషయం ప్రస్తావించారు.

"భార్య ఉండగా మళ్ళీ పెళ్ళిచేసుకోటం న్యాయమేనా" అన్నది
అక్కయ్య.

"న్యాయాన్యాయాలు కాదు. అది చట్టవిరుద్ధం, కోర్టులో విడాకులు
పొందాకనే మరోపెళ్ళి చేసుకోటానికి అర్హులు" అన్నది రాజ్యలక్ష్మి.

"ఒక్కమాట, మీ భర్తనుంచి మీరు విడాకులు పొందారా."

"ఆహా, వారు మళ్ళీ పెళ్ళిచేసుకున్నారు, ఇద్దరు పిల్లలుకూడా."

"మీ విడాకులకు కారణం" భయపడుతూ అడిగింది అక్కాయ్య.

"నా శరీరంలో ఏ లోపమూలేదు. కాని ఈ జీవితంలో నా ఆరోగ్యం సంసారయోగ్యంకాదు. ఆ విషయం డాక్టర్లు తేల్చిచెప్పారు. నాకూ నిజమనే అనిపించింది. నేను వారితో సంవత్సరం కాపురం చేశాను. కాని ఎప్పుడూ సుస్తీగానే ఉండేదాన్ని. నా ఆమోదంతోనే కోర్టులో చట్టరీత్యా విడాకులపత్రం పుచ్చుకుని మళ్ళీ పెళ్ళిచేసుకున్నారు. నేనూ ఇప్పుడు ఆరోగ్యంగానే ఉన్నాను. ఇదీ కథ" నవ్వు ముఖంతో చూసింది రాజ్యలక్ష్మి.

"నా పరిస్థితి మీకు తెల్సు. కోర్టుద్వారా వారు విడాకులపత్రం పొందవచ్చునా."

"కామేశ్వరిని పెళ్ళిచేసుకుంటారా."

"అని విన్నాను."

"మీ విషయంలో అది ఎంతమాత్రం జరగదు. చట్టం వప్పుకోదు."

"ఎందుకని."

"మీ ప్రవర్తనలో దోషం ఉందని ఎవ్వరూ అనే ప్రమేయం లేదు. ఆయన కట్టుకథ కల్పించినా నమ్మశక్యంకాదు. మీ ఆరోగ్యం విషయంలో లోపం ఉన్నదని ఏ డాక్టరూ అనరు. భార్యాభర్తలు మూడు సంవత్సరాలు విడివిడిగా ఉండే పరిస్థితి ఏర్పడలేదు. ఇక మీవారు మీకు విడాకులు ఇస్తాననటం కట్టుకథ. మిమ్మల్ని బెదిరించటానికి, భార్యకు డిగ్రీలేదని వదిలిపెడతానంటే తలోగుప్పెడు గడ్డి ఆయన నోట్లోనే పెడతారు. ఇంక మీ భయం తీరినట్లేనా" అన్నది రాజ్యలక్ష్మి.

అక్కాయ్యముఖం తేటపడింది.

"మీ మనస్తత్వం కాస్త మార్చుకోవాలి." అన్నదావిడ.

"మీది సాత్విక మనస్తత్వం, కొంచం పదును పెట్టండి. కాస్త ఎదురు తిరిగే స్వభావం అలవర్చుకోండి. తెగేదాకా లాగొద్దు. కొంచం

తిరగమూత వేస్తే చాలు. ఆయన మేడమీదఉండి, మిమ్మల్ని ఆఖరు మెట్టుమీద నిలబెట్టారు. నాలుగుమెట్లు మీరూ పైకి ఎక్కండి, కింద పడరు" నవ్వుతూ అక్కయ్య బుగ్గలు ముద్దుపెట్టుకుందావిడ. అక్కయ్య సిగ్గు పడింది.

"ఈ విషయంలో మీరు నాకు సహాయం చెయ్యాలి" ఏమిటో అనేసింది అక్కయ్య. రాజ్యలక్ష్మి పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వింది. అక్కయ్య నిర్ఘాంతపోయింది.

"మీవారు మిమ్మల్ని ముద్దుపెట్టుకోటానికి నా సహాయము కావా లంటారా. అవసరాన్నిబట్టి తప్పక సాయం చేస్తాను."

అక్కయ్య సిగ్గుతో తలవంచుకుని ఇక మాట్లాడలేక వచ్చేసింది.

రోజులు గడుస్తున్నయ్యి. అక్కయ్య మెట్రిక్యులేషన్ పరీక్ష లకు వెళ్ళింది. ఎట్లాగో ధైర్యం చిక్కబట్టుకుని పరీక్షలు రాసింది. పరీక్షల ప్రమేయంతో తన సంసార విషయాలకు ప్రాధాన్యత ఇవ్వ కుండా మనస్సును నిబ్బర పర్చుకుని జీవించిన అక్కయ్య పరీక్షలయాక ఆ పుస్తకాలు మూలపారేసింది. బావ పరీక్షలుకూడా పూర్తయ్యాయి. ఆటంకం తీర్చుకోవలసిందిగా నాన్న ప్రాధేయపడుతూ ఉత్తరం రాశాడు. అత్తయ్యకూడా బావకు హితోక్తులు చెప్పింది. బావ వప్పుకోలేదు. బావ మనస్సంతా ఎప్పుడూ ఎక్కడో ఉన్న కామేశ్వరివైపే లగ్నమై ఉండేది గాని ఎదురుగా ఉన్న అక్కయ్యవైపు కన్నెత్తి చూసేవాడుకాదు. నాన్న, అత్తయ్యకూడా చెవి నిల్లుకట్టుకుని పోరసాగారు. బంధువులందరిచేతా చెప్పించారు. గౌరవంగా బ్రతకవలసిన రెండుకుటుంబాలనూ ఈ రీతిగా నాశనం చెయ్యవద్దని ప్రార్థించారు. అత్తయ్య ప్రాణత్యాగం చేస్తా నన్నది.

ఈ సందర్భంలో కామేశ్వరి చరిత్ర కొంత తెల్సుకోవాలి. కామే శ్వరి తల్లిదండ్రులు చిన్నప్పుడే పోయారు. మేనమామ, మేనత్తలవద్ద పెరిగింది. అన్నదమ్ములుకాని, అక్క చెల్లెళ్ళుగాని లేరు. స్వంత

ఊళ్లో ఉన్న నాలుగెకరాలకూ వారసురాలు కామేశ్వరి. ఆ పొలంమీద వచ్చే అయివేజు మేనమామ వసూలుచేస్తూ, అంతా తనే వాడుకుంటూ, కామేశ్వరి అవుసరాలకు కావలసిన డబ్బు ఎంతో జాగుచేసి పంపిస్తూ ఉండేవాడు. ఎట్లాగయినా కామేశ్వరి పోషణకూ చదువుకూ దొంగ లెక్కలు సృష్టించి ఆ నాలుగెకరాలపొలమూ కాజెయ్యాలని ఆయన సంకల్పం. అందుచేత కామేశ్వరి ఏ పని చేసినా తమకేమీ సంబంధం లేనట్లుగా ఉండేవారు. ఈ కారణంచేత కామేశ్వరి ఏంచేసినా చెల్లుబడి అవుతున్నది. ఆమ్మాయి జీవితం తెగిన గాలిపటం, చుక్కానిలేనినావ, నాధుడు లేనిరాజ్యం. కామేశ్వరితో పేచీ పెట్టుకుంటే ఆస్తి కాజెయ్యటానికి వీల్లేకుండా పేచీ పెడుతుందేమోనని వాళ్ళ భయం. అందుచేత కామేశ్వరి జీవితం తాడు లాగిన బొంగరంలా తిరిగిపోతున్నది. గుక్కపట్టి తిరిగే ఆ బొంగరం ఎప్పుడు పడిపోతుందో తెలీదు.

పాపం ఎంతోకాలం దాగదు. ఎంత జాగ్రత్తపడినా కామేశ్వరి తల్లి కాబోయే పరిస్థితులు ఏర్పడ్డాయి. అప్పటికి కామేశ్వరి కళ్ళల్లో కామెర్లు కొంచం తగ్గినవి. తినరాని మందులుతిని, పడరాని పాట్లుపడి డాక్టరుచేత తల బొప్పికట్టే చివాట్లు తిని నలుగురిలోనూ నవ్వులపాలయి ఎట్లాగయితేనేం గర్భస్రావం చేసుకున్నది. ఫలితం ఆరోగ్యం చెడింది. అదివరకులాగా బావతో విచ్చలవిడిగా తిరగటానికీ, గాలిలో తేలిపోతున్నట్లుగా స్టయిలిష్‌గా మాట్లాటానికీ, చలాకీగా బావను సంతోష పెట్టటానికీ ఇప్పుడు వీల్లేదు. అంతటితో పరిస్థితులు అనుకూలించక ఇద్దరూ జాగ్రత్తగానే మసులుకోసాగారు.

పరీక్షలు తెల్సాయి. బావ ఎమ్. కాం. పాసయారు. క్లాసురాలేదు. ఆర్డినరీగా పాసయారు. కామేశ్వరి బి. కాం థర్డుక్లాసులో పాసయింది. అక్కయ్య మెట్రిక్ ఫస్టుక్లాసులో పాసయింది. నేను పి. యు. సి ఫస్టు క్లాస్‌లో పాసయాను.

అక్కయ్య విలువనూ, యోగ్యతనూ, సౌశీల్యాన్నీ బావ అప్పుడు కాని గ్రహించలేదు. అక్కయ్య మనస్సులో నవవసంతాలు విరిశాయి.

ఆ కళ్ళల్లో కోటిదీప కళికల కాంతి ప్రకాశించింది. మోడుబారిన అక్కయ్య మనస్సు మల్లెపందిరిలా అల్లుకుని చిగిర్చింది. సన్నజాజుల్లా సౌరభాన్ని వెదజల్లింది. ఆదర్శగృహిణిలా అభిప్రాయాలను సంతరించుకున్నది. రంగారు బంగారు వింతశోయగాలతో మనస్సంతా బావతో నింపుకున్నది. పరిపూర్ణత సంతరించుకున్న ఆదర్శగృహిణిలా భర్తమన్నన పొందా లనుకున్నది.

ఒక మంచిరోజున అత్తయ్య ఏ ఆర్భాటమూ లేకుండా అక్కయ్యను బావగదిలోకి పంపింది. వేడుక చెయ్యాలనుకుంటే ఈ కొడుకు మరేమయినా పేచీలు పెడతాడేమోనని భయపడ్డది. అత్తయ్య ప్రోద్బ లంతో అక్కయ్య బావగదిలోకి వెళ్ళింది.

అంతవరకూ ఊపిరి బిగబట్టి ఎంతో ఆత్రంగా, ఆదుర్దాగా చీమ చిటుక్కుమనే శబ్దమైనా చెయ్యకుండా ఈ కథంతా వింటున్న ధనలక్ష్మి ఒక్కసారి నిట్టూర్పు విడిచి నవ్వుతూ గట్టిగా శ్వాసపీల్చి, కడుపులోనుంచి పెగల్చుకుని వచ్చే సంతోషభరితమైన వాక్కు పెల్లుబికిరాగా,

"అమ్మయ్య, ఇప్పటికి మీ వేదవతి అక్కయ్య కాపురం కుదుట పడిందన్నమాట, అంతా ఆ పరమాత్మునిలీల" అన్నది ధనలక్ష్మి.

రాధ ముఖం కాస్త జేవురించింది.

"కాపురాలు కుదుటపట్టమంటే భార్యాభర్తలు గదిలో ఉంటమేనని నీ ఉద్దేశ్యమా" అన్నది రాధ.

"గదిలో సంగతులు నాకు తెలీవు, నీకు తెలిస్తే చెప్పు" నవ్వింది ధనలక్ష్మి.

"నేను కామేశ్వరినికాదు. కాని అక్కయ్య చెప్పిన విషయాలే చెప్తున్నాను." కొంచం బాధగా అన్నది రాధ. ధనలక్ష్మి చెప్పుమన్న ట్లుగా చూసింది.

రాధ చెప్ప సాగింది.

"అక్కయ్యను చూడగానే బావ ఇట్లా అన్నాడు:

ఏం వేదవతీ, ఈరోజు చాలా సంతోషంగా ఉన్నావ్. అమ్మ ముహూర్తం పెట్టిందా."

అక్కయ్య మంచంమీద కూర్చుని నవ్వుతూ చూసింది.

"ఎంతసిగ్గు" అన్నాడు బావ.

"సిగ్గులేకపోవటానికి నేను కామేశ్వరిని కాదు."

"నాకు సిగ్గులేని వాళ్ళంటేనే ఎంతో ఇష్టం, సిగ్గుకలవాళ్ళు నా కక్కర్లేదు" అక్కయ్య బాధపడుతూ చూసింది. కామేశ్వరి ప్రసక్తి రాగానే ఉద్విగ్న మనస్కురాలయింది. క్రోధంతో, కోపంతో అక్కయ్య భావాలు మనస్సులో రొద చెయ్యసాగాయి.

"సిగ్గులేనిదయితే ఆ కడుపు ఎందుకు పోగొట్టుకుంది" బావకోపం పదిరెట్లు పెరిగింది.

"నేను తండ్రిని కావటం నీకు ఇష్టం ఉండదని" కోపంతో అన్నాడు.

అక్కయ్య భయపడింది. మంచందిగింది. "ఎందుకండీ నామీద అంతకోపం! ఏ దుర్ముహూర్తాన ఆ కామేశ్వరి మిమ్మల్ని ఆశించిందో కాని మీ జీవితం ఆమ్మాయి స్మరణతోనే సరిపోతున్నది. కట్టుకున్న భార్యను ఈ రకంగా హింస పెట్టటం మీకు సంతోషమా చెప్పండి. నేను మీకు తగనా? మీ కోరికలు తీర్చలేనా, నా ముఖం చూస్తేనే అంత రెచ్చిపోతున్నారు. ఇది నాప్రారబ్ధకర్మా? మీ అభిప్రాయం చెప్పండి" అని తనూ కోపంతోనే అన్నది.

"ఈ గదిలోనుంచి అవతలకు వెళతావా, వెళ్ళవా" అన్నాడు బావ మండి పడుతూ.

"వెళ్లను, ఇక్కడే ఉంటాను. నా స్థానం ఇక్కడే. మీ వద్దనే" ఆ సమయంలో అది ధైర్యమో, ఉద్రేకమో తెలియదు. బావను కౌగలించుకుని ముద్దు పెట్టుకుంది.

కోపం మనిషిని కోపోద్రేకపు ఆలోచనలతో రెచ్చగొట్టినా, శారీరక వాంఛల్ని పూర్తిగా చంపలేదు. మా వేదవతి అక్కయ్యకు వేద

పురుషులంతా సాయపడి ఆశీర్వదించారు. వేదోక్తంగా చేసిన వివాహం అప్పటికి సార్థకత చెందింది. వైవాహిక జీవితంతో భర్త ఇంటికివచ్చిన అక్కయ్య సంసార జీవితం ప్రారంభించింది."

అన్నది రాధ.

"మీ అక్కయ్య జీవితం విచారకరమైనదైనా, విషాదకరమైనది మాత్రం కాలేదు. చాలా సంతోషం, మీ అక్కయ్యకు పిల్లలా?" అన్నది ధనలక్ష్మి.

"అవును, ఏడ్చేపిల్ల అక్కయ్య ఒక్కర్తె" అన్నది రాధ.

ధనలక్ష్మి సంబాళించుకున్నది.

"మీ వేదవతి కష్టాలు గట్టెక్కనేలేదా" అన్నది ధనలక్ష్మి.

"లేదు, కోరికలు గట్టెక్కినయ్యి" అన్నది రాధ.

"అయితే జీవితం కొత్త మలుపుకు తిరిగిందా."అన్నది ధనలక్ష్మి.

"ఆహా, మిగతాకథ రేపు, ఇవ్వాళ మనం ఒకచోటికి వెళ్ళాలి."

"ఎక్కడికి."

"సాయంత్రం వచ్చి చెప్తానుకదా" రాధ వెళ్ళింది.

సాయంత్రం రాధ వచ్చేసరికి ధనలక్ష్మికూడా సిద్ధంగానే ఉన్నది. రాధను అనుసరించింది. ఇద్దరూ రిక్షాలో వెళ్ళారు. ఒక ఇంటిముందు దిగారు. ఆ ఇల్లు ఎవరిదో ధనలక్ష్మికి తెలీలేదు.

"హల్లో, మీకోసమే ఎదురు చూస్తున్నాను, రండి" సాదరంగా ఆహ్వానించాడు రంజిత్‌కుమార్. రాధ ముఖంలోకి క్షణం చూసింది ధనలక్ష్మి. ఇద్దరూ హాల్లోకి వెళ్ళారు.

కుశల ప్రశ్నలయాక కాఫీ ఇచ్చాడు కుమార్.

"ఏమంటున్నాడు మీ బావగారు" రాధను అడిగాడు.

"ఆయన తత్వం మీకూ తెల్సు. ప్రస్తుతం ఆయన కళ్ళల్లో నేనూ మెదుల్తున్నాను" అన్నది రాధ.

"సుబ్బారావు మీ అందరికీ యముడులాంటివాడు. నాకు ఆప్తుడు. అతనితో ఎలావ్యవహరించాలో మీకు తెలేదు. అరకప్పు కాఫీ ఇస్తే ప్రాణం యిచ్చేరకం, అంటే డబ్బుకు కక్కుర్తిపడతాడని కాదు, ఉబ్బేస్తే ఆకాశమంత అవుతాడు. నీ అంత సద్భావాలు కలవాడూ, చదువుకున్న ఆడపిల్లలను గౌరవించేవాడూ, రసికుడూ లేడని స్తోత్రం చేస్తూనే కామేశ్వరి అతనికి హారతి ఇస్తూ ఎంతో డబ్బు గుంజింది. మీ ముందు చెప్పకూడదు. ఏ ఆడపిల్లయినా అతన్ని లొంగదీసుకోటం చాలా తేలిక. కాని ఆ సమయస్ఫూర్తి, తెలివితేటలూ వేదవతిలో లేవేమో, అంచేతనే ఇద్దరూ చుక్కెదురుగా ఉన్నారు. మీకు తెలీని విషయం మరొకటి. సుబ్బారావు కామేశ్వరిని నాలుగయిదుసార్లు కొట్టాడుకూడా. కాని కనీసం మూడువేలయినా ఇచ్చి ఉంటాడు" అన్నాడు కుమార్.

ధనలక్ష్మి ఆశ్చర్యంతో విన్నది.

"స్తోత్రపాఠాలకు లొంగిపోతాడంటారా" అన్నది రాధ.

"శృతితప్పని స్తోత్రంగా ఉండాలి. గ్రహిస్తే ఇదివరకు వచ్చిన మార్కులూ పోతయ్యి" అన్నాడు కుమార్.

"నా బొందల్లే ఉంది ఆయన మనస్తత్వం" అన్నది రాధ.

"చూడు రాధా, ఎవరి మనస్తత్వం వారిది. నీకున్న మనస్తత్వం ధనలక్ష్మికి ఉండకపోవచ్చు. ఏం ధనలక్ష్మి, అంతేనా."

రాధవైపు చూసింది ధనలక్ష్మి.

"అసలు మీ మనస్తత్వాలేమిటో నాకు అర్థంకావటంలేదు" అన్నది ధనలక్ష్మి.

రాధ కుమార్‌వైపు చూసింది.

"నీ దగ్గర దాపరికం ఎందుకు, మా ఇద్దరి మనస్సులూ కలిసాయి. సుబ్బారావు నాకు స్నేహితుడు. ప్రస్తుత పరిస్థితి నాకూ తెల్సు. వేదవతి కాపురం కుదుటపడ్డాక మా వివాహం జరుగుతుంది, క్లుప్తంగా ఇదీ కథ" అన్నాడు కుమార్. రాధ కళ్ళల్లో నీళ్ళు ధనలక్ష్మిని పలకరించాయి. తల వంచుకుని కళ్ళు తుడ్చుకుంది.

"చాలా సంతోషం. మీరు భార్యాభర్తలు అయ్యేలోపలే వేదవతి కాపురం కుదుటపడేటట్లుగా చూడాలి. అక్కయ్యకాపురం అట్లా ఉంటే చెల్లెలు పెళ్ళికి తొందరపట్టం అంత భావ్యం కాదేమో" అన్నది ధనలక్ష్మి.

కుమార్ ముభావకంగా చూసి అన్నాడు.

"రాధకాని, నేనుకాని పెళ్ళికి తొందర పట్టంలేదు ధనలక్ష్మి! రాధ తండ్రికి సంబంధాలు వెతికే శ్రమ తప్పించాం. అంతే, వాళ్ళ నాన్నకు చెప్పి పాతికవేలు కట్నం ఇప్పిస్తానన్నది రాధ" అన్నాడు కుమార్.

"మీకు అబద్ధం చెప్పటంకూడా చేతకాదు. పాతికవేలుకాదు. లక్షరూపాయలకట్నం. వందఎకరాలపొలం, నూరునవర్సుల బంగారు కంచం" అన్నది రాధ.

ముగ్గురి నవ్వులతో మనస్సులు తేలికపడ్డాయి.

"బావతో మాట్లాడుతారా" అన్నది రాధ.

"ఆహా, మన పెళ్ళికావాలంటే వాళ్లకాపురం కుదుట పడాలికద" అన్నాడు.

రాధ, ధనలక్ష్మి వెళ్ళారు. మర్నాడు రాధ, ధనలక్ష్మి ఇంటికి కాలేజినుంచే వెళ్ళింది. పుస్తకాలు డ్రాయరుమీద పడేసి కుర్చీలో కూర్చుంది.

"నీ ప్రేమకథ చెప్తావా, మీ అక్కయ్యకథ చెప్తావా" అన్నది ధనలక్ష్మి.

"అక్కయ్యకథ చెప్తాను. నా ప్రేమకథ మరొక రోజున."

"అయితే కానివ్వు. అక్కయ్య కథే చెప్పు వింటాను."

రాధ చెప్పసాగింది.

"అత్తయ్య ఉత్తరం రాసినమీదట, అక్కయ్యను సలక్షణంగా సారె, చీరెలతో కాపురానికి పంపారు. కొద్దిరోజులు అక్కయ్య సంసార

జీవితంలో సన్నజాజుల సౌరభం గుబాళించింది. తరువాత బావ యథా ప్రకారం కామేశ్వరితో తిరుగసాగాడు. అక్కయ్య కళ్ళల్లో మళ్ళీకన్నీళ్ల కాపురానికి వచ్చాయి. బావకు ఎంతో నచ్చ చెప్పింది. అన్నం నీళ్ళు మాని చిక్కి శల్యమైంది. కాని బావకు చీమకుట్టినట్లులేదు. అక్కయ్యను కాలేజిలో చేరి చదువుకోమన్నాడు. కనీసం పి. యు. సి పాసయినా చాలునన్నాడు. కాపురంచేసే సంసారస్త్రీ కాలేజిలో చదవటానికి వెళితే ఏం బావుంటుంది. చూసేవాళ్ళకయినా బావుండాలా? అక్కయ్య చదువు కోననీ, బావ చదువుకోమనీ, మళ్ళీ మామూలు భాగవతమే.

ఈ విధంగా మరో ఏడు గడిచింది.

అప్పటికి నేను బి. యస్సీ చదువుతున్నాను. మొదటిసంవత్సరం పూర్తయింది. అక్కయ్య సంసారం చూసి విసుగెత్తిన అమ్మ, నాన్న నన్ను చదివించి ఉద్యోగం చేయిద్దామనే దృఢ సంకల్పంతోనే ఉన్నారు.

ఈ పరిస్థితిలో అత్తయ్య మా ఊరు వచ్చింది. ఉత్తరమైనా రాయ కుండా ఆవిడ రావటంతో మాకు భయమే కలిగింది. అక్కయ్య ప్రాణ త్యాగం చేసిందో, లేక బావ మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడో, ఇట్లా అనేక అర్థంలేని ఆలోచనలు కలిగాయి.

వచ్చిన మర్నాడు ఎవ్వరూ ఆశించని సలహా చెప్పిందావిడ.

"సుబ్బారావు ప్రవర్తనతో కన్నతల్లికి నాకే విసుగెత్తింది. వేద వతికి అడుగులోనే హంసపాదన్నట్లుగా దానిసంసారజీవితమే విరక్తితో ప్రారంభమైంది. ఈ కొడుకూ, కోడళ్ళఘోష చూస్తుంటే నాకూ మతి పోతున్నది. ఇందుకు ఒకమార్గం ఆలోచించాను." అన్నది అత్తయ్య. అమ్మా, నాన్న, నేను ఏమిటన్నట్లుగా అత్తయ్యవైపు చూశాము.

"వేదవతి చాలా సున్నితమైన మనస్సుకలది. చాలా మెతక. వాడికి అణిగి మణిగి ఉన్నకొద్దీ ఇంకా దాన్ని కాల్చుకు తింటున్నాడు. దానికీ మనశ్శాంతిలేదు. అంచేత నేనొక నిర్ణయానికి వచ్చాను. రాధకు బి. యస్సీ మొదటిసంవత్సరం పూర్తయింది. మిగతా రెండేళ్ళూ అక్కడ

మా ఇంట్లో ఉండి చదువుతుంది. కాలేజీలు తెరవగానే ట్రాన్స్ఫర్ సర్టిఫికెట్ తీసుకుని రాధని విశాఖపట్నంలో చదివిస్తే వేదవతికి కాస్త మన శ్శాంతిగా ఉంటుంది. ఎంతో ఆలోచించి వేదవతికూడా ఇందుకు ఒప్పు కుంది. రాధ ఉంటే మరదలు ఉందనే బిడియంతో వాడూ కాస్త కుదురుగా ఉంటాడేమో" అన్నది అత్తయ్య.

రెండు రోజులు తర్జన భర్జనలు జరిగాక అందరం ఒప్పుకున్నాం. కాలేజి తెరవంగానే టి. సి తీసుకున్నాను. ఈ విశాఖపట్నం వచ్చి బి. యస్సీ రెండోసంవత్సరంలో చేరాను. ఈ విషయంలో బావకూడా చొరవ తీసుకుని నాకు కాలేజిలో సీటు ఇప్పించాడు" అన్నది రాధ.

"బాగుంది నువ్వు వచ్చాక మీ అక్కయ్య జీవితంలో ఏదైనా మార్పు కలిగిందా" అన్నది ధనలక్ష్మి.

ఈ మాట వినగానే రాధముఖం వెలవెలపోయింది.

"ధనం! జీవితపు విలువ, స్త్రీ జీవితంలో నిత్యమూ తొంగిచూసే సంక్షోభ, సంఘర్షణా నా ఇరవై ఏళ్ళ జీవితంలోనూ ఇక్కడికి వచ్చినప్పట్నుంచే చూస్తున్నాను. స్త్రీజీవితం సానబట్టిన వజ్రమో, నివురుగప్పిన నిప్పులాంటిదో, ఎంత విలువైనదో అంతలో ఎంత హీనమైనదో, నాకిప్పుడు బాగా అర్థమౌతున్నది. స్త్రీ జీవితపు విలువలు గ్రహించిన కొద్దీ జీవితంలో సంఘర్షణ తప్పదు. అన్నిటినీ త్యజించి, అన్నింటికీ అతీతురాలవాలంటే అందుకు కామేశ్వరిలా తయారవుతేనే జీవించగల్గుతారు. లేకపోతే అడుగడుగునా అనేకబాధలు తప్పవు. కాని బాధలు పడుతూ పవిత్ర జీవితం గడుపుతున్నామనే బాధతోకూడిన సంతృప్తికన్నా, అందరూ వేలెత్తి చూపుతున్నా ఆ వేలివైపు చూడకుండా తమ ప్రలోభం కోసం ఏమన్నా చెయ్యగల నేర్పుకలవారిలోనే సౌఖ్యపడుతున్నామనే సంతృప్తి ఉన్నది. అవునంటావా" అన్నది రాధ.

"ఎన్నటికీ కాదు. బాధలోనే విలువా, గౌరవమూ ఉన్నాయి. ఓర్పూ, క్షమాగుణమే జీవితానికి శ్రీరామరక్ష. సుఖలాలసత్వమనేది

తాత్కాలిక భావోద్రేకాలకు దాసులై వ్యక్తిత్వాన్ని చంపుకోటమే" అన్నది ధనలక్ష్మి.

రాధ మళ్ళీ చెప్పసాగింది.

"నా రాకతో అక్కయ్యముఖం విప్పారింది. ఆశించని ధైర్యమేదో అక్కయ్యలో కలిగింది. వచ్చిన వారంరోజులవరకూ అక్కయ్య తనకాపుర కథనంతా చెప్పింది. అంతా విన్నాక నాకూ బావమీద దురభిప్రాయం ఏర్పడలేదు, సానుభూతి కలిగింది. బావది ఒకరకమైన మనోదౌర్బల్యం. డబ్బుకు వెనకాడవలసిన పనిలేదు. ఏ చెల్లెలికో పెళ్ళి చెయ్యాలనీ, ఏ తమ్ముడికో చదువు చెప్పించాలనీ ఇలాంటి బాధ్యతలు లేవు. ఒక్కడే కావటంతో చిన్నప్పట్నుంచీ ఉన్న గారాబం పెంకితనంగామారి నేను చెప్పిందే నిజం, నేను వలచిందే రంభ అనే స్థితికి వచ్చేశాడు. మనస్సు ముదిరింది.

మరోవారం గడిచాక బావ నాతో అన్నాడు. ఇక్కడ ఒక్క విషయం చెప్తాను. బావను గౌరవంగా "మీరు" అనాలనే అభిప్రాయం నాలో ఏకోశానలేదు. అందుచేతనే 'డ'కారాన్ని ఉపయోగిస్తున్నాను.

"నువ్వు వచ్చాక మీ అక్కయ్య కళ్ళల్లో, ముఖంలో మాటల్లో కాస్త తేడా కనిపించింది రాధా" అన్నాడు.

"నువ్వు ఎన్నయినా చెప్పుబావా, కామేశ్వరిలో ఉన్న చలాకీతనం అక్కయ్యను చీల్చినా రాదు. ఆ అమ్మాయిమాటలో పుట్టతేనె ఉన్నది. అక్కయ్య మాటల్లో బెల్లపుపాకం ఉన్నది" అన్నాను.

రెండునిమిషాలు బావ నావైపే చూస్తూ నిల్చున్నాడు.

"కామేశ్వరిని నువ్వు చూశావా రాధా" అన్నాడు. బావముఖం వెలవెలబోయింది.

"మొన్ననే చూశాను. పెళ్ళికాకపోయినా జీవితాంతం భర్త ప్రమేయం లేకుండా జీవించగల సమర్థురాలు" అన్నాను. నేను ఎద్దేవా చేస్తున్నట్లు బావ గ్రహించాడు.

"కామేశ్వరిసంగతి నీకెందుకుగాని నీ చదువుసంగతి చూసుకో రాధా, ఆమ్మాయి ఏమన్నది" అన్నాడు.

"ఏమీ అనలేదు. అయినా ఎందుకంటుంది, అన్నా నేను అక్కయ్యను కాదుగా ఊరుకునేందుకు" కోపంతో అన్నాను. కొరకొర చూస్తూ వెళ్ళాడు బావ.

ఇట్లాగే కామేశ్వరిమీద పెట్టి అయిదారుసార్లు ఆయనకు కష్టం కలిగేటట్లు మాట్లాడాను. ఒకరోజురాత్రి గదిలో అక్కయ్యతో పెద్దగా అంటున్నాడు.

"రాధచేత నామీద బాగానే దండయాత్ర జరిపిస్తున్నావ్. చాలా సంతోషం. కాని ఒక్కమాట. కామేశ్వరిలో ఉన్న చొరవా, ధైర్యమూ రాధలో లేవు. మీ అప్పచెల్లెళ్ళ జీవితంకన్న కామేశ్వరి కాలిగోరు ఎంతో విలువైనది తెలుసా. రాధకు కాస్త బుద్ధిచెప్పు. నీకు చేతకాకపోతే నేనే చెప్తాను" అన్నాడు. నేను వినాలనే గట్టిగానే అన్నాడు. ఆ క్షణాన నా రక్తం ఉడికిపోయింది. బావమాటలు బుద్ధిఉన్న ఏ మగవాడూ అనడు. అలాంటి భర్తతో కాపురంచేసేకన్న భర్తలేకనుకుంటేనే ఎంతో మంచి దనిపించింది. కాని అమాయకురాలు అక్కయ్య ఈ పులినోట్లో పడ్డది. ఎట్లాగయినా అక్కయ్యకాపురం బాగుచెయ్యాలనే దృఢసంకల్పం నాలో కలిగింది. ఈ లక్ష్యసాధనకు బావచేత మాటలుపడ్డా లెక్కచెయ్యకూడ దనుకున్నాను. అక్కయ్యతరపున నేనే పోట్లాడదామనుకున్నాను.

ఆరాత్రంతా ఆలోచించి అదే నిర్ణయానికి వచ్చాను.

రెండురోజులు గడిచాక ఒక కాగితంపొట్లాం బావ చూస్తుండగా అక్కయ్య చేతిలో ఉంచి అన్నాను.

"ఈ పొట్లాం విప్పకుండా రోజూ కళ్ళకద్దుకుని బీరువాలో పెట్టవే అక్కయ్యా" అన్నాను.

"ఇందులో ఏముంది" అన్నది అక్కయ్య.

"చాలా విలువైనది. నీ కెందుకూ కళ్ళకు అద్దుకో అంతే" అన్నాను. ఆ పొట్లాం కళ్ళకు అద్దుకుని బీరువాలో దాచింది. బావ చూస్తూనే వెళ్ళిపోయాడు.

రెండురోజులు గడిచాయి. బావ చూసేటట్లుగానే అక్కయ్య ఆ పొట్లాం కళ్ళకు అద్దుకుని బీరువాలో దాచేది. మూడోరోజున బావ అక్కయ్యను అడిగాడు. ఆ పొట్లాం ఏమిటని, తనకూ తెలీదని చెప్పింది అక్కయ్య. కోపంతో వెళ్ళి బీరువాలో పొట్లాంతీసి విప్పి చూశాడు. బావ ముఖం చూస్తే మనస్సులో నవ్వుకుంటున్నట్టే అర్థమైంది. కాని ముఖంలో కోపం జేవురించింది. అక్కయ్యవద్దకు వెళ్ళకుండా చదువుకుంటున్న నా దగ్గరకు వచ్చాడు బావ. వెనకాలే అక్కయ్య వచ్చింది.

"ఈ పొట్లాంలో ఉన్నది ఏమిటి రాధా."

"విలువైన వస్తువు" అన్నాను.

"ఎగతాళిగా ఉన్నదా."

"కామేశ్వరి కాలిగోరు ఎంతో విలువైనది అన్నావు కదూ. అదే అది" అన్నాను.

అక్కయ్య బిక్కచచ్చిపోయింది. దానికి చెమటలు పట్టాయి.

"కామేశ్వరి ఇంటికి ఎప్పుడు వెళ్ళావ్."

"నువ్వు లేనప్పుడు."

"వెళ్ళి అడిగి ఈ కాలిగోరు తెచ్చావన్నమాట. నిజమేనా రాధా" ముఖంలో నవ్వు కనిపించింది. నాకూ ధైర్యం చిక్కింది.

"బావా! మా అప్పచెల్లెళ్ళ జీవితంకన్న కామేశ్వరి కాలిగోరు ఎంతో విలువైనదన్నావు. ఆమ్మాయిమీద ఉన్న మోజు నీచేత అట్లా అనిపించింది. అక్కయ్య అందమూ, అమాయకత్వమూ నీ కళ్ళకు కామేశ్వరిగోరులా కనిపించాయంటే పరస్త్రీ వ్యామోహం విద్యావంతుడవైన నిన్ను ఎంతగా దిగజార్చిందో విన్న ఎవరికయినా అర్థమౌతుంది. ప్రజలను శాసించే అధికారం రాజుకు ఉన్నా ఆ శాసనం ప్రజల మనస్సును ఆకట్టుకుని వారి మన్ననలను పొందేట్లుగా ఉండాలి కాని, ప్రజాకంటకంగా ఉండరాదు. భార్యాభర్తల విషయంలోనూ అంతే. అక్కలో దోషం ఉందని నిరూపిస్తే మీ విజాయితీని హర్షించి అక్కయ్యనే కేకలేస్తాను. దాని అతిమంచితనమే ఇంతవరకూ తెచ్చింది. కామేశ్వరితో స్నేహం మానమనే మా అందరి కోరికా. ఇంతకీ ఆ గోరు

కామేశ్వరిదికాదు అత్తయ్య కాలిగోరు" అన్నాను. బావముఖం వెల వెల పోయింది. బావచేత దెబ్బలు తినాలేమోనని అక్కయ్య భయపడింది. ఇద్దరూ గదిలోకి వెళ్ళిపోయారు. నా మనస్సు తేలికపడింది.

వారంరోజులు గడిచినా బావ నాతో మాట్లాడలేదు. అట్లా అని నా కోరికకాదు.

ఈలోగా బావకు ఒక పెద్దబ్యాంకులో ఉద్యోగం దొరికింది. ఉదయం పదిగంటలకు వెళితే సాయంత్రం ఆరుగంటలకు వచ్చేవారు. ఈకొత్త ఉద్యోగం, కొత్త వాతావరణంతో మనస్తత్వంలో కాస్త మార్పు వచ్చినా, ఆ పురుగు అప్పుడప్పుడూ మెదడులో తొలుస్తూనే ఉండేది.

ఒకరోజురాత్రి బావ ఇంటికి రాలేదు. మర్నాడు ఆదివారం. ఆరోజూ రాలేదు. సోమవారం ఉదయం వచ్చారు. ఈ రెండురోజులూ ఎక్కడికి వెళ్ళారని అక్కయ్య అడిగింది.

"నీకు చెప్పి వెళ్లాలా" అన్నాడు బావ.

చెప్పి వెళ్ళకపోతే ఎట్లా తెలుస్తుంది, ఈ రెండు రోజులూ ఎక్కడికి వెళ్ళారోనని నేనూ, అత్తయ్యా, రాధా ఎంతదిగులు పడ్డామో, ఖంగారుపడ్డామో, అన్నం, నీళ్ళుమాని అలమటించామో ఆ పరమాత్ముడికి ఎరుక" అన్నది అక్కయ్య.

"నామీద మీకుగల ఆదరాభిమానాలకు సర్వదాకృతజ్ఞుణ్ణి. కామేశ్వరికూడా మా బ్యాంకులోనే ఉద్యోగం ఇప్పించే ప్రయత్నంలో ఒక ఊరు వెళ్లొచ్చాను. సిఫార్సు కావాలికదా."

నా వళ్ళు భగభగలాడింది. అక్కయ్య ఏం మాట్లాడలేదు.

"నువ్వూ దిగులుపడ్డావా రాధా" అన్నాడు బావ నా కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

"అవును. అక్కయ్య జీవితాన్నిగురించి దిగులుపడ్డాను, అక్కయ్య భర్తగా దిగులు పడ్డాను. మేనత్తకొడుకుగా దిగులుపడ్డాను. నీకోసం

దిగులుపడలేదు" అన్నాను. ఈ పుల్లవిరుపుమాటకు బావకు కోపం రాలేదు.

'కామేశ్వరి ప్రియుడుగా అసహ్యపడ్డాను. అని అనలేదేం" అన్నాడు.

"ఆమాత్రం విచక్షణ నీలో ఉంటే అదే చాలు" అన్నాను.

కామేశ్వరికూడా బ్యాంకు ఉద్యోగంలో చేరింది. ఇక ఇద్దరూ కలిసే ఆఫీసుకు వెళతారు. ఇద్దరూ కలిసి వస్తారు. ఈ విధంగానే జరిగిపోతున్నది. అప్పుడప్పుడూ బావ ఒక్కోరాత్రి ఇంటికి వచ్చేవాడేకాదు. ఎక్కడ ఉండేవాడో తెలీదు. అక్కయ్య మానసికవ్యథ అట్లాగే ఉన్నది.

ఒకరోజున నేను కామేశ్వరి ఇంటికి వెళ్ళాను. ఆరోజు ఆదివారం. అంతకుక్రితం రెండు మూడుసార్లు నన్ను చూసే ఉంటంతో సాదరంగానే ఆహ్వానించింది.

"మా బావ పనిచేసే బ్యాంకులోనే ఉద్యోగం దొరికిందిట. చాలా సంతోషం" అన్నాను.

"కాదు, మీరు బాధపడుతున్నారని నాకుతెల్సు. అంతేకాదు, నేను వారితో సంబంధం పెట్టుకోటం తప్పే. కాని ఈనాటి పెద్దవాళ్లూ, గొప్పవాళ్లూ ఒకనాడు తప్పిదంచేసినవాళ్లే. సాంఘిక న్యాయసూత్రాలూ, కట్టుబాట్లూ సృష్టించినవాళ్లే వాటిని అధిగమించటానికి మరో సూత్రాన్ని చేర్చి మరోదృక్పథంతో అన్వయించి ఆచరిస్తారు. జీవితాంతం మీ బావగారినే అంటిపెట్టుకుని ఉంటానని నేను చెప్పను. ఆ కోరికాలేదు. నాకూ భర్తా, సంసారమూ, పిల్లలూ ఉండాలనే ఉన్నది. మంచిగా కాని, చెడుగాకాని ఏ మగవాని సాయమూ లేకుండా ఏ స్త్రీ తనంత తానుగా నిలబడి జీవించలేదు. ఒకరికి ఒకరకమైన అవకాశం లభిస్తుంది. మరొకరికి ప్రేమ జీవిత సోపానాన్ని నిర్మిస్తుంది. సర్వసాధారణంగా ఆడపిల్లల బాధ్యత తల్లితండ్రులే తీసుకుంటారు. కాని నా జీవితంలో అవేవీ నా చాయలకు రాలేదు. మంచిగా నా జీవితాన్ని నిలదొక్కుకునే వాతావరణం నాకు కని

పించలేదు. నాకు చేయూత నిచ్చేందుకు ఒకవ్యక్తి కావాలి. వారు మీబావ గారే అయారు. నాకు ఉద్యోగం ఇప్పించిందికూడా మీ బావగారే, అలాంటివారు కోరితే నేను కాదనటానికి నా మనస్సు వప్పదు" అన్నది కామేశ్వరి.

కామేశ్వరి గొంతు జీరపోయింది. ఆత్మ తను చేస్తున్న తప్పును పదేపదే గుర్తుచేస్తున్నా మనస్సు ఎదురుతిరగటం కామేశ్వరి ముఖంలో ప్రస్ఫుటంగా కనిపించింది.

"స్త్రీకి శత్రువు స్త్రీయే, అనే ఈనాటి లోకోక్తి విజమే అయింది కామేశ్వరీ, సాటి స్త్రీ కాపురంలో నిళ్ళుపోసి ఆ మగధీరుని నీ కొంగుకు కట్టుకుని తిప్పుకోటంలో ఏమీ అర్థంలేదు. తెలిసి ఇంత పాప కార్యం చేస్తున్నావంటే నీలో స్వార్థం ఎంత పేరుకుపోయిందో అందరికీ అర్థమౌతున్నది" అన్నాను.

"రాధా" అన్నది కామేశ్వరి. పేలవమైన అభిప్రాయాలను మనస్సులో ఎంత పదిలపర్చుకున్నదో నాకు బాగా అర్థమైంది.

"నీ జీవితంలో ఇంతవరకూ నువ్వు మంచినేకాని చెడును అనుభవించలేదు, చెడునుగురించి నీకు తెల్సింది, నీ ఊహాకు తట్టిందీ చెప్తున్నావు. నేను మంచినీ, చెడునూ అనుభవించే ఆ అనుభవాలను పురస్కరించుకుని, నా స్థితిగతులను తల్చుకుని చెప్తున్నాను. నా అంతట నేనుగా మీ బావగార్ని తృణీకరించను. వారు నన్ను తృణీకరించి నా స్నేహాన్ని మానుకుంటే సంతోషంగా నేనూ తప్పుకుంటాను. తను చేస్తున్నది తప్పనే యుక్తాయుక్త విచక్షణా జ్ఞానాన్ని ఆయన మనస్సుకు పట్టేటట్లు చెప్పగల బాధ్యత మీ వేదవతిది, కాని ఆవిడ ఆయనకు నచ్చ చెప్పలేదు. ఆ బాధ్యత నువ్వే తీసుకుంటే నేను చాలా సంతోషిస్తాను" అన్నది కామేశ్వరి.

ఈవింత ప్రతిపాదనకు ఆశ్చర్యపోయినా, ఒకరకంగా కామేశ్వరి చెప్పిందీ ఆ పరిస్థితుల్లో నిజమేననిపించింది.

ఇక తర్కించి లాభంలేదని వెళ్ళిపోయాను.

వారంరోజులు ఆలోచించాక నేనూ ఒక నిర్ణయానికి వచ్చాను. నా పథకం అక్కయ్యతోనూ చెప్పాను. అక్కయ్య సరేనన్నది.

ఒకరోజున బావను పలకరించి తనూ, నేనూ, అక్కయ్య విశాఖ బీచికి వెళదామన్నాను. బావ వెంటనే వప్పుకున్నారు. ఆ మర్నాడు ఏదో శెలవురోజు. సాయంత్రం అయిదుగంటలకు మా గుకలం బీచికివెళ్ళాం. ఆ ఇసకలో బావపక్కన అక్కయ్య, ఆ పక్కన నేను కూర్చున్నాము. అక్కయ్య మానసిక ఆందోళనకు ప్రతిగానే ఉన్నది సముద్రఘోష. అనంతమైన ఆ మహాసముద్రంలో అల్లంత దూరాన బండరాళ్ళు. నురుగులు గక్కుతూ వచ్చే ప్రతికెరటమూ ఆ బండరాళ్ళని ఢీకొని చెల్లా చెదరై రెట్టింపు వేగంతో వెనక్కు వచ్చేస్తున్నాయి. అట్లా అని ఆ కెరటాలు ఆ బండరాళ్ళను ఢీకొనక మానలేదు. అక్కయ్య సంసార జీవితమూ అట్లాగే ఉన్నది.

ఇద్దరువ్యక్తుల హృదయాలు పరస్పరం అర్థంచేసుకుంటేనే అర్థ మౌతాయి. అందమూ అంతే. అక్కయ్య బావను పలకరించింది.

"మాట్లాడకుండా కూర్చున్నారేం?"

"ఈ ప్రోగ్రాం వేసింది రాధ. రాధ మాట్లాడుతే వింటూ కూర్చుందాం" అన్నాడు బావ.

"ప్రోగ్రాం నేను వేసినా నీ ప్రోత్సాహంలేంది ఏదీ జరగదు బావా, నువ్వే ఏమైనా కబుర్లు చెప్పాలి" అన్నాను నేను.

బావ ఒకసారి నావైపూ, మరోసారి సముద్రంవైపూ చూస్తూ కూర్చున్నాడు. నేను బీచిరోడ్డువైపు చూస్తున్నాను. అక్కయ్య సముద్రపు అలలనే చూస్తున్నది.

రెండునిమిషాలు గడిచాయి.

"హల్లో! రాధా, గుడీవినింగ్, మీ అక్కయ్య బావతో చల్లగాలి పీలుద్దామని వచ్చావా" అన్నాడొ కతను. బావకు దగ్గరగా కూర్చున్నాడు. అతను రంజిత్‌కుమార్.

"ఓ, కుమార్, కులాసా, రాధ నీకు తెలుసా" ఆశ్చర్యంగా అడిగాడు బావ.

"తెలుసు. మా ప్రేమ పెళ్ళివరకూ వచ్చింది." అన్నాడు కుమార్. నేను అక్కయ్యవైపు చూసి తలవంచుకున్నాను. బావ విస్తుపోయాడు. అక్కయ్యకు గుండె ఆగినంత పనైంది.

"అట్లాగా నాకు తెలీదు. రాధ ఎన్నడూ చెప్పలేదు. రాధను ప్రేమించావా కుమార్" అన్నాడు బావ.

"అవును సుబ్బారావ్, నమస్కారం వేదవతిగారూ, మిస్టర్ రావ్, నా పెళ్ళివిషయంలో ఒక నిర్ణయానికి వచ్చేశాను. ఆ నిర్ణయానికి తిరుగులేదు. కాని నీ అంత అదృష్టవంతుణ్ణి కాదోయ్" అన్నాడు కుమార్. బావమనస్సులో సముద్రఘోష అయివేస్తున్నది. అలలు విరుచుకు పడవచ్చు.

"ఎందుకని."

"రాధ గడసరి. ఒకమాటకు పదిమాటలు సమాధానం చెప్తుంది. నేనే రాధకు లొంగిఉండాలేమో! రాధలో ఉండవలసిన సౌమ్యత, సహనమూ మా కాబోయే వదినెగారిలోనే మూర్తీభవించాయి. ఈ గడసరి రాధను ఎంచుకోవటంలో పొరబాటుపడ్డా మాటదాటే స్వభావం నాలో లేదు. ఈ రకంగా ఆలోచిస్తే నాకన్న నువ్వే అదృష్టవంతుడివి." అన్నాడు కుమార్.

అక్కయ్య నన్ను కళ్ళతో హెచ్చరించింది. ఇద్దరంలేచి వెళ్ళి కొంత దూరంగా వెళ్ళి కూర్చున్నాము. గాలివాలుకు వాళ్ళమాటలు చిన్నగా వినబడుతూనే ఉన్నాయి.

"మీ ప్రేమ దూరానే ఉన్నదా, దగ్గరకు వచ్చిందా?" అన్నాడు బావ. ఆయనముఖం జేవురించింది.

"రాధకు కామేశ్వరి మనస్తత్వంలేదు. కొంతలో బయట పడ్డావేం సుబ్బారావ్" సిగిరెట్ వెలిగిస్తూ అన్నాడు కుమార్.

"రోజూ నాకు నీతులుచెప్పే ఈవగలాడి నీతో ఈ భాగవతం ఎప్పుడు ఆడుతున్నదో తెల్సుకుందామని" అన్నాడు బావ.

చిరునవ్వుతో బావవైపు చూశాడు కుమార్.

"రాధను వగలాడి అనటం చాలా పొరబాటు. పెళ్ళికానివాళ్ళం, మనస్సులు ఇచ్చిపుచ్చుకుని ప్రేమించి పెళ్ళిచేసుకోవాలనుకున్న మమ్మల్ని అనుమానించి రాధ మలినమైపోయిందనే అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నావే. బజారెక్కిన నీ కామేశ్వరీ కలాపం ఎంతమంది నోళ్ళల్లో పడ్డదో తెల్సుకోలేవేం. నీకు తెలియకకాదు, నీ తప్పు నీ మనస్సుకు నచ్చింది. ఆ తప్పుడు కళ్ళతో చూస్తుంటే నీకు అందరూ తప్పుగానే కనబడతారు. నీతిని దుయ్యబట్టటం ప్రధానం కాదు. అమలుపర్చటం ప్రధానం" అన్నాడు కుమార్ నవ్వుతూనే.

బావ మాట్లాడలేకపోయాడు. కూర్చున్నచోటినుంచి లేచాడు. ముగ్గురం ఇంటికి వెళ్ళాం. కుమార్ వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి బావ అక్కయ్యను కొట్టాడు. రాత్రంతా అక్కయ్య ఏడుస్తూనే ఉన్నది. ఆ మర్నాడు బావ నాతో అన్నాడు.

"కుమార్‌తో పరిచయం అయి ఎన్నాళ్ళయింది రాధా."

"మూడు నెల్లు."

"మనస్సులేనా శరీరాలుకూడా దగ్గరయాయా" కళ్ళల్లో కార్పణ్యం బుసకొట్టింది.

"అంత నీచత్వం మా వంశంలోనే లేదు."

"ప్రేమించటం మీ వంశంలో ఉన్నదా"

"ఆ"

"ఎవరు ఎవర్ని ప్రేమించి పెళ్ళిచేసుకున్నారేం."

"అక్కయ్య మొదట్నుంచీ నిన్ను ప్రేమిస్తునే ఉన్నది. బావను చేసుకోటానికి నాకేమీ అభ్యంతరంలేదనీ, ఇష్టమేననీ చాలాసార్లు చెప్పింది. అక్కయ్య నిన్ను ప్రేమించే చేసుకుంది" అన్నాను.

"కుమార్‌ని ప్రేమించినట్లు ఎన్నడూ చెప్పలేదేం."

"భార్యతోనే మనసిచ్చి మాట్లాటానికి ఏరోజూ నీకు మనస్కరించటంలేదు. అటువంటప్పుడు మరదలు ప్రేమకథ వింటారనే నమ్మకం ఎన్నడూ నాకు కలగలేదు" అన్నాను.

బావ లోపల్లోపలే పళ్లు కొరుక్కున్నాడు. నన్ను నమిలి మింగుదామన్నంత కోపం వచ్చింది. కళ్ళల్లో కార్పణ్యం దోబూచులాడింది.

"నీ ప్రేమాయణం వినవలసిన అవసరమూ, తీరికా నాకు లేదు. నీ ప్రవర్తన ఏం బాగుండలేదు రాధా, ఆ కుమార్ నిన్ను పెళ్ళి చేసుకుంటాడో లేదో నాకు తెలీదు కాని, ఈ తిరుగుబోతు మరదలు నా ఇంట్లో ఉండక్కర్లేదు" అన్నాడు.

అక్కయ్య, అత్తయ్య వణికిపోయారు. అక్కయ్య మాటలాడితే చావబాదేటట్లున్నాడు బావ. బావకళ్ళు చింతనిప్పులు రాల్చాయి. నాలో ఏదో మొండిధైర్యం ప్రవేశించింది. పిల్లిని తలుపులువేసి చావగొడితే కళ్లు పీకుతుందిట. బావ మాటలకు నాకు కోపం రాలేదు. జాలి వేసింది. నేను ఏడుస్తూ అవతలకు వెళతాననుకున్నాడు బావ, మనస్సులోనూ, ముఖంలోనూకూడా నాకు నవ్వే వచ్చింది

"సిగ్గూ, మానాభిమానాలూ వదిలిపెట్టినట్లు నీ ముఖమే చెప్తున్నది రాధా. ఛీ, ఇంత తెగిస్తా వనుకోలేదు" కసిగా, కోపంగా, అసహ్యంగా అన్నాడు నా నవ్వు వెనక్కుపోయి రోషమూ, అభిమానమూ ముందు కుర్చీలల్లో కూర్చున్నాయి.

"బావా ! సిగ్గు, అభిమానమూ, మానాభిమానాలూ నాకు లేవని నువ్వంటున్నావా? వాటివిలువ నీకు తెలుసా, అవి నీకు లేవనే యదార్థం యూనివర్సిటీలోనూ, చుట్టుపక్కలవాళ్ళకూ అందరికీ తెల్సు. మరదలు నా ఇంట్లో ఉండక్కరలేదంటే సంతోషంగా వెళ్ళిపోతాను. కాని ఈ ఇంట్లో తిరుగుబోతు యజమాని ఉన్నాడుకాని, తిరుగుబోతు మరదలు లేదు. కనుక ఈ ఇంట్లోనుంచి ఈ మరదలు వెళ్లనక్కరలేదు. సిగ్గూ,

అభిమానమూ మానాభిమానాలు ఉన్న భార్య కనుకనే నీ మటుకు నువ్వు వాటిని వదిలేసి అటువంటి ఆడదానితోనే తిరుగుతున్నావు. ప్రస్తుతంలో నువ్వు ఒకరిచేత చెప్పించుకునే పరిస్థితిలోనే ఉన్నావు కాని చెప్పే పరిస్థితిలో లేవు. చదువు ఉండి సభ్యతా, సత్ప్రవర్తనలేని మగవానికన్న, సభ్యతా, సంస్కారమూ, శీలమూ ఉన్న చదువులేని ఆడది వెయ్యిరెట్లు ఎంతో నయం" అన్నాను.

కొరకొరలాడుతూ నావైపుచూసి వీధిలోకి వెళ్ళిపోయాడు బావ. అత్తయ్య నావైపు కృతజ్ఞతతో చూసింది.

"ఎప్పటికయినా వాడికింత జ్ఞానోదయం కలగచేసేది నువ్వే నమ్మా రాధా, వాడేదో అన్నాడని మనస్సు నొచ్చుకోకు, ఈ ఇంట్లో నుంచి నిన్నువెళ్ళమనేహక్కు వాడికిలేదు" అన్నది అత్తయ్య. అక్కయ్య కూడా నా చేతులు పుచ్చుకుని బ్రతిమాలింది.

రోజులు గడుస్తున్నాయి. బావదృష్టి ఇప్పుడు నామీద పడింది. వీలయినంతవరకూ నాతో ఏవో వెఱ్ఱిప్రశ్నలు వేస్తూ మాటలాడాలనీ, నాతో కబురుచెప్పి నన్ను కవ్వించి, నవ్వించి, నా మెప్పుపొంది నన్ను లొంగతీసుకోవాలనీ బావ వాంఛ. ఎప్పటికప్పుడు తగినబుద్ధే చెప్తున్నాను. కాని అన్నింటికీ తెగించిన వ్యక్తి ఏమైనా చెయ్యగలడు. అదే నా భయం. ఎలాగో ఈఏడు గడిపితే వచ్చేఏడు హాస్టల్లో ఉంటాను." అన్నది రాధ బరువుగా నిట్టూర్చుతూ.

ఈ మాటలు విని నిర్ఘాంతపోయింది ధనలక్ష్మి.

"అంతవరకూ వచ్చిందా రాధా, చాచి లెంపలు వాయించక పోయావా ఆ పశువును" అన్నది కోపంతో.

"నిజమే. ఒక్కనిముషం పట్టదు. కాని ఫలితాలు అనుభవించాలంటే నా జీవితకాలమంతా సరిపోవచ్చు. అప్పుడు అక్కయ్యసంగతి ఎలావున్నా, నేను ప్రాణత్యాగం చెయ్యవలసిందే" అన్నది రాధ.

"మరి ఆ పశువుకు బుద్ధిచెప్పేది ఎలా."

"ఏనాటికయినా కామేశ్వరే చెప్తుందని నా ఊహ. అక్కయ్య జీవితం గౌరవప్రదంగా, అంతా హర్షించే తీరుగా, కష్టాలపాలైనా వెళ్ళి

పోతుంది. కాని బావకు తగింది కామేశ్వరి. తనమట్టూ తిప్పుకుంటున్నది. తిప్పితిప్పి విసిరి పారెయ్యగలదు. దేనికయినా రోజూరావాలి."

"అవును. నిజమే అదీ చూద్దాం" అన్నది ధనలక్ష్మి.

"ఇదీ మా అక్కచెల్లెళ్ళ చరిత్ర, బావుందా". అన్నది రాధ.

"చెల్లెలి ప్రేమఘట్టాలు మధ్యలోనే వదిలేశావ్. మరోసారి చెప్తావుకదూ" అన్నది ధనలక్ష్మి.

రాధ నవ్వుముఖంతో చూసి వెళ్ళిపోయింది —

• • • •

రోజులు గడుస్తున్నయ్యి. సుబ్బారావుదృష్టి సర్వత్రా రాధమీదనే ఉంటున్నది. ఏం జరుగుతుందోననీ, ఇంకా ఎంత అల్లరిపాలు కావలసి వస్తుందోననీ వేదవతి సతమతమైపోతున్నది. రాధ కోపంతో మాట్లాట్టమూ, సుబ్బారావు లేనినవ్వు తెచ్చుకుని మాట్లాటమూ వేదవతి ఎప్పుడూ చూస్తూనే ఉండేది.

ఒకరోజున సుబ్బారావూ, కామేశ్వరీ సినిమాకు వెళ్ళారు. సిద్ధాంత రీత్యాగానీ, పారమార్థిక చింతతో ఆలోచిస్తేకానీ, ఒకేరకమైన తప్పు కొందరికి ఒక దృక్పథంలోనూ, మరికొందరికి వేరొక దృక్పథంలోనూ కనిపిస్తుంది. సినిమాకు వచ్చిన వాళ్ళిద్దర్నీ చూసి తెల్సినవాళ్ళు అంతా తలోకరకంగా మాటలాడుకున్నారు.

"కామేశ్వరి అన్నింటికీ తెగించినవ్యక్తి. తల్లీ, తండ్రీ లేరు. ఏంచేసినా చెలామణి అవుతున్నది. అందుకు కామేశ్వరి తప్పులేదు. భార్యతో కాపురంచేసే సుబ్బారావుకు ఇదేం దుర్బుద్ధి" అన్నారు కొంతమంది.

సుబ్బారావు మగవాడు. ఆడది కామేశ్వరి తానై వెంటపడితే ఆ పరిస్థితిలో సుబ్బారావేకాదు, ఏ మగవాడైనా లొంగక తప్పదు. ఆడది అన్నీ వదులుకుంటే మగవాడి తప్పేముంది. అంతా కామేశ్వరిదే తప్పు"

అన్నారు మరికొంతమంది. ఎంతమంది ఎన్ని అనుకున్నా వాళ్ళిద్దరూ, హాయిగా, చక్కగా సినిమాచూసి వెళ్ళారు.

సుబ్బారావు ఇంటికి వెళ్ళగానే వేదవతి అడిగింది.

"సినిమాకు వెళ్ళారా."

"ఏం వెళితే."

"ఎందుకువెళ్ళారని నే ననటంలేదు. పొద్దుపోతేను అడిగాను. సరే భోజనానికి లేవండి."

"అక్కరలేదు."

"ఎందుకని."

"నా ఆకలిసంగతి నీ కెందుకు."

"నాకుకాక మరెవరికి" పొంగి పొర్లుకువచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ అన్నది వేదవతి.

"అవునవును. ఎప్పుడూ నీళ్ళకుండ నెత్తిన ఉంటుంది. ఈఏడుపు ముఖంకోసమనీ, సాటి ఆడదాన్ని చూసి ఓర్వలేని ఈ చుప్పనాతి దానికోసమనీ, ఈ పల్లెటూరి బైతుకోసమనీ నేను పాకులాట్టంలేదు. నీ ముఖం చూస్తుంటే ఆకలి ఎప్పుడో ఎగిరిపోయింది. ఆప్యాయంగా నవ్వుతూ పలకరించి, ఆదరించి, లాలించి కబుర్లు చెపుతూ, కడుపునిండా కమ్మని ఆధరువులతో భోజనంపెట్టే భార్యారత్నానివి ఉన్నావనే వాతావరణం నా కెప్పుడూ నువ్వు కలిగించలేదు. నా జీవితానికి అంతమాత్రం అదృష్టం కూడానా? ఆ ఆశ ఏనాడో అంతరించింది. నాకేమీ అక్కరలేదు కాని వెళ్ళిపడుకో, ఎప్పుడూ ఏడుపుముఖమ్మూ నువ్వూను" గదిలోకి వెళ్ళిపోయాడు సుబ్బారావు. కళ్ళొత్తుకుంటూ అతన్ని అనుసరించింది వేదవతి. అక్కా, బావల అనుకూల దాంపత్యాన్ని చూసి, వాళ్ళ మాటలు విని, వాళ్ళ హృదయాల్ని అర్థంచేసుకుని, అమాయకత్వంతో మెతక హృదయంతో ప్రాకులాడే ఆడదాని జీవితం ఇలాగేఉంటుందని వాపోతూ కూర్చుంది రాధ.

మరొక వారం గడిచింది. ఒకరోజురాత్రి రాధ మంచెమీద ఎవరో చెయ్యి వేసినట్లయింది. రాధ కళ్ళు తెరిచింది. సుబ్బారావు. దిగాలు పడి మంచం దిగి నిల్చుంది.

"ఏంబావా! నేను కావాలసివచ్చానా" తొట్రుపడుతూ భయంతో అన్నది.

"నీకోసమే వచ్చాను రాధా, అర్థంకాలేదా" నెమ్మదిగా అన్నాడు.

"ఈ పశువుని ఎప్పుడో అర్థంచేసుకున్నాను. నేను కామేశ్వరిని కాదు, మర్యాదగా వెళ్ళటం మంచిది" కోపంతో అన్నది.

"అవును నీ మర్యాద నాకూ తెల్సు రాధా, కుమార్ ప్రియురాలి వని బాగా తెల్సు" చెయ్యి పుచ్చుకోబోయాడు.

"అత్తయ్యా" అంటూ గావుకేకవేసింది రాధ. ఆ కేకకు వేదవతీ, అత్తగారూ లేచి వచ్చారు. నిశ్చేష్టుడై నిల్చున్నాడు సుబ్బారావు. తల్లికోపం శృతిమించింది. కొడుకు రెండు దవడలూ తనశక్తి కొద్దీ వాయించింది.

"విశ్వాసఘాతకుడా, రాధనికూడా, బ్రతకనివ్వదల్చుకోలేదురా, ఈ బ్రతుకు బ్రతికేకన్న నువ్వుచస్తే శని విరగడైపోతుంది. ఇంతమంది ఉసురుపోసుకునేకన్నా నువ్వు చస్తేనే మంచిది" అన్నదావిడ దుఃఖంతో కూడిన కోపంతో.

"అత్తయ్యా, అంతమాట అనకండి" అంటూ వేదవతి కుప్పన కూలిపోయింది. సుబ్బారావు తనగదిలోకి వెళ్ళిపోయాడు. ఆరాత్రి ఎవరికీ నిద్రలేదు.

మర్నాడు ఉదయమే రాధ ధనలక్ష్మి ఇంటికి వెళ్ళింది. అప్పటికి ఇంకా కాఫీ అయినా తాగని ధనలక్ష్మి అంత పొద్దున్నే వచ్చిన రాధని చూసి ఆశ్చర్యపోయింది. రాధ కళ్ళు ఎర్రబడి, ముఖంపీక్కుపోయింది. శోకదేవత మూర్తీభవించింది. ఆదుర్దాగా సంగతేమిటని ధనలక్ష్మి అడిగింది. అంతా చెప్పింది రాధ. కొంతసేపటికి ధనలక్ష్మి తేరుకుని,

"రాధా, నువ్వు ఇంక అక్కడ ఎంతమాత్రం ఉండవద్దు. నీ పరువు దక్కదు. ఈరోజే నీ మకాం ఇక్కడికి మార్చెయ్యి. ఈ పద్ధతి

మీ అక్కయ్యకూ, అత్తయ్యకూ కష్టం కలిగించవచ్చు. కాని ఈ పరిస్థితిలో ఇంతకన్న మార్గంలేదు" అన్నది ధనలక్ష్మి.

రాధ బావురుమని ధనలక్ష్మిని కౌగలించుకుని, కన్నీటితో ధనలక్ష్మి బుజాలు తడిపివేసింది.

"నా మనస్సులోనిమాట నువ్వే చెప్పావే ధనం. నేనూ అందుకే వచ్చాను" అన్నది రాధ.

ఇంటికివచ్చి మేనత్తతోనూ, వేదవతితోనూ తన అభిప్రాయం చెప్పింది రాధ. ఆవిడ ఈమాట వినేసరికి కళ్ళనీళ్ళుపెట్టుకుని "నేను బ్రతికి ఉండికూడా నిన్ను కాపాడలేకపోతున్నాను. మీ అమ్మ, నాన్నకు నా ముఖం ఎలా చూపించేది; వాడు అన్నింటికీ తెగించాడు. కామాంధుడికి నీతి నియమాలుండవు. నువ్వు వెళతానంటే నాకు ఏం చెప్పటానికీ నోరు రాకుండా ఉన్నది. పగబట్టిన త్రాచు ఎప్పటికయినా కాటువేస్తుంది రాధా. అత్తయ్యని క్షమించు. నేను నిర్భాగ్యురాల్ని. ఇటువంటి కొడుకుని కన్న పాపాత్మురాల్ని" అని రాధను కౌగలించుకుని ఏడ్చింది.

నిస్సహాయురాలిగా అలమటించింది వేదవతి.

"నువ్వెక్కడున్నా నాకళ్ళఎదుట ఉన్నట్లే ఉంటావే రాధా, ఈ అసహాయురాలు అక్కయ్యను మర్చిపోకు. అప్పుడప్పుడూ వచ్చి చూసి పోతూ ఉండు" అన్నది వేదవతి.

"మానవజన్మ ఎత్తాక బంధుత్వంకన్నా గౌరవమూ, పరువు ప్రతిష్టలే ఎక్కువ. పరువు మర్యాదలు పోగొట్టుకుని బంధుత్వంకోసం ప్రాకులాడేకన్న చావటమే మంచిది. నీతోపాటు ధనలక్ష్మికూడా నాకు అక్కయ్య. తనంతట తనే నాకు రక్షణ ఇస్తానన్నది. కృతజ్ఞతతో ఒప్పుకున్నాను. మీరేమీ బాధ పడకండి" అని తన బట్టలపెట్టె, పుస్తకాలు తీసుకుని రిక్షాలో వెళ్ళింది రాధ. సుబ్బారావు రాధ వెళుతుంటే ఏమీ అనలేదు.

రిక్షాదిగి ధనలక్ష్మిని చూడగానే రాధకు అభిమానంతో దుఃఖం పొంగి పొర్లుకు వచ్చింది.

"బావ చేతుల్లోనుంచీ తప్పించుకోటానికి మీ ఇంట్లో తలదాచుకుని మీకు ఇబ్బంది కలిగిస్తున్నాను. నా పరిస్థితి మీ వాళ్లకు చెప్పావా" అన్నది రాధ. ధనలక్ష్మి నవ్వుతూ అన్నది.

"రాధా! నువ్వు వేదవతికే కాదు, నాకూ చెల్లెలివే. నా కన్నా ఏడాది చిన్నదానివి. నాకు చెల్లెళ్ళు లేనికొరత నువ్వు తీర్చావు. మీ ఇంట్లో ఉన్నట్లే ఇక్కడా ఉండు."

జరిగిన పరిస్థితి తండ్రికి ఉత్తరం రాసింది రాధ. ఉత్తరం చేరగానే ఆయనా వచ్చాడు. అభిమానంతో తండ్రితో మాట్లాడలేకపోయింది రాధ.

"అన్నీ విన్నానమ్మా, నేను అక్కయ్యగారింటినుంచి వస్తున్నాను. నువ్వు మంచిపనే చేశావు. ఆత్మవిశ్వాసంతో నీ గౌరవం నువ్వు కాపాడుకున్నావంటే నేను చాలా సంతోషిస్తున్నాను. మీ ధనలక్ష్మి అక్కయ్య తల్లిదండ్రుల్ని చూసి వారికి నా ధన్యవాదాలు తెల్పుకుంటాను." అన్నాడాయన. రాధ నవ్వుతూ, ధనలక్ష్మివైపు చూసింది. ముగ్గురూ కలిసి ధనలక్ష్మి తండ్రివద్దకు వెళ్ళారు.

మాట్లాడలేక ఆయనచేతులు పుచ్చుకున్నాడు రాధ తండ్రి.

"రాధ మీకు కన్నకూతురు. నాకు పెంపుడు కూతురు. మా ధనలక్ష్మికి చెల్లెలులేని కొరత మీరూ తీర్చారు. నేనూ మీకు కృతజ్ఞుడినే" అన్నాడాయన.

రాధకు కావలసిన పైకం ఇచ్చి జరిగిన విషయాలు మర్చిపోయి శ్రద్ధగా చదువుకోమని చెప్పి వెళ్ళిపోయాడాయన.

రాధ ధనలక్ష్మి అప్పచెల్లెళ్ళమాదిరే ఉంటున్నారు. ఎంతమనస్సు సరిపెట్టుకుని ఉంటున్నా, ఏ విధమైన అభిప్రాయభేదాలు లేకపోయినా, అభిమానవంతులకు పరాయి ఇల్లు తమ ఇల్లుగా ఎన్నటికీ ఉండదు. ఒకరోజున ధనలక్ష్మి తల్లి రాధను అడిగింది.

"ఏమ్మా రాధా, ఎప్పుడూ ఏదో దిగులుగా, బిడియంగా ఉంటావు. మా ఇంటిలో నీకేమయినా అసౌకర్యంగా ఉన్నదా."

"ఏమీలేదండీ, మా ఇంటిలోకన్న కూడా చాలా బాగున్నది. నాకేమీ ఇబ్బంది లేదు. మీకు ఇబ్బంది కలిగించానేమోనని బాధపడు తున్నాను" అన్నది రాధ.

"ఎప్పుడూ అలా అన్నావంటే నాకు కోపం వస్తుంది రాధా, కోపం వచ్చిందా మీ బావగారింటికి పంపేస్తాను" అన్నది ధనలక్ష్మి. రాధ చిన్నబుచ్చుకున్నది.

మరొక పదిరోజులు గడిచాక రాధ, ధనలక్ష్మి కలిసి ఒక శలవు రోజున వేదవతిని చూట్టానికి వెళ్ళారు. వేదవతి ఖిన్నురాలయి కూర్చు న్నది. వీళ్ళని చూడంగానే కళ్ళు తుడ్చుకుని లేని సంతోషాన్ని తెచ్చు కుని ఆప్యాయంగా ఆహ్వానించింది. సుబ్బారావు ఇంటిలో లేదు.

"కులాసాగా ఉన్నారా, రాధ మిమ్మల్ని ఇబ్బంది పెడుతోందా" అన్నది వేదవతి.

"రాధకు ఏలోపమూ రాదు. మిమ్మల్ని చూద్దామనే వచ్చాం" అన్నది ధనలక్ష్మి.

"నాకు ఏ రోగమూ రాదు. ఈ కష్టాలకు నా జీవితం అలవాటయి పోయింది. కాని మీ బావకు జాతకాలపిచ్చి పట్టింది."

"అంటే" అన్నది రాధ.

"మా భార్యాభర్తలకు పొంతనలు కుదరలేదుట. మా జీవితాల్లో సుఖశాంతులు తక్కువట."

రాధ, వేదవతి ముఖావకంగా చూశారు.

"జాతకాలు మనుష్యులను మభ్యపెడతాయి. కొంతమందికి వాటి యందు నమ్మకం ఎక్కువ. కొంతమందికి నమ్మకం తక్కువ. ఏది ఏమైనా ఇదే తల్చుకుని మనస్సుని పాడుచేసుకోకండి" అన్నది ధనలక్ష్మి.

"అంతేకాదు. ఈ విషయంలో అత్తయ్యకూ నమ్మకం కలిగి మును పటిలాగా నా విషయంలో ఆదరణ చూపటంలేదు, ఆవిడకూ నామీద మనస్సు విరిగిపోయింది" అన్నది వేదవతి.

రాధతో మేనత్తకూడా మనస్సు విప్పి మాటలాడలేదు. ఏదో రెండు మాటలు మాటలాడి వంటింటిలోకి వెళ్ళింది. ఈ కొత్త సమస్యతో రాధమనస్సు విలవిల్లాడింది. వేదవతి బాగా దిగులుపడినట్లు గ్రహించింది —

ఆ నవల అంతవరకూ చదివిన భారతికి సుబ్బారావుపట్ల కొంతగౌరవం ఏర్పడినప్పటికీ మరోపక్క ఏహ్యభావంకూడా కలిగింది. "స్త్రీవిద్య పట్ల అతనికున్న గౌరవం మెచ్చతగిందే" కాని విద్యావతియైన స్త్రీపట్ల అతనికున్న విజువమాత్రం చాలా అసహ్యంగా ఉంది.

విద్యాధికులయిన భార్యాభర్తలు కలిసి వెళ్తుంటే చూడముచ్చటగా ఉంటుంది. విద్యాధికుడైన సుబ్బారావు పక్కన వేదవతికూడా విద్యాధికురాలయి నడుస్తున్నట్లుగానే భావించి, మనోవీధిలో సాగిపోతున్న ఆ జంటను చూసి చిన్న చిరునవ్వు నవ్వుకుంది భారతి....ఆ వెను వెంటనే తననూ తనభర్తనూ తలవనితలంపుగా,అనుకోకుండానేపోల్చిచూచుకుంది.

నారాయణమూర్తికి పెద్దగా చదువులేదు. అయినంతమాత్రాన తాను ఏదో లోటు అనుభవిస్తున్నట్లు ఏనాడూ అనుకోలేదు. తనకంటికి నారాయణమూర్తి బాగా విద్యాధికుడుగానూ,సంస్కారిగానే కనిపిస్తూ వచ్చాడు. ఆ మాటకొస్తే సుబ్బారావులోనే సంస్కారంలోపించింది. చదువుకున్నాడన్న మాటేగాని అతని ఆలోచనలూ, ఆచరణలూ బొత్తిగా సంస్కారం లోపించినవాడు చేసేవిగా ఉన్నాయి ...స్త్రీ విద్యపట్ల అతని ఆసక్తి విజ

మైన ఆసక్తి కాదు. చదువుకున్న స్త్రీని కేవలం తన ఆటవస్తువుగా ఉప యోగించుకోవాలనే, స్వార్థం అతనిలో నిండి ఉంది.

ఆమాటకొస్తే చదువుకున్నంతమాత్రాన ఎవరికైనా పెద్దసంస్కార మబ్బుతుందనుకోవడం పెద్ద పొరపాటు.... సుబ్బారావు లోపమంత గొప్ప సంస్కారం ఉంది. కామేశ్వరిలో ఏం సంస్కారముంది. తన భర్త లోనూ, వేదవతిలోనూ సంస్కారం ఏం తక్కువయింది. కాబట్టి చదువుకూ సంస్కారానికీ సంబంధంలేదు....

కాబట్టి సుబ్బారావులో ఉన్నది స్వార్థం, మూర్ఖపట్టుదల. ఇంకా చెప్పాలంటే పశుప్రవృత్తి. వేదవతే నిజంగా చదువుకుని పెద్ద విద్యా వంతురాలయితే సుబ్బారావు ఆమెను తమవెంట తిప్పుకుని నలుగురి ఎదుటా తిరగగలడా? ఆ విశాలహృదయం ఉంటుందా? తమభార్య నలుగురి ఎదుటా పడుతుంటే చూసి సహించగల ఓర్పు అతనిలోవుందా? తమభార్యలు అందంగా నాగరికంగా నలుగురి ఎదుటా పడకూడదు.... ఇతరులభార్యలను, ఇతరస్త్రీలను తమవెంట తిప్పుకుని ఆనందించాలి. సమాజంలో సుబ్బారావులాటి పురుషులు ఎంతమందో—చదువుతక్కు వయినప్పటికీ తనభర్త ఎంతోవుదారుడూ, విశాలహృదయుడుగానే భారతికి కనిపిస్తున్నాడు. అలాగే అతనిని ఆరాధించుకుంటోంది.

"ఏమిటి మేష్టారూ మీలో మీరే ఏదో నవ్వుకుంటున్నారు." ప్రమీల ప్రశ్నించింది.

"ఏంలేదమ్మా."

"నా రచననుగురించి కాదుకదా."

"కాదు."

"మరి."

"పొద్దుపోయింది పడుకో. రేపు మాటలాడుకుందాం" ఇద్దరూ నిద్రపోయారు.

నారాయణమూర్తి మద్రాసునుంచి తిరిగివచ్చినతర్వాత భారతి ప్రమీల రాసినకథనంతా టూకీగా చెప్పి "చూశారా సుబ్బారావుకు స్త్రీ

విద్యపట్ల ఎంత అభిమానమో!" వయ్యారంగా అతని ముఖంలోకి చూచి నవ్వింది. కాని నారాయణమూర్తి ముఖంలో సంతోషంగానీ మరే విధమయిన ఉత్సాహంకానీ కనుపించలేదు. పైపెచ్చు కొద్దిగా విసుగు ఛాయలుమాత్రం మెరిశాయి. ఎంతో ఉత్సాహంగా పరాచికంగా చెప్పిన భారతి మనస్సు కొంచెం చివుక్కుమంది.

మగవాళ్ళు ఏదో వ్యవహారాలమీద అనేక మూడ్సులో వుంటారనీ, అతనిమూడ్ గ్రహించకుండా త్వరపడి చెప్పడం తనపొరపాటేనేమోనని భారతి సర్దుకోబోయింది. అయినా ఊరుకోలేక "ఏమిటి, ఇవ్వాళ అదోమాదిరిగా వున్నారు" అని అతని బాధలో భాగం పంచుకోవడానికి ప్రయత్నించింది.

"ఎలా ఉన్నాను."

"మామూలుమాదిరిగా లేరు ఏదో పరధ్యాన్నంగా, విసుగ్గా కన్పిస్తున్నారు."

"చదువురాని ఈ శుంఠ ఎలావుంటే నీకేంటే" అని అనాలని నోటివరకూ వచ్చింది. కాని పైకి అనలేకపోయాడు. "అబ్బే అదేంలేదు" అంటూనే కూర్చున్న కుర్చీలోనుంచి లేచి బయటికి వెళ్ళిపోయాడు.

భారతిమనస్సు ఇప్పుడు నిజంగా చివుక్కుమంది. తనకుకూడా చెప్పడానికి వీల్లేని బాధేదో తనభర్త పడుతున్నాడు. ఏనాడూలేనిది తను అడుగుతున్నా చెప్పకుండా ఎందుకలా వెళ్ళిపోతాడు — ఎంతో తనలో తను మధనపడి ఆలోచించి చూచింది, "తనకు తెలియకుండా అతని మనస్సు కష్టపెట్టానా" అని. సమాధానంమాత్రం పొందలేకపోయింది. కనీసం కాఫీ తాగడానికికూడా భారతికి మనస్కరించలేదు ఆపూట.

తెల్లటి స్వచ్ఛమైన నీళ్ళకుండీలో ఒక్కరంగుచుక్కపడితే ఆ నీటిరంగే మారిపోతుంది. ఎంత ప్రయత్నించినా నీళ్ల వెనుకటి స్వచ్ఛతకు రావు. నీళ్ళు మరిగిమరిగి ఆవిరిరూపం దాలిస్తే తప్ప.

కాంట్రాక్టుల్లో చేరకపూర్వంవరకూ నారాయణమూర్తి భారతితో చాలా అన్యోన్యంగానే ఉంటూ వచ్చాడు. కాకపోతే అతనిమనస్సులో

తాను భార్యకన్న తక్కువగా—బాగా తక్కువగా — చదువుకున్నాననీ, భార్య తనకన్న ఎన్నోరెట్లు అధికురాలనీ, ఆమె సంపాదనపై తాను జీవించవలసి వస్తోందనీ లోలోపల బాధపడేవాడు. కాని భారతి ఆప్యా యంగా చిరునవ్వులు చిలకరిస్తూ దగ్గరకు వచ్చినప్పుడు ఆ బాధనంతా క్షణంలో మరచిపోయేవాడు. అంతటి విగర్వి, అందాలబొమ్మ, చదువుల సరస్వతి తనకు భార్యగా దొరికినందుకు వెంటనే లిప్తకాలం గర్వపడే వాడు. అలా క్షణం బాధా, క్షణం గర్వం, క్షణం సంతోషం, క్షణం విచా రంతో లోలోపల మధనపడుతూ జీవించేవాడు. కాని ఈ బాధనుమాత్రం భారతిముందు ఏ కోశానా బయట పడనిచ్చేవాడుకాదు.

తనకు చదువులేదు నిజమే. అది తనతప్పుకాదు. తనకు చదువు అబ్బలేదు. దానికి కారణాలు చాలా వున్నాయి. ఆమాత్రం నేరానికి వలచి వలపింపచేసుకున్న భారతిని ఎలా కాదని దూరం చేసుకోగలడు. చదువుకున్నదైనా భారతి తనను మనస్ఫూర్తిగా ప్రేమించింది. ఆ అదృ ష్టాన్ని వదులుకునే శక్తి తనలోలేదు. తనూ భారతిని ప్రాణంకంటే ఎక్కువగా ప్రేమించాడు. తమమధ్య "చదువు" అనే అంతరం ఒక్కటే అడ్డుతెరగా నిలిచి ఉంది. ఆ కాస్త అడ్డుకారణంగా చేచేతులా తాను తన భారతిని వదులుకొని జీవించలేడు. ఎవళ్లో ఏదో అనుకుంటారని తను బాధపడటం దేనికి. భారతి తనను యిష్టపడింది. తాను భారతిని యిష్ట పడ్డాడు. తనకు కలిగే ఈ అదృష్టానికి ఆ కాస్త అడ్డుతెరను లెక్కపెట్ట కూడదని నిశ్చయించుకున్నాడు—పెళ్ళిచేసుకున్నాడు.

పెళ్ళయి, భారతి ఉద్యోగంలో చేరినతర్వాత తనలోని పురుషత్వం ఏదో ఒకమూలనుంచి తనకు తెలియకుండానే ఎగతాళి చేయటం మొదలు పెట్టింది— "పోనీ భారతిని ఉద్యోగం మానిపిస్తే?" అని చాలాసార్లు ఊహించకపోలేదు—మానిపించి? ఎలా గడపాలి సంసారం? స్త్రీ సంపాదనతో గడపాలా? పురుషుడు తానేమీ అంగవైకల్యుడు కాదే— కాలూ చెయ్యీ, బుద్ధిబలం అన్నీ ఉన్నాయి—కాని చదువులేదు — తన

కెవరూ ఉద్యోగం యివ్వరు — యిచ్చినా అంతజీతం యివ్వరు — ఎలాగ మరి? — ఏం చేయాలి — అదీకాక భారతితో ఏ కారణంచెప్పి ఉద్యోగం మానమనాలి? — కారణం చెప్పకుండా మానేయమంటే "భర్త తనను అనుమానిస్తున్నాడేమో"నని భారతి బాధపడితే? — "కారణం ఫలానా — నేను పురుషుడనై ఉండి స్త్రీ సంపాదనమీద ఆధారపడి ఆత్మగౌరవం చంపుకోలేకుండా ఉన్నాను." అని చెపితే — అంతకంటే హాస్యాస్పదం ఇంకొకటి ఉంటుందా —" ఈ ఆలోచనలతోనే తాను సతమతపడుతూ వచ్చాడు. అందుకు ఆలోచించి ఆలోచించి అన్నివిధాలా అనుకూలంగా ఉంటుందనీ "భార్యకన్న ఎక్కువ సంపాదించవచ్చుననీ, తనూహాయిగా రొమ్ములు విరుచుకు నిర్భయంగా తిరగొచ్చనీ "ఈ కాంట్రాక్టుల వ్యాపారంలో ప్రవేశించాడు. స్నేహితుడు వెంకట్రావు పార్టనర్‌గా దొరకడం కూడా ఒకవిధంగా అదృష్టంగానే భావించాడు.

వెంకట్రావు తనూ చిన్నప్పటినుంచీ స్నేహితులు — ఒకరి మనస్తత్వం ఒకరికి బాగా తెలుసు — "ఒకరిని ముంచుదాము" అన్న మనస్తత్వం ఇద్దరిలోనూ లేదు — ఏదో యిద్దరూ కలిసి కష్టపడుతున్నారు. అభిప్రాయభేధాలు రాకుండా చెరికాస్త పంచుకుంటున్నారు లాభాల్లో. కొంచెం ఎక్కువలాభాలే వచ్చి డబ్బు కొంచెం ఎక్కువగానే వస్తోంది యిద్దరికీ —

నారాయణమూర్తికి తననుగురించి తాను ఎక్కువగా ఆలోచించుకునే వ్యవధి కలగటంలేదు.... డబ్బుసంపాదన బాగా ఉండడంలో తనలో వున్న ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ పూర్తిగా అంతరించిపోయింది. తిండీ తిప్పలూ వేళకూ పాళకూ సరిగ్గా ఉండక నల్లబడిపోతున్న భర్తను చూసి భారతి లోలోపల చాలా బాధపడేది. అనేకసార్లు చెప్పిచూపిందికూడా "ఎందుకొచ్చిన బాధండీ ఇదంతా — ఇప్పుడు మనకొచ్చే ఈ జీతం మనిద్దరికీ సరిపోదు కనకనా — పోనీ నీడపట్టున కూర్చుని సంపాదించే మార్గమేదైనా చూద్దురూ" అని.

కాని నారాయణమూర్తి ఆ మాటలు ఖాతరు చేసేవాడుకాదు. "నీ దంతా మరీ అబ్బరం. ఈ మాత్రంకూడా కష్టపడనీయకుండా నీ మొగుడ్ని మరీ సోమరిపోతును చేయకు" అనేవాడు నవ్వుతూ.

ఇలా సంసారం సాఫీగానే గడిచిపోతోంది.

వెంకట్రావుకూ నారాయణమూర్తికీ ఈ కాంట్రాక్టు వ్యవహారాల్లో స్నేహం మరింత దగ్గరపడింది. ఒకరిమనస్సుల్లో విషయాలు మరొకరిని అరమరికలు లేకుండా చెప్పుకోడం కొత్త కాంట్రాక్టులు వచ్చినప్పుడు ఇద్దరూ క్షుణ్ణంగా చర్చించుకోవడం ఒకరిమాటకు మరొకరు విలువ యిచ్చి గౌరవించుకోడం–ఇలా సాగిపోతోంది. ఇద్దరిమధ్యా రహస్యాలు లేవు—అరమరికలులేవు—

ఈ కొత్త వాతావరణానికి అలవాటుపడ్డ నారాయణమూర్తి ఇంటి విషయంలోగానీ, భారతి విషయంలోకానీ పూర్వమంత ఎక్కువగా అంటిపెట్టుకు ఉండేవాడుకాదు. ఎంతసేపూ ఆఫీసు, స్నేహితులూ, కొత్త కాంట్రాక్టులూ, ఆఫీసర్లు, వాళ్ళతో స్నేహం వాళ్ళకు కావలసిన సప్లయిలూ, కాంట్రాక్టుల్లో సుళువు మెళుకులు వాటిమీదనే ఎక్కువగా దృష్టిని సారించేవాడు.

సంపాదనలోపడ్డ భర్తనుచూసి భారతి లోలోపల భర్తఆరోగ్యం విషయంలో కొంత బాధపడినా అతని వ్యవహారాల్లో ఎక్కువజోక్యం కలిగించుకునేది కాదు. కాని నారాయణమూర్తే తనకు సమయం దొరికి నప్పుడల్లా అన్నివిషయాలూ భారతిముందు ఏకరువుపెట్టేవాడు అడిగినా అడక్కపోయినా.

రానురాను ఎవరిపనులు వారికీ ఎవరితొందరలు వారికీ ఏర్పడుతూ వచ్చాయి. ఉదయం తొమ్మిదిగంటలు దాటినతర్వాత భారతికి క్షణం నిలబడి మాట్లాడే అవకాశం ఉండేదికాదు వంటా, పెట్టా, ఆ రోజు కాలేజీలో చెప్పవలసిన పాఠాల ప్రిపరేషను,స్నానం, అలంకరణ ఇవన్నీ పూర్తిచేసుకుని అంగలువేసుకుంటూ కాలేజీకి వెళ్ళిపోయేది. నారాయణమూర్తికి వేరేవ్యాపకం లేనప్పుడు తనుకూడా త్వరత్వరగా

పనులు పూర్తిచేసుకుని భార్యతోపాటే భోజనం ముగించుకునేవాడు. అప్పుడు ఏ ఇబ్బందీ ఉండేది కాదు. కాని తాను కాంట్రాక్టుల్లో ప్రవేశించినతర్వాత భారతి పనులకూ కాలేజీ సమయాలకూ, నారాయణమూర్తి రాకపోకలకూ పొంతనకలవడంలేదు. భారతి ఒకొ్కక్కప్పుడు క్యారేజీలో సర్ది జాగ్రత్తగా ఒకపక్క ఉంచడమో లేక భర్త ఆఫీసుకు పంపడమో చేసేది. కాని ఒకొ్కక్కప్పుడు సరిగ్గా భారతి కాలేజీకి వెళ్లే సమయంలో నారాయణమూర్తి త్వరత్వరగావచ్చి "భారతీ! నేను కంట్రాక్టు పని మీద ఊరు వెళ్ళాలి, త్వరగా నీళ్ళతోడి అన్నం వడ్డించు" అని వచ్చేవాడు.

ఆవిడకు కాలేజీ తొందర -

ఆయనకు ఊరు తొందర -

అలాగే పనిలోపని భారతి భర్తకు కావాల్సినవన్నీ అమర్చి కాలేజికి లేటుగా వెళ్ళి చివాట్లుతినేది ప్రిన్సిపాలుగారితో.... భారతి పడుతున్న ఈఇబ్బంది మొదటిలో నారాయణమూర్తికి తెలియలేదు. మాటల ధోరణిలో ఇద్దరూ ఖాళీగా తీరుబడిగా ఉన్నప్పుడు భారతి బయటపెట్టేది. నారాయణమూర్తి బాధపడేవాడు.

"పోనీ వెధవ ఉద్యోగం మానేయరాదూ....మనకు కాంట్రాక్టులపై వచ్చే ఆదాయం మనిద్దరికీ చాలదు కనకనా" అనేవాడు.

"మంచివారే....ఏదోఒక రోజు ఇబ్బంది వచ్చిందని పాడికుండలాంటి ఉద్యోగం వదులుకుంటామా ఏమిటి"

నారాయణమూర్తి తర్వాత ఆ ప్రసక్తి వదిలేసేవాడు.

ఇలావుండగా నారాయణమూర్తి, వెంకట్రావు మద్రాసు వెళ్ళాల్సి వచ్చింది, ఉదయం పదిన్నరకు రైలు — ఖర్మంచాలక ఆరోజునే భారతికి కాలేజీలో పరీక్షలు ప్రారంభం — ఆవిడ తొమ్మిదిన్నరకల్లా తప్పనిసరిగా కాలేజీకి వెళ్ళితీరాలి. — ఉరుకులూ పరుగులతో పనులన్నీ పూర్తి చేసుకుని వంటచేసుకుని నాలుగు ముద్దలు నోట్లో కుక్కుకుని ఆదరా బాదరా

బయటికి వచ్చి యింటికి తాళం వేయబోతుండగా విసుగ్గా నారాయణ మూర్తి రిక్షా దిగాడు.

"ఇదిగో ఒక్క క్షణం వెనక్కిరావాలి—నాకు బండీ టైమయింది. సర్దుకోవల్సినవి చాలా ఉన్నాయి. అంతగా కాకపోతే ఈపూట కాలేజీకి శలవుపెట్టి కొంచెం నాకు కావల్సినవి చూడు." అని అడిగాడు, నారాయణమూర్తి—భారతి నవ్వుం విరిగిపోయింది.

"ఇదేమిటి. ఇవ్వాళే పరీక్షలు ప్రారంభం. ఇప్పుడు శలవు పెట్టినా ఆ శలవు ప్రిన్సిపాలు గ్రాంటుచెయ్యరు సరికదా ప్రిన్సిపాలుగారిచేత నానా చివాట్లూ తినాలి—బాబ్బాబు ఈపూటకు కొంచెం సర్దుకుందురూ." అని ప్రాధేయ పూర్వకంగా అడిగింది భారతి—

"అరే. నేను అర్జంటుగా ఊరికెళ్ళాలంటే అర్థంచేసుకోవేమిటి."

"మీరే నన్ను అర్థం చేసుకోవటంలేదు. మీ అవసరమే మీది గాని నా అవసరం గుర్తించడంలేదు." అన్నది భారతి అదోలా ముఖం పెట్టి.

నారాయణమూర్తికి కొంచెం కష్టం వేసింది. "సరే అయితే నీయిష్టం" అంటూ ముభావంగా అంటూనే గబగబా యింటి తలుపు తీసి లోపలికి వెళ్ళాడు. అతని ఉద్దేశ్యం భారతి తనను నిర్లక్ష్యంచేసి కాలేజీకి వెళ్ళదని—కాని తాను లోపలికి వెళ్ళి చెమటతో తడిసిన చొక్కా బనీనూ విప్పి భారతి కోసం వెనక్కుతిరిగి చూచినా భారతి ఉన్న అలికిడి వినిపించలేదు. ఆశ్చర్యంతో బయటికివచ్చి చూశాడు—సందు చివరిగా దూరంగా రిక్షాలో వెడుతున్న భారతిని చూశాడు—అతని అహం దెబ్బ తిన్నది—తనను నిర్లక్ష్యంచేసి భారతి వెళ్ళిపోయిందని భావించి చాలా బాధపడ్డాడు ...కాని అతనంత బాధపడతాడని భారతి ఊహించలేదు.... అంతే కాదు. ఆ సమయంలో దేనిని గురించి కూడా ఆలోచించే వ్యవధానం ఆమెకో లేదు. ఆవిడ మనస్సు అంతా కాలేజీమీదా జరగబోయే పరీక్షలమీదా ఉంది. తన భర్త తనను అర్థం చేసుకునే "సరే నీయిష్టం" అన్నాడనుకుని ఆమె వెళ్ళిపోయింది.

స్నానంచేసి బట్టలు వేసుకుంటుండగా వెంకట్రావు తన పెట్టె బెడ్డింగుతో సహా వచ్చేశాడు—

"ఏం అయ్యగారింకా తయారు కాలేదా ఏమిటి. అవతల బండి వచ్చే టైమయింది - మా చెల్లెమ్మగారిని వదల్లేకుండా ఉన్నావా— ఏమమ్మోయి త్వరగా పంపు మీ ఆయన్ను.... ఈ రాత్రికి మద్రాసు చేరక పోతే కొన్ని లక్షలు నష్టమవుతాయి." అని గుక్కతిరక్కుండా ఏకరువు పెట్టుకు పోతున్నాడు లోపల భారతి ఉందనే ఉద్దేశ్యంతో.

"చెల్లెమ్మాలేదు—నా పిండాకూడులేదు ఏయ్ రిక్షా ఈ పెట్టెకూడా రిక్షాలో పెట్టుకో" అంటూ నారాయణమూర్తి యింటికి తాళం వేసేశాడు.

"ఏమిటి నీ భోజనం మాట." ఆశ్చర్యంగా అడిగాడు వెంకట్రావు.

"ఎవరిక్కావాలిరా; నా భోజనం సంగతి—" అంటూ జరిగిందంతా టూకీగా చెప్పాడు.

అంతా విన్నా వెంకట్రావు "ఒరీ చిట్టి తండ్రీ—ఆవిడ పెద్దచదువు చదువుకుని పెద్ద ఉద్యోగం చేస్తూకూడా నీకు వండిపెడుతోంది. అందుకు సంతోషించు." అని వ్యాఖ్యానించాడు.

అతని ఉద్దేశ్యం భారతి చాలా వినయవిధేయతలగల మనిషనీ నిగర్వనీ, కాని నారాయణమూర్తి ఆ అర్థం చేసుకోలేదు.

చదువుకున్నవాళ్ళూ, పెద్దఉద్యోగం చేస్తున్నవాళ్ళూ మగడికిఅన్నం పెట్టకపోయినా, నిర్లక్ష్యం చేసినా నోరుమూసుకు ఊరుకోవాల్సిందే అని వ్యంగ్యంగా అన్నాడని అర్థం తీసుకున్నాడు. భారతి నిర్లక్ష్యంగా రిక్షా ఎక్కి కాలేజీకి వెళ్ళిపోయినదానికన్న ఈ వెంకట్రావు అన్న మాటలు పుండుమీద కారం జల్లినట్లు పనిచేసినాయి—నారాయణమూర్తిలోని ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు బాగా తలెత్తింది. తాత్కాలికంగా తన అపజయాన్ని, దాని తాలూకు ఉక్రోషాన్ని పైకి కనబడనీయకుండా అణగ ద్రొక్కుకున్నాడు.

ఒకొక్కొక్కప్పుడు కొన్నికొన్ని సంఘటనలు బహు చిత్రంగా జరుగుతూ ఉంటాయి. సంతోషంగా ఉన్నరోజునే సంతోషంమీద

సంతోషం సంఘటనలు కలిసొస్తాయి—అలాగే విచారకరంగా ఉన్నప్పుడే దెబ్బమీద దెబ్బ తగలడం కూడా కద్దు — అసలే భార్యమీద ఉడికిపోతున్న నారాయణమూర్తికి మద్రాసులో కొన్ని సంఘటనలు అగ్నిమీద ఆజ్యం పోసినట్లయ్యాయి—

మద్రాసులో అదొక పెద్దక్లబ్—వెంకట్రావు, నారాయణమూర్తి తప్పనిసరిగా ఆ క్లబ్‌కు వెళ్ళవలసి వచ్చింది. వెంకట్రావుకు ఈ క్లబ్‌లకు, పార్టీలకూ వెళ్ళడం బాగా అలవాటే—వ్యాపారంలో అతనికి కావలసిన పెద్దపెద్ద పనులన్నీ ఇటువంటి క్లబ్‌ల్లోనూ, పార్టీలలోనే పూర్తవుతూవుంటాయి—పార్టీ అంటే మామూలు పార్టీకాదు. కల్చర్డ్ పీపులు అనబడే పెద్దపెద్దవారు జరుపుకునే బుడ్డిపార్టీలు — ఆ పార్టీలలో తరతమ బేధాలుండవు—తాబేదారు.ఆఫీసరు అనబడే వ్యత్యాసాలుండవు—అంతా ఫ్రెండ్స్—పార్టీనిషా తగ్గేంతవరకూ ఒకరికొకరు ఎంతో ఆత్మీయులు—ఆ పార్టీలకు అలవాటయిన వాళ్ళలో పార్టీచేసే వాడంటే అమిత గౌరవం ఉంటుంది. అతని మనస్సు కష్టపెట్టడం సభ్యతకాదు—ఈ సభ్యతనే ఇంగ్లీషులో ఎటికెటీ అనే పేరుతో జాగ్రత్తగా వాడుకుంటారు—ఈ పార్టీలకూ క్లబ్‌లకూ పెద్దపెద్ద ఆఫీసర్లు, ఇంజనీర్లు, మాజీ మంత్రులు, చలామణీలో వున్న మంత్రులు అంతా వస్తూవుంటారు. బాగా చదువుకున్న కల్చర్డు లేడీస్ కూడా వస్తూవుంటారు.. కల్చర్డు అన్న మాటకు విడిగా ఏం అర్థమున్నదో తెలియదుగాని, ఇక్కడ మటుకు వికృతపు అలంకరణ, స్త్రీ పురుష బేధం లేకుండా ఉండటం. సాధ్యమయినంతవరకూ అర్ధనగ్నంగా ఉండటం.ఈ అర్థాలన్నీ చెప్పుకోవచ్చు—ఈ కల్చర్డు లేడీస్ సామాన్యులుకాదు—ఇక్కడికొచ్చే పెద్దపెద్ద ఆఫీసర్ల భార్యలే— వాళ్ళ దృష్టిలో మిగతా ఆడవాళ్ళంతా ఎటికెటీ తెలియని కల్చర్‌లేని ఛాందసపు పురుగులన్నమాట —

వెంకట్రావు చాలామటుకు, తన పెద్దపెద్ద కాంట్రాక్టులు, బిల్లులు ప్యాసు చేయించుకునే పనులూ, ఈ క్లబ్‌ల్లోనే పూర్తి చేసుకుంటూ వుంటాడు. పెద్దపెద్ద మినిష్టర్లనూ, ఆఫీసర్లనూ యింటిదగ్గరగానీ, ఆఫీ

సులోగానీ కలవదు — క్లబ్‌ల్లోనే వాళ్ళ స్నేహం — ఎంతెంత పనులయినా ఒక్క పెద్దపార్టీ యిచ్చి పూర్తి చేసుకుంటాడు — చిన్న ఎర చూపెట్టి పెద్దపెద్ద చేపలుపట్టగల నేర్పు అతనికి చాలా వుంది

"ఒరేయి నన్ను చంపకు నాకలవాటులేదు." అన్నాడు నారాయణ మూర్తి రహస్యంగా.

"వెధవ్వేషాలు వెయ్యకు. మరీ అంత మడికట్టుకు కూర్చుంటే ఈ సభ్య సమాజంలో నీవేం చెల్లుతావురా బ్రదర్ — ఎప్పటికెయ్యది ప్రస్తుతం పద్యం చదువుకోలేదూ — ఈ క్లబ్‌ల్లో తిరిగే ఆ కవిగాడు సుమతీ శతకం వ్రాశాడు." అన్నాడు వెంకట్రావు పకపకా నవ్వుతూ కోడిపలావు ముక్క నంచుకుంటూ — మిగతా పెద్దలంతా ఒకళ్ళ గ్లాసులకు మరొకళ్ళ గ్లాసు అంటించి "గో ఆన్ స్టార్టు" అనుకుంటూ గ్లాసులు మూతుల దగ్గర పెట్టుకున్నారు — నారాయణమూర్తి పని కుడితిలోపడ్డ ఎలికలా గుంది. అతనెప్పుడూ తనవూరుదాటి బైట ఊరికి వచ్చిన ఘటంకాదు. వచ్చినా ఏదో చుట్టాలింట్లో రెండురోజులు ఆతిధ్యం స్వీకరించి గుట్టు చప్పుడు కాకుండా పోవడమేతప్ప అసలిటువంటి క్లబ్‌లున్నాయన్న సంగతికూడా అతనికి తెలియదు — ఇప్పుడు తన కళ్ళయెదుట ఈదృశ్యం చూడకపోతే ఈ సభ్యులంతా తాగుబోతులూ అంటే చచ్చినా నమ్మేవాడు కాదు. అంతవరకూ ఎందుకు వెంకట్రావు తాగుతాడన్న విషయమే తనకు తెలియదు —

"ఒరేయ్, నీ వింత దిగజారిపోయావని నాకు తెలియదురా." అన్నాడు రహస్యంగా.

"దిగజారేదేముందిరా — రెండుపెగ్గులు వేసుకుంటే ఎంతవరకు ఎగబ్రాకుతామో, నీకే తెలుస్తుంది — కానీ కానీ — అలా బైతులాగ నీళ్ళు నములుతుంటే, వాళ్ళు అసహ్యించుకుంటారు — అలా కూర్చోడం ఎటికెసీకాదు." అన్నాడు వెంకట్రావు —

"సరే ఈగ్లాసులోది ఎలాగో గొంతుకలో పోసుకుంటాగాని ఈ పళ్లెంలోదిమాత్రం నావల్లకాదు. అది చూస్తేనే నాకు వాంతి వస్తోంది." ముక్కులు బిగపట్టి గాలి పీల్చడం మానేశాడు నారాయణమూర్తి.

"ఏమిటి అంటారు మీ ఫ్రెండు." అన్నాడు గుటకమీద గుటక వేస్తున్న పెద్ద ఇంజనీరు.

"మావాడు ఉత్త మేకలెండి. గడ్డి గాదం తప్ప విటమిన్లు పుచ్చు కోడు."

"యూ మీన్ — హీ ఈస్ ఎ ప్యూర్ వెజిటేరియన్."

సమాధానంగా వెంకట్రావు నవ్వాడు —

మొత్తంమీద క్లబ్ ధర్మమా అని వెంకట్రావు వచ్చిన పని అయి పోయింది — ఏభయి వేలు ఖరీదుచేసే బిల్లులు ప్యాసయిపోవడమేకాకుండా మరో పెద్ద కాంట్రాక్టుకూడా దొరికింది —

వెంకట్రావు ఏ ఆఫీసుకు వెళ్ళినా ఎంత చకచకా పనులు జరిగి పోతున్నాయో అతనికి ఎంత పలుకుబడివుందో చూసిన నారాయణ మూర్తికి మతిపోయింది. ఇతనితో భాగస్వామిగా కలవడం నిజంగా తన అదృష్టమే — వెంకట్రావు చెప్పినట్లు ఈ మేకమొహంచూసి ఎవడు పని చేస్తాడు కనక. వాళ్ళమధ్య తాను ఒక వెలివేయబడ్డవాడిలా తోచిం దతనికి —

మర్నాడు వెంకట్రావు నారాయణమూర్తీ హోటలుగదిలో హాయిగా పడుకుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

"బాబులూ ఎలావుందిరా — రెండు పెగ్గులకే అవుటయి పోయా వేమిట్రా." వెంకట్రావు నవ్వు నాపుకోలేకుండా అన్నాడు నారాయణ మూర్తి నుద్దేశించి....

"నాయనా నన్నెందుకు చంపుతావుగాని ఈ బయట పనులన్నీ నీవు చూసుకొస్తూ వుండు — నేను పని స్పాట్‌లో వుండి పని చేయిస్తూ వుంటాను."

"ఓరి పిచ్చినాయనా — జీవితంలో అన్నీ అనుభవించాలి — అన్నీ తెలుసుకోవాలి. ముఖ్యంగా మనంచేసే వ్యాపారానికి ఇవన్నీ చాలా అవ సరం — నేను మడి కట్టుకుని చింతకాయపచ్చడితో ఎంగిలిపడతానంటే

పనికాదు సరికదా నిన్నొక జంతువులాగ చూస్తారు నలుగురూ— ఒక్కొక్కప్పుడూ నీ వొక్కడవే వచ్చి పనులు చేసుకు రావాల్సి ఉంటుంది—నలుగురినీ పరిచయం చేసుకోమరి—పని జరిగే పరిచయం సంపాదించాలంటే ఇదే ఉత్తమమైన మార్గం."

"నా పిండాకూడు." అనుకున్నాగు నారాయణమూర్తి. ఇంతవరకూ ఈ జీవిత మర్మాలేవీ అతనికి తెలియదు మరి....ఇటువంటి కష్టాలు పడితేనే లక్షాధికారులు కావడానికి వీలు చిక్కుతుంది—లేకపోతే జీడీలు వర్తకుడిలాగ జీతపురాళ్ళమీదే ఆధారపడుతూ, పిట్టని కొట్టా పొయ్యిలో పెట్టా అన్నట్లు జీవితం చావూలేక బ్రతుకూ కాక సాగిపోతుంది—

"రేపు వెళ్ళి మీ ఆవిడతో చెప్తావుండు నీవు తాగావని." వెంకట్రావు నవ్వుతూ అన్నాడు.

"చెపితే చెప్పుకో — అయినా ఏమిట్రా నీ ఉద్దేశ్యం....అది చదువుకున్నంతమాత్రాన దాని అడుగులకు మడుగులొత్తుతూ హడిలి పోతాననుకున్నావా." అన్నాడు కొంచెం బాధగా....అంతమాట అనవలసిన అవసరం అప్పుడులేదు....కాని అతని మనస్సులోని గిల్టీ కాన్షస్సే ఆ మాట గబుక్కున బైటికి అనిపించేసింది. అతను యింటిదగ్గరనుంచి బయలుదేరినప్పటినుంచీ, భారతి కాలేజీకి వెళ్ళిన వైఖరీ వెంకట్రావు మాటలూ అవే మెదులుతున్నాయి మరచిపోదామనుకున్నా మరపు రాకుండా....

"అది సరేగాని వెంకట్రావు! ఆ క్లబ్‌లో ఆడవాళ్ళుకూడా మరీ అంత విచ్చలవిడిగా బరితెగించిపోయారు?"

"కల్చరాత్రి బాబూ—బాగా చదువుకున్నవాళ్ళకు ఆ పట్టింపులు ఉండవు. భర్త ఎదురుగా ఉన్నా సరే పరాయిమగాడితో ఫ్రీగా ఉంటారు. ఒకవేళ భర్త చూసినా వాటిని పట్టించుకోకూడదు—పట్టించుకోడుకూడా."

"అదేమిటి,"

"అదిఅంతే.... ఆవిడకు ఉండే బోయ్ ఫ్రండ్స్ ఆవిడకుంటారు. ఆయనకుండే గరల్ ఫ్రండ్స్ ఆయనకుంటారు. అదేమిటి అని ఎవ రయినా నీబోటివాడు అడిగితే వాడు ఉత్తవెర్రివెధవ అన్నమాట. అయినా బోయ్ ఫ్రండున్నంత మాత్రాన చెడిపోయిన వాళ్ళని ఎందు కనుకోవాలి."

"ఏడిశావు. వెధవకబుర్లు చెప్పకు—యవ్వనంలో ఉన్న స్త్రీ పురుషులు పరాయివాళ్ళయితేమాత్రం ఒకచోట కలిసిమెలిసి తిరిగితే మనస్సులు చలించవా ఏమిటి."

"ఒరేయి బాబులూ. నీవు రాములువారికాలంలో పుట్టవలసిన వాడివి పొరపాటున ఈ యుగంలో-కాదుకాదు—ఈ ఇరవయ్యో శతా బ్దంలో పుట్టావు, పడుకో పడుకో-నీకు చెప్పినా అర్థమయి చావదు." అంటూనే వెంకట్రావు మరోపక్కకు తిరిగి చూస్తూచూస్తూ ఉండగానే గుర్రుకొట్టడం ప్రారంభించాడు.

అంతలో అలా నిద్రపోతున్న వెంకట్రావును చూసి నారాయణ మూర్తి అసూయపడ్డాడు—అతనికి హాయిగా నిద్రపడుతోంది. వాడి మన స్సులో ఏ బాధలూ లేవు—ముఖ్యంగా వాడిభార్య బాగా చదువుకున్నది కాదు. అందుకనే అలా నిశ్చింతగా పడుకో గలుగుతున్నాడు. నారాయణ మూర్తికి అకస్మాత్తుగానే భారతి గుర్తుకొచ్చింది. భారతినిగురించి అలా అపోహపడటం చాలా తప్పు అని మనస్సు ఘోషపెడుతూనే ఉంది. తన భార్యంటే తనకు పూర్తినమ్మకం ఉంది—చదువుకున్న ఆడవాళ్ళం దరూ అంత నీచంగా ఎందుకుంటారు. ఆడది చదువుకున్నంతమాత్రాన అంత నీచంగా అంచనా కట్టడం చాలా పొరపాటు. విజ్ఞుడయిన వాడెవ్వడూ ఆపని చేయడు. భారతినిగురించి తనకు పూర్తిగా తెలుసు. భారతి ఎంతో ఉత్తమురాలు—

నిజమే—భారతి చాలా ఉత్తమురాలే—ఆమె మంచితనంగురించి అన్నిసార్లు తనమనస్సులో ఎందుకు నెమరువేసుకుంటున్నట్లు. ఒక్క సారి భారతి మంచితనం స్మరించి ఎందుకు మరచిపోలేకుండా ఉంటు న్నాడు. తనలోని గిల్టీకాన్షస్ తనకు తెలియకుండానే తనను రెచ్చ

గొట్టి వెక్కిరిస్తోంది — అసలు ఈ అనుమానం తనకు కలిగినట్టు భారతికి తెలిస్తే ఆవిడ ఎంత బాధపడుతుంది — ఛీఛీ. మనస్సు ఎంత చెడ్డది.

అయినా నారాయణమూర్తికి భార్యమీద కోపం చల్లారలేదు. ఆ చదువుకున్న కల్చర్డులేడీస్ చర్యచూసినతర్వాత భారతిమీద కోపం మరింత ఎక్కువయింది. ఎక్కువవడమేకాదు. లోలోపల దహించివేస్తోంది. కారణం ఏమిటి? ఏమో తనకే తెలియడంలేదు. "కారణం ఇది" అని తానే చెప్పలేకపోతున్నాడు.

పని అయిపోయిన మరునాడే వెంకట్రావు, నారాయణమూర్తి తిరిగి యింటికి వచ్చేశారు.

తన మనస్సులోనివ్యథ భారతికి ఏమాత్రం తెలియకూడదు. ఏమాత్రం తెలిసినా భారతి చాలా బాధపడుతుంది. తననొక నీచపు పురుగుక్రింద జమ కడుతుంది. ఛా-ఛా. ఏమాత్రం తెలియకూడదు. మద్రాసు వెళ్లే ముందు జరిగిన సంఘటనకూడా తాను పూర్తిగా మరచిపోయి, భారతి పట్ల ఆదరంగానే వ్యవహరించాలి. ఏమాత్రం నోరుజారినా తన సంసారంలో కలతలు బయలుదేరకమానవు. తనెంతో గాఢంగా ప్రేమించి పెళ్ళిచేసుకుని ఆరాధిస్తున్న భారతి మనస్సు తాను కష్టపెట్టకూడదు. ఈ నిశ్చయంతోనే మేకపోతు గాంభీర్యం తెచ్చుకుని, తనలోని కోపాన్నీ, అనుమానాన్నీ గట్టిగా అణచి మూతపెట్టి నవ్వుతూ సంచరించ

పులిమీఁ పుట్ర అన్నట్లుగా ఈ సమయంలోనే - ఈ మానసిక సంఘర్షణలోనే, భారతి ప్రమీల వ్రాసిన కథనంతా విడమరచి చెప్పి "చూశారా ఆ సుబ్బారావు భార్య చదువుకున్నదయి ఉండాలని ఎంత పట్టు పట్టాడో; అలావుండాలి. చదువుకున్న స్త్రీ తరహాయే వేరు." అంటూ ఏదో ఉపన్యాసం దంచింది. పాపం ఆవిడకేం తెలుసు దానివల్ల విపరీతమయిన పరిణామాలు ఏర్పడవచ్చునని. ఏదో సరదాగా స్త్రీ విద్యపట్ల

ఉండే గౌరవం కొద్దీ మాట్లాడింది. అసలే మానసికంగా క్షోభ అనుభవిస్తున్న నారాయణమూర్తికి భారతి మాటలు ఒక సవాలుగా తోచాయి.

ఎంతో అణచుకోవాలనుకున్న కోపం ఒక్కసారి పెల్లుబికింది. భారతిని నమిలి మ్రింగుదామనుకున్నంత కోపం వచ్చింది. కాని ఏం చేస్తాడు తను. భారతి బాగా చదువుకున్న సంస్కారి. తనకు చదువు రాదు. అంటే తనకు తగినంత సంస్కారంలేదు. ఈ మాటలు భారతి చెవినిపడితే తనను మరింత సంస్కారం లేనివాడిగా జమకట్టి బాధపడితే, భారతి బాధపడుతుంటే తాను చూసి సహించలేడు. అందుకనే ఎంతో అణచి పెట్టుకున్న ఆ కోపం చాలావరకూ తెరమరుగుకు పోయి కొద్దిగా మాత్రం విసుగురూపంలో అతని ముఖంమీద తాండవించింది. ధైర్యం చేసి భారతిముఖంలోకి చూడగల ధైర్యం అతనిలో లేకపోయింది. ఛీ- ఆ ఆలోచన రావడం తనతప్పే. తన నరాల బలహీనతే. ఈ ద్వందంలో పడి సమాధానం చెప్పలేక కూర్చున్న చోటునుంచి లేచి వెళ్ళిపోయాడు నారాయణమూర్తి. నారాయణమూర్తిలోని ఈమార్పు భారతికి ఎంత ఆలోచించినా అర్థంకావడంలేదు.

నాలుగయిదురోజులు గడిచాయి. ఆ గడిచినరోజులుకూడా తమాషాగా గడిచాయి. నారాయణమూర్తి చాలా కృత్రిమంగా లేని నవ్వును తెచ్చుకుంటూ, నాలుకచివర ప్రేమ నభినయిస్తూ, భారతిముఖం గట్టిగా చూడలేకుండాపోతూ లేని ఉత్సాహాన్ని కల్పించుకుంటూ వ్యవహరిస్తున్నాడు. భారతి ఈ విషయాలన్నీ పసికట్టలేకపోలేదు. కాని దాని కారణమే ఎంత బుఱ్ఱ బద్దలుకొట్టుకున్నా తట్టడంలేదు తనకి. సమయం చూసి అడుగుదామని భారతికూడా తటస్థంగా ఊరుకుంటోంది.

ఒకరోజున భారతీ, నారాయణమూర్తి ఒకరి సరసన ఒకరు కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేస్తున్నారు. నారాయణమూర్తి మాత్రం తనలోని భావాలను ఏమాత్రం బయట పడనీయకుండా పూర్వం కంటె ఎక్కువ ఆప్యాయంగా నవ్వుతూ పేలుతూ భోజనం చేస్తున్నాడు.

ఇంతలో పోస్టుమాన్ ఉత్తరం తెచ్చి లోపలికి విసిరి వెళ్ళిపోయాడు. భారతే లేచివెళ్ళి ఉత్తరం చింపి చూసింది. ఉత్తరం తన పేరటనే ఉంది. అంతా చదివిన భారతి ఉత్సాహంతో ఉండిపోతూ, "ఏమండీ. ఇవాళ రైల్లో మా మనోన్నూ, రాజాన్నూ వస్తున్నారు." అంది.

"ఎవరా మనో, ఎవరా రాజా?"

"మనో అంటేనే తెలియదా ఏమిటండీ. మా క్లాసు మేటు, మనోరమ."

"ఓహో ఆవిడా నీ పెళ్ళిలో నిద్దరోకూడా చెప్పులు విడవకండా ఎత్తుమడమల బూటుతో టకటకా తిరుగుతూ ఉండేది." వెటకారంగా అన్నాడు.

"చాలెద్దురూ మీ వేళాకోళం. అది ఆరోగ్య సూత్రాలు బాగా పాటించేది. అందుకు తగ్గట్టే పెద్దఫారిన్ రిటర్న్డు ఇంజనీరుకు పెళ్ళామయి కూర్చుంది. అదృష్టవంతురాలు" అంటూ స్నేహితురాలి అదృష్టం గురించి ఆనందంతో చెప్పుకుపోతోంది. కాని నారాయణమూర్తి మనస్సు గతుక్కుమంది. ముఖం చిన్నబుచ్చుకుని "అవును పాపం, నీవే దురదృష్టవంతురాలివి. చదువు సంధ్యాలేనివాడిని చేసుకుని కష్టాలు పడుతున్నావు. ఒకేచదువు చదువుకున్నా ఇద్దరి అదృష్టాలోనూ ఎంత తేడాయో చూశావా." అన్నాడు లేని నవ్వును తెచ్చుకుని పేలవంగా నవ్వుతూ. భారతి ఉత్సాహానికి సడన్‌బ్రేకు పడింది.

"అదేమిటి. మీరు మాట్లాడుతోందేమిటి. ఇప్పుడు అదృష్ట, దురదృష్టపు శకునలు దేనికి. నేను దురదృష్టవంతురాలినని మీతోకానీ, కనీసం కలలోగానీ నేను ఎప్పుడూ అనుకోలేదే. మీరెందుకన్నట్లు ఆ ముక్క." కటువుగానే అడిగింది. నారాయణమూర్తి కొంచెం సిగ్గుపడ్డాడు తొందరపడి ఆమాట అన్నందుకు.

"అదికాదు భారతీ. నీవనేదేముంది. నిజం అంతేకదా. నేను పెళ్ళిచేసుకుని నీకన్యాయం చేశాననే బాధ నాకే ఉండి అన్నాను."

కప్పిపుచ్చుకోబోయాడు ఏదో మాట్లాడబోయి. భారతిముఖం మరింత కటువుగా పెట్టి "ఏం, ఈ మధ్య కొత్తగా మీకు చాలా కొత్త ఆలోచనలు వస్తున్నట్లున్నాయి." అదోలా చూస్తూ అడిగింది. కప్పిపుచ్చుకోబోయిన నారాయణమూర్తి మరింత కుంచించుకుపోయాడు.

"అదికాదు భారతీ-"

"మీరేం చెప్పక్కర్లేదు. పూర్వం ఎప్పుడయినా మీకు చెప్పానో లేదో నాకు జ్ఞాపకంలేదు. ఇప్పుడు చెపుతున్నా వినండి. ఎంత ఒకే చదువులు చదువుకున్నా, అదృష్టాలకూ సంబంధం ఉండాలని లేదు. అయినా మనోరమలాంటి వెయ్యిమంది అదృష్టాలకన్న నా అదృష్టం ఏమాత్రం తక్కువయిందికాదు. ఇంకా చెప్పాలంటే వాళ్ళందరికన్నా నేనే ఎక్కువ అదృష్టవంతురాలిని. ఆ సంగతి మీరు గుర్తుంచుకోండి."

"ఏదోమాటవరసకు ఏదో అంటే ఏమిటలా ఇరిటేట్ అయిపోతావేం." ఓడిపోయినవాడు వేసే ఆఖరిబాణం ప్రయోగించాడు నారాయణమూర్తి. "పోనీగానీ రాజా ఎవరో చెప్పావుకావు."

"ఎవరనుకుంటున్నారు మీరు."

"బహుశా నీ బాయ్‌ఫ్రండయి ఉంటాడు."

బాయ్‌ఫ్రండు అన్నమాట నారాయణమూర్తిలోని మరో నారాయణమూర్తి చటుక్కున అనేశాడు. నారాయణమూర్తిలో ఒక పెద్ద బలహీనత ఒకటి ఉంది. అతనికి కపటం తెలియదు. లౌక్యం తెలియదు. మనస్సులో ఉన్నది దాచుకునే తెలివిలేదు. తనకు తెలియకుండానే మనస్సులో ఉన్నదంతా పైకివచ్చేస్తుంది.తర్వాత బాధపడతాడు. ఏం లాభం?

భారతి తదేకంగా నారాయణమూర్తి ముఖంలోకి చూసింది. ఎంత వెతికినా అతనిముఖంలో స్వచ్ఛత కనుపించటంలేదు, ఇదివరలో తనను హాస్యాలాడినా దానిలో స్వచ్ఛత, హుందాతనం కనుపించేవి. ఇప్పుడన్న మాటల్లో హాస్యంగానీ, వేళాకోళంగానీ కనుపించడంలేదు. కృత్రిమం, దొంగతనం కనుపిస్తున్నాయి. అతనలా ఎందుకు మాట్లాడుతున్నాడో?

భారతి ఆశ్చర్యానికి అంతులేదు. నిలదొక్కుకుని ఇలా అంది: "ఏమండీ. ఇవాళ నా దురదృష్టమేమో మీ మాటలవెనక ఏదో భావం నన్ను వెక్కిరిస్తూ కనిపిస్తోంది. ఏది ఏమయినా రాజా ఎవరో చెప్పడం నా విధి. అతను మనోరమకు అన్నయ్య. ఎం. డి. ప్యాసయ్యాడు. నేనంటే ఎంతో అభిమానం అతనికి. మనోరమను ఎంత ప్రేమగా చూసుకుంటాడో అంత ప్రేమగానూ నన్ను చూసేవాడు. ఒక్కమాటలో చెప్పాలంటే అతను నాకొక అన్నయ్య. అంతకంటే ప్రస్తుతం నేనేమీ చెప్పలేను." అనుకుంటూ కళ్ళు తుడుచుకుంటూ గదిలోకి విసవిసా వెళ్ళిపోయింది.

భారతి కంటినీరుచూసి నారాయణమూర్తి కుంచించుకుపోయాడు. తన ప్రవర్తన తనకే అసహ్యమనిపిస్తోంది. పూర్వపు నారాయణమూర్తికీ, ఇటీవలి నారాయణమూర్తికీ సంబంధంలేదు. ఆ తేడా నారాయణమూర్తికే తెలుస్తోంది. ఇప్పటి నారాయణమూర్తిలో అనుమానపు పిశాచం ఆవహించివుంది. ఎంత వదిలించుకోడానికి ప్రయత్నించినా అది వదలడం లేదు. ఆ అనుమానపు పిశాచమే నారాయణమూర్తితో ప్రమేయంలేకుండా నోటికి వచ్చినట్లల్లా మాట్లాడిస్తోంది అతనిని. అసలు నారాయణమూర్తికీ, అనుమానపు పిశాచం నారాయణమూర్తికీ మధ్యజరిగే మానసిక సంక్షోభం లోనుంచి-తీవ్రసంఘర్షణలోనుంచి ఏ క్షణాన ఏ మాట బయటికి వస్తుందో అతనికే తెలియడంలేదు. పాలసముద్రంనుంచి బయటపడ్డ హాలాహలాన్ని శంకరుడు మింగలేక కక్కలేకా ఎలా అవస్థ పడిపోతున్నాడో నారాయణమూర్తికూడా అలా అవస్థపడిపోతున్నాడు అశగలప్రతిరూపమే ఈ ప్రశ్నలవర్షం.

"అరే ఏమిటి దీనినింత సీరియస్‌గా తీసుకుంటావు. చదువుకునే రోజుల్లో తెలిసినవాళ్లెవరైనా ఉండకూడదా? శ్రేయోభిలాషులు, బంధువులు ఎవరయినా ఉండొచ్చు. అదేం తప్పుకాదే" అని ఏదో సర్దాలని తబ్బిబ్బు అయి చూశాడుగాని అప్పటికే భారతి తనగదిలోకి పోయి తలుపు వేసేసుకుంది.

నారాయణమూర్తి ముఖంమీద కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు.

"అరే. ఏమిటి నేనింత నీచంగా ప్రవర్తిస్తున్నాను. ఛీ. ఏమిటి నా ప్రవర్తన" అని తనలోతనే మరోప్రక్క ఆశ్చర్యపోయి సిగ్గుపడి దహించుకుపోతున్నాడు. భారతినిగురించి అతనిమనస్సులో ఏ దురభిప్రాయంలేదు. తనమనస్సు ఖచ్చితంగా చెబుతోంది. మరి తనెందుకు అలా మాట్లాడుతోంది. తన మనస్సులోని అనుమాన పిశాచం, గిల్టికాన్షస్ తననలా ప్రవర్తింప చేస్తోంది. సిగ్గుపడిపోతూ, తిరిగి భారతి ముఖం చూడగల ధైర్యంలేక నారాయణమూర్తి అడుగులో అడుగువేసుకుంటూ బయటికి వెళ్ళిపోయాడు.

# 8

సాయంకాలమయింది. ఎర్రగా జేగురుముద్దలా మండిపోతున్నసూర్యుడు మబ్బుతెరలను చాటుచేసుకునేసరికి తీక్షణత కొంత తగ్గినట్లనిపిస్తోంది. దానితో సంబంధంలేకుండా గంభీరంగా ప్రవహించే నదిమాత్రం సుడులు తిరుగుతూనే ఉంది. ఆ నదిని తదేకంగా చూడలేని నారాయణమూర్తి తనదృష్టిని చెట్లవైపూ, ప్రకృతివైపూ సారించాడు. ఎవ్వరితోనూ సంబంధంలేని పక్షిజంటలు హాయిగా మత్తుగా వినీలాకాశంలో ఎగిరిపోతున్నాయి. సుడులు తిరుగుతూ గంభీరంగా ప్రవహించే నదిని చూసిన నారాయణమూర్తికి భార్య భారతి జ్ఞాపకానికొచ్చింది. భారతి నిండుకుండ. ప్రతి చిన్నగాలికీ చలించదు.

కాని ఈరోజున పూర్తిగా చలించిపోయింది. ఇంత అవమానం, బాధా, తనెప్పుడూ పొందలేదు. అదికూడా తానుగా ఆరాధించుకుంటున్న భర్త నారాయణమూర్తివల్ల...తన తప్పేమిటి. తప్పుంటే సరాసరి నిగ్గతీసి అడిగి తప్పుంటే శిక్షించవచ్చుగా. గత కొద్దిరోజులుగా ఎన్నడూ లేనంత మార్పు తనభర్తలో ఎందుకు రావాల్సి వచ్చింది. ఇవే ఆమె ఆలోచన--తపనబాధ.

సరిగ్గా నారాయణమూర్తి కూడా ఇదే ఆలోచనలో మునిగి, తేలుతున్నాడు నది ఒడ్డున కూర్చుని.

"భారతి చేసిన తప్పేమిటి. ఏ తప్పూ లేనప్పుడు తను ఎందుకు మాటలతో, చేతలతో హింసిస్తున్నట్లు."

"వెంకట్రావు చెప్పినట్లు భారతిలో చదువుకున్న అహం ఏమయినా కనిపిస్తోందా ?"

లేదు.

"పోనీ క్లబ్బులకనీ, షికార్లకనీ తోటివారితో విచ్చలవిడిగా తిరుగుతోందా ?"

"లేదు."

"తనను నిర్లక్ష్యంగా చూస్తోందా ?"

"ఆనాడు పరీక్షలరోజున కంగారుపడి వెళ్ళడం తప్ప ఏనాడూ తనను నిర్లక్ష్యం చేయలేదే."

"మరేమిటి భారతి చేసినతప్పు."

ఏమీలేదు.

"మరెందుకు తనలా ప్రవర్తిస్తున్నట్టు ?"

సరైన సమాధానం దొరకలేదు. దొరికిన సమాధానాన్ని బయటికి ఒప్పుకోలేకపోతున్నాడు. తనకు తెలుసు, తనలోని అనుమానపు పిశాచమేనని...

తన పెళ్ళయి దాదాపు నాలుగేళ్ళయింది. ఈ నాలుగేళ్ళ జీవితంలో భారతినిగురించి పూర్తిగా అర్థం చేసుకున్నాడు. తన అదృష్టదేవత

తాను గట్టిగా ప్రయత్నిస్తే తనలోని పిశాచాన్ని అణగద్రొక్కి భారతితో యధాప్రకారంగా ఉండి మునుపటిమాదిరిగా హాయిగా జీవిత యాత్ర సాగించగలడు. అలా చేయడానికి కృతనిశ్చయుడయ్యాడు. అతి సుకుమారమైన భారతి మనస్సును తానే నలిపివేశాడు. తప్పంతా తనదే.

ఇక ఏమయినాసరే ఆ తప్పు కొనసాగడానికి వీలులేదు. అవసరమయితే భారతిని క్షమాపణ వేడుకోడానికికూడా సిద్ధపడ్డాడు. లోలోపల ఆమె ముఖం ఎలా చూడాలా అన్న భయంకూడా పడకపోలేదు. మనస్సు వేగిర పడటం మొదలుపెట్టింది. ఇక జాగుచేయడానికి వీలులేదు. భారతిని ఇంకా కష్టపెట్టకూడదు. వెంటనేలేచి అంగలో అంగవేసుకుంటూ ఇంటి ముఖం పట్టాడు నారాయణమూర్తి.

తలుపు దగ్గరగావేసుంది.పిల్లిలా జంకుతూజంకుతూ తలుపు తీసుకు లోపలికి వెళ్ళాడు. ఒక్కసారిగా ముఖమెత్తి భారతిముఖం చూడటానికి బిడియపడిపోతున్నాడు ఎదురుగ్గా భారతి మంచంపై బోర్లా పడుకుని వెక్కివెక్కి ఏడుస్తోంది. తలుపుతీసిన అలికిడయినా భారతి తిరిగి చూడ లేదు. తాను వచ్చినట్లుగా తెలియడానికి ఒకసారి గట్టిగాతెచ్చుకున్న దగ్గు దగ్గాడు. కాని భారతి తిరగలేదు. నెంపాదిగా వెళ్ళి మంచంమీద కూర్చుని లాలనగా భారతిని తనవేపుకు తిప్పుకున్నాడు. "క్షమించు భారతీ, నిన్ను చాలా కష్టపెట్టాను. ఇకనుంచి ఇలా ఎప్పుడూ జరగకుండా చూసుకుంటాను."

భారతి ఛర్రున మంచంమీదనుంచి లేచి నిలబడి "ఎన్నాళ్ళనుండి మీకీ అలవాటు." అని నిగ్గతీసి అడిగింది.

"అలవాటా ?" ఆశ్చర్యపోయాడు నారాయణమూర్తి. "ఇందులో అలవాటు అనేది ఏముంది. ఏదో వెర్రిభూతం నన్నావహించింది. పొర పాటుగా ప్రవర్తించాను."

"అదే. ఆ విషయమే అడుగుతున్నాను. ఆ భూతానికే ఎప్పటి నుంచి దాసులయ్యారని."

"కొంచెం విడమరచి అడిగితే సంతోషిస్తాను."

"ఎందుకు సంతోషించరూ. బాగా సంతోషిస్తారు. మీకు సంతో షించడానికీ, నన్ను ఏడిపించుకు తింటానికీ, నలుగురూ నాలుగువిధాల అనుకోడానికీ."

"ఏమిటి భారతీ. ఏమిటి నీవంటుది. నీవు మాట్లాడేదీ నాకేం అర్థం కావడంలేదు."

"అంత తేలిగ్గా మీకెందు కర్థమవుతుంది. పిల్లి పాలు తాగుతూ ఎవరూ చూడలేదనుకుంటుందిట. మీ దగ్గర తప్పించుకునేనా ఎదుటివాళ్ళ మీద పడి ఇష్టంవచ్చినట్లు మాట్లాడుతున్నారు. ఎన్నాళ్ళనుంచి ఈ అల వాటు మీకు."

"అలవాటా ? ఏమిటది."

"ఇంకా చెప్పాలా. సరే అయితే ఉండండి." అంటూ సుడి గాలిలా గదిలోకి వెళ్ళి నారాయణమూర్తి తాలూకు చిన్నసూటుకేసు తెరచి ఒక బ్రాందీబాటిలు తెరిచి టేబులుమీద పెట్టి "ఇప్పుడు చెప్పండి... దీని కలవాటయిందికాక, ఆమెకంటోపడి యింటిలోవాళ్ళను ఏడిపించుకు తినడం, లేనిపోని మాటలని కుళ్ళపొడవడం మీకేమైనా బాగుంది....ఇదేనా మీరుచేసే కాంట్రాక్టువ్యాపారాలు. ఇందుకేనా మీరు తరచూ ఊళ్ళుపట్టుకు ఊరేగుతోంది. చెప్పండి. చెప్పరేం." అని వెక్కి వెక్కి ఏడుస్తూ మంచంమీద కుప్పగా కూలిపోయింది.

నారాయణమూర్తి ముఖాన కత్తివేటుకు నెత్తురు చుక్కలేదు — తానొకటి తలిస్తే దైవం మరోవిధంగా తలచాడు తనతప్పు ఒప్పుకుని క్షమాపణ కోరుకుని సంసారం సుఖవంతం చేసుకోవాలని ఆశించాడు. ఈ బ్రాందిబాటిల్ దొరకడంతో "తాను తాగుడు కలవాటయి వళ్ళు పై తెలియక ప్రవర్తిస్తూ ఆమెకంతో అనరానిమాటలని తనని హింసిస్తున్నట్లుగా" భారతి అనుమాన పడుతోంది. నిజానికి తానుతాగిందే ఒక్కసారి. ఆ ముక్క చెప్పినా భారతి వినేటట్లుగాగానీ, నమ్మేటట్లుగాగానీ లేదు —

"ఆబాటిలు నాదికాదు. ఎవరికో ఆఫీసరుకు యివ్వడానికి తెచ్చాము. నీ ఇష్టము ఉంటే నమ్ము లేకపోతే లేదు."

"ఇదివరలో అయితే మీ మాటలు తప్పక నమ్మేదానిని. మీరు ఏ విషయం నాతో దాచకుండా చెప్పేవారు. నిజంగా మీది కాకపోతే అంత దొంగచాటుగా బట్టల అడుగున దాచడానికి ఎందుకు ప్రయత్నిస్తారు."

"అంటే నేను నా కోసమే ఆ సీసా తెచ్చుకున్నాననే నీవు అను కుంటున్నావా."

"నిజం చెప్పండి. నామీద ఒట్టువేసుకు చెప్పండి. మీరు త్రాగలేదూ...."

నారాయణమూర్తి పని కుడితిలో పడ్డ ఎలుకలాగ అయింది. తాను నిజంగా తాగింది ఒక్కసారి — తాగావనిచెపితే భారతి బాధపడు తుంది. పైగా ఈసీసా తనకోసమే తెచ్చుకున్నట్లు రూఢి చేసుకుంటుంది. తాగలేదనిచెపితే- చూస్తూ చూస్తూ భారతిమీద ఒట్టువేసుకుని అబద్ధం చెప్పడానికి అతనికి మనస్కరించడంలేదు — ఏం చేయాలి తను?

"ఏం మాట్లాడరూ? అప్పుడు ఏం మాట్లాడతారూ? మీ దగ్గర ఇన్ని తప్పులుంచుకునేనా నా ప్రవర్తనమీద అనుమాన పడుతోంది. ఏనాడైనా మీరు నన్నుగురించి కలలోనైనా వేరు విధంగా తలచారా? ఇప్పుడు మీ మనస్సు ఈ విషంతో కలుషితం కావటంవల్లే మీరు నా విషయమై నీచంగా మాట్లాడ గలుగుతున్నారు, ఊహించ గలుగు తున్నారు."

"నాకేం తాగుడు అలవాటులేదు. ఇష్టంవచ్చినట్లు మాట్లాడకు."

"నామీద ఒట్టువేసుకు చెప్పండి."

"ఒకసారిమాత్రం తాగాను. కాని ఈ బాటిల్ మాత్రం-"

"చాలు-చాలు. నా కిక చెప్పకండి. మిమ్మల్నెంత ప్రాణపదంగా ప్రేమించుకున్నానో, ఎంత అదృష్టవంతురాలినని గర్వపడ్డానో, ఈనాడు నా కంత శృంగభంగమయింది."-భారతి ఉక్రోషంతో ఉడికిపోతోంది.

"నేను ఎందుకూ పనికిరాని చవటనైనట్లూ, నీవే ఏదో నన్ను ఉద్ధరించడానికి ప్రేమించినట్లు మాట్లాడతావేం. నీవు చదువుకున్నదానివీ, నేను చదువురానివాడిననేగా నీ దెప్పులాట. నీ సంపాదనమీద బ్రతుకు తున్నాననేగా నీవంత అధికారం చెలాయిస్తూ మాట్లాడటం." రెట్టించాడు నారాయణమూర్తి.

"ఎవరన్నారూ ఆ మాట. మీ గిల్టీకాన్షస్ మీకలా అనిపిస్తోందేమో. అంటే, మీ ఉద్దేశం నేను భర్తను. నా యిష్టం వచ్చినట్లు నేను ప్రవర్తిస్తాను. నీ వెవరవు నన్నడిగేందుకూ అనా ?"

"నా ఉద్దేశ్యం అదికాదు. ఎంత చదువురాని భర్తనయినా నాకూ కొంచెం వ్యక్తిత్వం ఉంది. నీ సంపాదనమీద బ్రతకటం ఇష్టంలేకనే నేను కాంట్రాక్టుల వ్యాపారంలోకి దిగాను."

"అంటే మీ సంపాదనలోనే మీరు తాగాలని సమర్థించుకోడమా? మీ సంపాదన అయినంతమాత్రాన మీరు చెడిపోవడానికి మీకు హక్కుందన్నమాట. మనిద్దరిమధ్యా ఒక్క డబ్బుసంబంధం తప్ప వేరు బంధం లేదన్నమాట. ఇన్నాళ్ళనుంచీ మీరు ఆ ఉద్దేశ్యంతోనే సంచరిస్తున్నారన్నమాట. బాగుంది. చాలాబాగుంది. ఇన్నాళ్ళకయినా మీ నిజస్వరూపం అర్థమయింది."

"నాకూ అర్థమయింది. భార్యఅనే హక్కుతో నామీద జబర్దస్తీ చేయడానికిమాత్రం ప్రయత్నించకు." తీక్షణంగానే చెప్పాడు నారాయణమూర్తి.

భారతి మరీ ఉడికిపోయింది. "నేను మీమీద జబర్దస్తీ చేస్తున్నానా? తాగుబోతయిన భర్తనుచూసి భార్య కుమిలిపోవడంకూడా జబర్దస్తీకే వస్తుంది కాబోలు. నాకు తెలియదులెండి."

"ఎందుకు తెలియదు. చదువుకున్నదానివి ఆ మాత్రం తెలియకుండా ఉంటుందా."

"చదువు...చదువు...చదువు... మాట మెదిలితే నా చదువుమీద పడిపోతారు దేనికి. చదువుకూ సంస్కారానికీ చాలా తేడావుంది. మనిషికి చదువుకంటే కావలసింది సంస్కారం. సంస్కారం చదువుతో రాదు..."

"అంటే నాకు సంస్కారంకూడా లేదని చెప్తున్నావు. అంతేనా. మంచిది. చాలా మంచిది. వస్తాను. చదువూ సంస్కారం అబ్బిన రోజునే ఈ గుమ్మంలో అడుగుపెడతాను." అనుకుంటూ నారాయణ

మూర్తి విసవిసా బయటకు వచ్చి మెట్లు దిగుతూవుండగా టాక్సీ ఆగి అందులోనుంచి మనోరమా, మరోపురుషుడూ బహుశా రాజేమోనను కున్నాడు నారాయణమూర్తి, ఇద్దరూ టాక్సీ దిగారు. వాళ్ళను చూసి కూడా చూడనట్లుగానే నటిస్తూ నారాయణమూర్తి ముందడుగు వేయ బోయాడు.

"నమస్కారమండీ! ఏమిటిలా చూసికూడా పలకరించకుండా వెళ్ళిపోతున్నారు. ఇతను మా అన్నయ్య రాజా. ఇంతకూ భారతి ఇంట్లో ఉందా." అని అడుగుతూ వెంటబడింది మనోరమ.

"ఉంది. లోపల ఉంది వెళ్ళండి. అత్యవసర పనిమీద ఆఫీసుకు వెళ్ళాల్సి వచ్చింది. ఇప్పుడే వచ్చేస్తా. భారతి లోపల ఉంది."అంటూనే గబగబా వెళ్ళిపోయాడు నారాయణమూర్తి. అతని ప్రవర్తన కొంచెం బాధ కలిగించింది మనోరమకు. కనీసం "ఎలాసాగా ఉన్నారా" అనికూడా అడక్కుండా వెళ్ళిపోయాడే. "చదువుకుంటేకదా సంస్కారం అబ్బ టానికి" అని మనసులో అనుకుంటూ బాధగానే లోపలికి ప్రవేశించింది మనోరమ అన్న

# 9

"హల్లో భారతీ! ఏమిటే మీ అయనకు అమాత్రం మేనర్సుకూడా తెలియదు. మరీ అంత చదువురానివాడి నెలా చేసుకున్నావే." నవ్వుతూ లోపలికి ప్రవేశించింది. తానూ తనభర్త ఎంత కీచులాడుకున్నా తనభర్తమీద మనోరమ అలా కామెంటు చేయడం భారతికి కొంచెం బాధే అనిపించింది. మరొకళ్ళయితే తలవాచేటట్లు చివాట్లు పెట్టేదే. కాని ఎన్నాళ్ళకో ఇప్పుడు కలుస్తున్న ప్రియమైన స్నేహితురాలు మనో రమను తానేమీ అనలేకపోయింది.

"ఏమయిందే. ఏంజరిగిం దసలు."

"అదికాదు. మెట్లుదిగుతూండగా మేము టాక్సీ దిగాముకదా. విష్ చేయడంగానీ, కనీసం పలకరించడంగానీ చేయకుండా అలా మొర ఎగబట్టి వెళ్ళిపోతాడేమే మీ ఆయన."

"అదా. భలేదానివే మొత్తానికి. ఆయనగురించి నీకు పూర్తిగా తెలియక తొందరపడి ఒక నిర్ణయానికి వచ్చావు ఆయన నడవడిమీద... కాని ఆయన చాలామంచివారే. నా అదృష్టంకొద్దీ దొరికారు. వెధవ చదువు లేకపోతేనేం ఆయనకున్న కల్చర్ ఎవరికుందే."

"ఓహో కల్చర్‌గురించి నాకు తెలియదులే. ఇంటికొచ్చిన గెస్టును సరిగ్గా రిసీవు చేసుకోలేని కల్చర్‌కూడా గొప్పకల్చరే కాబోలు."

"పిచ్చిపిచ్చిగా వాగకు. అసలువిషయం నీకు తెలియదు. హైద్రాబాదునుంచి ఎవరో ఛీఫ్ ఇంజనీరు వచ్చాడట. సుమారు డబ్బయివేల రూపాయల బిల్లులు ఆగిపోయాయట. ఆయనతో ఆ వ్యవహారం మాట్లాడాలనీ త్వరత్వరగా వెళ్తున్నారు. మళ్ళీ ఆ ఛీఫ్ ఇంజనీరు ప్లేనులో వెళ్ళిపోతాడట."

"అదాసంగతి. మీ ఆయన అన్నివేలతో వ్యాపారం చేస్తున్నాడని నాకేం తెలుసు. అయినా వస్తూనే నీతో తగాదా పెట్టుకుంటున్నానేమిటి."

"మొదటినుంచీ నీకున్న జబ్బదేగా. ఏమిటే మనూ కబుర్లు.... లేలే. ముందు బాత్‌రూములోకిపోయి శుభ్రంగా కాళ్లూ, చేతులూ కడుక్కురా. చల్లబడతావు."

"ఏవండోయి వదినగారూ....ఎంతసేపూ మీ మిత్రురాలిని మర్యాద చేయడంతోనే సరిపోతోంది. ఇక్కడొక అర్భకుడుకూడా ఉన్నాడన్న విషయం మరచిపోకండి."

"అదేమిటి రాజా! నాకు నువ్వొకటీ మనూఒకటీనా ఏమిటి? ఇదిగో టవలు సోపు. ముందు కాస్తముఖం కడుక్కురండి."

రాజాను చూసి భారతి కలుక్కుమంది. రాజా చాలా మంచివాడు. తనంటే ఎంతో ఆపేక్ష అభిమానం. అసలే అనుమానంతో దహించుకు

పోతున్న మూర్తి రాజాను ఎట్లా అర్థంచేసుకుంటాడో. అసీకాక సరిగ్గా వీళ్ళు వచ్చేసరికి నడితుఫానులో మునిగి తేలుతున్న తాను గబుక్కున మూడు మార్చుకుని గెస్టుఁను రిసీవు చేసుకోలేకపోయింది. నారాయణ మూర్తిని గురించిన ఈ వ్యవహారం ఏ మాత్రం బయటపడినా, ఒకటి, తన భర్తను ఎదుటివారు అలక్ష్యంచేస్తే సహించలేకపోవడం, రెండు అటువంటి భర్తను చేసుకున్నందుకు తనసెంత దుయ్యబడుతుందో — ఈ రెండు కారణాలవల తాను మూర్తిని సమర్థించి తీరాలి భార్యాభర్తలన్న తర్వాత ఏదో కీచులాటలు వస్తాయి. అంతమాత్రంచేత తన భర్తను తానే అల్లరిపెట్టుకుంటే ఎట్లా. భర్త అల్లరిపడితే తాను అల్లరి పడ్డట్లు కాదా-తనసంసారం అల్లరిపడ్డట్లుకాదా-అందుకనే గుక్క తిప్పుకో లేక ఏదో నోటికొచ్చినట్లు అబద్ధాలాడి భర్త ప్రవర్తించిన తీరును సమర్థించి బరువుగా ఊపిరి పీల్చుకోగలిగింది.

"అదిసరేనే భారతీ. ఇంతవరకూ ఒక మేనల్లుడినికూడా యివ్వ లేదు. అదేమిటే అంత చిక్కి శల్యమయ్యావు. కళ్ళల్లో ఉన్నాయి ప్రాణాలు."

"నీ మొహంలే. మరీ విడ్డూరంగా మాట్లాడకు. నాకు వళ్లొచ్చిం దని నలుగురూ అంటుంటే."

"ఎవరే అపూల్సు నిన్నన్నది. వాళ్ళను కళ్ళజోళ్ళు వాడమని సలహా యివ్వు. అదీసరే, నీ అర్థాంగుడు ఈ రాత్రి ఎంత పొద్దుపోయినా కొంపకు చేరుకుంటారా లేక ఆకట్టే వంతెనలక్రిందే ఏదో ఒకవంతెనకింద పడి నిద్దరపోతాడా?"

"ఏమిటేవ్. మా ఆయనపై మరీ వంటికాలుమీద వెళ్తున్నావు. నీకళ్ళ కెలా కనిపిస్తున్నారేమిటి."

"నా కళ్ళకెలా కనుపించినా నీ కళ్ళకు దేవుడుగా కనుపిస్తున్నా డుగా."

"అందులో తప్పేమీలేదుగా, మనూ. నీవు వేళాకోళానికన్నా నిజంగా ఆయన నా పాలిట దేముడేనే."

"అబ్బబ్బ. ఒక్కమాటన్నానో లేదో ఎంత వెనకేసు కొస్తున్నావే తల్లీ. అదిసరేగాని కడుపులో మండిపోతోంది."

"నేను ఇందాకనే చెప్పాను. త్వరగా స్నానం చేసిరమ్మని... వంటయి సిద్ధంగానే ఉంది. మీకోసం ప్రత్యేకంగా ఈ పూటకు చెయ్యమన్నా చేసేదిలేదు."

"ఎంత తెగేసి మరీ చెబుతున్నావే. సరేకానీ అదేపెట్టు. కడుపులో బాధ చల్లారాలిగా. ఏమిరోయి డాక్టరుగారూ, నీ స్నానం అయిందా." మనోరమ రాజాను కేకేసింది.

"అయిపోయింది, వచ్చేస్తున్నా." బాత్‌రూములోంచి రాజా అరిచాడు.

"ఏమే మనూ. రాజా ప్రాక్టీసు ఎలా ఉందే."

"వాడికేమమ్మా. రెండుచేతులా సంపాదిస్తున్నాడు." అంటూండగానే రాజా బాత్‌రూములోనుంచి బయటికివస్తూ "పాపం. మా బావగారే, కానీ సంపాదనలేక కటకటలాడిపోతున్నారు వదినగారూ. ఆ యింట్లో ఇది ఎంత అవస్థపడిపోతోందని పాపం." మనోరమ నుద్దేశించి అన్నాడు.

భారతికి ఆ రాత్రి భోజనం చేయాలనిలేదు - నారాయణమూర్తి భోజనం చేయకుండా తానెలా భోజనం చేస్తుంది. అతను కోపంతో వెళ్ళిపోయాడు. ఇక అతనారాత్రి కోపంతో ఎక్కడా భోజనం చేయడు. నిజానికి తనకూ భోజనం చేయాలనిలేదు. అందుకనే డైనింగు టేబుల్ మీద వాళ్ళిద్దరికే వడ్డించింది.

"ఏమ్. కోతీ నీ భోజనం అయిపోయిందేమిటే అప్పుడే." మనోరమ అడిగింది.

"ఈపూట ఆకలేయడంలేదే. ఇటీవల అసలు రాత్రుళ్ళు అన్నం తింటే అరగటం లేదుకూడానూ." తప్పుకోవాలని చూసింది.

"ఇదిగో వెధవ్వేషాలెయ్యకు. వెళ్ళమంటే ఈ క్షణాన వెళ్ళిపోతాం. అంతేగాని నీవు పక్కనలేకుండా ఒక్క మెతుకుముట్టుకోము. రా. మర్యాదగా వచ్చి నీవుకూడా వడ్డించుకో." మనోరమ పట్టుబట్టింది.

"అదికాదే."

"ఏదికాదే వెఱ్ఱిమొహమా. వస్తావా రావా. లేకపోతే మమ్మల్ని కూడా లేచిపొమ్మంటావా."

భారతి భోజనంముందు కూర్చోక తప్పలేదు-కాదంటే రాకరాక వచ్చిన మిత్రురాలు, రాజా బాధపడేటట్లున్నారు. సభ్యతకోసం కూర్చోవలసివచ్చింది. కాని లోలోపల బాధగానే ఉంది. నారాయణమూర్తి కోపంతో వెళ్ళిపోయాడు. అతడు ఈరాత్రి పస్తుపడుకుంటాడు. అతను భోజనం చెయ్యకుండా తాను భోజనం చేస్తోంది. లేని ఉత్సాహాన్నీ, నవ్వునూ తెచ్చుకు మరీ భోం చేస్తోంది.

"ఏయ్. ఏయ్. నీకు మతిక్కడ లేదా ఏమిటిఖర్మ. నేనేం రాక్షసిననుకున్నావా, పోలేరమ్మననుకున్నావా. అంతంత వడ్డించేస్తున్నావ్ ఏకంగా" మనోరమ చేతు లెగరేసుకుంటూ హెచ్చరించింది భారతిని.

"ఫర్వాలేదులేవే, ఎప్పుడనగా తిన్నావో ఏమిటో...ఇదిగో ఈ వేపుడు నంచుకో మధ్యమధ్య." అంటూ బంగాళాదుంపల చిప్స వడ్డించింది.

"ఇలా చేసిపెడుతున్నావు కాబట్టే మీ ఆయన మరీ ఇడ్డెనుముక్కలాగ తయారయ్యారు." మనోరమ జోకుతో ఇల్లంతా నవ్వుల్తో మారుమోగిపోయింది.

నవ్వుల మధ్యలో తలుపుచప్పుడయి నారాయణమూర్తి లోపలికి ప్రవేశించాడు. అతనిమనస్సు ఏమాత్రం బాగుండలేదు. ఎప్పుడూలేనిది భారతితో అనవసరంగా దెబ్బలాడాడు. మనస్సంతా చీకాకుగా ఉంది.

"చదువూ సంస్కారం అబ్బినరోజునే గుమ్మంలో అడుగు పెడతాను." అని మాట మీద మాటరాగా అనేయడంమాత్రం అనేశాడు గాని తీరా బయటకు వెళ్ళి ఆలోచించుకునేసరికి అందులో తనతప్పుకూడా ఉన్నట్లు తెలుసుకుని గతం మరచిపోయి, భారతితో మామూలుగా ఉండటానికే నిశ్చయించుకు తిరిగివచ్చాడు. భారతికూడా జరిగినదానికి నిజంగా పశ్చాత్తాపపడే ఉంటుంది అనుకున్నాడు. నిజానికి భారతికూడా అనవసరంగా భర్తతో మాటా మాటా పెంచుకున్నందుకు బాధపడింది. ఒకవేళ భర్త తిరిగివస్తే తనతప్పు ఒప్పుకొని మనసారా ఆహ్వానించడానికి సిద్ధంగానే ఉంది.

తాను వచ్చేసరికి నవ్వుతూ పేలుతూ రాజాప్రక్కన కూర్చుని భోజనంచేస్తున్న భారతిని చూసి నారాయణమూర్తి కలుక్కుమన్నాడు. తాను వెళ్ళిపోయినందుకు భారతి ఏమాత్రం బాధపడటం లేదన్నమాట. తాను భోజనంచేయకపోయినా ఆవిడకేం దిగులులేదు. తనకంటె ఆ మిత్రురాలూ,రాజాయే ఎక్కువ తనకు,అవునుమరి. వాళ్ళు చదువుకున్నవాళ్ళూ, సభ్యత తెలిసినవాళ్లూ....తనదేం ఉంది — తనకు చదువులేదు. సభ్యత తెలియదు. స్పష్టంగా భారతి చెప్పినా తానే ఇంకా పట్టుకు పాకులాడుతున్నాడు. భారతి తనను ఇంత నిరాదరిస్తుందని కలలో కూడా అనుకోలేదు — ఇప్పుడు తనేం చెయ్యాలి. నవ్వుతూ పేలుతూ ఆనందంలో మునిగి తేలుతున్నవాళ్ళమధ్య తను ఒంటరిగా, అనామకుడుగా, చదువురాని శుంఠగా, పల్లెటూరి బైతుగా కూర్చోలేడు. ఆవిరిమధ్య ఉడకబెడుతున్నట్లుగా ఉంది అతనికి.

"ఏమిటి అన్నగారు ఆలోచిస్తూ అలాగే నిలబడ్డారు. రండి. రండి. మీరుకూడా మాతో జతకలవండి. సమయానికి మీరులేరే అనికూడా అనుకున్నాం. మీరు వచ్చారు. చాలా సంతోషం. అంతా కలసి సరసన కూర్చుని భోంచేద్దాం — వడ్డించు భారతీ, వారికికూడా వడ్డించు" అన్నాడు రాజా —

భారతి కలుక్కుమంది — మొదట తనకూ తనభర్తకే వండింది. కోపంలో నారాయణమూర్తి వెళ్ళిపోయాడు. ఇక అతను ఈ రాత్రికి రాడు

గదా అని మళ్ళీ వండటానికి బద్ధకించి వండిన ఆ అన్నమే వాళ్ళకు వడ్డించి తాను ఏదో కాలక్షేపంగా తింటూ నటిస్తోంది — ఉన్న అన్నం అయిపోయింది. మళ్ళీ వండాలి. ఇప్పుడు వీళ్ళ సరసనే కూర్చోపెట్టి పెట్టడానికి వీలులేకపోయింది. అది చెప్పడానికి ఇష్టంలేక "ఎందుకులే. తాను తర్వాత భోజనం చేస్తారు. వారికి కొంచెం ఆలస్యం ఉంటుంది. ఇంకా స్నానం గట్రా చేయాలి." అని మాటమార్చింది. నారాయణ మూర్తికి ఆ మాట కత్తితో పొడిచినట్లయింది "వాళ్ళంతా చదువుకున్న వాళ్ళు. వాళ్ళమధ్య కూర్చుని తినగలిగే అర్హత సభ్యత తనవద్ద లేవని కాబోలు భారతి అభిప్రాయం." అనుకున్నాడు.

"నీకా శ్రమేమీ అక్కర్లా. నా భోజనం, స్నానం అన్నీ అయి పోయాయి. నేను అర్జంటుగా మద్రాసు వెళ్ళాల్సి వచ్చింది. మీ భోజ నాలు కానీయండి. నాకు కావలసినవి నేను చూసుకుంటాలే," అంటూ విసవిసా గదిలోకి వెళ్ళిపోయాడు.

"అన్నగారు కట్టించే వంతెన ఎంతవరకూ వచ్చింది." మనో రమ జోక్ వేసింది నారాయణమూర్తిమీద.

"సమాధివరకూ." నారాయణమూర్తి కటువుగా చెప్పాడు. కాని అలా చెప్పినందుకు వెంటనే తనలో తనే నాలుక కరుచుకున్నాడు. సమాధా నానికి మనోరమతోబాటు రాజశేఖరం కలుక్కుమన్నారు. భారతి నడుం విరిగిపోయింది. అయినా ఊరుకోక మనోరమ "అంటే" అని రెట్టిం చింది —

భారతిమనస్సులో గిజగిజ కొట్టుకుంటోంది. తింటున్న ప్లేటు ముందునుంచి గబుక్కున లేవడానికి ఆత్మాభిమానం అడ్డువచ్చింది. అలాగే ప్లేటులో వేళ్ళు తిప్పుతూ ఆలోచనలో పడింది. నారాయణమూర్తికి కోపం తగ్గలేదు. పైగా తనమిత్రురాలిముందు తనను అవమానంచేస్తూ ప్రవర్తిస్తున్నాడు. లోపల ఎన్నికోపాలున్నా పైకి తనమిత్రులతో నవ్వుతూ మాట్లాడడం చేస్తే తానెంతో సంతోషించేది. వస్తూనే ముఖా వంగా, మూతిముడుచుకు నిలబడితే తన సంసారంగురించి మిత్రురాలు

గానీ, రాజాగానీ ఏమనుకుంటారు? తన సంసారం గుట్టు అంతా బయట పడిపోదూ. మరోపక్క సందర్భం తెలియని మనోరమ ఆయనతో జోక్సు వేయడం, ఆ జోక్సుకు ఆయన కట్టె విరిచినట్లు సమాధానం చెప్పడం తనకేం నచ్చలేదు. నచ్చక ఏం చేస్తుంది.

గబగబా పళ్లెంలో చెయ్యి కడుక్కుని తానుకూడా గదిలోకి వెళ్ళింది. నారాయణమూర్తి పెట్టె సర్దుకుంటున్నాడు.

"మీరిలా చేయడం నాకేం బాగుండలేదు. నా స్నేహితులముందు నన్నిట్లా హింసించినందువల్ల మీ కొచ్చేలాభం" రహస్యంగా ఉడుకు మోత్తనంగా అంది.

"అదే నేనూ అడుగుతున్నా—నీ మిత్రులముందు నన్నొక గాడిదగా చేసి ఆడించడం మంచిది కాదు. ఈ నీ ప్రవర్తన నాకే సిగ్గుగా ఉంది. నీవిలా తయారవుతావని కలలోకూడా అనుకోలేదు."

"మీరు పొరపడుతున్నారు. సావకాశంగా ఆలోచిస్తే మీ పొరపాటును మీరే తెలుసుకోగలుగుతారు."

"ఎవరి పొరపాట్లు వాళ్ళకు తెలిసిరావు — అడ్డులే — నేను వెళ్ళాలి—"

"మీ కాళ్ళు పట్టుకుంటా-రాకరాక వచ్చిన మా మిత్రురాలిముందు నన్నవమానంచేసి సంసారం వీధిపాలు చేయకండి—నేనది సహించ లేను."

భారతి నారాయణమూర్తి కాళ్ళమీద పడింది.

నారాయణమూర్తి విదిలించుకుని బయటికి వెళ్ళిపోయాడు. వెళ్ళి పోతున్న నారాయణమూర్తిని చూసి రాజా, మనోరమా తెల్లబోయారు.

భారతి ఉక్కిరిబిక్కిరయింది. కడుపులో దేవినట్లయింది. ఒక్క సారి కళ్ళు తిరిగాయి. దానితో ప్రపంచమంతా గిర్రున తిరుగుతున్నట్లయి పోయింది. ఎంత అణుచుకుందామని ప్రయత్నించినా అణగకుండా పెద్ద వాంతయిపోయింది. భారతికి యింకా కళ్ళు తిరుగుతూనే ఉన్నాయి.

ఏదో శబ్దంవిన్న రాజా, మనోరమా చేతులు కడిగేసుకుని ఆదరా బాదరా గదిలోకి పోయి చూసేసరికి వాంతి మధ్యలో పడివున్న భారతి కనుపించింది. కంగారుతో యిద్దరూ భారతిని ఎత్తి మంచంమీద పడుకో పెట్టారు. రాజా భారతి నాడిపరీక్షచేసి చూశాడు.

"రాజా. పరుగెత్తి కెళ్ళి వీధిలో ఆయనున్నారేమో చూడు." మనోరమ తొందర పెట్టింది.

రాజా ఒక్క పరుగులో వెళ్ళి వాకిట్లో చూశాడు. పెట్టె పుచ్చుకు దూరంగా నడిచివెళ్తున్న నారాయణమూర్తి కనుపించాడు. రాజా కేకలు పెట్టుకుంటూ బజారువెంట పరుగెత్తాడు. వెనక్కుతిరిగి చూసిన నారాయణమూర్తి ప్రక్కసందులోకి మలుపు తిరిగాడు. మరి కనుపించలేదు.

రాజాకు నారాయణమూర్తిపై అసహ్యం, కోపం ముంచుకు వచ్చాయి.

"ఎటికెసీ తెలియని బ్రూట్" అని లోలోపల శపించాడు. అతనికి ఏం చేయడానికీ తోచక ఎందుకయినా మంచిదని ఒకరిక్షా పిలిచి "మంచి లేడీ డాక్టరు యింటికి పోనీ" అన్నాడు.

భారతి కళ్ళు తెరిచింది.

"ఎలా ఉందే. ఏమయిందసలు." మనోరమ ఆప్యాయంగా తల నిమురుతూ అడిగింది స్నేహితురాలిని.

"అబ్బే. ఏమీకాలేదు. వారు ఊరు వెడతానంటే బట్టలు సర్ది పెట్లో పెడుతున్నాను. ఇంతలో తిప్పులాగ వచ్చింది." కళ్ళనీళ్ళు తుడుచుకుంది భారతి.

"బట్టలు-నీవు-సర్ది పెట్టెలో పెట్టావా—భారతీ! ఎందుకే యింక నన్ను మభ్య పెట్టడానికి ప్రయత్నిస్తావు. అయితే ఎన్నాళ్ళనుంచి సాగుతోంది నీ సంసారం ఇలాగ" నిగ్గతీసి బాధగా అడిగింది మనోరమ.

"అబ్బే. అదేంలేదే—నీవేదో పొరపాటు అభిప్రాయం పడుతున్నావు." తొట్రుపడుతూ కప్పిపుచ్చుకోడానికి ప్రయత్నించింది భారతి కళ్ళు మూసుకునే—

కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి. సూది కిందపడితే చప్పుడయ్యే నిశ్శబ్దం — భారతి కళ్ళుమూసుకునే ఉంది త్రినేత్రుడు మూడో కన్ను తెరిస్తే లోకాలన్నీ భస్మీ పటలమయి పోతాయట. భారతి కళ్ళు తెరిచి సూటిగా మనోరమవైపు చూడగలిగితే భారతి ఏమయిపోతుందో. భారతిలో శగలు జిమ్ముతూ లోలోపల కుమిలి దహించివేస్తున్న అగ్ని ఒక్కసారిగా పర్వతంలా పగిలి లావా ఎగజిమ్మగలదు — ఆ వేడికి, ఆ బాధకు, ఆ ఆత్మాభిమానానికి భారతి తట్టుకోలేకపోవచ్చు. అందుకనే కళ్ళు గట్టిగా మూసుకు పడుకుంది కళ్ళయితే మూసుకోగలిగిందిగాని చెవులుమాత్రం బాగా పనిచేస్తూనే ఉన్నాయిగా. ఆ నిశ్శబ్ద, నిశీధి వాతావరణాన్ని చీల్చుకుని ఆక్రందనలాంటి వేడి ఊపిరులు, బరువైన ఎక్కిళ్లు వినబడి ఆశ్చర్యంతో భారతి కళ్ళు విప్పిచూసింది. మనోరమ వెక్కి వెక్కి ఏడుస్తోంది. పద్మంమీదనుంచి జాలువారిన మంచుబిందువుల్లా మనోరమ చెక్కిళ్ళమీదినుంచి కన్నీటిబొట్లు రాలి భారతి నుదుటిమీద పడ్డాయి భారతిఆశ్చర్యానికి అంతులేదు. ఇదేమిటి. నవ్వుతూ పేలుతూ ఉండే మనోరమేనా ఈ ఏడ్చేది? కారణం అర్థంకాలేదు — భారతిలో శగలు జిమ్ముతున్న మానసిక సంక్షోభంకూడా లిప్తకాలం మరుగున బడిపోయింది.

"ఏమిటే మనూ, ఏమిటిది. నీకేమైనా కష్టం కలిగించి ఉంటే క్షమించు." అంటూ ఉద్విగ్నంగా లేచి మనోరమకు మరింత చేరువగా వచ్చింది.

"భారతీ! నీవూ నేనూ ప్రాణాలొకటిగా పెరిగాము — నీ ఆనందమే నా ఆనందంగా, నీవు నాకు దైవమిచ్చిన అక్కగా భావించి నిన్నెంతో ప్రేమించి అభిమానించాను. మనిద్దరిమధ్యా ఎరమరికలు రహస్యాలూ లేవని మనస్ఫూర్తిగా ధృఢంగా నమ్ముకున్నాను. నీవెంతో సుఖంగా ఉండాలని నీ భావి జీవితాన్నిగురించి ఎన్నెన్నో ఆశలు పెంచుకున్నాను. ఆశలసౌధం నిర్మించాను. కాని ఈరోజున తెలుసుకున్న పరమసత్యంతో అర్థమయింది. నేనెంత అజ్ఞానంలో ఉన్నానో. మంచిదే

భారతీ, నిన్నుగురించీ, నీ సంసారంగురించీ, నీ భర్తనుగురించీ వివరాలు ఇక తెలుసుకోవాలని కోరుకోడంకూడా చాలా పొరపాటు—వస్తాను." అంటూ మంచంమీదినుంచి ఏదో పిచ్చిదానిలా, మతి చలించినదానిలా ఏం మాట్లాడుతోందో, ఎందుకు మాట్లాడుతోందో తెలుసుకునే స్థితిదాటి పోయి మరీ లేచింది. భారతి మరీ మరీ తెల్లబోయింది—ప్రస్తుతం తాను ఏ పరిస్థితిలో ఉన్నదీ కూడా మరచిపోయి, లేచిపోబోతున్న మనోరమను దగ్గరకు లాక్కుని,

"క్షమించు మనూ—నిన్ను ఎంతలా కష్టపెట్టానో తెలుసుకుని సిగ్గుతో కుంచించుకుపోతున్నాను. నీవు నాకు సహపాఠివే కాదు, స్నేహితురాలివేకాదు నా ప్రియమైన చెల్లివికూడా. మనిద్దరిమధ్యా రహస్యాలు ఉండకూడదు. అంతా చెప్తాను, నా సంసార పరిస్థితి విడమరచి మరీ చెప్తాను. ఇందులో నా తప్పేమయినా ఉంటే నీ యిష్టం వచ్చిన శిక్షవిధించు. కాదనను. ఎంతో కాలానికి ఈ అక్కను చూద్దామని వచ్చిన నీకు, మా సంసారంలో అకస్మాత్తుగా వచ్చిన ఈ తుఫానువల్ల బాధ కలగగూడదనే కారణంచేతనే మా మధ్య కలిగిన కలతలు నీకు తెలియకుండా దాచి కప్పిపుచ్చుకోడానికి ప్రయత్నించాను—అంతకుతప్ప వేరే ఏమీకాదు. నా మాట విను. నన్ను అపార్థం చేసుకోకు. నీవు బాధ పడితే నా మీద ఒట్టే."

మనోరమ శిలా ప్రతిమలా కూర్చుండి పోయి,

"ఎన్నాళ్ళనుంచి మీ యిద్దరిమధ్యా ఈ కలతలు."

"ఒట్టు—నీమీద ఒట్టు. ఇటీవలినుంచే. అంటే సుమారు నాలుగయిదు రోజులనుంచి అంతే, నా మాట నమ్ము చెల్లీ." అంటూ జరిగిందంతా పూసగుచ్చినట్లు మనోరమకు విడమరచి చెప్పింది.

"నన్ను అపార్థం చేసుకున్నందుకుకూడా నేను బాధ పడటంలేదే మనూ—తాగుతున్నారని తెలిసింతర్వాతకూడా నే నెట్లా తట్టుకోగలనో నీవు చెప్పు."

"భారతీ! నీకు జ్ఞాపకముందా — మన హాస్టల్లో ఒక పనిమనిషి ఉండేది — అది ఒకరోజున మన గదిలోకి వచ్చి భోరు భోరున ఏడ్చింది —"

"అవును. అది కష్టపడి పాచిపనిచేసి గడించి తెచ్చుకున్న డబ్బును దాని మొగుడు తాగుడుకోసం ఎత్తుకెళ్ళి, అదేమిటని అడిగి నందుకు దానిని పట్టుకు చావ చితక కొట్టాడని ఫిర్యాదుచేసింది."

"అవును — ఆ పైడమ్మ భర్తకూ, మీ ఆయనకు ఏమిటి తేడా."

భారతి ఒక్కసారిగా గాలివానలో పట్టుతప్పిన లేతీగలా వణికి పోయింది. అంతేకాదు. పైడమ్మ భర్తతో తనభర్తను మనోరమ పోల్చినందుకు సిగ్గు, కోపం, అవమానంతో దహించుకుపోయింది. ఏం సమాధానం చెప్పాలో ఎలా చెప్పాలో తెలియక పిచ్చిదానిలా "మనూ — ఏమిటే — ఏమిటే నీవన్నది?" పైడమ్మ భర్తకూ నా భర్తకూ తేడా లేనేలేదా? కంపించే కంఠంతో విలవిలలాడిపోయింది.

"అవునే. ఉన్నమాటే అన్నాను. ఆ రోజున పైడమ్మతో నీవన్న మాటలుకూడా నీకు గుర్తు ఉన్నాయనుకుంటాను"

"ఉన్నాయి. ఎందుకూరుకున్నావు పైడమ్మా, వెంటనే నీ మొగుడిని పోలీసులకు పట్టించక. అన్నాను."

"అవును జ్ఞాపక మొచ్చింది. నేనైతే తన్ని పాతేద్దును. అని కూడా అన్నాను-అంతేనా, మనూ.... చివరకు — చివరకు — నా భర్తని."

ఆపైన మాట్లాడలేకపోయింది భారతి —

"పిచ్చిదానా — మీ ఆయన్ని తన్ని పాతేయమని నేనేం సలహా యివ్వటంలేదు. అంత మూర్ఖురాలినేంకాదు. కాని ఆ పైడమ్మకూ నీకూ తేడావుంది. పైడమ్మ చదువురాని మూర్ఖురాలు. నీవు చదువుకున్న వివేక వతివి — పైడమ్మను భర్త చావకొట్టినా "నీవే నాదేవుడివి" అంటూ వాడి కాళ్ళా వేళ్ళాపడి ఏలుకోమని ప్రాధేయపడేది. అది అలా ప్రాధేయపడు

తూనే ఉండేది__వాడు రోజు కొకసారి దాన్ని తంతూనే ఉండేవాడు.... అది ఒక్కరోజున తిరగబడి గట్టిగా వాడికి బుద్ధిచెప్పగలిగిఉంటే దాని బ్రతుకు అంత నీచానికి దిగజారేదికాదు. వాళ్ళ సంసారం అంత అల్లరి

"అంటే నీవు చెప్పేది__" ఏమీ తెలియని అయోమయ స్థితిగా అడిగింది.

"అంటే నీ భర్తమీద తిరగబడి అల్లరి పడమనికాదు నా సలహా. సంసారం అల్లరి పాలయితే అది ఒక్కభార్యకే చెరుపుకాదు__భర్తకు కూడా చెరుపే__ఆమె ఎంత బాధపడుతుందో అతనూ అంతే బాధపడ తాడు__నీ భర్త మరీ అంత సంస్కారం లేనివాడుకాదు. తన సంసారం అల్లరిపెట్టుకుని ధైర్యంగా నలుగురిముఖం చూడగల ధీశాలికాదు. అతనికీ లజ్జా బిడియం ఉన్నాయి."

"అందుకని_"

"సాంతం విను నేనుచెప్పేది__సంసారంలో ఉండే మంచి చెడు గులకూ, కీర్తి అపకీర్తులకు బాధ్యత యిద్దరిమీదా ఉంటుంది__కాబట్టి పైడమ్మలాగ నీవు నీ భర్తను కాళ్ళా వేళ్ళాపడి దేవురించ నక్కరలేదు. అలా అని అతనితో తెగతెంపులు చేసుకోమని నా ఉద్దేశ్యం కాదు. కొంచెం బెట్టుసరిగా ఉండు. కోపంమీద వెళ్ళినవాడు రెండురోజుల పాటు కాళ్ళు అరిగేలాగ తిరిగి ఆ తర్వాత సరాసరి యిల్లు వెతుక్కుంటూ తానే వస్తాడు. నీ తప్పు లేనప్పుడు నీవేమాత్రం భయపడనక్కర్లేదు__ కొంచెమంటే కొంచెం బెట్టుసరిగా ఉంటే ఏ మగవాడైనా తనతప్పు తెలుసుకు కాళ్ళబేరానికి రాకమానడు__అప్పుడే బుద్ధి కుదుట పడుతుంది__ చదువూ సంస్కారంలేని అలగా జనంలో ఈ సూత్రం వర్తించక పోయినా, జన్మతః కొద్దోగొప్పో సంస్కారం ఉన్న ఏ గృహస్థుడూ కూడా బెట్టుసరులకూ, మాటపట్టింపులకూ పోయి తనకుతాను అల్లరి పాలు కాడు__వింటున్నావా."

భారతి "ఊఁ" కొట్టలేదు __ తలమాత్రం ఆడించింది వింటు.

న్నట్లుగా—మనస్సు అక్కడలేదు. మమత ఎక్కడో ఉంది. మనిషి ఇక్కడ ఉంది—చూపులు శూన్యంలో ఉన్నాయి.

ఇంతలో భడాలున తలుపు తెరుచుకుని రాజా ఒక లేడీడాక్టరుతో లోపలికి ప్రవేశించాడు.... "ఈవిడ ఎవరో కాదే మనూ—నా క్లాసు మేటు రామారావు లేడూ, వాడిచెల్లెలు—నా కంటే ఒకేడు జూనియర్. ఏమండీ మీకు ఫిజియాలజీకి డాక్టరు వర్మగారు వచ్చేవారనుకుంటా" అను కుంటూ ప్రవేశించాడు.

"ఒరేయ్ చాదస్తం వెంకటనరసయ్యా—" మనోరమ మాట పూర్తికాకుండానే—

"వాడెవడు." ఆశ్చర్యపోతూ వెనక్కి చూశాడు రాజా, వాడెవడో తన వెనకగా వస్తున్నట్లు—

"ఎవరోకాదు—నీవే—నీ కాలేజీగొడవలు కాస్త తగ్గించి ముందు భారతిని పరీక్ష చేయమని డాక్టరుగారితో చెప్పు."

కొత్తగా వచ్చిన లేడీడాక్టరుగారు రాజా హడావుడిచూసి పకపకా నవ్వుతూ, నవ్వు ఆపుకోలేకుండా, భారతిని తీసుకుని గదిలోకి పోయింది పరీక్షకోసం—పదినిమిషాలతర్వాత ఎంత నవ్వుతూ లోపలకు వెళ్ళిందో అంత రెండురెట్లు నవ్వుతూ బైటికి ప్రవేశించింది.

"ఈవిడ మీకేమవుతుంది."

"ఎత్తుకుదేస్తే రెండవుతుంది—వదిన. సరేనా!" త్వరగా చెప్పి తగలపెట్టవమ్మా అనే ధ్వనిలో మనోరమ విసుక్కుంది—

"అయితే మీకు అల్లుడు పుట్టేయోగం పట్టింది." ఇంకా విరగబడి నవ్వింది డాక్టరు....

"ఒరే బడుద్దాయి—నీవు డాక్టరువుకదా ఆ మాత్రం నీవు తెలుసుకో లేవా." మనోరమ అన్నగారి నుద్దేశించి అడిగింది.

"ఛా. ఫో. ఏమిటే మనూ నీకు మరీ మతిపోతోంది." సిగ్గుతో ఎరుపెక్కిన తల ఎత్తలేని భారతి ఓరగా మనోరమవైపు చూస్తూ—

"ఇంకెక్కడి మతే....డాక్టరు శుభవార్త చెప్పినప్పుడే మతి పూర్తిగా పోయింది."

"ఎందుకనో."

"ఎందుకేమిటి — మీ అసాధ్యం కూలా! ఒక పక్క కొట్టుకు చస్తూనే ఉన్నారు. మొగుడూ పెళ్ళాం మరోపక్క —" మాట పూర్తి కాకముందే లేడీ డాక్టరు బిగ్గరగా నవ్వడంతో మనోరమ నోరు గట్టిగా నొక్కేసింది భారతి — రాజా ఆడవాళ్ళమధ్య నిలబడి నవ్వలేక పక్కకు తిరిగి నవ్వుతున్నాడు.

# 10

రాజా దృష్టినుంచి కావాలని తప్పించుకున్న నారాయణమూర్తి సందు మలుపుతిరిగి పక్కనేఉన్న పార్కులో జొరబడ్డాడు. అతనికి ఏం చేయడానికీ తోచడంలేదు. సమయం కాని సమయంలో ఏం చేయాలో తెలియక గబుక్కున నోటికి వచ్చినమాట "నేను మద్రాసు వెళ్ళాల్సి వచ్చింది. వెడుతున్నాను" అని బొంకేశాడు. నిజానికి అతను మద్రాసు కాదుకదా పక్కనున్న వెంకట్రావు యింటికికూడా వెళ్ళాల్సిన అవసరం లేదు. ఉదయంనుంచీ సరిగ్గా భోజనం లేదు....కాఫీ అసలు తాగలేదు. కడుపులో మండిపోతోంది. కణతలు బదలేసుకుపోతున్నాయి — పొద్దుపోయింది — దగ్గరలో ఏ కాఫీహోటలూ తెరిచిఉన్న జాడా కనుపించడం లేదు — అలాగే తూలుతూ తూలుతూ వెళ్ళి పార్కుబెంచీమీద చతికిలబడ్డాడు.

ఏం చేయాలి తను — ఇప్పుడెక్కడికి వెళ్ళాలి — వెంకట్రావు యింటికి వెళ్తే — వాడు ఊళ్ళో లేడు. కాంట్రాక్టు పనిమీద ఏదో వూరెళ్ళాడు.... బహుశా మద్రాసేనేమో — ఈసరికి తిరిగి వచ్చివేయవలసిందే కాని రాలేదు — పోనీ తనుకూడా మద్రాసువెళ్తే — అతనిదొక దారీ తన దొక దారీ అయి అతను తిరిగి వచ్చేస్తే — అసలు అంత ప్రయాసపడి

మద్రాసువరకూ వెళ్ళవలసిన కారణం ఏమిటి — వెంకట్రావు అడిగితే తనుమాత్రం ఏం చెప్పగలుగుతాడు — వెళ్ళక ఏం చేయాలి — ఎక్కడికి వెళ్ళాలి — ఇంటికి తిరిగి వెళ్ళడం ఏకోశానా యిష్టంలేదు. చలిగాలి రివ్వున కొడుతోంది. మరోపక్కనుంచి మబ్బులు ముంచుకొస్తున్నాయి. ఇక అక్కడే ఆ పార్కు బెంచీమీదే కూర్చుంటే తడిసి ముద్దయిపోవాల్సిందే. వళ్ళంతా చికాకుగా ఉంది. మనస్సంతా గందరగోళంగా ఉంది — తల నొప్పి ఆకలిబాధ — చలిగాలి — ఏదో ఒకటి తేల్చుకోవాలి. ఎక్కడికో అక్కడికి వెళ్ళిపోవాలి. వెంకట్రావుతో వంతు పెట్టుకోవాల్సిన అవసరమేముంది. వెంకట్రావు మద్రాసులో ఉంటే మరీ మంచిది. ఎందుకొచ్చావురా అంటే యేదో కల్పించి చెప్పొచ్చు. అతను మద్రాసులో లేకపోయినా మంచిదే — రెండురోజులు హాయిగా మద్రాసులో తిరిగి యేమి చేయాల్సిందీ తీరుబడిగా ఆలోచించుకోవచ్చు — టైమెంతయిందీ తెలియటం లేదు — హడావుడిలో గడియారం చేతికి పెట్టుకురాలేదు —

సరాసరి రైలుస్టేషనువైపు కాళ్ళు లాక్కెళ్ళాయి —

"మద్రాసు వెళ్ళేబండి...."

"వెళ్ళి అరగంటయింది. అసలే లేటుగాకూడా వచ్చింది — మళ్ళీ తెల్లారుఝాము నాలుగ్గంటలకొక ఎక్స్‌ప్రెస్ ఉంది —"

తిరిగి వెళ్ళడానికి నారాయణమూర్తికి ఓపికలేదు — పార్కులో కూర్చోకుండా సరాసరి వస్తే రైలు అందేది. యేదయినా కొనుక్కు తిందామని ప్లాట్‌ఫారమంతా తిరిగాడు — కడుపులో మండిపోతోంది — ఎప్పుడుచేసినవోకాని బిగుసుకుపోయి ఈగలు వాలుతున్న మసాలా వడలూ, జంతికలూ కనుపించాయి — అవే కొన్నాడు. రోజూ భారతి వండిపెట్టే ఫలహారాలకూ, వంటకాలకూ వీటిని పోల్చి చూసుకున్నాడు. భారతి తలపుకు వచ్చేసరికి వళ్ళు మండిపోయింది. "ఆ రాక్షసి చేసి పెట్టే ఫలహారాలకంటే ఈ పునుగులూ చక్రాలే నయం" అని భార్య మీదున్న కోపం ఒక్కసారి వెళ్ళకక్కి ఈ కొన్న ఫలహారాలు కటకటా నమిలి కడుపుపట్టినన్ని నీళ్ళుత్రాగి వెయిటింగురూములోకి పోయి కటికి బలమీద పడుకున్నాడు — బయట హోరుగాలి — వాన — ఈదురుగాలికి

కరెంటుపోయింది. తలుపువెక్కాలు ఊడిపోయిన కిటికీసందులనుంచి జల్లు లోపలికి కొట్టి హాలంతా తడిపేస్తోంది. నారాయణమూర్తి తనసంచి లోని తుండుతీసి కప్పుకు ముణగదీసుకుని ఒకమూలకు ఒదిగి పడు కున్నాడు. నిద్రరావడంలేదు. ఆ తుండు కప్పుకోడానికి ఎలా సరి పోతుంది?

నిమిషాలు గంటలు దొర్లిపోతున్నాయి. నిమిషమొక యుగంగా గడిచిపోతోంది. ఎప్పటికి నాలుగ్గంటలవుతుంది. ఎప్పుడు ఎక్స్‌ప్రెస్ వస్తుంది. కలతనిద్దరలో ఉండుండి ఒకసారి ఉలిక్కిపడి లేచి చూసే వాడు. చీకటి అంధకారం. బయట కుండపోతగా వర్షం. అలాగే తలుపు నెంపాదిగా తెరిచి అంగలేసుకుంటూ, వణుక్కుంటూ, స్టేషనుమాష్టరు గదివద్దకు వెళ్ళి చూశాడు. చిన్నదీపం దిమ్మె పక్కన స్టేషనుమాష్టరు ముణగదీసుకు పడుకుని కంబళిమధ్యనుంచి గుర్రుకొడుతున్నాడు.

"ఏమండీ ఎక్స్‌ప్రెస్ రావడానికి ఇంకా ఎంతటైముంటుందండీ."

జవాబులేదు. రెండుసార్లు, మూడుసార్లు, నాలుగో పిలుపుకు ముసుగులోనుంచి జవాబు వచ్చింది.

"ఏమి ఎక్స్‌ప్రెస్సయ్యాబాబూ, బతికుంటేతెల్లారి చూసుకుందాం. పోయి పడుకో" అని.

నారాయణమూర్తికి సమాధానం నచ్చలేదు. నచ్చినా అంతే నచ్చక పోయినా అంతే. తిరిగివచ్చి యథాస్థానంలో పడుకున్నాడు. ఎప్పుడు నిద్రపట్టిందో పట్టింది. లేచిచూసేసరికి కిటికీ సందుల్లోనుంచి, రాత్రి తెల్లవార్లూ గాలిదేవుడితో, వానదేవుడితో పోట్లాడి నిశ్చలంగా నిలబడ్డ చెట్లూ, వాటిపైన ఆహారంకోసం అన్వేషణకు బయలుదేరబోయే పక్షి సంతతి రణగొణ ధ్వని తాలూకు సందడీ కనుపించాయి.

నారాయణమూర్తి లేవబోయాడు. శరీరమంతా పచ్చిపుండులా ఉంది. అటు కదలనీయడంలేదు. ఇటు కదలనీయడంలేదు. అలాగే ఓపిక చేసుకు లేచి చూశాడు. వర్షంమాత్రం పూర్తిగా తగ్గింది. మేఘాలు

మాత్రం దట్టంగా పరుగిడుతూనే ఉన్నాయి. ఎక్స్‌ప్రెస్ తెల్లావకట్ట నాలు గింటికి వెళ్ళిపోయిందేమో. తనకు మొద్దునిద్ర పట్టింది అనుకుంటూ లేచి స్టేషన్‌మాష్టరు గదివైపు వెళ్ళబోయాడు. కాని కళ్ళు స్వాధీనానికి రాలేదు. కళ్ళు చింతనిప్పుల్లా మండిపోతున్నాయి. వళ్ళు కాలిపోతోంది. తల భారంగా ఉండి కళ్ళు విప్పి సరాసరి చూడలేకపోతున్నాడు. అలాగే ఓపికలేకుండా కూర్చున్నసమయంలో ఎవరో అక్కడికి రాగా వాళ్ళ నడిగాడు ఎక్స్‌ప్రెస్‌సంగతి.

"ఎక్కడి ఎక్స్‌ప్రెస్. మధ్యాహ్నం పన్నెండుగంటలకు వస్తుందిట. ఎనిమిదిగంటలు లేటుట" వెళ్ళిపోయాడు అతగాడు.

ఇప్పుడు తనేంచేయాలి. పన్నెండుగంటలవరకూ ఆగగల స్థితిలో లేడు. ఇంటికి వెళ్ళడానికి మనస్కరించడంలేదు.

"టైమెంతయింది బాబూ."

"ఎనిమిదిన్నర."

నారాయణమూర్తి అలాగే ప్లాటుఫారం బెంచీమీద కూర్చున్నాడు.

దూరంగా ఒక కప్ప, పురుగు కోసం బయటికి వచ్చి పొంచి కూర్చుంది. ఆ కప్పను పట్టుకోడానికి నీళ్ళపాము సమయంకోసం నిరీక్షిస్తోంది — దూరంగా రిక్షావాడు సమయంచూసి అర్ధరూపాయి బేరానికి రూపాయిన్నర అడుగుతున్నాడు. బియ్యంలేవని షావుకారు శేరు మూడు రూపాయలకు అమ్ముతున్నాడు.... టాక్సు కట్టలేదని గవర్నమెంటు షావుకారుకు వందరూపాయలు జరిమానా వేశారు. ఇలా ఒకళ్ళను మింగటానికి ఒకళ్ళు ప్రయత్నిస్తున్నారు — నీతీ న్యాయం అడుగంటాయి — పెద్దలేదు చిన్నలేదు — అన్నలేదు తమ్ముడులేదు.... భార్యలేదు భర్తలేదు. ఎవరికి ఎవరూలేరు.... అందరిలక్ష్యం ఒకటే. ఒకళ్ళనొకళ్ళు నోళ్లు కొట్టుకోవడం మోసం చేసుకోవడం — నోరుగలవాడిదే రాజ్యం అని దురాక్రమణకు పూనుకోవడం —

నారాయణమూర్తి కళ్లు తిరిగాయి ఒక్కసారి .... కూర్చోలేక పోతున్నాడు — ఇక ప్రయాణం చేయగల శక్తిలేదు. ప్రయాణం చేయ

లేక ? ఎక్కడికి వెళ్ళాలి—చిమ్మచీకటిలో మెరుపులాగ అతని కొక ఆలోచన తట్టింది. తనకొక తోడబుట్టిన చెల్లెలు శ్యామల ఆ వూళ్ళోనే ఉన్నట్లు గుప్పున జ్ఞాపకమొచ్చింది—నీరసంగా లేచి స్టేషను బైటికి వచ్చాడు—

సుమారు తొమ్మిదిన్నర దాటి ఉంటుంది — మెయిన్ రోడ్డుమీద కాలేజీపిల్లలు నడిచి కొందరూ, సైకిళ్ళమీద కొందరూ, రిక్షాలమీద కొందరూ బారులుతీర్చి వెడుతున్నారు. వారి మధ్యలో అడుగులో అడుగు వేసుకుంటూ పరధ్యాహ్నంగా వెడుతున్న భారతి కనుపించింది నారాయణ మూర్తికి—అసలే జ్వరంతో కుతకుత లాడుతున్న మూర్తి భారతిని చూడగానే మరింత ఉడికిపోయాడు. వెంటనే ముఖం పక్కకు తిప్పు కున్నాడు....

కాని భారతి నారాయణమూర్తిని చూడకపోలేదు. నారాయణ మూర్తిని చూడగానే ఎందుకో భారతిమనస్సు చివుక్కుమంది. అతని ముఖం చూసేసరికి చెప్పరాని జాలివేసింది. కాని తాను నడిరోడ్డు మీదుంది. ఏంచేయాలి. ఆలోచిస్తూ ఉండగానే అతను ధుమధుమలాడుతూ ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు. రిక్షా అందినంతవరకూ చూస్తూనే నిలబడింది. కొంతదూరం పోయినతర్వాత నారాయణమూర్తికూడా రిక్షా వెనకతెర ఎత్తి భారతివైపు మరోసారి చూచి ఆమె తనవైపే చూడటం గమనించి కటిక్కున ఏమీ ఎరగనివాడిలా దృష్టిని ముందుకు సారించాడు.

"ఏమిటి మాష్టారూ. యేదైనా మరచిపోయి వచ్చారా ఇంటిదగ్గర. ఆలోచిస్తూ నిలబడ్డారు" ప్రమీల పలకరింపుతో ఉలిక్కిపడిన భారతి మామూలు ప్రపంచంలో పడింది.

"లేదమ్మా—తలనొప్పిగా ఉంటేనూ పోనీ 'ఈపూటకు శలవు పెడదామా' అని ఆలోచిస్తున్నా-యేం తల్లీ అసలు దర్శనమే కరువయి పోయింది." అనుకోకుండానే అడుగు ముందుకువేస్తూ తిరిగి పలక

రించింది భారతి—వెనక్కి వెడతామా ముందుకు వెళ్తామా అన్న సంశయం తీరనేలేదు—యాంత్రికంగా అడుగువేస్తోంది.

"మీకు తెలియనిదేముంది మాష్టారూ పరీక్షలుకదా — ఎక్కడికీ వెళ్ళడంలేదు." ప్రమీల చెప్పుకుపోతోంది కాని భారతి చెవికి అవేం విని పించడంలేదు. యేదో అడగాలి కాబట్టి తనకు తెలియకుండానే అడిగింది. సమాధానంకోసం ఆమె ఎదురుచూడటం లేదు.

"మరీ అంత తలనొప్పిగా ఉంటే ఫస్టు అవర్ అయిం తర్వాత ప్రిన్సిపాలుగారి పర్మిషన్ తీసుకు వెళ్ళిపోమరుగాని లెండి." ప్రమీల ఈ మాటలు వినిపించాయి భారతికి ఈసారి—అదే తనకుకూడా ఉత్త మంగా తోచింది. 'ఇంటితాళం చెవులు ఎలాగు అతనిదగ్గరకూడా ఉన్నా యిగా—ఒక్క గంటలో పెద్ద మునుకుపోయిందేముంది

ఆలోచనలు పూర్తికాకుండానే కాలేజీ ఆవరణలోకి వచ్చేశారు. తర్డుబెల్ కూడా కొట్టేయడంతో సరాసరి క్లాసులోకి వెళ్ళిపోయింది.

"ఇదిగో ప్రమీలా మధ్యాహ్నం ఎన్ని పనులున్నా ఒకసారి మా యింటికి వచ్చి వెళ్లమ్మా. నీతో పనుంది." అనిమాత్రం కేకేసింది వెళ్ళే ప్రమీలతో. "అలాగే మాష్టారూ."

ఎవరి క్లాసుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

ఆరోజు మధ్యాహ్నం సుమారు ఒంటిగంటయి ఉంటుంది. ప్రమీల పడకకుర్చీలో కూర్చుంది. ప్రక్కనే భారతి మంచంమీద పడుకుని యింటి నడికప్పువైపు తీవ్రంగా చూస్తోంది. ఇంటిదగ్గర తనకోసం ఎదురు చూస్తూఉంటాడనుకున్న నారాయణమూర్తి అసలు ఇంటికివచ్చిన జాడే కనిపించడంలేదు. "ఎక్కడికి వెళ్ళినట్లు. రాత్రంతా ఎక్కడున్నారు. మనిషి బాగానలిగిపోయి అదోలా ఉన్నారే."

"మేష్టారూ, ఈరోజు అనవసరంగా ఆ పిల్ల విషయంలో మీరే తొందరపడ్డారనిపిస్తోందండీ. అనవసరంగా యేనాడూ లేనిది ప్రిన్సి పాలుగారివరకూ వెళ్ళింది ఈ విషయం." భారతి అందుకే బాధ పడుతోం దనుకుని అనునయించబోయింది ప్రమీల.

"నిజమే ప్రమీలా. నాదే పొరపాటు. అనవసరంగా తొందర పడ్డాను. మనస్సు అసలే బాగుండలేదు. తలనొప్పిగా ఉంది. వెధవది నోట్సు సరిగ్గా రాయనంతమాత్రాన ఆ అమ్మాయిని పదిమందిలో అలా ఇన్‌సల్టుచేయడం నాదే పొరపాటు. సరే ఏం చేస్తాం. లేచినవేళ అలాంటిది — ఏనాడూ మనమీద ఏ బ్లాక్ మార్కు లేదు."

"అది సరేగాని మాష్టారూ — ఈమధ్య రోజూ కాలేజీలో మిమ్మల్ని చూస్తున్నాను. మీలో ఏదో మార్పు కనిపిస్తోంది — మరీ మనిషికూడా నానాటికీ చిక్కిపోతున్నట్లు పరధ్యాహ్నంగా ఉంటూ కనిపిస్తున్నారు."

మాటలింకా పూర్తికాలేదు. తలుపు తెరుచుకుని భారతి ఆడబిడ్డ భర్త కృష్ణమూర్తి లోపలికి వచ్చాడు. ఎప్పుడూరాని కృష్ణమూర్తి, తలవని తలంపుగా వేళగానివేళ తనయింటికి రావడంచూసి భారతి తెల్లబోయింది. కొంచెం కంగారుపడిందికూడా....

"ఓ-మీరా అన్నయ్యా! రండిరండి. ఏమిటిది తలవని తలంపుగా వచ్చారు. మంచినీళ్ళు కావాలా. ఉండండి ఇప్పుడే వస్తా." అనుకుంటూ వంటయింటిలోకి వెళ్ళబోయింది.

"ఇప్పుడేమీ వద్దమ్మా! నీతో ఒక విషయం మాట్లాడిపోదామని." ఆ మాటలో తనతో రహస్యంగా ఏదో మాట్లాడాలనీ ప్రమీల అక్కడుండటం మంచిదికాదని అర్థం స్ఫురించింది భారతికి. ప్రమీలను ఒక ప్రక్కగా పిలిచి రహస్యంగా,

"చూడమ్మా! ప్రమీలా. నీవు యేమి అనుకోకపోతే కొంచెం స్టౌ వెలిగించి కాఫీనీళ్ళు పడేసిపెట్టు. నేనిప్పుడే అన్నగారితో మాట్లాడివస్తా." అని ప్రమీలను నేర్పుగా వంటింట్లోకి పంపించివేసింది.

ఎప్పుడూ తనింటి ముఖమైనా చూడని ఆడపడుచు పెనిమిటి అకస్మాత్తుగా తనయింటికి రావడం అందులోనూ యేదో రహస్యంగా మాట్లాడాలని కోరుకోవడం భారతికి యేదో భయంగా తోచింది. కొంపతీసి తన ఆలుమగల మధ్య జరిగిన విషయాలన్నీ వీరికి తెలిసిపోలేదుగా,

అసలే ఆడపడుచు అంతంతమాత్రం మనిషి. ఈ పెళ్ళిజరిగినప్పటినుంచీ తననొక పురుగులా చూడటం, తనతో మాట్లాడినప్పుడల్లా పుల్లవిరిచి నట్లు చెప్తూ మాట్లాడటం. ఇవన్నీ తనకేం నచ్చని విషయాలు — అటువంటివారికి కొంపతీసి తన కుటుంబ గొడవలు తెలిస్తే ఇంకేమన్నా ఉందా.

"యేమిటన్నగారూ. యేమిటి విషయం. అంతా కులాసాగా ఉన్నారా."

"అంతా కులాసాగానే ఉన్నారు. యేమమ్మా ఒక్క విషయం అడుగుతాను. యేమీ అనుకోకుండా నేను నీ స్వంత అన్నగారినే అను కుని మరీ చెప్పు." ప్రారంభించాడు ఉపోద్ఘాతం — ఇంకేముంది అన్ని విషయాలు వీరికి కూడా తెలిసిపోయినట్లున్నాయి.... కొంపతీసి తనభర్త సరాసరి వీరియింటికే పోలేదుకదా — తోబుట్టువు శ్యామలతో అన్ని విష యాలూ చెప్పుకోలేదుగదా.... యేవేవో ఆలోచనలు ఈగల్లా ముసురు తున్నాయి భారతిమనస్సులో —

"ఏమీలేదమ్మా — నీకూ, నారాయణమూర్తికీ, ఈ మధ్య యేమ యినా అభిప్రాయ భేదా లొచ్చాయా."

ఇంకేముంది కొంపతీశారు — ఈయన సరాసరి అక్కడికే వెళ్ళి ఉంటారు.

"ఇలా అడిగానని యేమీ అనుకోవద్దు."

"అసలీ ప్రశ్న ఎందుకొచ్చిందన్నయ్యా." అవునూ కాదూ అన కుండా ఎదురుప్రశ్న వేసింది భారతి.

"అహ యేంలేదు — రెండుగంటలక్రితం మూసినకన్ను ఎరగని జ్వరంతో మీ ఆయన తూలుకుంటూ రిక్షాలో యింటికి వచ్చిపడ్డాడు. నీకేమాత్రం తెలిసున్నా అతన్ని ఆ స్థితిలో బయటికి వదిలి పెట్టవు. ఆ ధైర్యం నాకు బాగా ఉంది. అసలు అతన్ని చూస్తే యింటిదగ్గర్నుంచి వస్తున్నట్లుగా కనిపించటంలేదు. సరాసరి యింటికి రాకుండా కట్టుకున్న

భార్యను కాదని ఎప్పుడూ రాని మా యింటికి వచ్చాడంటే నాకు కొంచెం అనుమానంవేసి అడిగాను. మరేమీ అనుకోకు. నీ అన్నగారిలాటివాడిని. యేదయినా ఉంటే నాతో చెప్పు తల్లీ" అని అడిగాడు.

భారతి నెత్తిన పిడుగుపడ్డట్లయింది....ఏం మాట్లాడాలో తెలియ లేదు—ఎప్పుడూ జిర్రున చీదయినా ఉంరని భర్త మూసినకన్ను తెలి యని పరిస్థితిలో ఉన్నాడు. ప్రేమించి మనసుపడి చేసుకున్న తనను కాదని తనవారిదగ్గరకు వెళ్ళిపోయాడు. నామమాత్రమైనా తనకు తెలియ కుండా చేయాలనుకొని పట్టుపట్టడంలో తాను అంతగా చేసిన నేరం యేమిటి. ఆ చెల్లెలు—తనమీద కక్షగా ఒక్కనాడైనా గుమ్మంలో అడుగు పెట్టని చెల్లెలు-ఈనాడు ఆదరిస్తుందనే వెళ్ళారా-అక్కడికి తనేదో ఘోర తప్పు చేసినట్లు నలుగురిలోనూ అల్లరిపెట్టడానికేగా ఆ చెల్లెలు మన స్తత్వం అతనికి బాగా తెలుసు. యేనాడూ ఆమెనుగురించి ఆప్యాయంగా ఒక్కమాట చెప్పలేదు. అటువంటి చెల్లెలు ఇంటికి వెళ్ళడమంటే తాను సగం చచ్చి, ఆత్మాభిమానాన్ని వదులుకుని వెళ్ళడమే. అంత ఆత్మాభి మానాన్ని వదులుకుని వెళ్ళడానికి తనమీద ఎంత కోపంలేకపోతే వెళ్తాడూ—అతనిమనస్సు ఎంత గాయపడిందో!

ఈ ఆలోచనలతో ఉక్కిరిబిక్కిరయిన భారతి ఇదమిత్థమని ఏ సమాధానం చెప్పలేక ఒక్కసారిగా బావురుమని యేడ్చేసింది.

శ్యామలా, కృష్ణమూర్తి భార్యాభర్తలే అయినా ఇద్దరి మనస్తత్వా లకూ చాలా తేడా ఉంది. కృష్ణమూర్తి వివేకంగల మనిషి—కష్టసుఖాలు తెలిసినవాడు. పరిస్థితులర్థం చేసుకోగల శాంతమూర్తి—ఏదో బలవత్తర కారణం లేకపోతే నారాయణమూర్తి అలా తనింటికిరాడు—దానికి పరి స్థితుల ప్రభావం కావచ్చు...నారాయణమూర్తి తొందరపాటు కావచ్చు. భారతి తెలివితక్కువతనం కావచ్చు. ఏదో తాత్కాలిక ఆవేశంలో ఇద్దరూ పడి వుండవచ్చు, ప్రేమించి పెళ్ళి చేసుకుని ఒకరికొకరు ప్రాణంగా ఇన్నాళ్ళూ ఉన్నవారు ఇవాళ ఇలా ప్రవర్తించడమంటే అదేదో తాత్కాలిక పరిస్థితి ప్రభావం కావచ్చునని ఆ విషయం తెలుసుకుని చేత

నయినంత సాయపడి వారిమధ్యగల వైషమ్యాలను తొలగించడానికే అతను వచ్చింది. అదీకాక భారతీ నారాయణమూర్తి లేవరు? తన బావ మరదీ, అతనిభార్య. వారికి కష్టంవస్తే ఒకటీ తనకు కష్టమొస్తే ఒక టీనా. ఇద్దరి విబేధాలూ తొలగించి ఇద్దరినీ యేకం చెయ్యడం తనవిధీ. తనకర్తవ్యమున్నూ. కాని శ్యామల మనస్తత్వం వేరు. పరిస్థితులను సమన్వయించుకుని సర్దుబాటు చేసుకోవాలనే తలంపు ఆడవాళ్ళలో తక్కువ. అదే శ్యామలలోకూడా ఉన్నబుద్ధి. "ఎవరెట్లాపోతే మన కెందుకు ప్రతివిషయంలో నేనూ ఉన్నానని మీరు బయలుదేరకండి." అని భర్తను మందలించింది. కాని కృష్ణమూర్తి ఊరుకోలేదు. భార్యకు తెలియకుండా వచ్చేశాడు.

భారతి బావురుమనేసరికి కృష్ణమూర్తి ద్రవించిపోయాడు.

"యేమిటమ్మా. యేంజరిగిం దసలు."

"ఏంలేదు. పదండి అన్నగారూ. నేనూ వస్తున్నాను మీయింటికి. ప్రమీలా ఇవాళ నీకేమైన ప్రత్యేక పనివుందా యింటిదగ్గర." ప్రమీలను కేకవేసి అడిగింది.

"ఏమీలేదండి."

"అయితే నేను వచ్చేవరకూ నీవు యింటిలోనే వుండమ్మా. ఒక వేళ రాత్రికి రాకపోయినా నీవు కంగారుపడకు. హాయిగా అన్నం వండుకు తిని పడుకో. పదండి అన్నగారూ."

కృష్ణమూర్తికి వివరం తెలియకపోయినా తెలుసుకోవాలని ఇక ప్రయత్నించలేదు.

భారతీ, కృష్ణమూర్తీ ఇంటికి వచ్చేసరికి డాక్టరు నారాయణ మూర్తిని ఎగ్జామిన్‌చేసి యింజక్షనిస్తున్నాడు. ఆ డాక్టరు భారతీ వాళ్ళకు మొదటినుంచీ తెలిసినవాడే. బాగ్ మూసేసుకుంటూ భారతివైపు తిరిగి "రాత్రి తెల్లవార్లూ చలిగాలిలో తిరిగినట్లున్నారు. మరేం భయంలేదు. రెండుమూడురోజుల్లో తగ్గిపోతుంది. ఈ మాత్రలు పొద్దునా సాయంత్రం

వాడండి. మరీ కంగారుచేస్తే నాకు కబురంపించండి. రేపు ఉదయమే మళ్ళీ వచ్చి చూస్తాను." అని డాక్టరు వెళ్ళిపోయాడు.

నారాయణమూర్తి ఒకసారి కళ్ళుతెరిచి భారతిని చూసి ఇష్టం లేనట్లుగా ముఖం చిట్లించి పక్కకు తిరిగిపడుకున్నాడు. భారతిని ఎవరూ కూర్చోమనలేదు. నించోమనలేదు. నిప్పులమీద నిలబడ్డట్లుగా ఉంది ఆవిడ పరిస్థితి.

"శ్యామలా! ఇటొచ్చి ఒకసారి దుప్పటి కప్పి వెళ్ళమ్మా" నారాయణమూర్తి చెల్లెలిని కేకపెట్టాడు. శ్యామల వదినగారివైపు చూడకుండానే గబగబా వచ్చి అన్నగారికి దుప్పటి కప్పి వెళ్తూ వెళ్తూ, "అసలెందుకు దెబ్బలాడుకున్నారమ్మా" అనుకుంటూనే సమాధానంకోసం వేచి ఉండకుండానే వెళ్ళిపోయింది. ఆ ప్రశ్న చాలా కటువుగా వినిపించింది భారతికి. సభ్యత, సంప్రతింపు కనుపించలేదు ఆ గొంతుకలో. అలగాజనాన్ని అడిగినట్లుగా అడిగింది. మగడు 'ముండ' అని తిడితే ముష్టికి వచ్చినవాడుకూడా 'ముండ' అన్నాడని సామెత. అసలైనవాడే, కావాలని తనను అవమానిస్తున్నప్పుడు మిగతావాళ్ళు అవమానించడంలో ఆశ్చర్యంలేదు. ఇంతలో శ్యామల గొంతుకే వంటయింటిలోనుంచి బిగ్గరగా వినిపించింది. "ఈ బిడ్డల చాకిరీతోనే సతమతపడి నేను చస్తుంటే మధ్యలో నాకీ మేళంకూడానూ. కొట్టుకున్నవాళ్ళు కొట్టుకున్నట్లు పడుండక నా యింటిమీదికొచ్చి కూర్చోడమెందుకో. ఈ తెలివితేటలు పెళ్ళి చేసుకునేటప్పుడే ఉండాలి. తనచదువుకు తగిన గంతకుతగ్గ బొంతను చేసుకోవాలిగాని ఎట్టగా బుట్టగా ఉందిగదాని చదువుకున్న సీమరాణిని తెచ్చుకుంటే సరిగ్గా కాపురం చేస్తుందా యేమిటి. ఒక్కనాడంటే ఒక్కనాడు చెల్లెల్నిగదాని తీసుకెళ్ళి ఒక్కగజం రెవికలగుడ్డ పెట్టాడా? ఇప్పుడొచ్చి నా నెత్తిన కూర్చున్నాడు."

"ఇదిగో నీవు నోరు మూస్తావా మూయవా" గొంతుక నొక్కుకుంటూ కృష్ణమూర్తి అడ్డు తగలబోయాడు.

"ఎందుకు మూయాలి." రెట్టించింది శ్యామల.

"అసలే ఆ పిల్ల అభిమానవంతురాలు. ఆవిడ విన్నదంటే ఏం బాగుంటుంది."

"ఏమిటి బాగుండేందుకు. మనమేమన్నా ఆవిడగారితో వియ్యమందబోతున్నామా. ఆ పుట్టింటి ఆశ ఏనాడో పోయింది."

వంటింట్లో భార్యాభర్తల సంభాషణవిన్న భారతికి తలకొట్టి వేసినంత పనయింది. నిద్రపోతున్నట్లు నటిస్తున్న భర్తను తట్టి "వింటున్నారా ఆ మాటలు" అని అడిగింది.

"వింటున్నా."

"అయినా ఇంకా ఇక్కడే ఉండాలనుకుంటున్నారా. జరిగిపోయిందేమో జరిగిపోయింది — టాక్సీ తీసుకువస్తాను .... మనింటికి వెళ్ళిపోదాం."

"— —" నారాయణమూర్తి మాట్లాడలేదు.

"ఏమిటి మాట్లాడరూ."

"తిట్టినా కొట్టినా అది నా తోబుట్టువు. పరాయివాళ్ళమధ్య అవమానం పొందేదానికంటే తోడబుట్టిన దానిచేత తిట్లుతిన్నా ఫర్వాలేదు."

"ఎవరు పరాయివాళ్లు. నేను పరాయిదాన్నా మీకు ?"

"ఆ విషయం నీ అంతరాత్మ నడుగు — దయయుంచి నన్ను వాగించకు."

భారతి ఏమీ మాట్లాడలేకపోయింది. శ్యామల ఎదుట ఒక్కక్షణం ఉండటానికి ఆవిడకు మనస్కరించడంలేదు. పోనీ భర్తను యింటికి తీసుకుపోదామంటే అతను ససేమిరా రానంటున్నాడు. ఏం చేయాలి తను. ఆత్మాభిమానం చంపుకుని ఎంతసేపు ఉండగలదు. అతనికి ప్రాణభయం ఏమీలేదు. రెండుమూడురోజుల్లో తగ్గి మామూలు మనిషవుతాడని డాక్టరు చెప్పాడు అతను చెప్పినట్లు తిట్టినా, చాకిరీచేసినా, సాధించినా అన్నాచెల్లెళ్ళకు వాళ్ళకే సరిపోతుంది ..మధ్య తను మాటలు పడి, అవమానం పొందాల్సిన అవసరం తనకులేదు.

"ఏమండీ, ఏమంటారు. ఇంటికి వెళ్దాం."

"ప్లీజ్. నన్ను వాగించక నీదారిని నీవు వెళ్ళు." బిగ్గరగా అరిచాడు నారాయణమూర్తి.

భారతికి ఇక అక్కడ ఒక్క క్షణం నిలబడాలని అనిపించలేదు. సలసల కాగుతున్న నూనెలో తనని మరగబెడుతున్నట్లుగా అనిపించింది. తల ఎత్తి చూసేసరికి గుమ్మంలో అచేతనంగా నిలబడ్డ కృష్ణమూర్తి కనుపించాడు. తనకూ, తనభర్తకూ మధ్య జరిగిన సంభాషణంతా తాను వినే ఉంటాడు. లోపలినుంచి తెరలు తెరలుగా దుఃఖం పొంగుకొచ్చింది. పమిటి చెంగు నోటికి అడ్డుపెట్టుకుని గబగబా వాకిట్లోకి వచ్చి యింటిదారి పట్టింది.

# 11

"మేష్టారూ — అప్పుడే ఎనిమిదిగంటలయింది. ఎప్పుడూ లేనిది ఇవాళ ఇదేమిటి ఇప్పటివరకూ పడుకున్నారు. కాలేజి టైమయిపోతోంది. లేచి ముఖం కడుక్కుని కాఫీ తాగరూ." అప్పటివరకూ పడుకుని నిద్ర పోతున్న భారతి నుద్దేశించి పలికింది ప్రమీల. ముసుగుపెట్టుకుని నిద్ర పోతున్నభారతి ముఖంమీద కప్పుకున్నరగ్గును కొంచెం తప్పించి "చూడు ప్రమీలా, నాకీపూట వంట్లో బాగుండలేదు. శలవు చీటీయిస్తాను. కొంచెం ప్రిన్సిపాలుగారికి అందచేయమ్మా. కాఫీకూడా తాగాలనిలేదు. ఎందుకయినా మంచిది. ఆ ఫ్లాస్కులో పోసి నీవు కాలేజికి వెళ్ళు. మరి నీ భోజనంమాట —"

"అదిగో స్టౌమీద యిద్దరికీ పడేశాను. అదేమిటి మీరుమరీ అలా ఉన్నారు. రాత్రికూడా ఎంత బలిమాలినా భోజనం చెయ్యకపోతిరి." అని భారతి నుదుటిమీద చెయ్యివేసి—

"ఇదేమిటి మాష్టారూ, వళ్ళు కాలిపోతోంది. జ్వరం తగిలిందా." అని అడిగింది.

"ఏమోనమ్మా. తలంతా దిమ్ముగా ఉంది. బహుశా వేడిచేసి ఉంటుంది."

"డాక్టరును పిలుచుకు రమ్మంటారా."

"ఏమీ వద్దు. నీవు ఒకపని చెయ్యి. నీవు భోజనంచేసి మిగతా వన్నీ మూతపెట్టి వెళ్ళు. ఈ భారం తగ్గితే ఏ ఒంటిగంటకో కాస్త ఎంగిలి పడతాను. సాయంత్రం కాలేజీ వదలగానే కాస్త వచ్చి చూసి వెడతావుగా."

"చూసి వెళ్ళడమేమిటి, ఈరాత్రికూడా ఇక్కడే పడుకుంటా మీకు తోడుగా. అలా ఉన్న మిమ్మల్ని ఒంటరిగా ఎలా వదిలి వెళ్తాను."

"సరే నీ యిష్టం." భారతి మళ్ళీ రగ్గు ముసుగేసుకుంది.

పదిగంటలకు ప్రమీల కాలేజీకి వెళ్ళిపోయింది.

సుమారు పన్నెండుగంటలకు భారతికి మళ్ళీ మెలుకువవచ్చింది. రగ్గులో తలపెట్టుకుని రాత్రి తెల్లవార్లూ కుమిలి కుమిలి ఏడ్చినసంగతి భారతికి తప్ప మరెవ్వరికి తెలుసు? ఏడ్చి ఏడ్చి తెల్లారుకట్ల యే అయిదుగంటలకో కాస్త కునుకుతీసింది. పన్నెండుదాటినతర్వాత లేచి ముఖార్జనచేసి తలారా స్నానంచేసి కొంచెం ఎంగిలిపడింది. అసలు అన్నం తినాలనిపించలేదు మరీ నీరసంగా ఉండటంతో కొద్దిగా ఎంగిలి పడింది. కొంచెంసేపు పడకకుర్చీలో కూలబడి గతాన్నంతా ఒక్కసారి నెమరుకు తెచ్చుకుంది. ఇందులో తనతప్పు యేమాత్రం కనపడటంలేదు. అతనికంత కష్టం కలిగించేపని తానేం చేసింది. యేం చేయనిదానికి ఎందు కింత కక్ష సాధించినట్లు శిక్షవేస్తోంది.

మనస్సంతా చీకాకుగావుంది. ఉబుసుపోక యేదైనా చదువు కుందామని పుస్తకాల షెల్ఫుదగ్గరకు వెళ్ళిచూసింది. ఎదురుగా ప్రమీల రాస్తున్న నవల కనుపించింది. తను చదివినతర్వాత ప్రమీల యింకా యేమన్నా రాసిందో,కథ ఎట్లా పరిసమాప్తి చేసిందో చూద్దామని పుస్తకం

తెరిచి చూసింది. ఎప్పుడు పూర్తిచేసిందో తెలియదుగాని ప్రమీల తన నవల చాలవరకూ పూర్తిచేసింది. భారతికి ఉత్సాహం ఇనుమడించింది. ప్రమీల తన నవలను ఎలా కొనసాగించిందో చూడాలనే కుతూహలంతో సరాసరి ఆ పుస్తకాన్ని తీసుకుని కుర్చీలో వాలిపోయింది. భారతి నవల చదువుతోంది.

# 12

వేదవతి యింటిదగ్గరనుంచి సరాసరి యింటికి వచ్చిన రాధ, ధనలక్ష్మి లకు మనస్సు మనస్సులోలేదు. ఎంతసేపూ వాళ్ళ ఆలోచన వేదవతిని గురించే—ఎన్నాళ్ళు ఈ బాధలు వేదవతికి. దీనికి ఒక ఆదీ అంతూ లేదా? ఆమె బ్రతికున్నన్నాళ్ళూ ఈ బాధలు అనుభవిస్తూ బ్రతకాల్సిందేనా. ఆ బాధలనుభవించేకన్న బయటికివచ్చి స్వతంత్రంగా ఏదో పని చేసుకుంటూ స్వేచ్ఛగా బ్రతకటం ఉత్తమం."ఆ అత్తవారిల్లు ఇకలేదు." అనుకోవడంలో ఒక తృప్తన్నా ఉంటుంది.

"అదికాదే రాధా. కాలు విరిగి మంచంలో పడుండికూడా, సకలోపచారాలూ చేయించుకుంటూ ఆ అత్తగారుకూడా అదేమిటే కొడుకుని సమర్ధించుకుంటూ మాట్లాడుతుంది. ఆ కొడుకు ఒక్కనాడన్నా తనముఖం సరిగ్గా చూస్తున్నాడా."

"అందుకే అంటారు 'గొఱ్ఱె కటికవాడినే నమ్ముతుందిగాని గొల్లవాడిని నమ్మదు.' అని. ఎంత చాకిరీచేస్తేనేం, ఎన్నికష్టాలు పడితేనేం. దానికర్మ అలా రాసిపెట్టి ఉన్నప్పుడు-తెల్లవారకట్టననగా లేచి ఇంటెడు పనీ చేసుకోడంతోనే సరిపోతోందే. ఇంక అది చదువుకోవాలంటే ఎప్పుడు చదువుకుంటుంది. చదువుమీద మనస్సెలా మళ్ళుతుంది."

"ఈ పదిరోజుల్నుంచీ అంటే ముసలమ్మ కాలుజారిపడి కాలు విరగ్గొట్టుకున్నప్పటినుంచీ, అంతకుముందుకూడా మీ బావ తల్లినేమీ పని చెయ్యొద్దని గోల చేసేవాడటగా."

ఇలా రాత్రి పన్నెండుగంటలవరకూ వేదవతినిగురించే ధనలక్ష్మి, రాధ వాపోతూ కూర్చున్నారు. ఇంతలో బయట కాలింగుబెల్ అదేపనిగా మోగటం మొదలుపెట్టింది.

"ఇంత అర్ధరాత్రివేళ ఎవరొస్తారబ్బా" అనుకుంటూ స్నేహితురాళ్ళిద్దరూ మేడదిగివచ్చి తలుపుతీశారు. ఎదురుగా కనుపించిన వ్యక్తిని చూసి వాళ్ళమతులు పోయాయి — వాళ్ళకళ్ళను వాళ్లే నమ్మలేకపోయారు —

"ఏమిటక్కా. ఇంత రాత్రివేళ ఒక్కర్తివే ఒచ్చావు .... ఏం జరిగింది."

"అదేమిటి చెంపలమీద ఈ దెబ్బలు తలనుంచి రక్తం కారుతోంది. ఏంజరిగింది? ఆ బ్రూట్ ఏమన్నా అసభ్యంగా ప్రవర్తించాడా." ఇద్దరు కోపంతో అట్టుడికినట్లు ఉడికిపోతున్నారు. వారిద్దరినీ కౌగలించుకుని వేదవతి బావురుమని ఏడ్చేసింది.

"ఏమిటక్కా. ఏం జరిగిం దసలు "

"ఉండవే. ముందు మేడమీదికి తీసుకుపద. రోడ్డుమీదెందుకు ఈ రాద్ధాంతం. ఎవరైనావింటే పరువుపేటుకూడాను. చూడు రాధా, అక్కని నీవు మేడమీదికి తీసుకుపద. నేను ఓవల్టిన్ కలుపుకు వస్తా" అని ధనలక్ష్మి లోపలికి వెళ్ళబోయింది.

"వద్దమ్మా. ఇప్పుడేమీ వద్దు." వేదవతి వారించబోయింది. కాని ధనలక్ష్మి కంగారుతో వణికిపోతూ వంటయింటివైపు పరుగెత్తింది.

జరిగిన కథేమిటంటే ఆ సాయంత్రం రాధా, ధనలక్ష్మి వేదవతిగారి యింటినుంచి తిరిగివచ్చినతర్వాత రాత్రి ఎనిమిదిగంటలకు సుబ్బా

రావు యింటికి రాగానే ముసలమ్మగారు పిళ్ళువచ్చి,వెళ్ళినసంగతి కొడుక్కు చెప్పింది.

అసలే రాధమీద కోపంలోనున్న సుబ్బారావు రాధను యింటికి రానిచ్చినందుకు వేదవతిమీద తారామండలానికి లేచాడట. దానికి తోడు కూరలో ఉప్పు ఎక్కువయిందని "నీకు వళ్ళుపై తెలుస్తోందా. నీ చెల్లెలి అండచూసుకుని మరీ మిడిసిపడుతున్నావు. నీవుకూడా పోయి నీ చెల్లెలి దగ్గరే ఉండు." అని చావచితకకొట్టి ఇంటిలోనుంచి బైటికితోసి తలుపు వేసుకున్నాడట.

అతని ఉద్దేశ్యం వేదవతి బ్రతిమాలోచామాలో,ఏడ్చో మొత్తుకునో రాత్రల్లా ఆ కటికి చీకటిలో, చలిలో బాధపడయినా సరే తనను ఆశ్రయించుకునే ఉంటుంది అని భావించాడు. బెట్టుసరిచేసి తన ప్రతాపం చూపించి తిరిగి లోపలికి రావడానికి అనుమతిద్దామనుకున్నాడు.

కాని వేదవతి ఒంటరిగా ఆ కటికి చీకటిలో నడిరోడ్డుమీద నిల బడ లేకపోయింది. భయంతో గడ్డకట్టుకుపోయింది. తలుపుకొట్టి అనేక విధాల భర్తను ప్రాధేయపడి వేడుకుంది. సుబ్బారావుకు ఈషణ్మాత్ర మైనా మనసు కరగలేదు. చేసేదిలేక రోడ్డునపడి, ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని ధనలక్ష్మిగారియింటికి వచ్చిపడింది. ఎలావచ్చిపడిందో తనకే తెలియదు.

అదీ జరిగినవిషయం.

అంతా విన్న రాధ పమిట చెంగుతో కళ్ళు తుడుచుకుంటూ ధనలక్ష్మివైపు చూసింది. ధనలక్ష్మి కళ్ళు చింతనిప్పుల్లా మండి పోతున్నాయి.

"నీవు కాబట్టి అలా దెబ్బలుతిని వచ్చేశావు కాని అక్కా, నేనయితే వాడి అంతు చూసేదానిని....ఛీ-ఛీ. వాడూ ఒక మనిషేనా."

"ఇదంతా నారాతమ్మా. వాడినని ప్రయోజనమేమిటి."

"చాల్లే ఊరుకో. ఈ అమ్మమ్మ కబుర్లతోనే అతన్ని అంతవరకూ తెచ్చావు. సరే అయిపోయిందేమో అయిపోయింది. నీ విక ఆ గడప తొక్కకు."

"లక్ష్మి!" ఆశ్చర్యంగా కంగారుగా ప్రశ్నించింది వేదవతి.

"లక్ష్మిలేదు గిక్ష్మిలేదు. రత్నం చేతిలో ఉన్నంతవరకూ దాని విలువ ఎవరికీ తెలియదు. అది చేజారి పోయింతర్వాతే దాని విలువ తెలిసేది. రత్నంలాటి నిన్ను పోగొట్టుకుని అతనేం బాగుపడతాడో నేనూ చూస్తాను."

"ఏమిటే ధనం, ఆవేశంలో ఏమిటేమిటో మాట్లాడుతున్నావుగాని జరగవలసిందేమిటో ఆలోచించు. అత్తింటికి వెళ్ళక అది ఎక్కడుం టుంది. ఎవరు పోషిస్తారు. విధంవెడి ఆడది పుట్టింటికివెళ్తే దాని గౌరవం ఎంతవరకూ ఉంటుంది. ఇవన్నీ ఏమయినా ఆలోచించావా." రాధ అను మానంగా ధనలక్ష్మిని ప్రశ్నించింది.

"మరేం ఫర్వాలేదు. నీవూ నేనూ తిని అక్కనిమాత్రం పస్తుపడుకో పెట్టములే. అతనుకూడా అక్కలేని లోటు తెలిసి అకాలే కాళ్ళబేరానికి రావాలి. వచ్చి తీరతాడు. అంతవరకూ అక్కభారం నీదీ నాదీన్నూ—" ధనలక్ష్మి ఆవేశంలోనే ఉంది ఇంక.

"నీవేదో ఆవేశంలో అంటున్నావేకాని నిర్మాణాత్మకంగా జరిగే పని చెప్పటంలేదు. బాగా ఆలోచించే ఏదైనా నిర్ణయానికి రావడం మంచిది."

"త్రికరణశుద్ధిగా చెపుతున్నాను. అక్కంతట అక్క ఇక ఆగడప తొక్కటానికి వీలులేదు. ఆడవాళ్ళకూ ఆత్మగౌరవమంటూ ఉంటుంది. అతగాడు ఏనాటికైనా వస్తే తగినరీతిని బుద్ధిచెప్పి మరీ పంపిద్దాము అక్కను సరేనా?"

"ఏమిటో—నీ ధోరణేనీది—అయినా ఇప్పుడు దానినిగురించి వాదోపవాదాలు దేనికి. చాలా పొద్దుపోయింది. తెల్లవారినతర్వాత

మాట్లాడుకుందాం. పడుకోండి — చివరికి ఎంత తెగించాడు బాస్." అని బాధగా అంది రాధ — వేదవతికి ఏం మాట్లాడాలో తెలియటం లేదు —

"అది కాదమ్మా లక్ష్మి. ఇప్పటికే రాధను నీవు కడుపులో పెట్టుకు కాపాడుకుంటున్నావు. దానికితోడు నేనకూడా వచ్చి ఇలా నీ నెత్తిన కూర్చోడం."

"అక్కా! ఇంకోసారి ఆ ముక్క అంటే నన్ను చంపుకుతిన్నట్లే. ఈ యింట్లో అటువంటి సంకోచాలకు తావులేదు. మా నాన్నగారు అమ్మ గారు, ఎటువంటివారో నీకు తెలియక అలా అంటున్నావు. రేపు ఈ విషయమంతా మా అమ్మ నాన్నలకు తెలిస్తే వాళ్లెంత బాధపడతారో నీకు తెలియదు. రాధ చెప్పినట్లు ఆ ఆలోచనలన్నీ ఇప్పుడెందుకు. హాయిగా జరిగిన విషయాలన్నీ కాసేపు మరిచిపోయి పడుకో. ఇదిగో ఈ పరుపు మీద నీవు ఒక్కదానివీ హాయిగా పడుకో. రాధా నేనూ ఆ మంచం మీద పడుకుంటాము." అంటూ వేదవతిని ఎంతో ఆదరించి గౌరవించింది

మొత్తంమీద వేదవతి జీవితం తలవని తలంపుగా ఇంకోమలుపుకు తిరిగింది. వేదవతికయితే మరునాడు ఉదయమే తిరిగి భర్తయింటికి చేరుకుందామనిపించింది. కాని ధనలక్ష్మిమాత్రం ససేమిరా ఒప్పుకోలేదు. రాధమాత్రం ఎటూ చెప్పక ముభావంగానే ఉండిపోయింది. నిజానికి తన అక్క తిరిగి ఆ నరకంలో కాలుపెట్టటం, రాధకూ యిష్టంలేదు. ఇష్టంలేక? తిరిగి అక్కగారికి ఏ విధంగానూ సాయపడగల స్తోమతు తనదగ్గర లేక పోవడంతో ఎటూ చెప్పలేక ముభావంగా ఉండిపోవలసి వచ్చింది.

"అదికాదే, ఒకళ్ళకిద్దరం ఎన్నాళ్ళని నీయింటిమీద కూర్చోము చెప్పు."

రాధ ధనలక్ష్మి నుద్దేశించి అడిగింది మరునాడు సాయంత్రం.

"రాధా! నీవూ అక్కా ఎంత ఆత్మాభిమానులో నాకు తెలియక పోలేదు. మీరు ఎన్నాళ్ళున్నా మా ఆస్తేమీ తరగేదికాదు. నీబోటివాళ్ళు

వందమంది భోజనాలిన్నా మాకేం భయ్యాలేదు. కాని మీ ఉద్దేశ్యం, మన స్నేహం నాకు పూర్తిగా తెలుసు కాబట్టి ఇవాళ మా నాన్నగారితో సంప్రతించి మీకో ఏర్పాటు చేశాను."

"ఏమిటది?" ఉత్సాహంగా అడిగింది రాధ.

"మా అవుటు హవుసు ప్రస్తుతం ఖాళీగా ఉంది. ఇప్పటిలో ఆ రెండుగదులతో మాకేం పనిలేదు. ఇక మీరిద్దరూ హాయిగా ఆ గదుల్లో ఉండే ఏర్పాటు చేశాను."

"పోతే-"

"మాటమధ్యలో అడ్డురాకు. నీ సందేహం నాకు తెలుసు. బ్రతకటానికి ఏదైనా ఆధారం కావాలికదా అంటావు అంతేనా."

"ఇవాళే నాన్నగారు వెళ్ళి ఆ ట్యుటోరియల్ కాలేజీ ప్రిన్సిపాలు గారితో మాట్లాడివచ్చారు. నీవు ఉదయం ఒకగంట సాయంత్రం ఒక గంటా ఆ ట్యుటోరియల్ కాలేజీలో ట్యూషన్ చెప్పాలి. నెలకు నూట ఇరవై జీతం. కాకపోతే నీవు నీ చదువు చూసుకుంటూ అదనంగా కూడా కొంత కష్టపడాలి. ఆత్మాభిమానాన్ని చంపుకోలేనివారు ఆ మాత్రం బాధ పడక తప్పదులే. ఏం చేస్తాం మరి."

"ఒసేధనం. నీ ఋణం ఎలా తీర్చుకోగలమే. నీలాటి స్నేహితురాలు దొరకటం నా పూర్వజన్మ సుకృతమే."

"ఆ. ఆ. కట్టెయ్యి. గుర్రాన్ని కట్టెయ్యి. మరీ అంత పొగిడితే నాకుకూడా బుద్ధి మారిపోగలదు. ఇందులో నేను చేసిందేముంది. ఇద్దరు మిత్రురాళ్ళకు అన్నం పెట్టలేకపోయినా ఆ మాత్రమయినా సాయంచేయలేని మనస్నేహం ఉంటేనేం. లేకపోతేనేం."

"అంతా అట్లా అనుకుంటారుటే."

"అన్నట్లు మరచిపోయా. నీమీదా నామీద మరొకబరువు బాధ్యత కూడాఉంది. రేపు మార్చిపరీక్షలో అక్కయ్యచేత ఎలాగయినా సి.యు.సి

పరీక్షకు కట్టి ప్యాసు చేయించాలి. అంతేకాదు. ఈ నాలుగయిదు ఏళ్ళలో అక్క తనకాళ్ళమీద తాను బ్రతికేలా చేయాలి. కేవలం భర్త మీదే ఆధారపడ్డ స్త్రీలగతేమిటో చూశావుగా. అందుకు యిప్పటి అక్క జీవితమే నిదర్శనం. అలాకాదు. కాలం మారింది. భర్త అనాదరించినా స్త్రీ తనకాళ్ళమీద తాను బ్రతికేలా తయారవాలి. అప్పుడే స్త్రీ ఆత్మ గౌరవం, వ్యక్తిత్వం నిలబడతాయి."

"ఒసే లక్ష్మి, ఇవాళ నీవు మామూలు లక్ష్మివిగా కనబడటం లేదు. ఏదో దివ్యశక్తి నీలో ఆవహించి స్త్రీజాతినే మేల్కొలుపుతున్న ట్లుగా ఉంది. చిన్నదానివైనా నీకు చేయెత్తి నమస్కారం చేస్తున్నానే."

"ఏడిశావులే. వెధవ్వేషాలు వేయకు. పదండి భోజనానికి టైమయింది. అమ్మ మనకోసం ఎదురుచూస్తూ ఉంటుంది."

ముగ్గురూ భోజనానికి లేచారు. రాధమనస్సు ఎంతో తేలికపడింది. అక్కజీవితం సుఖవంతం చేయడానికి రోజుకు రెండుగంటలేకాదు. రోజులో ఇరవై గంటలు కష్టపడమన్నా పడుతుంది. అంతకుమించిన ఆనందం ఆమెకులేదు.

వేదవతికిమాత్రం ఇదంతా ఏదో కలగా తోస్తోంది. "ఇవన్నీ జరిగే పనులేనా. ఈ పిల్లలిద్దరూ చిన్నపిల్లలు. ఉడుకురక్తంలో అనాలో చితంగా ఏవేవో గాలిలో మేడలు కడుతున్నారు. ఈ గాలిమేడలు కూలి పోతే? తనబ్రతుకేం కావాలి. ఏదో కాళ్ళా వేళ్ళాపడి బ్రతిమాలితే ఇప్పుడు భర్తపాదాలచెంత కాస్త చోటివ్వకపోడు. దాసిగానైనా ఆ యింట్లో పడివుంటే రోజులు వెళ్ళకపోవు. అదేమంత అసహజమూ కాదు. అసభ్యమూ కాదు. ఆడదానికి భర్త సాన్నిధ్యంకంటె కావలసిం దేముంది. అత్తగారు మంచంలో ఉంది. ఆయన బ్యాంకుకు వెళ్ళాలి. ఏం ఇబ్బంది పడుతున్నారో ఏమో? తనుమాత్రం హాయిగా పంచభక్ష్య పరమాన్నాలతో టేబుల్ముందు కూర్చుని విందారగిస్తోంది." ఇదే ఆలో చనతో మునిగి తేలుతోంది.

వేదవతి వచ్చేసిన రాత్రి సుమారు ఒంటిగంట సమయంలో సుబ్బారావు వాకిటి తలుపు తెరచి చూచాడు వేదవతికోసం. ఎంతసేపటికీ

అలికిడి వినరాకపోయేసరికి అతనికి అనుమానం తోచింది. వాకిట్లో వేద వతి వున్న అలికిడి వినిపించలేదు. కొంచెం భయం వేసింది. ఏదో పని వున్నవాడిలా నటిస్తూ ఆ వీధంతా ఈ చివరినుంచి ఆ చివరివరకూ తిరిగి చూశాడు. దగ్గరలో ఉన్న చెట్లక్రిందా, పక్కవాటపీధి అరుగుల మీదా వెతికి చూశాడు. వేదవతి జాడలేకపోయేసరికి మరింత కంగారు పడ్డాడు.

"ఏదో కొంచెం భయపెడదాంగదా" అని అలా చేశాడు. ఇప్పుడు వేదవతి జాడ తెలియటంలేదు. కొంపతీసి ఏ నూతిలోగానీ, గోతిలోగానీ, కాలవలోగానీ దూకలేదుకదా. రైలుకట్టవెపు ఎవరో వ్యక్తి వెళ్ళినట్లు ఆదారినపోయే ఎవరో ఆచూకీ చెప్పారు. దాంతో మరింత కంగారు పుట్టింది.

"అమ్మా, నీ కోడలు జాడ తెలియడంలేదే"

"నీదంతా ఒకటే తొందర. కోపంవస్తే వళ్ళు పై తెలియదు. అది యేఅఘాయిత్యమయినా చేసివుంటే రేపు నలుగురూ మనముఖాన వుమ్మేస్తారు. ఇక పదిమందిలో మనం తలెత్తుకు ఎలా తిరగగలం."

"అసలు దీనికంతటికీ కారణం నువ్వు. ఇంటికి రాగానే కొంప మునిగిపోయినట్లు శుభవార్త చెవినివేసేవరకూ నిద్రపోయావు కాదు."

"చాల్లే నోరుముయ్యి. 'ఇలావచ్చారా' అని నామకః చెప్పి నందుకు నిన్ను చావచితక కొట్టమన్నారా యేమిటి. పండంటి పెళ్ళాన్ని ఇంట్లో పెట్టుకుని అడ్డమైనవాళ్ళతో తిరిగే నిన్ను యేమనాలి నీమూలానే ఈ అనర్ధం కొంపకు."

ఇలా సంభాషణ జరిగి ఆరాత్రి యిద్దరూ నిద్దర్లు లేకుండా వేయి దేముళ్ళకు మ్రొక్కుతూ కూర్చున్నారు.

ఎలా తెల్లవారిందో వాళ్ళకు తెలియదు. పూర్తిగా తెల్లవారక ముందే సుబ్బారావు రైలుకట్టవెంటా, కాలవగట్లవెంటా, యేమీ ఎరగని వాడిలా సర్వేచేసి వచ్చాడు. కాని ఎక్కడా వేదవతిజాడ లేకపోవడంతో

పిచ్చెత్తి నట్లయి కాళ్ళీడ్చుకుంటూ పది పదకొండు గంటలకు కొంపకు చేరుకున్నాడు.

వేదవతిసంగతి దేముడెరుగు. తాను ఊరంతా బలాదూరు తిరిగి వచ్చాడు గాని యింటిదగ్గర వంట ప్రయత్నం ఎవరు చేస్తారు. తల్లి మంచంమీదనుంచి కాలు కింద పెట్టలేదు. తనకు కడుపులో మండి పోతోంది. పోనీ తాను యే హోటలుకయినా పోయి భోం చేద్దామంటే ముసలమ్మసంగతి?

"ఏమిరా. అపరాహ్ణం దాటిపోతోంది. నీరసంతో నా గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి. గుప్పెడుబియ్యం కుంపటిమీద వేద్దామంటే ఈ కాలు కిందపెడితే నరాలు జివ్వున లాగుతున్నాయి." అని ప్రారంభించింది ముసలమ్మ ఉసూరుమంటూ, వచ్చిన కొడుకును చూడగానే ప్రాణం లేచివచ్చి.

"నీ కాలి నరాలేకాదు. నా ప్రాణాలుకూడా జివ్వున లాగుతున్నావు. ఇవాళ బ్యాంక్‌కు శలవుకూడా పెట్టలేదు. ఆ ఉద్యోగం ఏమవుతుందో" అనుకుంటూ తల్లిని నాలుగుతిట్టి తనను నాలుగు తిట్టుకుని కుంపటిమీద అత్తెసరు పడేసేటప్పటికి ఒంటిగంటయింది.

రోజూ వేదవతి ఎంతో ఓపిగ్గా నవరసాలు ఉట్టిపడేటట్లు వండి పెడుతుంటే ఏమీ తెలిసొచ్చేది కాదు. పైపెచ్చు హుంకరింపులూ గీంకరింపులు. అవన్నీ జ్ఞాపకం వస్తున్నాయి సుబ్బారావుకు. మరోపక్క వేదవతి యేమయిపోయిందోనని బెంగ. నిజంగా వేదవతే చనిపోతే పోలీసులు వచ్చి తన్ను జైలుకు ఈడ్చుకుపోరూ. యే అలికిడయినా ఉలిక్కిపడి చూస్తున్నాడు ఎవరొస్తున్నారోనని.

ఈ ఆలోచనలతో ఉండి సరిగ్గా అన్నంగిన్నెకేసి చూడకపోయేసరికి సగం అన్నం మాడిపోయి,సగంమంట అందక ఉడకక ఎలా తయారవమంటే అలా తయారయింది. అందులోనే సగం తల్లికిపెట్టి సగం తను తిన్నాడు.

"ఏమిట్రా ఈ అన్నం. వంకాయకూరలో ఉప్పువాడలేదనేకదా దానిని చావచితకకొడతివి. నీవు-"

"చాల్లే నోరుమూసుకుతిందూ. పెట్టిందేదో తినక ప్రతిదానికీ వంకలూ."

"ఆ ప్రశ్నే నిన్ను అడగగల అవకాశం లేకపోబట్టేగా దాని గతి అలాగయింది."

"అసలిదంతా నీమూలానే వచ్చింది."

"అవును. నేను బ్రతికుండటమే నీకు కష్టంగా ఉందయ్యే.... నన్నుకూడా గొంతుక పిసిగి యే కాలవలోనో రైలుక్రిందో పారేస్తే నీవు హాయిగా కులకొచ్చు. దాని అడ్డం తీరిపోయిందిగా, నా అడ్డంకూడా

"ఛీ. ఛీ. దరిద్రపుకొంప. నే పోతున్నా. నీచావు నీవుచావు." అను కుంటూ బట్టలు వేసుకుని బయటికి బయలుదేరాడు.

"మళ్ళీ రాత్రికి పెందలాడే వస్తావా. మంచినీళ్ళిచ్చే దిక్కూకూడా లేదు కొంపలో."

"ఏమో నా యిష్టమొచ్చినప్పుడు వస్తా." అనుకుంటూ అంగలేసు కుంటూ బజారున పడ్డాడు.

ఇక తనసంసారం గతేమిటి? తనకు వంటచేయడం రాదు. హోటలునుంచి తెప్పిస్తే తల్లికి సయించదు. ఇక తను వంటా పెట్టూ అంటూ ఇంట్లో కూర్చుంటే తన బ్యాంకువుద్యోగం గతేమిటి కావాలి? సాయంత్రంసరాసరి బ్యాంకునుంచి ఇంటికి రాకపోతే తల్లి ఆకలితో మాడి చచ్చిపోతుంది. ఇంటికివస్తే కామేశ్వరి ఊరుకుంటుందా. ఛీ. ఛీ. అనవస రంగా తొందరపడి వేదవతిని కొట్టాను. పాపం. ఒక్కనాడన్నా నావల్ల సుఖపడలేదు. జీవితమంతా కష్టాలతోనే గడిపి చివరికి నావల్లే ప్రాణా లను కూడా-" సుబ్బారావుకు కళ్ళనీళ్ళు తిరిగాయి.

ఈ పరధ్యాన్నంలో అతను బ్యాంక్ గుమ్మంలో అడుగుపెట్టిన మాటే మరచిపోయి కళ్ళుతుడుచుకుంటూ నిలబడిపోయాడు.

# 13

అంతవరకూ చదివిన భారతి పుస్తకం మూసేసి కళ్ళు మూసుకుని జరిగిన కథను ఒక్కసారి మననం చేసుకుంది.

ఏదియేమయినా ధనలక్ష్మి చెప్పిన ఒక్కమాటమాత్రం పరమ సత్యం. "తన్నుతాను పోషించుకోగల స్థితి వచ్చేవరకయినా స్త్రీ చదువుకు తీరాలి." భర్తభార్యకు ఎన్ని అన్యాయాలు చేసినా. కొట్టినా తిట్టినా పడివుండేరోజులు పోయాయి. స్త్రీకీ కొన్ని వ్యక్తిత్వపు విలువలు ఉన్నాయి. ఆత్మగౌరవం ఉంది. వాటిని గౌరవించవలసిన బాధ్యత పురుషులకు ఉంది. అలా ఒకరిగౌరవాలు ఒకళ్ళు పాటించినప్పుడే ఆ ఇల్లు స్వర్గతుల్యంగా ఉంటుంది. ఆ అదృష్టం పూర్వజన్మ సుకృతం చేసుకున్నయేకొద్దిమందికో ఉంటుంది.

సుబ్బారావు స్థితి తలుచుకున్న భారతికి చటుక్కున భర్త నారాయణమూర్తి జ్ఞాపకం వచ్చాడు. తన భర్తమీద తనకున్న ప్రేమ, గౌరవం సుబ్బారావుమీద ప్రతిఫలించి సుబ్బారావుపట్ల జాలివేసింది.

నారాయణమూర్తి—ఎలా ఉన్నాడో, జ్వరం పూర్తిగా తగ్గిందో లేదో, మళ్ళీ డాక్టరువచ్చి చూశాడో లేదో. ఆయనగారి పిచ్చిగాని అంత కస్సు బుస్సులాడే తోబుట్టువును నమ్ముకుని అక్కడే ఉండటమేమిటి. తను చేసిన తప్పేమిటి. 'ఇది నీవు చేసినతప్పు' అని తెలియచెప్పి కోపగిస్తే అర్థముందిగాని, తన తప్పు లేనిదానికి తన నీవిధంగా శిక్షించడంలో అర్థమేముంది.

లేచి వెళ్ళి నారాయణమూర్తిని మరోసారి చూచి వద్దామా అనుకుంది. ఎంతమనస్సు సమాధాన పరచుకున్నా యేమిటో వెళ్ళడానికి కాళ్ళాడటంలేదు.

మూర్ఖంచేసి వెళ్ళడమల్లా తిరిగి అవమానం పొందటమే అవుతుందేమో. ఆడబిడ్డ యేదన్నామాట తూలితే భరించడం కష్టం.

ఇంతలో వాకిటి తలుపు చప్పుడయి పోస్టుమాన్ ఉత్తరాన్ని లోప లికి గిరవాటేసి వెళ్ళిపోవడం కనుపించింది. మనోరమ రాసిన ఉత్తరమది.

:

నీ దగ్గరనుంచి తిరిగి వచ్చేశానన్నమాటేగాని మనస్సంతా నీమీదే ఉంది. కొన్నాళ్ళపాటు నీ దగ్గరుంటే బాగుండుననిపిస్తోంది. అంత హాలాహలాన్ని లోపల యిముడ్చుకుని యేమీ జరగనిదానిలా ఎలా తిరగ గలుగుతున్నావు నువ్వు. నిన్ను తలుచుకున్నప్పుడల్లా నీవు పూర్వపు భారతివేనా అనుపిస్తోంది.

యేదియేమయినా నీపట్ల అంత నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించే నీభర్త పట్ల నీవు కొంచెం మెలుకువగానే వ్యవహరించటం మంచిది. అటువంటి వాళ్ళు మరీ ఎక్కువగా అణుసిస్తే నెత్తినెక్కి పిండికొడతారు సంసారం, కుటుంబం, గౌరవం, సాంప్రదాయం అన్నవి మనకెంత అవసరమో వాళ్ళకూ అంతే అవసరం. నీ మాదిరి గుణవతి, విద్యావతి, ఉద్యోగస్తు రాలు దొరికినందుకు సంతోషించడంపోయి, ఇలా మంచి బుద్ధితో వ్యవ హరించే నీ భర్త సంస్కారపు విలువలు నాకు పూర్తిగా అర్థమయ్యాయి. నిన్ను తలుచుకు బాధపడటం తప్ప నేనేం చేయగలను. తరచు క్షేమం తెలుపుతూ ఉండు—యేపని చేస్తున్నా నీవే జ్ఞాపక మొస్తున్నావు. పుట్ట బోయే అల్లుడు యేమంటున్నాడు.

నీ

మనోరమ....

ఉత్తరం చదువుకున్న భారతి ఒక్కసారి బరువుగా నిట్టూర్చి యేమనుకుందో ఏమో వెంటనే కవరుతీసుకుని మనోరమకు జవాబు వ్రాసేసింది.

ప్రియమైన మనోకు,

నీకు నాపట్ల అవ్యాజానురాగాలకు కృతజ్ఞురాలిని. నీవు వచ్చి నప్పుడు జరిగినదంతా ఒక పీడకల. తాత్కాలికం. సంసారమన్న

తర్వాత ఏటువంటివాళ్ళకైనా ఇవి తప్పవు. కాకపోతే మోతాదుల్లో తేడా లుండవచ్చు. ఇప్పుడు మేము ఎంతో అన్యోన్యంగానే ఉంటున్నాము. ఈ మా అభిప్రాయబేధం సరిగ్గా నీవు వచ్చినప్పుడు రావడమే నా దుర దృష్టకరము.

ఇకపోతే పుట్టబోయే అల్లుడు. అత్తగారిని తగుప్రయత్నాలలో ఉండమంటున్నాడు. నా ఆరోగ్యం బాగానే ఉంటోంది.

నీ

ఉత్తరం పూర్తిచేసి వచ్చినతర్వాత భారతి మరింత బాధపడ సాగింది. తను బాగా చదువుకున్నది, సంస్కారంగలది. గౌరవ ప్రద మైన ఉద్యోగం చేస్తోంది. అలాంటిది తనకూ తనభర్తకూ మధ్య కల తలు రావడం, అందులో మరోవ్యక్తి జోక్యం కల్పించుకుని బాధపడటం ఎంతో బాధ అనిపిస్తోంది. మనోరమ తనకు ఎంతో ముఖ్యురాలే, తన శ్రేయోభిలాషే, కావచ్చు. తన సంసారంలోని లోటుపాట్లూ, ఆవిడ తన భర్తను తేలిగ్గా చూడటం తనకిష్టం లేదు. అందుకనే ఆ విధంగా తిరిగి వెంటనే సమాధానం వ్రాసింది.

నిజానికి మనోరమ చెప్పినదాంట్లో నిజం లేకపోలేదు. తను తలుచుకుంటే నారాయణమూర్తికి మించిన విద్యావంతుడినీ, అందగాడినీ, ఉద్యోగస్థుడినీ వివాహమాడి వుండగలదు. కాని నారాయణమూర్తినే భర్తగా వరించి వివాహం చేసుకుంది. ఆతనిపట్ల ఎంతో గౌరవముంచి భర్తగా, హృదయాధినాధుడుగా ఆరాధించి పూజించుకుంటోంది. అదేమీ అతను గుర్తించకుండా తననీవిధంగా అగౌరవించి అల్లరిపెట్టడం ఏం సబబు___

మనోరమ చెప్పినట్లు, తనకు తాను అభిమానాన్ని చంపుకుని, ఆత్మగౌరవాన్ని వదులుకుని అతని కాళ్ళావేళ్ళాపడి బతిమిలాడటం

నిజంగా అవివేకమేనేమో_పోనీ విధంచెడి ఆత్మాభిమానాన్ని చంపుకుని అందుకు ప్రాకులాడినా అతను గుర్తించడం లేదు.

అప్రయత్నంగానే భారతిమనస్సు ప్రమీల రాసిన నవలమీదికి మళ్ళింది.

ఏమిటో....తనరాతా ఆ వేదవతిరాతా ఒకేమాదిరిగా ఉన్నాయి.... కాకపోతే విధానాలలో కొంచెంమార్పు. ఆమెభర్త ఆమెను యింటినుంచి వెడలకొట్టాడూ. తనభర్త తనయింటినుండి వెళ్ళిపోయాడు. గారెల చిచ్చయితేనేం, బూరెల చిచ్చయితేనేం జరిగింది ఒకటే. భార్యాభర్తలు ఒకరికొకరు కాకుండా పోవడం. ఎలాగయినా ప్రమీల మంచి ఘటికు రాలు. కథ మంచి బిగువుగా లాక్కొస్తోంది. భర్తనుంచి విడిపోయిన వేదవతి గతి యేమయిందో. ముందది తెలుసుకోవాలి.

భారతి, తరువాత కథ చదవడం ప్రారంభించింది.

అనుకున్నప్రకారం ఆ మరునాడే రాధా, వేదవతీ, ధనలక్ష్మిగారి. అవుట్ హౌవుస్‌లోకి మారారు. ఉదయం సుమారు పదకొండుగంటలయి ఉంటుంది. వంటంతా పూర్తిచేసుకుని వేదవతి రాధకోసం, ధనలక్ష్మి కోసం ఎదురు చూస్తూ కూర్చుంది. ఆరోజునుంచే వంట ప్రారంభిం చడం ధనలక్ష్మికి యిష్టంలేదు. కాని వేదవతీ, రాధల పట్టుదలతో ధన లక్ష్మి మాటసాగిందికాదు.

వేదవతి మనస్సంతా తన అత్తవారియింటిమీద ఉంది. పాపం, బ్యాంకుకు పోవలసిన భర్త ఈసరికి ఏంచేస్తూ ఉంటారో—ఆ ముసలావి డకి అన్నం వండిపెడుతూ అవస్థపడుతున్నారేమో—ఏమాట కామాట చెప్పుకోవాలి. తనభర్త యేదో కోపం వచ్చినప్పుడు అలా విచిత్రంగా ప్రవర్తిస్తాడు కాని ఒక్కొక్కప్పుడు తనను ప్రేమగాకూడా చూసేవాడు కదా—.భర్త అన్నవాడికి ఆ మాత్రం అధికారం ఉండదా యేమిటి? అది పురాణకాలంనుంచీ వస్తున్న ఆచారమే. ఇవాళ ఒక్కరోజు మాటమంచే

ఎలా మారుతుంది. పోనీ చటుక్కున ఎవరితో చెప్పకుండా భర్తదగ్గరికి వెళ్ళిపోతే—యేమోనబ్బా—ఆయన మళ్ళీ తన్ని తగిలేస్తే తనగతి ఏంగాను? ఈసారి రాధగానీ ధనలక్ష్మిగానీ తమ నీడ దాపుకయినా రానీయరు.

ఇంతలో దడాలున తలుపు తెరచుకుని రాధా ధనలక్ష్మిలు రావడంతో తన ఆలోచనలన్నీ ఒక్కసారి మాయమయ్యాయి.

"ఏమిటే! ఒక్కదానివీ కూర్చుని ఏమిటో ఆలోచిస్తున్నావు. కొంపతీసి భర్తగారిమీదికిగాని గాలిమళ్ళలేదుకదా."

"అదికాదే మా అత్తగారు పాపం-"

వేదవతిమాట యింకా పూర్తిచేయలేదు. రాధా ధనలక్ష్మి ఒక్కసారి గయ్యిమని లేచారు. "నీ చాదస్తం మండా. ఈసారి వాళ్ళ ఊసెత్తావంటే చూడు నిన్నేం చేస్తామో. గొర్రెప్పుడూ కటికవాడినే నమ్ముతుందిగాని గొల్లవాడిని నమ్మదనే శాస్త్రం ఊరికినే వచ్చిందీ? నిన్ను చూసే రాసుంటారు." అంటూ.

పాపం, ఆ మాటలతో ఇక మారు మాట్లాడలేక వేదవతి బిక్కచచ్చి ఊరుకుంది.

"ఇదేమిటో చెప్పుకో చూద్దాం." రాధ అడిగింది అక్కగారిని.

"ఏమో నాకు తెలియదు."

"మరేం తెలుసు. అస్తమానం అత్తగారూ అని పలకరించడం తెలుసూ."

"అందులో ఆక్షేపణం ఏం లేదులేవే."

"ఆక్షేపణా? పూర్తి ఆక్షేపణా. వాళ్ళపేరు కాదు సరికదా యింటిపేరుకూడా తలవడానికి వీలులేదు. తెలిసిందా—ఇదిగో యూనివర్శిటీకి డబ్బు కట్టిన చలానా—రేపు మార్చిలో అంటే రెండు నెలల్లో నీవు పి. యు. సి పరీక్షకు వెళ్ళితీరాలి. ప్యాసు అయి తీరాలి. తెలిసిందా."

"ఏమిటోనే నాకిదంతా భయంగా ఉంది."

"భయంలేదు. బెంగలులేదు. మేము చెప్పినట్లు చదువు. పి. యు. సి యే కాదు, బి. యే కూడా నీ చేత కష్టించి ప్యాసు చేయిస్తాం.... ఒ. కే."

"ఒ. కే." వేదవతి పకపకా నవ్వింది. రాధ తన అక్కా ముఖం మీద నవ్వు చూచి తృప్తిగా గాలి పీల్చుకుంది.

"సరేనే అక్కా. నాకు త్వరగా అన్నం వడ్డిస్తే నేను తిని కాలేజీకి పోవాలి."

"అప్పుడే పన్నెండయింది. సగంరోజు పోయినట్లేనా." వేదవతి మాటలో చెల్లెలిపట్ల కృతజ్ఞతాభావం స్ఫుటంగా కనిపిస్తోంది.

"ఏమీకాదు. ఫస్టు టూ అవర్సు టీచర్సులేరు — అది సరే, సాయంత్రం నేను వచ్చేసరికి ప్రొద్దుపోతుంది. నీవేం కంగారుపడుతూ కూర్చోకు."

"అదేం?"

"అదంతే— ఈరోజునుంచీ మనం సంపాదనలో పడ్డాం. మరి మనసంసారం ఎలా గడుస్తుందనుకున్నావ్ —ట్యుటోరియల్ కాలేజీలో పార్టుటైమ్ టీచరుగా చేరాను. నేను భర్త. నువ్వు భార్య."

వేదవతి కృతజ్ఞతాభారంతో ముఖం కిందికి దించివేసుకుంది. రాధ మాటలకు ధనలక్ష్మి పకపకా నవ్వేసింది. ఆ నవ్వు కేవలం రాధ మాటలకే అనే దానికన్న ఆమె హృదయం తేలికపడి తన ప్రయత్నాలు నిర్విఘ్నంగా కొనసాగుతున్నాయనే ఆనందం, వేదవతిని మనిషిని చేయ గలుగుతున్నాననే తృప్తి అంటే బాగుంటుంది.

ధనలక్ష్మి ఇల్లెగిరిపోయేటట్లు సరిగ్గా నవ్వేసమయంలోనే వాకిట్లో పెద్ద పెద్ద అరుపులుకూడా వినిపించి అంతా ఒక్కసారిగా స్తంభించిపోయి వాకిటివైపు చూశారు —గుండెలు బాదుకుంటూ రాధా వేదవతుల తల్లీ, దండ్రీ, వారివెనుక కుక్కినపేనులా సుబ్బారావూ నిలబడి ధనలక్ష్మి నుద్దేశించి కేకలు వేస్తున్నారు.

"ఒసే అక్కా ఎందుకయినా మంచిది. నీవు వంట యింట్లోకి పోయి తలుపు లోపల వేసుకో—నీవు యిక్కడున్నట్లు ముందు తెలియ

కుండా ఉండటం మంచిది. ముందు లోపలికి వెళ్ళు." అని రాధా ధనలక్ష్మిలు వేదవతిని తొందర చేశారు.

"ఏమిటో నాకు చాలా భయంగా ఉందే — ఏం జరుగుతుందో ఏమిటో."

"భయంలేదు బెంగలులేదు. ముందు లోపలకు వెళ్ళు....నీ ప్రాణానికి మా ప్రాణం అడ్డు."

అంటూ వాళ్ళిద్దరూ వేదవతిని బలవంతంగా లోపలికి తోసి తలుపు వేసేసి యేమీ ఎరుగని వారిలా "యేమిటి నాన్నా" అనుకుంటూ బయటికి వెళ్ళారు.

"చూశావా అమ్మా. అక్క బావతో మాటామాటా వచ్చి చెప్పకుండా ఎక్కడికో వెళ్ళిపోయిందిట. ఎక్కడికి వెళ్ళిపోయిందో ఏమో. ఒకవేళ ఇక్కడికిగాని వచ్చిందేమోనని."

తండ్రి మాటలువిని రాధ తెల్లబోయి "చూశావా! బావ ఎంత అబద్ధమాడేశాడో" అన్నట్లు ధనలక్ష్మి ముఖంకేసి చూసింది. ధనలక్ష్మి ముఖం అప్పటికే ధుమధుమ మండిపోతోంది.

"ఇక్కడికి రాలేదు నాన్నా — అసలెందు కొచ్చిందిట యిద్దరి మధ్యా తగూ."

"తగూ అంటే పెద్దతగూ యేంలేదుట—ఇటీవల అక్క ప్రవర్తన యేం బాగుండటం లేదుట. కోపం ఎక్కువయి అయినదానికీ కానిదానికీ బావను వేధించుకు తింటోందిట కూరలో అంతకారం వేశావేమే అని మాటవరసకు అన్నందుకు — బావనూ, అత్తయ్యనూ నానా మాటలు అని చర్రున తలుపుతీసుకు వెళ్ళిపోయిందిట—అతను కంగారు పడిపోతున్నాడు పాపం."

ధనలక్ష్మి, పళ్ళు పటపట కొరకటం చూచి రాధ ధనలక్ష్మి చేయి తనచేతిలోకి తీసుకుని,

"తొందరపడకు" అన్నట్లుగా గట్టిగా నొక్కింది.

"అంతేనా బావా జరిగింది." రాధ సాదాగానే అడిగింది.

"అంతే—అంతే—ఎన్నోవిధాల చెప్పి చూశాను. నామాట విన లేదు" ఎంత ఘంటాపథంగా చెబుదామని సుబ్బారావు ప్రయత్నిస్తున్నా అతని గొంతులోని వణుకు రాధా, ధనలక్ష్మి గ్రహించకపోలేదు.

"పోనీలే బావా—అంత నిన్ను కాదని వెళ్ళిపోయిన దాని గురించి నీవింత బాధపడ్డం దేనికి."

"అలా అంటావేం రాధా—అది లేకపోతే ఇంట్లో ఎంత ఇబ్బం దిగా ఉందో. నీకేం తెలుసు—అసలే మా అమ్మ కాలు క్రింద పెట్టలేక మంచంలో పడివుంది...."

"అయితే అక్కయ్య వెళ్ళిపోయినందుకు కాదన్నమాట నీబాధ. ఇంటిలో చాకిరీ చేసేవాళ్ళు ఎవ్వరూ లేరనా?"

"అబ్బే—అదేంకాదు—" మాట మరింత తడబడింది సుబ్బా రావుకు—

"ఒకవేళ ఎందులో పడన్నా చచ్చిపోయినదేమో — వెంటనే పోలీసు రిపోర్టివ్వడం మంచిది." ఓరగా సుబ్బారావు ముఖకవళికలు కనిపెడుతూ ధనలక్ష్మి ఒక బాంబు విసిరింది. సుబ్బారావు ముఖం ఒక్క సారి నల్లగా మాడిపోయి "నా ఉద్దేశ్యంకూడా అదే — కాని పోలీసు రిపోర్టివ్వడం అనవసరం."

"ఏం—ఎందుకని అనవసరం —చాలా అవుసరం—ఉండండి. సూపరెంటెంటు ఆఫ్ పోలీసు మానాన్నగారికి ముఖ్యస్నేహితుడు. నాకు కూడా బాగా పరిచయం. అర్జంటుగా రమ్మని ఫోను చేస్తాను అన్ని విషయాలూ తేలిపోతాయి." అంటూ రెండడుగులు వేసింది ధనలక్ష్మి.

సుబ్బారావు ముఖాన నెత్తురుచుక్కలేదు. గజగజ వణికిపోతూ "ఏమండీ ధనలక్ష్మిగారూ. మీరు తొందరపడి ఫోనుచేయకండి. పోలీసు వారితో పెట్టుకుంటే అంత తేలిక కాదు బయటపడటం—జరిగింది జరిగి పోగా కొత్తలంపటాన్ని కొనుక్కు తెచ్చుకున్నట్లవుతుంది. అయినా ఆమె ఆత్మహత్య చేసుకున్నట్లు ఏమిటి రుజువు."

"అంటే ఆవిడ ఆత్మహత్య చేసుకున్నట్లు ఋజువయ్యేవరకూ ఆగుదామనా మీ ఉద్దేశ్యం." రెట్టించింది ధనలక్ష్మి.

సుబ్బారావు ఏం చెప్పాలో తెలియక తికమకపడ్డాడు. "నా ఉద్దేశ్యం—" ఆపైన ఏం చెప్పాలో తెలియటంలేదు.

"మీ ఉద్దేశ్యం మాకు తెలుసు మహానుభావా — ఎలాగోలాగ, ఏ ఆత్మహత్యో చేసుకుని మా అక్క పీడ కాస్తా విరగడయిపోతే మీరు ఏ కామేశ్వరిలాటి వారితోనో హాయిగా కలుపుగడ్డి మేయొచ్చు"

"ధనలక్ష్మిగారూ, మీరు చాలా మితిమీరి మాట్లాడుతున్నారు— ఎవరిహద్దులు వారు తెలుసుకోవడం మంచిది."

"ఎవరిహద్దులు వారు తెలుసుకోవాలనే నీతి తెలిసినవా రెవ్వరూ మీలాగా ఆడవాళ్ళను ఆటవస్తువులుగా, పురుగులక్రింద జమకడుతూ పశువుల్లాగ ప్రవర్తించరు. మర్యాదస్తులకు నేను మర్యాదగానే సమాధానం చెప్పాలని నాకు తెలుసు—కాని యుక్తాయుక్త జ్ఞానం తెలియని మూర్ఖులకు మూర్ఖంగానే సమాధానం చెప్పాలి. భార్య అనగానే అంత తేలిగ్గా కనిపిస్తుందా—మా అక్క నోరుమెత్తనిది కనక మీరు గొడ్డును బాదినట్లు బాది మెడపట్టుకు అర్ధరాత్రివేళ వీధిలోకిగెంటి తలుపువేసు కుంటే ఊరుకుంది. మీరు కళ్ళెర్రచేసి మాట్లాడి జడిపించినంతమాత్రాన జడవడానికి నేను వెర్రి వేదవతినిగాను."

ధనలక్ష్మి కళ్ళు చింతనిప్పుల్లా మండిపోతున్నాయి — ధనలక్ష్మి చిన్నప్పటినుంచీ అతి గారాబంగా ధనవంతుల యింట్లో ఆడింది ఆటగా పాడింది పాటగా పెరిగిన ఒక్కగా నొక్కపిల్ల. ఆవిడది లొంగిఉండే స్వభావంకాదు. న్యాయమైనవన్నీ న్యాయంగానే జరగాలనే మనస్తత్వం కలది. ఆవిడపేరు చెపితే నౌకర్లేకాదు ఒక్కొక్కప్పుడు ఆమె తల్లి దండ్రులే ఎదురు మాట్లాడరు. మధ్యతరగతి కుటుంబీకులమల్లే తప్పు వున్నా లేకున్నా ప్రతిదానికీ తలవంచి సర్దుకు పోవాలన్న విషయమే ఆవిడకు తెలియదు. కేవలం కనుసన్నలతోనే ఆవిడ వాళ్ళింట్లో హుకుంలు జారీచేసి చేయించుకుంటుంది—అటువంటి ధనలక్ష్మితో స్నేహం

లభించడం కేవలం రాధ అదృష్టం. ధనలక్ష్మి అందరితోనూ చనువుగా
తిరిగి అందరితోనూ స్నేహంచెయ్యదు-తనకు అన్నివిధాల నచ్చిన సద్గు
ణాలు కలవారితోనే స్నేహంచేస్తుంది. స్నేహితులు అని నమ్మినవారికోసం
ఏ త్యాగం చేయాలన్నా కళ్ళు మూసుకు చేస్తుంది—అన్యాయమని తోచి
నప్పుడు ఎదుటివాళ్ళు ఎంత గొప్పవాళ్ళయినాసరే, నిర్భీతిగా ఎదు
ర్కొని ప్రతిఘటించి తీరుతుంది—పరిస్థితులతో రాజీపడటమన్నమాట
ఆమె జీవితంలో లేదు....అటువంటి ధనలక్ష్మికి ఈ సుబ్బారావు ఒక
లెక్కా !.

ఒకసారి కాలేజీలో ఒక కుఱ్ఱవాడు అసభ్యంగా ప్రవర్తించినప్పుడు
ఎడమకాలు చెప్పుతీసి పదిమందిలో ఎడాపెడా వాయించేసి, తరువాత
తను చేసినపనికి ఆరోజల్లా బాధపడింది—ఆవేశం వచ్చినప్పుడు ఆమెకు
వళ్ళు పై తెలియదు ఆ ఆవేశంతోనే సుబ్బారావును దుమ్ముదులిపేసినట్లు
దులిపేసింది—చుట్టూ వాళ్ళంతా ఉన్నారని కొంత సందేహించిందికాని,
ఆవిడకు లోగడనుంచీ సుబ్బారావు మీదున్న కోపానికి అతనిని ఈరోజున
ఏంచేసినా చేసేది—ఒకళ్ళ కుటుంబ విషయాలలో—అందులోనూ—
భార్యాభర్తలమధ్య తాను అంత ఎక్కువగా కల్పించుకోకూడదన్న ఆలో
చనకూడా ఆ సమయంలో ఆమెకు రాలేదు—ఆవిడ దృష్టిలో సుబ్బా
రావు పరమ దుర్మార్గుడు—అన్నెం పున్నెం ఎరుగని అమాయకురాలు
తనఅక్కకు అతనిమూలంగా అన్యాయం జరుగుతోంది అంతవరకే ఆవి
డకు ప్రస్తుతం కనిపిస్తోంది. అందుకనే అంత తీవ్రంగా సుబ్బారావును
ఎదిరించి మాట్లాడింది....

ధనలక్ష్మి నిప్పులవర్షం కురిపిస్తూ మాట్లాడుతుంటే కేవలం
సుబ్బారావే కాదు, రాధ తల్లితండ్రులుకూడా గుడ్లప్పచెప్పి చూడటంకన్న
నోరెత్తి మాట్లాడలేకపోయారు. ధనలక్ష్మి మాటల్లోని కొన్ని వాక్యాలు
వాళ్ళను మరింత ఆశ్చర్య పరుస్తున్నాయి. "గొడ్డును బాదినట్లు బాది అర్థ
రాత్రివేళ వీధిలోకి గెంటి తలుపువేసుకోడం." అన్న వాక్యం వాళ్ళకు
ఏదో కొత్తగా ఉంది. సుబ్బారావు లోగడ చెప్పినమాటలకూ, ధన
లక్ష్మి మాటలకూ ఏదో తేడా కనిపిస్తోంది—

రాధకుకూడా సుబ్బారావుమీద అంతకోపమూ ఉంది — రాధ వేదవతికి చెల్లెలు — వేదవతి అంతకాకపోయినా వేదవతిలో సగం మెతకతనం రాధకు ఉంది — ధనలక్ష్మి మాట్లాడినంత తీవ్రంగా తాను మాట్లాడాలని ఉన్నా మాట్లాడలేదు — ధనలక్ష్మి మాటలు తనకు సంతోషం కలుగజేస్తున్నా మరోప్రక్క ఈ ధనలక్ష్మి మాటలతో తన అక్కసంసారం ఇంకా ఎంత అధ్వాన్న స్థితికి దిగజారుతుందోననే భయంకూడా మరోప్రక్క కంగారుపెట్టకపోలేదు — కాని ఏంచేస్తుంది — ధనలక్ష్మి ముఖం చూసి ఆ క్షణంలో ఆమెను వారించే ధైర్యం ఆవిడకు కలగటంలేదు. ధనలక్ష్మి మూర్తీభవించిన కాళికాదేవిలాగ-మహిషాసురుడిపై దూకబోయే మహిషాసురమర్దనిలాగ-కనుపిస్తోంది.

కొంతసేపటికి సుబ్బారావు కొంచెం తేరుకుని లౌక్యంగా కొంచెం తగ్గి,

"ధనలక్ష్మిగారూ....మీ రనవసరమైన ఆరోపణలు చేస్తున్నారు. అర్ధరాత్రివేళ గొడ్డును బాదినట్లుబాది ఎవరు బైటికి గెంటాలంటారు?"

విషయం బైటపడిపోయిందని తెలుసుకున్నాడు. ధనలక్ష్మి మాటలకు అతనికి కోపం రావటంకంటే మనస్సు కొంచెం తేలికపడింది — తాను వేదవతిని కొట్టి బయటికి గెంటినసంగతి ఈమెకు ఎలా తెలుస్తుంది. కాబట్టి వేదవతి ఎక్కడుందో వీరికి బాగా తెలిసి ఉంటుంది. వేదవతి మరణించలేదని ఊహ తట్టగానే అతనికి కలిగిన ఆనందం ముందు ధనలక్ష్మి మాటల్లోని ఘాటుతనం అతనిపట్ల పనిచేయడంలేదు. అయినా ఆ విషయం పూర్తిగా తెలుసుకునేందుకే ధనలక్ష్మిని తిరిగి అనిధంగా ప్రశ్నించాడు.

"ఎవరని ఏమీతెలియని నంగనాచిలాగ మాట్లాడకండి సుబ్బారావుగారూ — ఒక్కసారి ఆత్మవిమర్శన చేసుకుంటే మీకే తెలుస్తుంది." ధనలక్ష్మి రెట్టించింది.

ఆ మాటలతో రాధ తల్లిదండ్రులకు కథ కొంత అర్థమయింది —

"ఏమిట్రా అది — వేదవతిని కొట్టి గెంటేశావా" బాధ, ఆవేదనతో నిండిన కంఠంతో వణుకుతూ ప్రశ్నించాడు వేదవతికి తండ్రీ, సుబ్బారావుకు మేనమామ అయిన పరంధామయ్యగారు.

"అదంతా అబద్ధం మామయ్యా." బుకాయించాడు సుబ్బారావు.

దానితో ధనలక్ష్మి ఆవేశంతో రెచ్చిపోయి — "అబద్ధమా — మాది అబద్ధమా — ఎవరిది అబద్ధమో ఇప్పుడే తేల్చేస్తాను." అంటూ అంగలు వేసుకుంటూ లోపలికి వెళ్ళి బరబరా వేదవతిని లాక్కొచ్చింది.

వేదవతిని చూడగానే పరంధామయ్యగారూ, ఆయనభార్యా ఒక్కసారి బావురుమని కౌగలించుకున్నారు — సుబ్బారావు ముఖంలో భావాలు వింతరంగులతో వెలా తెలాపోయాయి. ఒక పక్క సంతోషం, మరో పక్క బాధ-మరోపక్క కోపం — ఊసరవిల్లి రంగులు మార్చినట్లు సుబ్బారావు ముఖంలో రంగులు మారిపోతున్నాయి.

"ఇప్పుడు చెప్పండి సుబ్బారావుగారూ — మా అక్కముఖం చూసి మరీ చెప్పండి."

సుబ్బారావు నోట మాటరాలేదు — క్షణంలో ప్లేటు ఫిరాయించి ముఖం కందగడ్డలా చేసుకుని "భార్యాభర్తలమధ్య అనేకం ఉంటాయి. వాటిల్లో మరొకళ్ళు జోక్యం కలుగచేసుకోవలసిన అవుసరంలేదు — అది నిజంగా నా భార్యే అయితే కొట్టినా తిట్టినా అక్కడే పడి ఉండేది. అది నన్ను అల్లరి పెట్టాలనే ఇక్కడికి చేరి యింత నాటకమాడింది. ఇప్పుడు చెప్పు మామయ్యా — దీనికి మీరేం సమాధానం చెప్తారో." అనివాక్యం యింకా పూర్తికాకముందే ధనలక్ష్మి అందుకుని,

"కొట్టినా తిట్టిన పడివుండటానికి ఇవి వెనుకటిరోజులు కాదు సుబ్బారావుగారూ —" అని ఇంకా ఏమో అనబోతుండగానే సుబ్బారావు తోకతొక్కిన తాచులాగలేచి....

"ధనలక్ష్మిగారూ! చాలాకాలంగా చూస్తున్నా మీ విషయం.... అసలు మీరెవరు — మీకూ మాకూ ఏమిటి సంబంధం — మా భార్యా

భర్తలమధ్య అనవసరంగా కల్పించుకోవటమే కాకుండా మీ యిష్టం వచ్చిన రీతిగా నోరు పారేసుకునే అధికారం మీ కెవరిచ్చారు — ఇంకో సారి మితిమీరి మాట్లాడితేమాత్రం సహించేదిలేదు — హద్దుమీరిమాత్రం ప్రవర్తించకండి." అని దులపరించి పారేశాడు.

ధనలక్ష్మి మాట్లాడలేకపోయింది — ఇప్పుడు సమాధానం చెప్ప వలసింది వేదవతి. నిజమే. ఆ భార్యాభర్తలమధ్య కల్పించుకొని మాట్లాడ టానికీ, వేదవతిని వెనకేసుకు రావడానికీ తనకేం హక్కుంది — కనీసం వాళ్ళచుట్టంకూడా కాదే — సానుభూతి కలిగినంతమాత్రాన దేశంలోని ఒకభార్యను వెనకేసుకుని ఆమెభర్తను నిందించడం నిజంగా తన పొరపాటే .... ఆమెకు అయినవాళ్ళంతా నోరుమూసుకు కూర్చుని ఉండగా తాను కల్పించుకు ఎందుకు అంతతీవ్రంగా మాట్లాడినట్లు .... వేద వతి తనకేమవుతుందని తనకింత ఆవేశం?" ఈ ఆలోచనలు ఎప్పు డయితే తనమనస్సులో మెదిలాయో అప్పుడు ధనలక్ష్మి వాటి తీవ్రతకు తట్టుకోలేక వెర్రిగా చూస్తూ వెలా తెలాపోయింది.

"నిజమే రావుగారూ — మీరు చెప్పినట్లు నాది తప్పే — తోటి స్త్రీ అన్యాయంగా అణమటించిపోతుంటే చూసి సహించలేక వెర్రి ఆవేశా నికి లోనయిపోయాను. కందకులేని దురద చేమకెందుకన్నట్లు ఆమె తల్లి, తండ్రి, చెల్లెలూ అందరూ సహించి ఊరుకోగలుగుతున్నప్పుడు దారినిపోయే దానయ్యను నాకెందుకొచ్చిన కంఠశోష —" ధనలక్ష్మి గొంతు మూగపోయింది.

"కాదు అలా ఎప్పటికీ కాదు — దారినపోయే దానయ్యావు ఎప్ప టికీ కాదు .... నీవు నా శ్రేయోభిలాషివి. నా చెల్లివి — కాదుకాదు నా చెల్లికి మించిన దానవు. ఆపదలో ఆదుకొని రక్షించిన దేవతవు — నన్ను కొట్టి తిట్టి, నా చావుకోరే వారికన్న నీకే నన్నుగురించిన అధికారం ఎక్కు వగా ఉంది ...." ఊగిపోతూ మాట్లాడుతున్న వేదవతిని చూసి అంతా ఒక్కసారి నివ్వెరపోయారు.

"ఆ మాట్లాడుతున్నది నిజంగా వేదవతేనా? ఇంత సాహసం వేదవతికి ఎక్కడనుంచి వచ్చింది. ఇది కలా నిజమా —"

అని అంతా అనుకునేలోగానే వేదవతి ధనలక్ష్మి దగ్గరకు వెళ్ళి కౌగ లించుకుని, కళ్ళనీళ్ళు కారుస్తూ "నన్ను క్షమించు చెల్లీ — నామూలంగా నీవు ఎంత ఆవేదన అనుభవిస్తున్నావో, ఎంత కష్టపడుతున్నావో నాకు తెలుసు — అటువంటి నీకు నామూలంగా అవమానం జరుగుతుంటే, చూస్తూ ఊరుకోగల కృతఘ్నురాలనుకాదు." అంటూ కొంతసేపు మాట్లాడలేక క్షణంలో తేరుకుని "ఇంతకీ కనుక్కోండి నాన్నగారూ వారి అభిప్రాయమేమిటో" అనిమాత్రం అంది —

పరంధామయ్యగారు కానీ, రాధగానీ, రాధ తల్లిగానీ, ఇంకా పూర్తిగా తేరుకోలేదు. "అదికాదమ్మా — ఏమిటిది, మేం చూస్తున్నది కలా నిజమా — అసలు నీకూ అతనికీ ఆరోజున-" మాట పూర్తికాకుం డానే వేదవతి అందుకుంది.

"నాకూ వారికీ ఆరోజున ప్రత్యేకంగా వచ్చిన అభిప్రాయభేదం ఏమీలేదు. అది ఎన్నాళ్ళనుండో పేరుకువస్తున్న అగ్నిపర్వతం — రగిలి రగిలి అది ఆరోజున బద్దలయి కూర్చుంది. ఆయన నన్ను అగ్ని సాక్షిగా వివాహం చేసుకున్న భర్త — నేనాయన భార్యను — కష్టాల్లో సుఖాల్లో ఒకరికొకరం నిలుస్తామని బాసచేసుకుని అగ్ని చుట్టూ ప్రదక్షిణ చేశాం — అటువంటిభర్త చదువులేనిదాననే సాకుతో నన్ను చిత్రహిం సలు పెడుతూ క్షుద్రపురుగుకంటే హీనంగా చూడటం మొదలుపెట్టారు. ఒకే యింట్లో వున్నా నోరెత్తి పలకరించడానికి వారి సంస్కారం అడ్డు వచ్చింది. అన్నిటినీ సహించాను — స్త్రీకి చదువుకన్నా ముఖ్యం ఉత్తమ సంస్కారం, యిల్లూ, భర్తా, అన్యోన్య జీవితం అని ఎన్నోవిధాల నచ్చ చెప్పి చూశాను. కాని వారిమనస్సు మారలేదు సరికదా మరింత కర్క శంగా ప్రవర్తిస్తూ, ఆ కామేశ్వరిని తరుచు యింటికే తీసుకు వస్తూ తనతోపాటు ఆమెకూ సకల మర్యాదలూ చేయమని ఒత్తిడి చేయడం మొదలుపెట్టారు — తన ఎదుటే తనభర్త పరస్త్రీతో కులుకుతుంటే ఏ స్త్రీ చూసి సహించగలదు — ఓర్పుకుకూడా ఒక హద్దంటూ వుంది. మంచి తనం ఎక్కువయితే అసమర్థతక్రింద జమకట్టబడుతుంది — కాని అన్ని

టికీ ఓర్చుకున్నాను—చివరికి ఆ కామేశ్వరిముందే చావు దెబ్బలుకూడా తిన్నాను నాన్నా—ఆ కామేశ్వరిముందే పశువులాగ బయటికి ఈడ్చ బడి దిక్కూ-మొక్కూ-లేని దానిలాగ బజారు పాలయ్యాను. చావడానికి ధైర్యంలేకపోయిందిగాని ఆరోజున చచ్చిపోయినా బాగుండిపోయేది. ఈనాడు మీ అందరికీ ఇంతకష్టం కలగకుండా పోయేది—చెప్పండి ... ఇప్పుడు చెప్పండి నన్నేం చేయమంటారో—రక్తసంబంధమైనా లేని ఈ నా చెల్లి విశాలహృదయంలో కాస్తంత చోటు దొరికింది కాబట్టి ఈమాత్రమైనా మీ కళ్ళఎదుట పడగలిగాను. లేకపోతే ఆయనగారు ఆరోజున ప్రవర్తించిన తీరుకు ఎప్పుడో నామ రూపాల్లేకుండా పోయే దాన్ని—చెప్పండి—ఇప్పుడు చెప్పండి—ఇంకా మీరు నన్ను ఆయన వెంట వెళ్ళమనే శాసిస్తారా?—" కంటికి ఏకధారగా ఏడుస్తూ ఆవేశంలో తూలిపోతూ ప్రశ్నించింది వేదవతి—

వేదవతిలో ఇన్ని అగ్నిపర్వతాలు రగులుతున్నాయన్నసంగతి పరంధామయ్య దంపతులకు తెలియనే తెలియదు.

వేదవతిలోనుంచి ఈనాడు బయటకువచ్చిన మరో వేదవతిని చూసి తమకళ్ళను తామేనమ్మలేక స్థంభించిపోయారు ధనలక్ష్మి, రాధలు....

ఆవేశంతో బాధతో తపనతో ఊగిపోతున్న తనభార్యను చూసి ఏంమాట్లాడాలో తెలియని సుబ్బారావు గుడ్లప్పగించి నిలబడిపోయాడు.

# 14

అంతవరకూ పూర్తిచేసి వుంది ప్రమీల నవల. ఎంతో ఉత్సాహంతో నడుస్తున్న కథ అసంపూర్తిగా మధ్యలో ఠక్కున ఆగిపోయేసరికి భారతి చాలా నిరుత్సాహ పడింది. వేదవతి చరిత్ర భారతిని బాగా కలిచి వేసింది—రెండురోజులు గడిచాయి—ఈ రెండురోజుల్లోనూ భారతి ఏ పని చేస్తున్నా వేదవతే మనస్సులో మెదలటం మొదలుపెట్టింది—

వేదవతి భర్త వేదవతి ఎదుటే మరో స్త్రీతో కులుకుతున్నాడు — తనభర్త తనకు తెలియకుండా త్రాగుడు అలవాటు చేసుకుంటున్నాడు — చూస్తూ ఊరుకుంటే సుబ్బారావు లాగానే నారాయణమూర్తికూడా తిన ఎదుటే త్రాగటం మొదలు పెడతాడు — భార్యకుకాకుండా భర్త దూరమై పోతున్నప్పుడు కారణం మగువయితేనేం? మధిరైతేనేం — ఏదాయెనా ఒకటే. కాని అది కావన్నందుకే నారాయణమూర్తికి కోపం వచ్చి వెళ్ళి పోయాడు — వెళ్ళేవెళ్ళాడు — ఇవాళ వెళ్ళినా తర్వాత తన తప్పిదాన్ని తెలుసుకుని తానే వస్తాడు. ఆ ధైర్యం తనకుంది. కాని చూస్తూ చూస్తూండగా తనభర్త తాగుబోతుకావడం తాను చూసి సహించలేదు.

ఇంతకీ ప్రమీల తనకథ నెలా పూర్తిచేయాలనుకుంటోందో....

ప్రమీల చాలా తెలివిగలపిల్ల. అంతేకాదు. జీవితాన్ని కాచి వడ బోసిన నేర్పరిలా కనుపిస్తుంది. ఎవరితోనూ అనవసరంగా మాట్లాడదు. ఎంతసేపూ తనచదువేమో తానేమో — రెండో గొడవేపట్టదు. కాలేజీలో కూడా ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడినట్లుగానీ, ఎవరయినా స్నేహితు లతో కలిసి తిరుగుతున్నట్లుగానీ కనిపించదు. పి. యు. సి ఫస్టు క్లాసులో ప్యాసయినప్పుడు సరాసరి తనదగ్గరికి వచ్చి కాళ్ళకు నమ స్కారం చేసింది...."మేష్టారూ — అందరూ మీ అంత నేర్పుగా ఓర్పుగా చదువు చెప్పినట్లయితే ఎటువంటి బండరాయయినా ఇట్టే ప్యాసవుతుందండీ....మీరు పాఠాలు చెపుతుంటే ఎంతో ఇంటరెస్టింగుగా ఉండి ప్రతిపాఠం ఎంతో తేలికగా వచ్చేసినట్టే అనిపిస్తుంది. ఈనాడు నాకు ఫస్టుక్లాసు వచ్చిందంటే మీ దయవల్లనే" అని సంతోషంతో, ఉక్కిరి బిక్కిరయిపోతూ అంది. అప్పటినుంచే ప్రమీలంటే తనకెంతో యిష్టం. సభ్యత తెలిసినపిల్ల —

"నాదేముందమ్మా.... మేము చెప్పినప్పటికీ శ్రద్ధగా విని ఫస్టు క్లాసులో ప్యాసవాలనే అభిప్రాయంమాత్రం అందరికీ ఉంటుందా — గోడలకు చెపుతున్నట్లు మేము చెప్పుకుపోవడం, 'ఎప్పుడు కాలేజీ వదు లుతారా' అంటూ ఆవలింతల్తో పిల్లలు పాఠాలు వినడం జరిగినప్పుడు మేము

ఎంత గొంతుకు చించుకు చెప్పినా లాభమేంటదమ్మా — కోటికి నీలాటి విద్యార్థిని ఒకళ్ళువున్నా మేం చెప్పినచదువుకు సాఫల్యత ఉంటుంది. చెప్పినఉపాధ్యాయులం మేము ధన్యులమవుతాం" అని అన్నప్పుడు ప్రమీల కళ్ళల్లో వెలిగినవెలుగు భారతి ఈనాటికీ మరచిపోలేదు.

అంత నిబ్బరంగా, దీక్షగా చదువుతున్న ప్రమీల ముఖంలో ఎప్పుడూ ఏవో విషాదచ్ఛాయలు లీలగా కనిపిస్తూనే ఉండేవి. కారణం తాను అడుగుదామనుకుంటే ఒకళ్ళ స్వవిషయాలలో జోక్యం కలిగించుకోవడం సభ్యతకాదని తలిచి, ఒక్కొక్కప్పుడు నోటి చివరివరకూ వచ్చినా అడగటం మానేసింది. ప్రమీల పుట్టుపూర్వోత్తరాలు అసలు తనకేం తెలియదు — ఈ కాలపు షోకులూ, హాళ్లాపెళ్ళా ప్రమీలలో మచ్చుకయినా కనిపించవు — నిజానికి తనకంటే వయస్సులో కొంత పెద్దదయినప్పటికీ, తనంటే విపరీతమయిన గౌరవం, అభిమానం. ఈ సంవత్సరం కనుక కష్టపడి చదివితే బి. ఎ. కూడా ఫస్టుక్లాసులో ప్యాసవుతుంది ప్రమీల. భారతికి ప్రమీలపట్ల ఆ నమ్మకం బాగావుంది. ప్రమీలకూడా శ్రద్ధగా రాత్రింబవళ్ళు కష్టపడి చదువుతుంది. ప్రమీలను గురించే ఆలోచిస్తున్న సమయంలో తలుపు చప్పుడయింది. ప్రమీల వచ్చిందేమోననే సంతోషంతో భారతి ఉత్సాహంగా వెళ్ళి తలుపు తెరిచింది —

కాని ప్రమీలకు బదులుగా ఎవరో యిద్దరమ్మాయిలూ, ఒకకారూ ఉండటం చూసింది. ఆ యిద్దరమ్మాయిల్నీ తానెప్పుడూ చూసిన జ్ఞాపకం లేదు — ఒకటి రెండుసార్లు కాబోలు ప్రమీలపక్కన కాలేజీలో చూసిన జ్ఞాపకం —

భారతికూడా కాలేజీలో చాలామంది పిల్లల్ని ఎరగదు — ఎవరితోనూ పరిచయం చేసుకోవాలని కూడా ప్రయత్నించదు. కాలేజీలో వంచిన తల ఇంటిదగ్గర, ఇంటిదగ్గర వంచిన తల కాలేజీదగ్గర — దారిలో ఎవరు వస్తున్నది, ఎవరు పోతున్నది ఆవిడకు తెలియనే తెలియదు —

ఇద్దరి మనస్తత్వాలూ ఒకటి కాదట్టే ప్రమీలకూ భారతికీ స్నేహం కుదిరింది—

"లోపలికి రండమ్మా." ఆహ్వానించింది భారతి.

అంతా లోపలికి వచ్చి కూర్చున్నారు.

"నమస్కారమండి—నాపేరు రాధ. ఈమెపేరు ధనలక్ష్మి", అని తమను పరిచయం చేసుకున్నది ఒకమ్మాయి.

భారతి తెల్లబోయింది. తనేమీ కలగనడం లేదుకదా. సినిమాల్లో లాగ ఊహించినంతమాత్రానే కలలోకి ఊహించిన వ్యక్తులు ఢూఖాయట్లు పాడుకుంటూ వచ్చినట్లు, ఇంతవరకూ ప్రమీల నవల చదివి వుండటం, ఆ నవలలోని వ్యక్తులు వెనువెంటనే ప్రత్యక్షం కావడం, ఏదో తమాషా అనుభూతిని పొందింది భారతి. అందులో ఒకమ్మాయి- అదే తమను పరిచయం చేసుకున్న అమ్మాయి-చాలావరకూ ప్రమీల పోలికల్లోనే ఉంది. కొంపతీసి ప్రమీలే వేదవతి కాదుకదా - లేకపోతే నిజంగా తాను కలలోనే ఉందా.

"ఏమిటో ఆలోచిస్తున్నట్లున్నారు. మీపని చెడగొట్టి మిమ్మల్ని డిస్టర్బుచేస్తే క్షమించండి." రెండో అమ్మాయి ధనలక్ష్మి పేరుగల అమ్మాయి అంది.

"అబ్బెబ్బే, అదేంకాదు. ఏదోవిషయం జ్ఞాపకం వచ్చి మీకు వెంటనే సమాధానం చెప్పలేకపోయాను. ఏమీ అనుకోకండి. నా వల్ల మీకు కావలసిన పని-"

"అదే, వేదవతి అనే అమ్మాయి మీ యింటికి వస్తూ ఇక్కడే అప్పుడప్పుడూ ఉంటూ ఉండేది. మీరంటే ఆవిడకు ఎక్కడలేని గౌరవం. ఎప్పుడూ మీ విషయమే చెప్తుతూ ఉంటుంది. ఆమెకోసం-"

భారతికి నిజంగానే ఈసారి మతిపోయింది. నిజంగా ఇది కలే- లేకపోతే ప్రమీల నవలలోని పాత్రలన్నీ ఇట్లా తనను వెంటాడటమేమిటి. వేదవతి తనదగ్గర చదువుకోవడమేమిటి. తనంటే గౌరవ

పేమిటో? సమాధానం చెప్పలేక గుడ్లప్పగించి చూడటంతప్ప ఏమీ చేయ లేకపోతోంది.

"ఏమిటలా చూస్తారు. క్షమించండి. వేళగాని వేళలో వచ్చి మీ మనస్సు చెడగొట్టామేమో, తప్పనిసరయి రావల్సి వచ్చింది. నిన్న సాయంత్రం వేదవతి మామూలుగా యింటికివచ్చి ఏదో ఆదుర్దాగా, భయంగా, చంచలంగా వ్యవహరించడం మొదలుపెట్టింది. ఎన్ని సార్లడిగినా కారణం చెప్పలేదు. రాత్రి మామూలుగానే పడుకుంది. ఎంత ప్రాధేయపడ్డా భోజనం చేయలేదు. తెల్లవారి లేచిచూస్తే పక్కమీదలేదు. పక్కమీద ఈ ఉత్తరంమాత్రం ఉంది. కంగారుపడి ఒకవేళ మీయింటి దగ్గరుందేమోనని ఆదుర్దాగా వచ్చాం."

అమ్మా, రాధా, లక్ష్మి.

ఇన్నాళ్ళనుంచీ నేను మీ దగ్గరుండి నా విద్యుక్త ధర్మానికే నేను ద్రోహం చేశాను. నన్ను మీ కంటికి రెప్పలా చూచుకుంటూ ఎంతో ఆదరించారు. ఎంతో కృతజ్ఞురాలిని. యిక ఇప్పుడుకూడా మీదగ్గర ఉండటం నా వల్లగాని పని. వెళ్ళిపోతున్నందుకు క్షమించండి. మీ అభీష్టానికి వ్యతిరేకంగా చేస్తున్నందుకు నన్ను మీరు ఎన్నివిధాల నిందించినాసరే - భగవంతుడు నాలో ఇంత చంచలత్వాన్ని ఎలా సృష్టించాడో-పరిస్థితిని ఎదురించే శక్తి నాలో లేదు.

మీ అక్క, వేదవతి.

ఉత్తరం పూర్తిగా చదివింది భారతి. కొంతసేపటికి తేరుకొని,

"క్షమించండి. వేదవతి ఎవరో నాకు తెలియదు. నా యింటికి వచ్చి నాతో ఉన్న విద్యార్థిని పేరు ప్రమీల."

"అవును. ప్రమీలే వేదవతి. ప్రమీల అన్నపేరు మా బావగారు మార్చారు. వేదవతి అంటే పురాణకాలంలో పేరు లాగుందని ప్రమీల అన్న పేరుతో మెట్రిక్‌కు పంపించారు. ఆ పేరుతోనే మెట్రిక్ ప్యాసైంది. తరువాత ఆ పేరుతోనే కాలేజీ రిజిష్టర్సులో పేరెక్కించి చదువు కొనసాగించాల్సి వచ్చింది."

భారతి బరువుగా ఊపిరి పీల్చుకుంది. ఇంతకీ ప్రమీల తనకథనే నవలగా రాసుకున్నదన్నమాట. అందుకనే ఎప్పుడూ విచారంగా కనిపిస్తూ వుండేది. కారణం ఇప్పుడర్థమయింది భారతికి.

ఒక్కసారిగా లాటరీలో లక్షరూపాయలొచ్చినప్పుడు-మనస్సులో ఏవేవో వింతవింత భావాలూ, అనుమానాలూ, సంతోషం- అన్నీ కలిసి విపరీతమైన అనుభూతినీ, ఆలోచనల్నీ కలిగిస్తాయి.

భారతి ప్రస్తుత స్థితీ అలాగే ఉంది. వేదవతిపాత్ర తనకెంతో ఆకర్షించి, ఆ పాత్రపట్ల తనకెంతో సానుభూతి ఏర్పడింది. ప్రస్తుతం తనకూ, తనభర్తకూ మధ్య ఏర్పడ్డదూరం, వేదవతీ సుబ్బారావులమధ్య ఏర్పడటంలో తనకూ వేదవతికీ ఒకే దురదృష్టం రాసిపెట్టబడి ఉండటంలో ఆ పాత్ర తనకంత దగ్గరయింది. ప్రమీలకూడా తనకెంతో నచ్చినపిల్ల. ప్రమీల వాస్తవానికి శిష్యురాలయినప్పటికీ ప్రమీలంటే తనకెంతో గౌరవం ఏర్పడింది. అటువంటి ప్రమీలే వేదవతి అవి తెలియగానే లాటరీలో లక్షరూపాయలు దొరికిన ఆనందం భారతికి ఒక్కసారిగా కలిగింది.

కాని ఈఉత్తరం మాటేమిటి. వేదవతి ఏమయినట్లు. ఈ ఉత్తరంలోని అర్థమేమిటో తనకు తెలియకుండా వుంది. అంత ఆప్యాయంగా చూసుకునే చెల్లెళ్ళతోగానీ, ఎంతో అభిమానంగా వున్న తనతోకాని చెప్పకూడనంత అఘాతం ఇప్పుడు ఆవిడకు ఎలా కలిగివుంటుంది? ఎక్కడికి వెళ్ళి ఉంటుంది?

"ఏమమ్మా. ప్రమీలకు కష్టం కలిగించే విషయం ఏమన్నా జరిగిందా."

"ఏంలేదండీ."

"మీ యిల్లూ కాక, మా యిల్లూకాక మరెవరయినా స్నేహితులుగానీ, ఆప్తులుగానీ ఆవిడకున్నారా."

"ఎవ్వరూ లేరు. అసలు నోరువిప్పి ఎవరితోనూ మాట్లాడదు. అసలు మీతోనే స్నేహం ఎలా కలిగిందో మాకర్థంకాలేదు. మా అక్క

"ఏమిటి." అర్థంకాక ప్రశ్నించింది రాధ.

"ఏమీలేదు. ఏదో జ్ఞాపకం వచ్చి." పాము చావకుండా సమాధానం చెప్పింది భారతి.

"వేదవతి తనకథనే వ్రాసి పంపాలనుకుంటున్నది." అన్న విషయం ప్రస్తుతం చెప్పడానికి ఎందుకో యిష్టంలేకపోయింది భారతికి.

"ఏదీ ఆ ఉత్తరం ఇలా యివ్వండి ఒకసారి." వేదవతి వదలి వెళ్ళిన ఉత్తరం అడిగింది. రాధ ఆ ఉత్తరాన్ని తిరిగి యిచ్చింది. భారతి రెండు మూడుసార్లు ఉత్తరం చదువుకున్నది.

"అన్నట్లు రంజిత్‌కుమార్ గారూ,సుబ్బారావుగారూ ఒకే బ్యాంకులో పనిచేస్తున్నారుకదూ."

"అవును." ధనలక్ష్మి సమాధానం చెప్పింది.

"సరే లేవండి." కుర్చీలోనుంచి ఒక్కసారిగా లేచింది భారతి.

"ఎక్కడికి?" రాధా, ధనలక్ష్మి ఆశ్చర్యంగా అడిగారు.

"ఒకసారి రంజిత్‌కుమార్‌గారిని కలుసుకు మాట్లాడాలని వుంది."

"మా అక్క అక్కడికి ఎప్పుడూ వెళ్ళదు."

"ఆసంగతి నాకూ తెలుసు. కాని ఆయనను కలుసుకుంటే మంచిదని నాకు తోస్తున్నది."

"సరే మీ యిష్టం."

ధనలక్ష్మి కారుడ్రైవ్ చేస్తున్నది. రాధ భారతి వెనకసీట్లో కూర్చున్నారు.

"ఇదంతా నాకొక కలగా ఉందమ్మా." కారు కొంతదూరం వెళ్ళాక భారతి తనలో తనే నవ్వుకుంటూ అంది.

"ఎందుకని."

"గంటక్రితంవరకూ మీరంతా ఊహలోని వ్యక్తులు. గంట గడిచిందో లేదో ఊహలోని వ్యక్తులకు స్వరూపాలువచ్చి కళ్ళెదుట సాక్షాత్కరించారు,

"అంటే."

"అంటే ఏం చెప్పను. నవలల పోటీమహత్యం."

"మీరేదో మాట్లాడుతున్నారు. నాకర్థం కావడంలేదు."

"ఇప్పుడు కాకపోయినా తరువాత అదే అర్థమవుతుంది. వేదవతి మీద గౌరవం పూర్వంకన్న ఇప్పుడెక్కువయింది నాకు. నీవూ, ధన లక్ష్మి, వేదవతి మీరంతా మంచికి ఒక్కొక్క రూపంలో నిజ స్వరూపాలు —"

కారు ఒకసందులోకి తిరిగి తక్కున ఆగిపోయింది. ధనలక్ష్మి తాను ముందుదిగి భారతికి తలుపుతీయడంలో ధనలక్ష్మిలోని నమ్రత భారతికి పూర్తిగా అర్థమయింది. అంతా లోపలికి వెళ్ళారు.... రంజిత్ కుమార్ ముందుహాలులోనే ఎదురయి వీళ్లను సాదరంగా ఆహ్వానించి మేడమీదకి తీసుకువెళ్లాడు..

"వీరు—" రాధ పరిచయం చేయబోయేసరికి మధ్యలోనే కుమార్ అందుకుని "నాకుతెలుసు, నారాయణమూర్తిగారి భార్య, భారతి గారు."

తెల్లబోయింది భారతి ... మళ్ళీ వెంటనే తేరుకుని, "అవునూ, మావారి ఎకౌంటు మీబ్యాంకులోనేకదూ ఉంది."

"అంతేకాదు. మాచెల్లికూడా మీకాలేజీలోనే చదువుతోంది.. మిమ్మల్నిగురించే ఎప్పుడూ మాఅమ్మతో చెపుతూఉంటుంది. అదీకాక మీకు జ్ఞాపకముందోలేదో ఒకసారి చెక్కుమార్చుకునేందుకు మీరు మా బ్యాంకుకు వచ్చారు. మీ సిగ్నేచరు వెరిఫికేషను కావల్సివచ్చింది... అప్పుడు నేను రాధబావగారు సుబ్బారావుదగ్గరకు వచ్చి మీ సిగ్నేచరు వెరిఫైచేసి మిమ్మల్ని నాకు తెలిసినట్లుగా చెప్పాను... బహుశా అదంతా మరిచిపోయిఉంటారు.."

భారతికి యిప్పుడు ఆకథంతా జ్ఞాపకమొచ్చింది. ఎక్కడో చూశానని మధనపడుతున్న భారతికి కుమార్ ఎవరయిందీ, ఎక్కడచూసిందీ యిప్పుడు పూర్తిగా జ్ఞాపకమొచ్చింది..

"అయితే అప్పుడు తెల్లగాఉన్న ఒకాయన పై వేసుకున్నారూ.. వారేనా సుబ్బారావుగారంటే —"

"అవునండీ."

ప్రమీలభర్త అందగాడని తెలియగానే తనకు తెలియకుండానే ఆనందించింది భారతి. మనిషి చాలా సాధువుగా మంచివాడుగానే కనిపించాడు.. మరి అతనివెనుక అంత కథఉందని తనకెట్లా తెలుస్తుంది.. ఎలా ఊహించుకుంటుంది...

"ఏమిటాలోచిస్తున్నారు.. ఏదైనా బ్యాంకుపనిమీదగాని వచ్చారా."

ఈసారి రాధ అందుకుంది."మాఅక్క వేదవతి మీకు తెలుసుగా. ఆమె వీరి శిష్యురాలు.. వీరిదయవల్లనే అది గ్రాడ్యుయేషను పూర్తి చేసుకుంటోంది."

"మామూలుగాకాదు.. ఫస్టుక్లాసులో" భారతి నవ్వుతూ పూర్తి చేసింది...

కుమార్ ఏదో జ్ఞాపకమొచ్చినవాడిలా సర్దుకుని "అన్నట్లు మరచిపోయాను చెప్పడం... సుబ్బారావుకు చాలా సుస్తీగాఉంది. హాస్పటల్లో ఉన్నాడు."

అందరూ ఒక్కసారిగా ఉలిక్కిపడ్డారు. సుబ్బారావు దుర్మార్గుడని అందరూ అనుకుంటున్నదే...తమసొత్తయిన వేదవతితో అతను సంబంధాలు తెంచుకున్నాడనికూడా వాళ్లకు తెలుసు.. అతనికీ తమకూమధ్య ఏవిధమైన సంబంధ బాంధవ్యాలూ లేవనికూడా పూర్తిగా తెలుసు.. అయినా ఉలిక్కిపడ్డారు.. ఎంత సంబంధం లేదనుకున్నా అతను వేదవతి భర్తేకదా.. ఆ అనుబంధమే వారిని విచలితుల్ని చేసింది..

"ఈ విషయం మీరు వేదవతికి చెప్పారా." ప్రశ్నించింది భారతి.

"అవును నిన్నసాయంత్రం కాలేజీనుంచి వస్తూన్న వేదవతిగారు కనుపించారు. నిజానికి సుబ్బారావు, ఆమకునేనాశ్లెవ్వరూలేక, మంచినీళ్లయినా గొంతులోపోసే దిక్కులేక దిక్కూ మొక్కూ లేనివాడిలా హాస్పటలు పాలయితే నాకెంతో బాధ అనిపించింది..."

"ఏం, పాపం ప్రియురాలు కామేశ్వరిగారేమయ్యారు." కళ్లు పెద్దవి చేసి కోపంగా అంది ధనలక్ష్మి... భారతీ, రాధా, కుమార్ ఒక్కసారిగా నవ్వారు ధనలక్ష్మి కోపంచూచి...

"నిజమే ధనలక్ష్మిగారూ.. మీరు అడగవలసిన ప్రశ్నే అడిగారు.. కామేశ్వరి మనస్తత్వంకూడా మీకు తెలిసే ఉంటుంది.. ఆవిడకూ సుబ్బారావుకూ మధ్యగల అనుబంధం కేవలం డబ్బే... అందుకనే ఆవిడ ఆ విధంగా కబురుచేసింది.."

"ఏమని?"

"నీకు సుస్తీచేస్తే హాస్పటల్లోకూర్చుని చాకిరీచేసేందుకు నేనేం నీ కట్టుకున్న భార్యనుకాదు." అని...

"ఈ విషయాలన్నీకూడా మీరు వేదవతికి చెప్పారా."

"చెప్పాను. ఏమిటి ఇంత ఇదిగా అడుగుతున్నారు."

"ఏంలేదు___వేదవతి భర్తదగ్గరకు చేరుకుంది." భారతి నిశ్చలంగా అంది.

"అదేమిటి. మీకెట్లా తెలుసు." రాధ, ధనలక్ష్మి ఆత్రంగా అడిగారు.

"నాకెట్లా తెలుసేమిటమ్మా. నాకు పెళ్ళయింది కనక తెలుసు___ భర్తకు జబ్బుగా ఉన్నప్పుడు భార్య ఎంత మనోవేదనతో కుమిలిపోతుందో నాకు తెలుసుకనక తెలుసు. అది మీకు తెలవాలంటే కొద్ది రోజుల్లో కాని తెలీదు. వేదవతినిగురించి మీరేమీ ఆదుర్దా పడక్కర్లేదు.

భార్యాభర్తలమధ్య ఉండే అనురాగం ఒక ప్రవాహంలాటిది. దాన్ని తాత్కాలికంగా ఎవరయినా గట్టువేసి ఆపినా, సమయం చూసుకుని అది గట్లు తెంపుకుని పొర్లి ప్రవహించి పరవళ్ళు తొక్కుతుంది." భారతికి కళ్ళనీళ్ళు గిర్రున తిరిగాయి. ఆమెకు తనభర్త నారాయణమూర్తి జ్ఞాపక మొచ్చాడు. అతనూ సుస్తీగా వున్నాడు. ఆ సంగతి తనకు తెలుసు— తాను ఎంత మనోవేదన అనుభవిస్తున్నప్పటికీ తనభర్త దగ్గరకు తను చేరుకోలేకపోతోంది. దానికి కొన్ని పరిస్థితులు అడ్డువస్తున్నాయి. సమయం కలిసి వచ్చినప్పుడు ఈ పరిస్థితులు అడ్డంకులేవీ నిలవవని ఆమెకు మూఢ విశ్వాసం. పైకి వేదవతినిగురించి మాట్లాడుతున్నా అంత రాత్మలో మెలితిరుగుతున్న ఈ భావాలే ఆమెకు కళ్ళనీళ్ళు తెప్పించాయి. ఈ విషయాలన్నీ తెలియని రాధ ధనలక్ష్మి భారతికి వేదవతిపట్ల గౌరవం చేత ఆమెకళ్ళనీళ్ళు పెట్టుకుందని భావించి భారతిపై మరింత గౌరవాన్ని పెంచుకున్నారు.

అంతా కలిసి ఆసుపత్రికి వెళ్ళారు.

భారతి చెప్పినట్లుగానే వేదవతి భర్త పక్కన మంచంమీద కూర్చుని బత్తాయితొనలు ఒలిచిపెడుతోంది—సుబ్బారావు వేదవతి చేతిని తనచేతుల మధ్య ఇరికించుకుని వేదవతికళ్ళల్లోకి చూస్తూ కృతజ్ఞతగా నిమురుతున్నాడు.

# 15

పేడకకుర్చీలో పడుకున్న భారతి హాయిగా తృప్తిగా గాలి పీల్చుకుంది.

తన ప్రియశిష్యురాలు ప్రమీల కష్టాలన్నీ తీరాయి. హాయిగా భర్త దగ్గరకు చేరుకుంది, ఇకా జంటను బ్రహ్మదేవుడుకూడా విడదీయలేడు. అదే తనకెంతో ఆనందంగా ఉంది. అందుకే హాయిగా తృప్తిగా గాలి పీల్చుకుంది. కాని సుబ్బారావు మనస్తత్వమే భారతికి అర్థంకాలేదు.

వింతవింత కోరికలతో మూర్ఖంగా ప్రవర్తించేవారిని ఎంతమందినో చూచింది కాని,భార్య కేవలం చదువుకోలేదనే కారణంతో వదులుకునేంత నీచస్థితికి పాల్పడే మూర్ఖులనిమాత్రం చూడలేదు. 'తమాషావ్యక్తి' అను కుంది మనసులో. పిచ్చివాడు కామేశ్వరి యిచ్చిన సమాధానంతో కుప్పగా కూలిపోయి వుంటాడు. దేవుడేదిచేసినా మనమేలుకే అన్నట్లు అది మంచికే పరిణమించింది.

తలుపు చప్పుడయింది. ఆలోచనల్లోనుంచి తేరుకుని భారతి వీధి తలుపు తెరిచింది. ఎదురుగా తన మరిది కేశవులూ, అత్తగారు యశోదమ్మగారు కనుపించేసరికి తనకళ్ళను తానే నమ్మలేకపోయింది. పెళ్ళయిన ఇన్నాళ్ళకు తన అత్తగారు తన గుమ్మంలో అడుగుపెట్టింది. రిక్షాలో దుప్పటితో వళ్ళంతా కప్పుకుని వణకిపోతున్న అత్తగారిని చూసి మరీ ఆశ్చర్యపోయింది. ఒక్క అంగలో రిక్షాదగ్గరకు వెళ్ళి అత్తగారి రెక్క పట్టుకుని జాగ్రత్తగా దింపి, అడుగులో అడుగువేసుకుంటూ నడవలేని అత్తగారిని జాగ్రత్తగా నడిపించుకుంటూ లోపలికి తీసుకు వచ్చింది. తానే రిక్షావాడికి డబ్బులిచ్చి పంపించివేసింది.

"ఏమిటత్తయ్యా. ఇలా వున్నారేం."

"పదిహేనురోజులునుంచి మూసినకన్నెరకుండా జ్వరమమ్మా. చలి, వణుకు. ఆ వూళ్ళో గుక్కెడు మందువోసే దిక్కులేదు. ఏమయితే అయిందని ఆ చంటివెధవను వెంటేసుకు వచ్చేశాను."

"మంచిపని చేశావు. అయినా ఒకకార్డుముక్క వ్రాయిస్తే నేనే వచ్చి జాగ్రత్తగా తీసుకువచ్చేదాన్నిగా."

"ఏడీ మావాడు, ఊళ్లోలేడా."

భారతి గతుక్కుమంది. ఏం చెప్పాలి. ఇప్పుడీ సమయంలో ఆవిడకు గతచరిత్ర చెప్పడమంత తెలివితక్కువ మరొకటిలేదు—మరేమని చెప్పాలి?

"లేదు. ఊరెళ్ళారు. అయిదారురోజుల్లో వస్తారు." అబద్ధమాడేసింది....

"అలాగా—అదీ ఇప్పుడే వచ్చిందీ....పోనీ అయితే అమ్మాయిగారింటికి వెళ్తా—"

"అదేం — ఇక్కడుండకూడనివాళ్ళమా ఏమిటి....అమ్మాయిగారింటికి వెళ్తే తర్వాత వెళ్దురుగాని. ఇప్పుడుమాత్రం ఇక్కడనుంచి కదలడానికి వీల్లేదు."

"నీ ఉద్యోగానికీ, దీనికీ కుదరదమ్మా" ఆ మాటలో వ్యంగ్యం కనపించింది. నీవుఉద్యోగస్థురాలివి.నాకు చాకిరీ నీ వెక్కడచేస్తావు అన్న అర్థం స్పష్టంగా కనపించింది. కాని భారతి ఆ మాటకు బాధపడలేదు. అత్తగారు మొదటినుంచీ తనయందు అదే అభిప్రాయంతో ఉన్నారు. అదే మరోసారి వ్యక్తం చేశారు. అంతమాత్రంచేత తాను కష్టపెట్టుకుని ఆవిడను కష్టపెట్టడందేనికి ?

"నే నిప్పుడే వెళ్ళి డాక్టరును తీసుకువస్తాను. మీ అబ్బాయిగారు లేరని మీరేం ఇబ్బంది పడక్కరలేదు. రా బాబూ కేశవా. కాళ్ళు కడుక్కో. ఎప్పుడనగా తిన్నావో." అంటూ మరిదికి అన్నం వడ్డించింది—

అన్నమంతా తిన్నతర్వాత "ఎన్నాళ్ళకు కడుపునిండా తిన్నాను వదినా—నేను అన్నం వండితే సగం మాడుచక్క, సగం బియ్యమున్నూ." అన్నాడు కేశవుడు — ఆ మాటకు భారతికి కళ్ళనీళ్ళు తిరిగాయి.

అత్తగారిని తనింట్లో ఉంచుకు సేవచేయాలని భారతికి ఎన్నాళ్ళనుంచో ఉంది. అటువంటి అవకాశం యింతవరకూ కలగలేదు. అందులోనూ బాగా సుస్తీతో వచ్చింది పాపం. ఇంతవరకూ తనమీద అత్తగారికి అకారణంగా దురుద్దేశం ఏర్పడి బాధపడుతోంది. తాను చదువు

కున్న గర్విష్టినని ఆవిడ అభిప్రాయం. ఆ అభిప్రాయం, పూర్తిగా తొలగించివేయాలి. అత్తగారికి వేడివేడి కాఫీ కాచియిచ్చి "యిప్పుడే వస్తా అత్తయ్యా" అంటూ లేడీ డాక్టరుకోసం పరుగెత్తింది.

భారతి హడావుడి చూసి యశోదమ్మగారు ఆశ్చర్యపోయింది.

మొదటినుంచీ ఎందుకో భారతంటే తనకే తెలియని కొన్నికొన్ని మూఢాభిప్రాయాలను పేర్చుకు కూర్చుంది. భారతి తనను సరిగ్గా చూడదనీ, చదువుకున్న అహంభావం బాగావుంటనీ, ఆ పల్లెటూళ్లో మందిచ్చే దిక్కులేనందున జ్వరబాధ పడలేక తప్పనిసరయి వచ్చింది కాని లేకపోతే వచ్చేదికాదు. తీరా వచ్చేసరికి కొడుకు లేడని తెలిసి కృంగిపోయింది. కోడలు తనకు చెయ్యదనే అభిప్రాయంతో కూతురుదగ్గరకు పోదామనుకుంది. కేశవుడికి వదినగారంటేనే ఎక్కువప్రేమ. తల్లికి జ్వరమొచ్చినప్పటినుంచీ మొదలుపెట్టాడు."వదిన దగ్గరకు పోయి మందు పుచ్చుకుందామ"ని—కొంత వాడి పోరు పడలేకకూడా వచ్చింపని చెప్పుకోవచ్చు. లేకపోతే అభిమానానికి పోయి మూర్ఖంగా ఇంకా కొన్నాళ్ళపాటు ఆ పల్లెటూళ్ళోనే ఉండిపోయేది.

కాని తాను వచ్చినప్పటినుంచీ భారతి ఆదరిస్తున్న తీరు చూసి యశోదమ్మగారు లోలోపల మనస్సు కొంచెం మార్చుకోవడం మొదలుపెట్టింది. 'ఆసాంతం ఈ ఆదరణ ఉండాలికదా' అని మరోపక్క అనుమానించక పోనూ లేదు.

సుమారు పావుగంటలో లేడీడాక్టరు వచ్చింది. ఆనాడు మనోరమా, రాజా వచ్చినప్పుడు, ఈ డాక్టరుగారిని రాజా పరిచయంచేసినప్పటినుంచీ ఇద్దరికీ పరిచయం బాగా కుదిరింది. ఆ పరిచయంతోనే డాక్టరు పిలవగానే పనులన్నీ మానుకుని వెంటనే వచ్చింది.

పరీక్షంతా పూర్తయింతర్వాత "పెద్ద కంగారు పడాల్సిందేంలేదు. మలేరియా జ్వరంలాగ ఉంది. నాలుగురోజుల్లో తగ్గిపోతుంది. ఇదిగో

ఈ మందులు తీసుకొచ్చి వాడండి. రోజూ నేను వచ్చి చూసిపోతూ వుంటాను." అని చెప్పింది.

"ఏమండీ, డాక్టరుగారూ త్వరలో నయమవుతుందంటారా."

"ఏం ఫర్వాలేదు. నాలుగురోజుల్లో మామూలు మనిషయిపోతారు. ఆ - ఏమండీ భారతిగారూ, ఎలా వుంటోంది ఒంట్లో. పుల్లటివేమయినా తినాలనిపిస్తోందా. దోకులు తగ్గాయా? ఇంకా బలహీనతగానే కనిపిస్తున్నారు. మంచి టానిక్కులు యిప్పటినుంచే పుచ్చుకోవాలి. లేకపోతే రేపు మీరే చాలా ఇబ్బంది పడతారు."

"పోండి డాక్టరుగారూ. మీ కెప్పుడూ నా ఆరోగ్యం సంగతే." అని ఓరగా అత్తగారివైపు చూసి సిగ్గుపడుతూ గదిలోకి వెళ్ళిపోయింది ముఖం తప్పించేందుకు ___

"ఏమిటి డాక్టరమ్మగారూ. మీ మాటలు నా కర్థం కావడంలేదు ___ మీరుచెప్పేది ___" ఆనందంతో ఉక్కిరిబిక్కిరవుతూ అడిగింది యశోదమ్మగారు ___

"మీకు తెలియదా ఏమిటి ___ మీరు మనుమడి నెత్తుకోబోతున్నారు."

"చూశారా చూశారా ___ భడవ నామమాత్రంగానన్నా చెప్పిందేమో. ఇదిగో ఏమే పిల్లా ఇలారా." అని కోడల్ని కేకేసింది. భారతి సిగ్గుపడుతూ అత్తగార్ని సూటిగా చూడలేక శోభనపు పెళ్ళికూతురులా అడుగులో అడుగువేసుకుంటూ వచ్చి అత్తగారిపక్కన కూర్చుంది.

ఆ సమయంలో యశోదమ్మగారి ఆనందం చెప్పడానికి వీలులేదు. కోడలు మీదున్న దురభిప్రాయాలన్నీ ఆ క్షణంలో మటుమాయమయి పోయాయి. ఆపెద్ద మనోనేత్రం ముందు మనమడు దోబూచులాడుతూ

నవ్వుతున్నాడు. తన రోగమంతా లిప్తకాలం మరచిపోయి కోడలిని క్షల దగ్గరకు తీసుకుని పుణికి పుచ్చుకుని మనసారా ఆశీర్వదించింది.

"అమ్మా. పాపాయి పుట్టేవరకూ-ఇక్కడే ఉండామే." అమాయకంగా అన్నాడు కేశవుడు. డాక్టరు పకపకా నవ్వింది. భారతి సిగ్గుపడి నవ్వింది.

యశోదమ్మగారు తృప్తిగా హాయిగా మనసారా నవ్వింది.

"ఇక ఎప్పుడూ మీరిక్కడే ఉందురుగాని బాబూ....ఇక ఆ వూరు వెళ్ళవలసిన పనిలేదు—నీవు హాయిగా నా దగ్గరుండే చదువుకుందువుగాని.

"అలాగే వదినా, నే నిక్కడనుంచి వెళ్ళనే వెళ్ళను. హాయిగా చదువుకుంటూ నీ దగ్గరేఉంటా—ఆ పల్లెటూళ్ళో అమ్మకు అన్నం వండి పెడుతూ నే నుండను."

యశోదమ్మ "అవునూ—కాదూ." అని ఏమీ అనలేదు.

స్వభావసిద్ధంగా యశోదమ్మ చాలా బోళాబోళి — మంచివచ్చినా చెడువచ్చినా నిగ్రహించుకోలేదు. బడబడమనిషి—మనిషిలో ఏ అభిప్రాయం పడితే ఆ అభిప్రాయాన్నే నమ్ముతుంది. కోడలిమీద దురభిప్రాయమంతా కొట్టుకుపోయింది—అసలు కోడలు మంచిచెడ్డలమీద ఇప్పుడు ఆలోచనేలేదు—ఆవిడ మనస్సంతా పుట్టబోయే మనుమడి రూపురేఖలమీద ఉంది. కోడలు తనదృష్టిలో ఇప్పుడు రత్నాలకొండ.

అత్తగారూ, మరిదీ రావడం ఇల్లు కళకళలాడటం భారతికి ఎంతో ఆనందంగా ఉంది....తనభర్త తనయింటికి తిరిగివచ్చినంత సంతోషంగా ఉంది. భగవంతుడనే వాడుంటే ఈ క్షణంలో తనభర్తను ఇక్కడికి తీసుకురాకూడదూ. గతమంతా మరచిపోయి తనభర్త తనచేతుల్లో వాలిపోకూడదూ—

భారతి ఆలోచనలు కళ్ళాలులేని గుర్రాలుగా పరవళ్ళు తొక్కాయి.

భారతి కాలేజీకి వారంరోజులు శలవుపెట్టింది. ఆనందంగా రెండు రోజులు గడిచాయి. రెండురోజుల్లోనూ యశోదమ్మ జ్వరం చాలావరకూ తగ్గుముఖం పట్టింది. కోడలు ఆదరణతోనే సగం సుస్తీపోయింది— అత్తగారిని కాలుక్రింద పెట్టనీయడంలేదు కోడలు. వేళకు మందు, పళ్ళ రసం, హార్లిక్స్, ఏది కావాలంటే అది హాజరుగా అమరుస్తోంది. అత్త గారి దృష్టిలో భారతి ఇప్పుడు నెత్తిమీది దేవత.

మూడోరోజున భారతి ఆడబిడ్డ తల్లిని చూడటానికి వచ్చింది— భారతి గతాన్నంతా మరచిపోయి సంతోషంతో సాదరంగా ఆహ్వానించి లోపలికి తీసుక వచ్చింది. భారతి ఎంత నవ్వుతూ పలకరించినా శ్యామల మాత్రం ముఖం మటమట లాడించుకుంటూనే ఉంది. కొంచెంసేపు ఆడ బిడ్డదగ్గర కూర్చున్నప్పటికీ ఆవిడ ఏమీ మాట్లాడకపోవడం గమనించి భారతి "మీరు మాట్లాడుతూ వుండండి. ఇప్పుడే వస్తా." అని వంటింటి వైపు దారితీసింది.

"ఏమమ్మోయి. ఫలహారం గట్రా చేస్తావేమో. అటువంటి వేం తలపెట్టబోకు. నాకు వంట్లో అసలేం బాగుండలేదు." అని ఈస డింపుగానే అంది. భారతికి కొంచెం బాధగానే ఉంది. ఇంతవరకూ తాను ఏనాడూ తన ఆడబిడ్డను తేలికగా మాట్లాడటంగానీ, తేలికగా చూడటం గానీ చేయలేదే? ఎందుకు తనంటే అంత ఏవగింపు—ఇంకా తనే పుల్ల విరుపుగా అనేకసార్లు మాట్లాడింది. అయినా తనేమీ లక్ష్యపెట్టటం లేదు వాటిని— "ఏం మనస్తత్వంరా బాబూ." అనుకుంది మనస్సులో— అయినా ఫలహారంచేసే ప్రయత్నం మాత్రం మానలేదు—కాని లోలో పల ఒకందుకు భయపడుతూనే ఉంది. తనకూ తనభర్తకూమధ్య ఈ మధ్య జరిగిన విషయాలన్నీ అత్తగారికి చెప్పేస్తుందేమో. ఎంతో ఆనం దంతో కోలుకుంటున్న ఆవిడమనస్సు మళ్ళీ బాధపడుతుంది. ఏం చేయాలి తను. చాటుగా తాను వద్దనిచెప్పినా ఆవిడగారు తనమాట వింటుందా? అనుకున్నంతా అయిందికూడా.

ఏదో వస్తువు కావాల్సి ఉండి స్టోరు రూములోకి తాను వెళ్ళేసరికి పక్కగదిలోనుంచి ఆడబిడ్డమాటలు వినిపిస్తూనే ఉన్నాయి. ఉన్నవీ, లేనివీ పూసగుచ్చినట్లు వల్లించి వల్లించి మరీ చెపుతోంది.

"హోయి భగవంతుడా. ఒక సంసారం పచ్చగా ఉంటే చూడ లేవా మహానుభావా—" అని మనస్సులో వ్యధపడసాగింది.

ప్రశాంతంగా ఉన్న సముద్రంలో మళ్ళీ తుఫాను ఏక్షణంలో ఎలా ప్రారంభ మవుతుందో—మొండిగా ఎదుర్కొగలగడం కన్న తాను చేయగలిగిందేం లేదు. ఫలహారం తయారుచేయడం పూర్తయింది— అత్తగారికి బత్తాయితొనలు వలిచి గింజలు తీసి ఒకప్లేట్లో పెట్టి రెండు ప్లేట్లలో ఫలహారం పెట్టి ఆడబిడ్డముందూ, కేశవుడి ముందూ పెట్టి మంచినీళ్ళు పెట్టింది. ప్లేట్లు వాళ్ళముందు పెట్టేటప్పుడు అత్తగారిముఖం వంక చూడలేకచూసింది. ఆమెముఖం గంభీరంగా వర్షించబోయే మేఘంలా బరువుగా కనబడింది.

భారతి ఆ వాతావరణంలో నిలబడలేక పనున్నదానిలా హాలు లోకి వచ్చింది—ఎదురుగా వెంకట్రావు దంపతులు నిలబడి వున్నారు. వాళ్ళను అకస్మాత్తుగా చూడటంలో భారతి ఒక్కసారి గతుక్కుమని వెంటనే తేరుకుని "రండన్నయ్యా. ఏమిటిలా దారితప్పివచ్చారిద్దరూనూ ఏమమ్మా వదినగారూ ఇన్నాళ్ళకు జ్ఞాపకం వచ్చామన్నమాట." అని లేని ఉత్సాహాన్ని తెచ్చుకుని హాలులోనే చెరోకుర్చీవేసింది వాళ్ళకు—

"దారి తప్పేటట్టు చేశావమ్మా నీవు. చేయవలసిందంతా చేసి ఏమీ ఎరగని నంగనాచిలాగ మాట్లాడకమ్మా వదినగారూ." అంటూ వెంకట్రావు భార్య పార్వతి భారతి సరసన సోఫాలో వచ్చి కూర్చుంది.

"ఏమిటి వదినా ఏం చేశాను నేను." ఆశ్చర్యంగా అడిగింది భారతి.

"ఓయుంచీపళ్ళు—పసుపూ కుంకుమ తీసి లోపలపెట్టు. ఎంత రహస్యంగా నీవు దాచినా డాక్టరమ్మ అంతా చెప్పిందిలే." అంటూ చీరా జాకెట్టుగుడ్డ పళ్ళు ఉన్న పేకెట్లు తీసి బొట్టుపెట్టి భారతి ఒళ్ళో పెట్టింది పార్వతి.

"ఏమిటొదినా ఇవన్నీ, మీకేమన్నా మతిపోతోందా."

"మతిపోయేటట్లే చేశావు. మీ అన్నగారి ఆనందానికి హద్దు ల్లేవు. అసలయిన పసుపు కుంకుమ తర్వాత ఇద్దాం. మా చెల్లెమ్మను ఏమ యినా సరే చూసి రావలిసిందే అని బయలుదేరారు. ఇటువంటప్పుడు ఉత్తి చేతుల్తో రాగూడదని అడ్వాన్సుగా ఇవి తీసుకొచ్చాం." అంటూ నవ్వుతూ భారతి చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంది.

భారతి రెండుప్లేట్లలో ఫలహారాలు తెచ్చి వాళ్ళముందు పెట్టింది. వాళ్ళు ఫలహారాలు చేస్తూనే ఉన్నారుగాని భారతిమాత్రం ఇరుకునపడ్డట్టు గానే ఇబ్బంది పడుతోంది. ఇదే సమయంలో అత్తగారుగానీ, ఆడబిడ్డ గానీ ఏమన్నా అసభ్యంగా ప్రవర్తిస్తారేమోనని. మనోరమా వాళ్ళు వచ్చినప్పుడు నారాయణమూర్తి ప్రవర్తించినట్లు ప్రవర్తిస్తే తాను ముఖం ఎత్తుకోలేదిక....కాని అటువంటిదేమీ జరగలేదు. ఫలహారాలు పూర్త య్యాయి—తన అత్తగారినీ ఆడబిడ్డనీ లోపల వదిలేసి వీళ్ళతో నవ్వుతూ పేలుతూ కబుర్లు చెపుతూ కూర్చుంటే వాళ్ళేమన్నా అనుకో వచ్చు—

"రావదినా, లోపల అత్తగారూ, ఆడబిడ్డా వున్నారు. చూద్దువుగాని" అని పార్వతిని లోపలికి తీసుకువెళ్ళి,

"అత్తయ్యా, వీరు మీ అబ్బాయితో వాటాదారుగా పనిచేస్తున్న వెంకట్రావుగారిభార్య. వీరిచలవవల్లే ఈ సంవత్సరం మీ అబ్బాయిగారికి పాతికవేలు లాభం వచ్చింది" అని పరిచయం చేసింది.

యశోదమ్మ సాదరంగా పలుకరించింది పార్వతిని. భారతి మనస్సు కొంత తేలికపడింది. ఈ వాతావరణమంతా దినదినగండం నూరేళ్లు ఆయుష్షులాగ వుంది తనకు — ఎంత చప్పున తన అడబిడ్డ, వెంకట్రావు దంపతులూ వెళ్ళిపోతే తన ప్రాణం అంతత్వరగా తేలికపడుతుంది.

పార్వతిని అత్తగారి దగ్గర కూర్చోపెట్టి వెంకట్రావుకు కాఫీ యివ్వడానికి అతనిదగ్గరకు వెళ్ళింది భారతి.

"కూర్చో చెల్లెమ్మా, ఒక్కవిషయం మాట్లాడాలి." అన్నాడు వెంకట్రావు. మామూలుగా అయితే అలా కూర్చోడానికి తనేమీ సందేహించేదికాదు. ఈ రోజున అవతల అత్తగారూ, ఆడబిడ్డా వుండగా పరాయి మగవాడిదగ్గర కూర్చుని మాట్లాడటానికి కొంచెం సంకోచించింది. కూర్చోకండా వుండటానికి సభ్యత అడ్డువచ్చింది. తప్పనిసరిగా కూర్చుని "ఏమిటన్నయ్యా, త్వరగా చెప్పండి. అవతల చాలా పనుంది." అంది.

"ఏం లేదమ్మా. ఒక్కవిషయం చెపుతాను, కోప్పడకు. ఏదో ఒక రోజున తాగాడనే కోపంతో నీవు మావాడితో మాట్లాడం మానివేశావట. తాగటం మంచిదని నేను సమర్థించడంలేదు. కొన్ని కొన్ని వ్యవహారాలలో, పెద్దపెద్దవాళ్ళతో పనికావాల్సి తిరిగేటప్పుడు మనకిష్టం ఉన్నా లేకపోయినా సభ్యతకోసం కొన్నిపనులు చేయాల్సి వస్తుంది. ఒకే ఒకసారి నా బలవంతంమీద వాడలా చేశాడు. అంతకు ముందుగాని ఆతర్వాతగాని వాడెప్పుడూ దాని ప్రాంతానికి —"

మాట పూర్తికాకముందే నారాయణమూర్తి తల్లి యశోదమ్మగారు వెనకవైపుగా వచ్చి "ఏం బాబూ కులాసాగా ఉన్నారా అంతా" అంటూ పలకరించింది.

ఈతాగుడు వ్యవహారం వెంకట్రావు అప్పుడు ప్రస్తావన తీసుకు రావడం భారతికి ఇష్టంలేదు. అప్పుడే కాదు ఎప్పుడూ పరాయిమనిషి తన భార్యాభర్తలమధ్య విషయాలు తీసుకురావడం ఆవిడకు సుతరాం

గిట్టదు — వెంకట్రావు ఆ విషయం తీసుకురావడం, అందులోనూ ఒకపక్క అత్తగారూ వాళ్ళూ ఉండగా తీసుకురావడం భారతికి ఇరుకున పడ్డట్టయింది — దానికితోడు సరిగ్గా ఆ మాటలే మాట్లాడుతున్నప్పుడు అత్తగారు ఆయన వెనకనుంచి రావడం జరిగింది. మరి ఆవిడ విన్నదో లేదో ఆ మాటలు —

అసలే ఆవిడ రాకరాక ఎన్నాళ్ళకో ఈనాడు నట్టింట కాలు పెట్టింది. తనమీద పూర్వం ఉన్న దురభిప్రాయం చాలావరకూ పోయిందని తాను సంతోషిస్తుంటే మధ్యలో ఆడబిడ్డ ఒకపక్కన, వెంకట్రావుగారు మరోపక్కన ఆవిడమనస్సు కలతపడేలా మాట్లాడుతుండే. అసలు ఆడబిడ్డ చెపుతున్నదానికే ఎలాగురా భగవంతుడా అనుకుంటుంటే అగ్నిమీద ఆజ్యంపోసినట్లు వెంకట్రావుగారి అనునయింపుకూడా ఇప్పుడే వచ్చింది —

"అంతా కులాసాగానే ఉన్నామండి."

"మా అబ్బాయి మద్రాసు వెళ్ళాడని మా భారతి చెపుతోంది. ఎప్పుడొస్తాడో మీకు తెలుసా."

"నేనుకూడా ఈ రాత్రి వెళ్తున్నాను. ఇద్దరం కలిసి ఎల్లుండి ఉదయానికి వచ్చేస్తామండి."

"సరేబాబూ — ఆ విషయం చెబుదామనే వచ్చాను. నేను వచ్చాననీ, నా వంట్లో బాగుండటంలేదనీ మరీ చెప్పండి."

"అలాగేనండి."

"మరోవిషయం. ఒకవేళ అటునుంచి అటు రైలు దిగగానే శ్యామలగారింటికి వెళ్తాడేమో అలా వీల్లేదు — ఇక్కడికే రమ్మన్నానని చెప్పండి."

"అలాగేనండి."

ఆవిడ చెప్పేతీరులో హుకుం జారీచేసిన సూచన కనిపించింది.

వెంకట్రావుకు, తాను మాట పూర్తిగా చెప్పలేకపోయానే అనే బాధ లోపల ఉండిపోయింది. భారతికిమాత్రం ఈ ప్రసక్తి ఇక్కడితో ఆగిపోయి వెంకట్రావు దంపతులు ఎంత తొందరగా వెళ్ళిపోతే అంత మంచిదీ అనిపిస్తోంది. చివరికి ఎట్లాగయితేనేం వెంకట్రావు తనవాక్యం పూర్తిచేయకుండానే భార్యతో సహా వెళ్ళిపోయాడు. యశోదమ్మగారు ఇక కూర్చునే ఓపికలేక సరాసరి మంచంమీద పోయి పడుకుంది— యశోదమ్మగారు వెంకట్రావుతో మాట్లాడుతున్నప్పుడే అంటించవలసిన అగ్గి అంటించి శ్యామల చల్లగా జారుకుంది.

ఇక యింటిలో వున్నవారు భారతి, యశోదమ్మగారూ, కేశవుడూ—యశోదమ్మగారు ఏ క్షణాన భారతిని పిలిచి ఏమడుగుతుందోనని భారతి ప్రాణాలు బిగపట్టుకు కూర్చుంది. కాని ఆవిడ ఏమీ అడగడం లేదు—క్షణమొక యుగంగా గడుస్తోంది భారతికి. ప్రాణాలు ఉగ్గపట్టుకుని ఎంతసేపు కూర్చుంటుంది. ఆవిడ ఒక్కసారి పిల్చి అడగవలసిన నాలుగు అడిగేసినా తనకంత బాధ అనిపించదు.

భారతి స్థితి ఊదరలో పెట్టి ఉడకపెట్టినట్లుగా ఉంది.

"కేశవా ఒకచోటికి వెళ్ళొద్దాం వస్తావా?"

"ఎక్కడికి వదినా."

"చెపుతాగా."

"అలాగే—నీ యిష్టం."

"అత్తయ్యా, నేనూ కేశవుడూ ఒక్కసారి అలా వెళ్ళివస్తాం.. ఒకగంటలో వచ్చేస్తాం." అంది అత్తగారి అనుమతి లేకుండా వెళ్లడం బాగుండదనీ, ఈలోగా ఆమెకేమన్నా కావాల్సివస్తుందేమోనని తెలుసుకునేందుకు..

ఒక్కసారి అలా వీధిలోకివెళ్లి ఒకగంట తిరిగివస్తే మనస్సు

కొంచెం కుదుటపడుతుందని భారతి ఒక్కక్షణం అలావెళ్ళిరావడానికి నిశ్చయించుకున్నది.

"అలాగేనమ్మా.. నాకేం అక్కర్లేదు. ఒక చెంబుతో కాస్త మంచినీళ్ళు ఇక్కడపెట్టి వెళ్ళిరా." అంది యశోదమ్మగారు. ఆ చెప్పడంలో ఎక్కడా కోపంగానీ, కష్టంగానీ కనుపించలేదు. మరి యశోదమ్మగారి మనసులో ఉద్దేశ్యమేమిటో భారతికి అర్థంకావడంలేదు...

ముందుగా భారతి ఒక రెడీమేడ్ షాపుకు వెళ్ళి కేశవుడికి రెండు మంచి షర్టులు రెండు పాంట్లు తీసుకుంది. ఆ తర్వాత అత్తగారికి రెండు జతల బట్టలు తీసుకుంది. తర్వాత ఏంచేయాలో తోచలేదు.. కేశవుడు మాత్రం ఆ బట్టలుచూసి ఉబ్బి తబ్బిబ్బయిపోయాడు. రాకరాక వచ్చిన అత్తగారూ మరదులకు ఆమాత్రం ఖర్చుచేయడం తనకు ధర్మంగానూ, ఎంతో ఆనందంగానూ తోచింది. అవసరమైతే తర్వాత మళ్ళా కొనవచ్చు నని ప్రస్తుతానికి అంతటితో సరిపెట్టింది.

భారతికి అకస్మాత్తుగా ప్రమీల జ్ఞాపకమొచ్చింది. చూసికూడా నాలుగురోజులయింది. సుబ్బారావు ఆరోగ్యం ఎలాఉందో. ఒకసారి చూసొస్తే బాగుండుననుకుంది. ప్రమీలనుబట్టి సుబ్బారావుమీద అభిమానం ఏర్పడింది భారతికి. వెంటనే రిక్షాఎక్కి ఆసుపత్రికి పోనీయమంది...

తలవనితలంపుగా వచ్చిన భారతిని చూసి వేదవతి సుబ్బారావులు ఎంతో ఆనందించారు. సుబ్బారావుకు చాలావరకు తగ్గి ఆపూటే పథ్యం పెట్టారుట...

"నేనే వద్దామనుకుంటున్నా మాష్టారూ.. ఇంతలో మీరే వచ్చారు., మరీ నీరసంగా కనుపిస్తున్నారు. ఎలాఉంది మీ ఆరోగ్యం."

"నాకేమమ్మా బాగానేఉన్నాను. మా అత్తగారూ, మరిదీ వచ్చారు. నీవొకసారి వచ్చి చూసెళ్ళు.. ఇంతకూ ఏమిటిసంగతి."

"రాధా, ధనలక్ష్మి మీ దగ్గరకు రాలేదా.."

"రాలేదే . ఏమిటి సంగతి.."

"ఏమీలేదు.. పై బుధవారం రాధపెళ్ళి.. కట్నాలూ, కానుకలూ ఆర్భాటాలు ఏమీలేవు. తిరుపతికొండమీద స్వామిసన్నిధిని చేసుకోడం,

వచ్చేయడం.. లిమిటెడ్ మెంబర్సు. మీరూ, ధనలక్ష్మి, మా దంపతులం తప్పనిసరిగా ఉండవలసినవాళ్ళం.. తర్వాత రంజిత్‌కుమార్ తల్లి దండ్రులూ మా అమ్మా నాన్నా మరోకార్లో-"

"చాలా సంతోషం. కాని నేను రాలేనేమోననుకుంటా. వచ్చిన తర్వాత మీఅందరికీ మాయింట్లో డిన్నరు. మా అత్తగారి ఆరోగ్యం సరిగా లేదు. అందుకని నన్ను వదిలిపెట్టండి."

"అదేం లాభంలేదు. అయినా ఇప్పటినుంచే ఎందుకులెండి వాదన.. అన్నట్లు మరోవిషయం.. మావారిని రెండుమూడు రోజుల్లో డిశ్చార్జి చేస్తారుట.- తర్వాత నేను మామూలుగావచ్చి మీయింట్లోనే ఉంటా.. అత్తగారివంకమీద పాఠాలు చెప్పడంమాత్రం మానేయకండి.."

"అదేంకాదు పాఠాలకుమాత్రం మీయింటికి వస్తుందండీ.."

"అబ్బా, ఆ పప్పులేం ఉడకవు.. నేను గ్రాడ్యుయేటునయ్యేవరకూ మీయింటికి రావద్దన్నారు. గ్రాడ్యుయేటునయ్యే మీ యింటికి వస్తాను. అంతవరకూ మేష్టారి ఇంటిలోనూ, కాదుకూడదంటే మా చెల్లెలుగారిం ట్లోనూ."

"మీ చెల్లెలుగారియిల్లు ఇంకెక్కడుందోయి.. మీ చెల్లెలిగారిల్లు కుమార్‌గారిఇంట్లోనే.. పానకంలోపుడకలాగ వాళ్ళమధ్య నీవెందుకు. అదేంకాదు మాష్టారూ. మేము మాయింటికే వెళ్తాం."

"వేదవతీ.. ఎన్నాళ్ళకు ఈ చల్లటి కబురు విన్నానమ్మా.. ఈ మీ పోట్లాట వింటుంటే నాకెంతో ఆనందంగా ఉంది.."

"నిజం మేష్టారూ. ఈ సుస్త్రీతో పాత సుబ్బారావు చచ్చి పోయాడు. కొత్తసుబ్బారావు ఈ వేదవతిని కలలోకూడా వదులుకోలేడు.. జరిగినదానికి మీఎదుటే క్షమాపణ చెప్పుకుంటున్నాడు."

"చాల్లెండి, ఎవరైనవింటే నవ్విపోతారు."

భారతి మరో అరగంట కూర్చుని "వస్తానమ్మా. ఇంటిదగ్గర అత్తగారొక్కరే ఉన్నారు. ఏంకావాలో ఏమో." అంటూ లేచింది..

"చాలా సంతోషం మేష్టారూ, మాయందభిమానంతో వచ్చారు. మీరు చేసిన సహాయానికి జీవితాంతం మీ సేవచేసినా ఋణం తీర్చుకో

లేను. మీ దయవల్లనే, నా సంసారం ఇలా కుదుటపడింది." అంటూ వంగి భారతి రెండుకాళ్ళకీ దణ్ణంపెట్టింది వేదవతి.

భారతి ఆనందభాష్పాలు తుడుచుకుంటూ వేదవతిని లేవనెత్తి అక్కున చేర్చుకుంది.

♦ ♦ ♦ ♦

"అమ్మా అమ్మా, త్వరగారావాలి.. వదిన పడిపోయింది." గావు కేక పెట్టాడు కేశవుడు దొడ్లోనుంచి. భారతికి ఈమధ్య వాంతులు బాగా అవుతున్నాయి. ఏదీ తినాలనిపించడంలేదు. ఈమధ్య జరిగిన పరిస్థితుల్లో భోజనంకూడా సరిగ్గా చేయడం లేదు. మనిషి మరీ రోజురోజుకూ నీరసించి పోతోంది. అసలే నారాయణమూర్తికీ తనకూ అభిప్రాయభేదం వచ్చినప్పటినుంచీ మనస్సు బాగుండకుండా ఉంది. ఇప్పుడు అత్తగారు వచ్చిన తర్వాత ఏదో ఒకవిధమైన తృప్తీ ఆనందంతో మనస్సు తేలిగ్గా ఉంది. ఆ సంతోషసమయం ఎక్కువకాలం సాగకుండా ఈ ఆడబిడ్డా వెంకట్రావులు మళ్లీ ఆవిడమనస్సు పాడుచేసి తనకు ఆవేదన కలిగించారు. ఈ రెండు మూడు రోజులనుంచీ ఏపని చేస్తున్నా ఇదే మనోవేదనతో యింట్లో తిరగడం ప్రారంభించింది. ఒకటి రెండుసార్లు తనకు తానుగానే అన్ని విషయాలూ అత్తగారితో విడమరిచి చెప్పి మనస్సు తేలికపరుచుకుందామనుకుంది. కాని ధైర్యం చాలలేదు.

ఈరోజున అత్తగారికీ మరిదికీ అన్నంపెట్టి శనివారం కనక పూజ మరింత ఎక్కువ చేసుకునేందుకు ఎండలో తులశమ్మ దగ్గర కూర్చుని, లేచి వచ్చేటప్పటికి అసలే నీరసంగా ఉండటంవల్ల కళ్లుతిరిగి వళ్లుతూలి పడిపోయింది. సమయానికి కేశవుడు దగ్గరుండటంతో తల్లిని కేకవేసి వదినగారిని ఆదుకోగలిగాడు.

"ఒరేకేశవా! మనింటికి వస్తారేడాక్టరమ్మగారు,వారిల్లు తెలుసానీకు"

"నాకు తెలుసమ్మా. క్షణంలో తీసుకొస్తాను" అని కేశవుడు రెండంగల్లో పరుగెత్తాడు.

కేశవుడు రాకముందే భారతి కళ్లుతెరచి తాను అత్తగారి వడిలో ఉన్నసంగతి తెలుసుకుని సిగ్గుపడి లేవబోయింది..

"లేవకమ్మా ఫర్వాలేదు, కాసేపు అలాగే పడుకో."

"ఫర్వాలేదు మీ చేత విసిరించుకుని సేవచేయించుకుంటున్నానా? ఏడిసినట్లేఉంది.," అని సిగ్గుపడుతూ లేచికూర్చుంది.

"ఇలా ఎప్పుడన్నా తిప్పు వచ్చిందా అమ్మ."

"ఒకసారి మీ అబ్బాయి మద్రాసు వెళ్తున్నప్పుడు వచ్చింది. మళ్లా ఇప్పుడు.."

మాట పూర్తికాకపూర్వమే డాక్టరుగారు కేశవుడు లోనికి ప్రవేశించారు. డాక్టరుగారు వస్తూనే భారతి పక్కన పూజాపళ్లెం చూసి "అనుకుంటూనేఉన్నా మీవాదస్తం మానలేదన్నమాట.. పిన్నిగారూ మీకోడలుగారికి పూజలు పునస్కారాలు చాదస్తం ఎక్కువయింది. వేళపట్టున పెందలాడే భోజనం చెయ్యమని నేనుచెప్తే ఆదివారమనీ, సోమవారమనీ శనివారమనీ ఒంటిపూట భోజనాలూ పొద్దెన్నభోజనాలు.. అసలే నీరసంగా ఉన్న ఈవిడ ఇలాచేస్తే రేపు పురుడు సమయంలో చాలా బాధపడాల్సి వస్తుంది చెప్తున్నా." అని ఏవేవో ఇంజక్షనులు చేసి భారతిని మంచంమీద పడుకోబెట్టి "కోడలు ఎక్కువగా పనిచేయకూడదనీ" మానసికంగా కూడా,ఆరాటపడకూడదనీచెప్పి డాక్టరమ్మ బయలుదేరారు.

"ఇంజక్షను చేశాను. కొంచెం నిద్రపడుతుంది. మీరు కంగారుపడకండి. ఆవిడకు చాలా విశ్రాంతి ఉండాలి." అనిచెప్పి డాక్టరమ్మగారు వెళ్ళిపోయారు.

యశోదమ్మగారు చాలా కంగారుపడింది. డాక్టరు చెప్పినట్లు కొద్దిగా హార్లిక్సు కలిపిచ్చి పడుకోబెట్టింది.. హార్లిక్సు తాగిన కాసేపటికే భారతికి వళ్ళుతెలియని నిద్రపట్టింది...

యశోదమ్మగారు కోడలి ఆరోగ్యంకోసం యిష్టదేవతా ప్రార్థన చేసుకుని వచ్చి హాల్లో కుర్చీలో చతికిలబడింది. ఇన్నాళ్ళనుంచీ ఈ కొడుకూ కోడల్నీ వదిలి తనవూళ్ళో వుండి తాను చాలా పొరపాటు చేశానని పశ్చాత్తాపపడటం మొదలుపెట్టింది—తాను లేకపోవడంవల్ల ఇక్కడ

చాలా నష్టం సంభవించింది. తానే ఉంటే ఇన్ని పొరపాట్లు ఇక్కడ జరిగి ఉండేవి కావు.

"ఎవరికమ్మా సుస్తీ. డాక్టరమ్మగారు వచ్చి వెళ్తున్నారు." అంటూ నారాయణమూర్తి లోపలికి అడుగుపెట్టాడు.

యశోదమ్మ వెంటనే సమాధానం చెప్పలేదు. కొడుకుమీద కొంచెం కోపం ఉన్నట్లుగానే ఉంది.

"ఏం అమ్మా-నీ వంట్లో బాగుండటం లేదా."

"నా కోసంకాదు డాక్టరమ్మ వచ్చింది. ఈ మొండిప్రాణం ఇప్పుడప్పుడే పోదు. దానికేం ఫర్వాలేదు, ఇంకా ఎన్ని చూడాలో ఈ ప్రపంచంలో."

"ఏమిటమ్మా అది. ఏం జరిగింది—డాక్టరమ్మా ఎవరికీ."

"ఎవరికయితే నీకేరా—నీవు మగమహారాజువు. సంపాదనపరుడివి. ఇంట్లో ఎవరెట్లా చస్తే నీకేం—మొత్తంమీద నీవు మనిషివయ్యావని తెలిసి చాలా సంతోషంగా వుంది—"

తల్లి మాట్లాడుతున్న వ్యంగ్యధోరణి చూసి ఇంట్లో ఏదో జరగగూడనిది జరిగిందనీ, పరిస్థితులన్నీ తల్లికి తెలిసిపోయాయని ఊహించాడు నారాయణమూర్తి.

"అది నీకు ఏం చెప్పిందోగాని నీవు నామీద అనవసరంగా-"

"చాల్లే నోర్ముయ్. దానిమీదపడి గోల పెడతావెందుకూ. అదీ ఒక అమ్మ కన్నబిడ్డే. దానిగుణం తెలియక ఇన్నాళ్ళూ నేనే పొరపాటు చేశాననుకుంటే అన్నీ తెలిసిన నీవుకూడా పశువులా ప్రవర్తించి దానిని ఒంటరిగా వదిలిపెట్టి పారిపోతావా—ఎన్నాళ్ళు పెడుతుందో ఆ చెల్లెలు పోనీ అక్కడే ఉండకపోయావూ....ఒరే ఇంత ఉత్తమురాలిని వదిలిపెట్టి వెళ్ళడానికి నీకు మనసెట్లా వచ్చిందిరా."

"అదికాదమ్మా—అదే నన్ను నిర్లక్ష్యంగా చూడబట్టి—-"

"నా కన్నీ తెలుసురా. పరిస్థితులను అర్థం చేసుకోలేక నీ బుజాలు నీవే తడుముకుని నీవే వెళ్ళావుగానీ, ఈ విషయంలో దాని పొరపాటు

ఏమాత్రంలేదు, నీ చెల్లెలి గుణం నాకు బాగా తెలుసు. దానికిష్టంలేని వ్యక్తులమీద అది ఎన్ని అభూత కల్పనలు కల్పించాలో అన్నీ కల్పిస్తుంది. అసలు దానిమాటలు వినే నేను ఇన్నాళ్లూ బంగారంలాంటి ఈ కోడలిని దూరంచేసుకున్నా. నీవూ నేనూ, నీ చెల్లెలూ అందరం కలిసి దాన్ని ఎన్నివిధాల హింసించామో అన్నివిధాలా హింసించాం. అది నిజంగా ఎంతో ఉత్తమురాలు కాబట్టే నీవు తాగుతున్నా, తనది వదిలిపెట్టినా మాట మాత్రమయినా నాకు చెప్పలేదు—"

"అయితే ఎవరు చెప్పారు."

"ఇంకెవరు నీ చెల్లెలు శ్యామల—సుస్తీతో వచ్చిన నన్ను తన యింటికి పిలవకపోక, కల్లబొల్లివన్నీ కల్పించి మీ యిద్దరిమీదా చెప్పడం ప్రారంభించింది—చివరికి నాచేత తలవాచేటట్లు చివాట్లు తిని కుక్కిన పేనులా జారుకుంది."

అని తనకూ శ్యామలకూ మధ్య జరిగిన సంభాషణ, వెంకట్రావు కోడలితో మాట్లాడుతూ చెప్పిన విషయాలూ అన్నీ ఏకరువు పెట్టి చెప్పేసింది—

ఇంత జరిగినా తననుగురించి ఒక్క ముక్కకూడా తల్లితో చెప్పలేదని తెలిసి నారాయణమూర్తి భారతిపట్ల తాను వ్యవహరించిన తీరుకు లోలోపల సిగ్గుపడటం మొదలుపెట్టాడు.

"భారతి చాలా గుంభనగలపిల్లరా, ఏమో అనుకున్నాగాని—భార్యాభర్తలమధ్య విషయాలు ఆ వెంకట్రావుకు తెలిశాయని ఎంత బాధపడిందనుకున్నావు. దాని ముఖమే చెపుతోంది దాని బాధంతా."

అని కోడలినిగురించి వెనకేసుకొస్తూ యశోదమ్మగారు మాట్లాడుతుంటే నారాయణమూర్తి నిస్తేజంగా గుడ్లప్పచెప్పి చూస్తూ నిలబడిపోయాడు.

ఈ మధ్య కొన్నివిషయాలు జరిగాయి. దానితోనే నారాయణమూర్తి బుద్ధి పూర్తిగామారి పట్టుదల సడలటం మొదలుపెట్టింది.

ఒక చిన్నవిషయంలో శ్యామల తనయింటిదగ్గర ఉంటున్న అన్నగారిని పురుగును దులపరించినట్లు దులిపి పారేసి "గతిలేక నీవు నా

యింటికి వచ్చావు" అన్నపదం వాడింది. ఆమాట అతనికి చాలా బాధ కలిగించింది. తాత్కాలిక ఆవేశంలో భార్య తప్పుచేయకపోయినా పట్టు దలకు పోయి, ఇక్కడికి వచ్చినందుకు తగినశాస్తి జరిగిందనుకున్నాడు. వెంటనే పషన్నా లేకపోయినా సామాను సర్దుకుని 'చెడి చెల్లెలిగారింటికి చేరకూడదనీ' పాఠం వల్లె వేసుకుంటూ మద్రాసు వెళ్ళిపోయాడు.

మంచిజరిగినా, చెడుజరిగినా ఒక్కొక్కప్పుడు ఒకదానిమీద ఒకటి జరుగుతాయి. మద్రాసులో జరిగిన ఒక చిన్న సంఘటనతో నారాయణమూర్తి పూర్తిగా తిరిగిపోయాడు.

ఒకబిల్లు శాంక్షను చేయించుకునేందుకు ఒక పెద్ద ఇంజనీయరు గారింటికి వెళ్ళవలసి వచ్చింది. తీరా వెళ్తే ఆ ఇంజనీరుగారు ఇంటిలో లేరని తెలిసి వెనక్కు తిరగబోతుండగా నౌకరు వచ్చి సాదరంగా ఆహ్వానించి "అమ్మగారు మిమ్మల్ని రమ్మంటున్నారు బాబూ. వచ్చి హాల్లో కూర్చోండి." అని చెప్పాడు. నారాయణమూర్తి తెల్లపోయాడు. అంత పెద్దఇంజనీరుగారి భార్యేమిటి? తనను లోపలికి రమ్మనడమేమిటి? ఆశ్చర్యపోతూ మాట తీసేయలేక వచ్చి హాల్లో కూర్చున్నాడు. కూర్చున్న కొద్దిసేపటికే ఫలహారం, కాఫీ వచ్చాయి. అంతా ఇంద్రజాలంగా వుందని భావిస్తూనే సేవించేశాడు. మరి పదినిమిషాల్లో కర్టెన్లు తొలగించుకుని మనోరమ బయటికి వచ్చింది. మనోరమను చూసి నారాయణమూర్తి తెల్లబోయాడు.

"మీరు? ఇక్కడ?"

"అవును మూర్తిగారూ, ఇదే మా యిల్లు. మా వారితోనే పనుండి మీరు వచ్చారు. మీరొక్కరే వచ్చారా—భారతికూడా వచ్చిందా."

కొంతసేపటికి గుక్కతిప్పుకుని, "నేనొక్కడినే వచ్చానండి." అనిమాత్రం అన్నాడు.

"ఇప్పుడు మీరు కలిసే ఉంటున్నారటగా—భారతి వ్రాసింది.... ఏమయినా ఆరోజు మీరు ప్రవర్తించిన తీరు ఏం బాగుండలేదండీ—మీరు వచ్చేసరికి గిన్నెలో ఒక్క మెతుకు అన్నంకూడా లేదు. అది కప్పి

పుచ్చేందుకే భారతి "వారు తర్వాత ఫోంచేస్తారులే" అని సమర్థించింది. దాన్ని మీరు అపార్థం చేసుకుని ఆరోజున నానా హింసా పెట్టి ఇంటిలో నుంచి వెళ్ళిపోయారు.

"నానా హింసా పెట్టానా?"

"హింసకాక ఏమిటి చెప్పండి....స్పృహలేకుండా పడిపోయి ఎంతసేపటికి తెలివి రాకపోతే నేనూ రాజా ఎంత కంగారు పడ్డాము— రాజా నిజంగా దేవుడు లాగ పరుగెత్తి వెళ్ళి లేడీ డాక్టరును తీసుకురాబట్టి గాని—" అని ఏమేమో చెపుతుంటే తనుచేసిన పనికి నారాయణమూర్తి సిగ్గుతో తలవంచేసుకున్నాడు. మనోరమ తన భార్య స్నేహితురాలనే తెలుసుగాని పెద్ద ఇంజనీరుగారి భార్య అని తెలియదు. అంత గొప్ప వారికి తను అనాలోచితంగా సంస్కారంలేకుండా చేసినపని తెలిసిపోయిం దంటే అంతకంటె అవమానం తనకేం కావాలి?

"ఆ మర్నాడే యింటికి వచ్చేశారటగా. ఎంతో సంతోషపడుతూ రాసింది పిచ్చి భారతి." మనోరమ భారతి నుద్దేశించి అంది—

నిజానికి తాను తిరిగి తనయింటికి వెళ్ళనేలేదు. అయినా తాను మరునాడే తిరిగి వచ్చినట్లు స్నేహితురాలికి రాసిందీ అంటే ఎంత అభి మాన పడిపోతోందో ననుకున్నాడు. తనసంసారం గుట్టు బయటపడ కుండా ఉండటానికి ఆవిడ పడేపాట్లలో వెయ్యోవంతయినా తాను పాటించ లేదు. ఏదియేమయినా తానుచేసినపని చాలా పొరపాటయినదనీ, ఇక పాత విషయాలన్నీ మరచి సరాసరి తనయింటికే వెళ్ళి ముందు భారతికి క్షమా పణ చెప్పుకోవాలనీ మనసులో అనుకున్నాడు.

"ఇంతకీ వారితో ఏమిటిపని." మనోరమ సాదరంగానే అడిగింది.

"ఏంలేదులెండి. ఏదో బిల్లులు విషయం—"

"అలాగే. రాగానే చెప్తాను. పోనీ ఈరాత్రికి ఇక్కడే ఉండి పొండి. సావకాశంగా మాట్లాడుకోవచ్చు."

అసలే ఆవిడముఖం చూడటానికే సిగ్గుపడిపోతున్నాడు. ఇంకా ఉంటాడా తను ?

"లేదులెండి. మళ్ళీవస్తాను. ఇంటిదగ్గర అది ఒక్కతే ఉంది" అని లేనిపోనికోత కోసేశాడు. తానెంతో అన్యోన్య దాంపత్యం వెలగబెడుతున్న వాడిలాగ.

"అదీ నిజమేలెండి. అసలే ఉట్టిమనిషికూడా కాదు. దానికి మంచి పళ్ళుటానిక్కులు ఇప్పించండి. పుట్టబోయే అల్లుడు దబ్బపండులాగ పుటాలి."

నారాయణమూర్తికి సగం అర్థమయి, సగం అర్థం కాలేదు. "కొంపతీసి భారతి-" తనలో తనే సిగ్గుపడి మెలికలు తిరిగిపోయాడు—

ఇప్పుడు యింటికి రాగానే తల్లి వేసిన చివాట్లతో నారాయణమూర్తి కళ్ళు పూర్తిగా తెరిపినపడ్డాయి.

ఇంతలో గదిలోనుంచి "అత్తయ్యా. కాసిని మంచినీళ్ళిస్తారా." అని నీరసంగా వినిపించేసరికి—యశోదమ్మగారు "అలా గుడ్లప్పగించి చూస్తావేరా. దానికి మంచినీళ్ళు కావాలిట." అంది చిరునవ్వు నవ్వుకుంటూ.

నారాయణమూర్తి ఒక్క అంగలో మంచినీళ్ళగ్లాసు పట్టుకుని భారతి ఉన్నగదిలోకి ప్రవేశించాడు.

భారతి తనకళ్ళను తానే నమ్మలేకపోయింది. నారాయణమూర్తి గది తలుపు దగ్గరగావేసి సిగ్గుపడుతూ భారతి మంచంమీద కూర్చున్నాడు. లేవబోతున్న భారతిని వారించి ఆవిడ తల తన ఒళ్ళో పెట్టుకుని కొద్ది కొద్దిగా భారతి నోటికి అందించాడు. భారతి తన రెండుచేతుల్ని అతని మెడచుట్టూ పోనిచ్చి తలను అతని ఒళ్లో దాచేసుకుంది ఆనందంపట్టలేక.

సంపూర్ణం